# భారతీయ సంస్కారములు


రచయిత
దేవరకొండ శేషగిరి రావు

సంపాదకుడు
డా॥ కె. ఎస్. ఆర్. దత్తా ఎం.ఏ.,పిహెచ్.డి.






తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# భారతీయ సంస్కారములు

రచన
**దేవరకొండ శేషగిరిరావు**

సంపాదకుడు
డా॥ కె.ఎస్.ఆర్. దత్తా




ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి
2008

BHARATHEEYA SAMSKARAMULU

by

Devarakonda Seshagiri Rao

T.T.D. Religious Publications Series No : 459



First Edition : 1997

Re-Prints : 2003, 2004 2008

Copies : 2,000

*Published by*

K.V. Ramanachary, I.A.S.
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati — 517 507.

Printed at : Students Offset Printers
Tirupati

# ముందుమాట

సంస్కారం - సంస్కృతి - భారతీయాత్మలో నిత్యనిష్ఠానంద, కర్మాచరణ జ్యోతిగా, విశ్వమానవుని అనుష్ఠాన చైతన్య ప్రస్థానంలో వెలుగులు వెలార్చింది.

ఒక మహోన్నతాదర్శ సమాజావిర్భావానికి శత సహస్ర కిరణకాంతులను విరజిమ్మింది.

ఆ వెలుగే అగ్ని. "అగ్ని మీళే పురోహితం" అను వేద మంత్రం తోనే కర్మానుష్ఠానం ప్రారంభం అవుతుంది. భారతీయ సంస్కారాలన్నీ ఒక ఆలోచనతో ఒక నిర్దిష్ట సంప్రదాయ ఆచార వ్యవహారంతో శాశ్వత విధి విధానంగా - కర్మాచరణంగా అనూచానంగా వస్తున్నవి.

మానవుడు పుట్టింది మొదలు, గిట్టే వరకు అతని జీవన ప్రస్థానంలో జరిగే కార్యకలాపాల పరిశోధనాత్మక గ్రంథం ఈ "భారతీయ సంస్కారములు".

రచయిత శ్రీ దేవర కొండ శేషగిరిరావుగారు శ్రమించి, పరిశోధించి, నాటి భారతీయ సంస్కారములను గురించి శాస్త్రబద్ధంగా రూపకల్పన చేశారు.

మారుతూన్న కాలంతోపాటు కర్మాచరణంలో వచ్చిన, వస్తూన్న మార్పులనూ, ప్రాచీన కాలంలో అనుసరించిన పద్ధతులనూ వివేచనాత్మకంగా, పరిశీలించడానికి ఈ గ్రంథం ప్రయోజనాత్మకంగా వుంటుందన్న ఆశయంతో తి.తి. దేవస్థానం పక్షాన ప్రచురిస్తున్నాము.

ఎప్పటి లాగే ఈ గ్రంథాన్ని కూడా పాఠకలోకం ఆదరించి, మా కృషికి ఆహ్వానం పలుకుతుందని ఆశిస్తున్నాము.

కార్యనిర్వహణాధికారి.

# కృతజ్ఞతలు

ఈ రచనకు బీజము వేసినవారు శ్రీ జటావల్లభుల పురుషోత్తం గారు. మహోపన్యాసకులుగా ప్రసిద్ధులు. ధర్మమే ఊపిరిగా బ్రతికిన ఆ మహాత్ములు వేసవి సెలవులలో ధర్మశాస్త్రపాఠశాలలను నడిపెడివారు. 1958 లో వారు ముక్కామలలో నడిపిన పాఠశాలలో, బ్ర॥ నౌదూరి కామేశ్వర శాస్త్రిగారి దగ్గర గౌతమ ధర్మసూత్రములను, బ్ర॥ చిర్రావూరి అనంతపద్మనాభశాస్త్రి గారి వద్ద ధర్మసింధువును, బ్ర॥ భమిడిపాటి యజ్ఞేశ్వర సోమయాజిగారి దగ్గర వివాహమంత్ర వ్యాఖ్యానమును విను భాగ్యమబ్బి నది. ఋగ్వేద పరీక్షాధికారులైన బ్ర॥ గోడా సుబ్రహ్మణ్యశాస్త్రిగారి దగ్గర ఆశ్వలాయన గృహ్యసూత్రమును, మా గురువుగారైన బ్ర॥ ఆకెళ్ల శేషాద్రిగారి దగ్గర అపరకర్మకు సంబంధించిన మంత్ర వ్యాఖ్యానమును, కాకి నాడలో పురోహితులైన ఇంద్రగంటివారి దగ్గర అపరకర్మయొక్క తంతును తెలిసికొంటిని. తణుకులో ఉండగా వేదార్థవేత్తలైన బ్ర॥ ఘండికోట సుబ్ర హ్మణ్య శాస్త్రిగారికి ప్రతి అక్షరమును విన్పించితిని. వేదార్థ ప్రమాట్టులైన బ్ర॥ లంక వేంకట్రామ సోమయాజిగారికి చాల భాగము విన్పించితిని. వారి అమూల్యాభిప్రాయములకు కృతజ్ఞుడను.

ఈ రచనకు కొన్ని వందల పుస్తకములు ఆధారము. ఆర్ష వాఙ్మయముతో బాటు, భారత రత్న శ్రీ పి.వి. కాణేగారు వ్రాసిన History of Dharma-Sastra, శ్రీ రాజబలి పాండేగారు వ్రాసిన హిందూ సంస్కార్, స్వామిదయానందుల ధర్మవిజ్ఞాన్ మిక్కిలి యుపకరించినవి. వారికి ఋణపడి యున్నాను. కొన్ని భాగములనెత్తి వ్రాయుటకు అను మతిని ప్రసాదించిన పాండేగారి సతీమణికి, యథేచ్ఛగా వాడుకొనుటకు అవకాశ మిచ్చిన ఓరియంటల్ భండార్కర్ ఇన్‌స్టిట్యూట్ క్యురేటర్‌గార్కి హృదయపూర్వక నమస్కారములు. సంస్కారములు--ఆధారగ్రంథములు; సంస్కారములు--అంగములు వంటి ప్రకరణములు పాండేగారి గ్రంథమునకు అనువాద ప్రాయములు. India of Vedic Kalpa Sutras, Glimpses

of Vedic Nation, శూద్రకమలాకరము, వైద్యగ్రంథములు, అష్టాదశకల్ప సూత్ర సమీక్షవంటి ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత, హిందీగ్రంథము లెంతో ఉపకరించినవి.

ఈ గ్రంథమును వ్రాయుటకు పదిసంవత్సరములు పట్టినది. దీనిని తిరుమల తిరుపతి దేవస్థానమువారు ప్రకటింతుమని పది సంవత్సరముల వెనుకనే వాగ్దానము చేసినారు. నేటికిది వెలుగులోనికి వచ్చినది. ధార్మిక గ్రంథ రచయితలకు ఆర్థిక సాహాయ్యమునిచ్చు దేవస్థానము ద్వారా పుస్తకములను ప్రకటింపించుట అనెడి మహోపకారము చేసిన ఆనాటి దేవస్థాన కార్యనిర్వహణాధికారులైన శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ ఐ.ఏ.ఎస్. మహోదయులకు, ఆ కార్యక్రమములను నిర్విఘ్నముగా కొనసాగించు నేటి కార్యనిర్వహణాధికారులకు హృదయపూర్వక నతులు. జ్యోతిర్విద్యా పారంగతులై, స్వర్గస్థులైన డా॥ ధూళిపాళ అర్కసోమయాజులు గార్కి ఏటి కోళ్లు. ముద్రణయంత్ర నిర్వాహకులకు ధన్యవాదములు.

రచనకాధార గ్రంథములను చదివి అర్థము చేసికొనుటలోగాని, లేదా పెద్దలకు వినిపించునపుడుగాని నేను లోటుపాట్లు చేసియుండవచ్చును. దోషజ్ఞులు తెలిపినచో సవరించుకొందును.

ఎందరో మహానుభావులు - అందరికీ వందనములు.

తమ విధేయుడు,

దేవరకొండ శేషగిరిరావు.

# సాంకేతిక పదములు -- వివరణ

అ.వే. = అథర్వవేదము
అ.క. సమీక్ష = అష్టాదశ కల్పసూత్ర సమీక్ష
ఆ.గృ. = ఆశ్వలాయన గృహ్య సూత్రములు
ఆప.గృ. = ఆపస్తంబ గృహ్య సూత్రము
ఆప.ధ.సూ. = ఆపస్తంబ ధర్మ సూత్రము
అను. = అనుశాసనిక పర్వము
ఋక్. = ఋగ్వేద సంహిత
ఐత.బ్రా. = ఐతరేయ బ్రాహ్మణము
ఐత.ఆర. = ఐతరేయ ఆరణ్యకము
కాత్య.శ్రౌ.సూ. = కాత్యాయన శ్రౌత సూత్రము
కాఠక.గృ. = కాఠక గృహ్య సూత్రము
కౌ.సూ. = కౌశిక సూత్రములు
ఖాదిర. = ఖాదిర గృహ్య సూత్రము
గో.గృ. = గోభిల గృహ్య సూత్రము
గౌత.ధ.సూ. = గౌతమ ధర్మ సూత్రము
ఛా.ఉప. = ఛాందోగ్యోపనిషత్తు
జై.గృ. = జైమిని గృహ్య సూత్రము
తైత్తి.స. = తైత్తిరీయ సంహిత
తై.బ్రా. = తైత్తిరీయ బ్రాహ్మణము
తై.ఉ. = తైత్తిరీయ ఉపనిషత్తు
తై.ఆ. = తైత్తిరీయ ఆరణ్యకము
దేవల. = దేవల స్మృతి
నా.స్మృ. = నారద స్మృతి
పా.గృ.సూ. = పారస్కర గృహ్య సూత్రము
బృ.ఉ. = బృహదారణ్యక ఉపనిషత్తు
బౌ.ధ.సూ. = బౌధాయన ధర్మ సూత్రము

బౌ.పి.సూ. = బౌధాయన పితృ సూత్రము
బౌ.గృ.సూ. = బౌధాయన గృహ్య సూత్రము
భార. = భారతము
భార.గృ. = భారద్వాజ గృహ్య సూత్రము
మను. = మనుస్మృతి
మానవ. = మానవ గృహ్య సూత్రము
యాజ్ఞ.స్మృ. = యాజ్ఞవల్క్య స్మృతి
య.వే. = యజుర్వేదము
వారాహ. = వారాహ గృహ్య సూత్రము
వ.ధ.సూ. = వసిష్ఠ ధర్మ సూత్రము
వ్యాస. = వ్యాస స్మృతి
వీ.మి. = వీర మిత్రోదయము
వైఖ. = వైఖానస గృహ్య సూత్రము
విష్ణు. = విష్ణు ధర్మ సూత్రము
శత.బ్రా. = శతపథ బ్రాహ్మణము
సాంఖ్య.గృ. = సాంఖ్యాయన గృహ్య సూత్రము (శాంఖ్య. గృ)
హా.గృ. = హారీత గృహ్య సూత్రము
హిర.గృ. = హిరణ్యకేశి గృహ్య సూత్రము

# విషయ సూచిక

# భారతీయ సంస్కారములు

## ఉపోద్ఘాతము

షోడశ కళాప్రపూర్ణుడు చంద్రుడు
షోడశ సంస్కార సంస్కృతుడు భారతీయుడు.

అనాది అవిచ్ఛిన్న భారతీయ సంస్కృతికి అవతార తత్త్వము, కర్మ సిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతము, విగ్రహారాధన, వర్ణాశ్రమ వ్యవస్థ, షోడశ సంస్కారములు, మొ॥ పెక్కు అంశములు మూలస్తంభముల వంటివి. పై అంశములు ఈ సంస్కృతికి ఒక విలక్షణతను, ఒక విశిష్టతను సంపాదించి పెట్టినవి.

వేద ప్రతిపాదిత కర్మలను చేయుటద్వారా మనస్సు, శరీరాదులందొక అతిశయమేర్పడునని (విశేషము) దానినే సంస్కారమందురని పెద్దల తీర్పు. ఒక వస్తువును ఒక విశిష్ట ప్రయోజనము కొఱకు యోగ్యమగునట్లుగా చేయునది సంస్కారమని, ఇది ఆ పదార్థములోని దోషమును పోగొట్టి, గుణమును కలిగించునదిగా ఉండునని, మనకు కనబడని ఫలములనిచ్చు (ఉదా: స్వర్గాదులు) వైదిక కర్మలను చేయుటకు అర్హతను ప్రసాదించునని మహాత్ముల హెచ్చరిక.

ప్రాణములేని ఇనుప ఖనిజమునకు పెక్కు మార్పులు చేసి వస్తువులుగా మార్చి, వాడుకొనుచున్నాముకదా! ఇట్లు అచేతన పదార్థములే సంస్కారమును కోరుచుండగా, ప్రాణము లేదా చైతన్యము కలిగిన మనకు సంస్కారముల అవసరము లేదా?

వేష భాషాభూషలు కాల పరిస్థితులకు తగినట్లున్నచో సంస్కారవంతుడని అనుచున్నాము. తన జీవితమునకు, పౌరజీవితమునకు భంగము కల్గించు రీతిలో నున్నచో సంస్కార హీనుడని పిలుచుచున్నాము. వేషభాషలలోనే కాదు, తుదకు మనస్సు కూడ శుద్ధమైనపుడే సంపూర్ణ సంస్కారవంతుడగును.

ఈ సంస్కారము కంటి కగపడునా? ప్రభుత్వ ముద్రయున్నచో తెల్ల కాగితము రూపాయి నోటగుచున్నది. ముద్రలేనిచో వట్టి కాగితమే కదా! మనమెన్నుకొను వ్యక్తి మంత్రి యగుచున్నాడు. ఎన్నికలకు ముందు మనవంటి సామాన్యవ్యక్తియే యాతడు. మంత్రియైన తరువాత మంత్రియని అతని ముఖముపై వ్రాసియుండునా? ఉండదు. ఒక వ్యక్తికి మంత్రిత్వమను సంస్కారమును కల్గించితిమి. అట్లే కొన్ని సంస్కారముల ఫలము ప్రత్యక్షము. ఉదా: పుంసవనము చేసినచో స్త్రీగర్భములోని శిశువు పురుషునిగా మారును. కొన్ని సంస్కారముల ఫలము అదృష్టము. ఉదా: స్వర్గాదులు, స్వర్గము, మోక్షము కంటికి కనబడవు.

స్త్రీ పురుషుల కలయికవలన ఏర్పడిన జీవునకు ఒక పాపము చుట్టుకొనగా, దానిని పోగొట్టు కొనుటకు ఈ సంస్కారము లేర్పడినవని మహర్షులు గుర్తించిరి. ఆత్మకు పుణ్యపాపములు లేవుగాని, అవిద్యతో కూడిన జీవునకు కలవు. ఆ సంస్కారముల సంఖ్య పదునారు. గర్భాధానము మొదలగునవి.

గర్భాధానమువలన బీజగర్భదోషములు పోవునని; ఆ వెనుక స్త్రీ గర్భము నందున్న శిశువు పురుషునిగా మారవలెనని పుంసవనము చేయవలెనని, తల్లికడుపులోనున్న ఆ శిశువు తల్లి తిను ఆహారమును

తానుకూడ స్వీకరించును కనుక, దాని దోషమును పోగొట్టుకొనుటకు జాతకర్మ అను సంస్కారమును చేయవలెనని, నామకరణము వలన ఆయు ర్దాయము, తేజస్సు మొదలగునవి లభించునని, నిష్క్రమణము వలన మంత్ర పూర్వకముగా సూర్యనారాయణమూర్తిని దర్శించి ఆయుస్సు, సౌభాగ్యము పొందునని, అన్నప్రాశన సంస్కారము వలన మాతృ గర్భములోనున్న మలాదులను తినుటవలన వచ్చు దోషము పోవునని, ఉపనయనము వలన వేదమును చదువు అర్హత, బ్రహ్మజ్ఞానమును పొందు అర్హత సిద్ధించునని; వివాహము వలన భార్యతో సమస్త వైదిక క్రియలు చేయుటద్వారా స్వర్గప్రా ప్తియని, మంచి సంతానము కల్గి ఇహపరలోక సౌఖ్యములను పొందవచ్చని మనువు ఘోషించినాడు. చనిపోయిన తరువాత చేయు కర్మలవలన జీవునకు ఉత్తమలోకములు ప్రాప్తించునని శాస్త్రములు భాషించుచున్నవి.

యజ్ఞములు, పంచమహాయజ్ఞములు చేయుటద్వారా ఈ శరీరము బ్రహ్మశరీరముగా మారునని స్మృతికర్త లుద్ఘాటించియున్నారు. గర్భాధా నము మొదలగు బ్రాహ్మసంస్కారముల వలన ఋషి స్థితిని పొందుచున్నా డని, యజ్ఞాదులైన దైవసంస్కారములవలన దేవతాస్థితిని అనగా సాలోక్య, సామీప్య, సాయుజ్యములను పొందుచున్నాడని స్మృతికర్తలు చాటినారు.

సంస్కారములవలన సంస్కరింపబడి, ఆత్మగుణములు (దయ, ఓర్పు, మొ॥) కలిగినవారు బ్రహ్మలోకమును చేరి బ్రహ్మపదమును పొందుదురని గౌతమాదులు నిర్ధారంచినారు.

అంగిరసుడు, ఈ సంస్కారములను ఒక చిత్రకర్మతో పోల్చినాడు. భిన్న మైన రంగులవలన ఒక చక్కని ఆకార మేర్పడునటుల ఈ సంస్కారముల వలన ఒక ఉత్తమస్థితి కల్గునని పోల్చినాడు.

పక్షికి రెండు రెక్కలున్నటుల జీవుదున్నతిని పొందవలెననిన జ్ఞాన కర్మములు రెండును ఉండవలెనని యోగవాసిష్ఠము వాకొనుచున్నది. కర్మలు చేయుటద్వారా చిత్తశుద్ధిని పొంది ఆత్మజ్ఞానమును బడయుటయే సర్వభారతీయ వాఙ్మయ లక్ష్యము. కొందరు జ్ఞానమార్గమును, కొందరు

కర్మమార్గమును సమర్థింపగా ఈ రెంటిమార్గములను సమన్వయించి ఒక సేతువును కట్టుటయే ఈ సంస్కారప్రయోజనము.

సంస్కారములనిన వట్టి కర్మకాండయని భ్రమింపరాదు. అనేక నైతిక సూత్రములు ముడివడి యున్నవి. ఆ సూత్రములను పాటించుట ద్వారా వ్యక్తి వికాసముతో బాటు, సమాజశ్రేయస్సు కూడ సిద్ధించుచున్నది. పై ఆత్మగుణములు లేనివాడు బ్రహ్మసాన్నిధ్యమును పొందలేడను గౌతముని మాటలు మరియొకసారి స్మరింపతగినవి.

ఇందు ధనమును, ఆయుర్దాయమును, శక్తిని, బుద్ధిని ప్రసాదింపుడని దేవతలను ప్రార్థించుట, దుష్టశక్తులు దూరముగా తొలగవలెనను ప్రార్థనలు లెక్కకు మిక్కిలి.

జీవితమును మధుర కళాఖండముగా మార్చునవే ఈ సంస్కారములు. ఆత్మసౌందర్యమును వెలికి తీసికొనివచ్చునవే! చివరికొకమాట. శరీరమును, మనస్సును శుద్ధము చేయునవి సంస్కారములు. వీని ప్రయోజనమును, సంఖ్యను ముందు ముందు విపులముగా చర్చించితిని.

## సంస్కారములు -- ఆధార గ్రంథములు

హిందూసంస్కారములను గూర్చి సంపూర్ణముగా తెలియవలెననిన గృహ్య సూత్రములను, ధర్మసూత్రములను చదువవలెను. సంస్కారముల విధి విధానములందుల్లేఖింపబడినవి. 'ఎప్పుడు, ఎట్లు, ఎవరు' అను ప్రశ్నలకు సమాధానములందు లభ్యమగును. కొన్ని స్మృతులు, మధ్యకాలీన నిబంధన గ్రంథములు, ధార్మికమైన లౌకికమైన విధుల విషయమై ప్రమాణములను జూపెట్టినవి గాని కర్మకాండకు సంబంధించిన విధానముల ప్రస్తావన నెత్తుకొనలేదు. వాని లక్ష్యమువేరు, పద్ధతి గ్రంథముల ప్రణాళిక వేరు. కనుక సంస్కారముల గురించి సంపూర్ణముగా తెలుసు కొనవలెననిన వివిధ గృహ్య సూత్రకారుల మతభేదములు తెలియవలెననిన, వాటి ప్రక్రియను గ్రహించవలెననిన, కొన్ని ముఖ్యమైన మంత్రముల అర్థములను అవగాహన చేసికొనవలెనన్న, సంస్కార ఆవిర్భావముల యొక్క వికాసము ప్రయోజనా

దులు మొదలగు అంశముల పరిశీలనము చేయవలెను. ఇవి ఈ రచనకు లక్ష్యమగుచున్నవి.

వేదములు: సమస్త ధర్మములకు మూలమైనది వేదము. గౌతమ ధర్మసూత్రముల ననుసరించి వేదములు, వేదవేత్తల స్మృతి, శీలములు ధర్మమునకు మూలములు. "వేదో ధర్మమూలమ్, తద్విదాంచ స్మృతిశీలే", (1-1-2). ధర్మసూత్రగ్రంథములు, స్మృతులీ యభిప్రాయమునే బలపరిచినవి. (ఆప.ధ.సూ. 1-1, 1-2; వ.ధ.సూ. 1-4-5) మానవ జీవనమునకు సంబంధించిన వివిధ విషయములగురించి అనేక మంత్రములు, సూక్తములు వీటియందు కలవు. సంస్కార సంబంధమైన మంత్రములు కూడ వీటియం దుపలబ్ధము లగుచున్నవి. ఋగ్వేదము ప్రపంచ సారస్వతమున ప్రప్రథమ గ్రంథమనుట నిర్వివాదాంశము. అందు వివాహము (20-85) అంత్యేష్టి (10-14-16-18) గర్భాధానాదుల (10-183-184) వర్ణన కలదు. ఐతిహాసిక దృష్టితో చూచినచో ఈ సంస్కారముల యావిర్భావమున కదే మూలకందము. ఇందుగల కొన్ని సూక్తము లాయా సమయములందు వివరించబడుచున్నవి. ఈ సూక్తములందు విధ్యాత్మకనియమములు లేవని చెప్పవచ్చును. అవి ప్రాసంగికముగా నుండును. అనగా ఫలానా వ్యక్తి, ఫలానా సమయమున, ఫలానా విధముగా ఈ సంస్కారములు చేసికొనవలెననుట మొదలగునవి తు, చ తప్పక లేక పోవచ్చును. మంత్ర ద్రష్టలగు ఋషులు ఆయా విషయములను స్మరించి, దర్శించి బహు సూత్రములను వ్రాసి మనకందించిరనుమాట మరువరాదు. వాటిని సూత్రకారులు సంపుటీకరణముచేసిరి. అప్రస్తుతము కాదని తలంచినచో ఒక మాట. అనంతమైన వేదరాశిలో ఇది కలదని, ఇది లేదని నిర్ధారణ చేయుట మన బుద్ధికందనిది. అనంతమైనశాఖలలో నేడు మిగిలినవి ఎనిమిది తొమ్మిది శాఖలు మాత్రమే. పెక్కు శాఖలు ఖిలమైపోయినవి. అనగా పఠన పాఠనములలో లేకుండ కనుమరుగై పోయినవి. మన అల్పప్రజ్ఞత్వమును గ్రహించియే మహర్షులు వైదికమైన విషయములను స్మరించి వ్రాసిరి కనుకనే స్మృతులను పేరుతో వ్యవహరింపబడు గ్రంథములను మనము చూచుచున్నాము. కనుక ఇది వేదమున కలదు, ఇది లేదు, ఇది స్మృతిలో మాత్రమే ఉన్నది, ఇది

పురాణములో కలదు, ఇది అర్వాచీనము, అది ప్రాచీనమను మాటలు సంప్రదాయజ్ఞులనరు. సంహితముందు, బ్రాహ్మణము ఆ వెనుక పుట్టినది, ఉపనిషత్తు క్రీస్తు తరువాత పుట్టినది అనెడి మాటలు, ముందు ఋగ్వేదము, తరువాత యజుర్వేదము, ఆ వెనుక సామవేదము, ఆపైన అథర్వణ వేదము అనెడి చారిత్రకుల చిలుకపలుకులు సంప్రదాయజ్ఞులు పలుకరు. వైదికవాఙ్మయ సంప్రదాయము తెలియవలెనన్నచో హరిసోదరులు వ్రాసిన "భారతీనిరుక్తి" వంటి గ్రంథములు చదివిన సందేహములు పటాపంచలగును. ఏతావతా సంహితలో లేనిది బ్రాహ్మణములో నుండును. బ్రాహ్మణములో లేనిది ఉపనిషత్తులో నుండును. అన్నియు ఏకకాలీనములే! వివరముల జోలికి పోయినచో అసలు విషయము పుసిగిపోవును కనుక కాలమును నిర్ధారణచేయుట నదుల పుట్టిన తేదీని చెప్పుటవంటిదని చెప్పుచు ఆ విషయమును ముగించుచున్నాను.

ఋగ్వేదమున సంతతి నిమిత్తమై, వారి యాయుర్దాయము కొఱకై అనేక ప్రార్థనలు, సంతతి ఘాతుక రక్షస్సుల వినాశమునకై ప్రార్థనాదులు మొదలగు అనేక సంస్కారాంగముల ప్రస్తావన కలదు. "శతమింతు శరదో అంతి దేవా యత్రా నశ్చక్రా....." ఆదిగాగల మంత్రములు కలవు. ఇందులకు అతిరిక్తమైన సామాజిక విషయములు కూడ కలవు. ఉదా:--అభ్రాతృక కన్యకు పతి లభించుట కష్టమనియు, పితృగృహమున అవివాహిత జీవనము గడుపుట మొదలగునవి కూడ కలవు. "ఆమా జూరివ పిత్రోః సచాసతీ సమానాద్య సదసస్త్వామి యే భగమ్" (2-17-7). ఋగ్వేదము ఆసుర వివాహమును కూడ (డబ్బిచ్చి పిల్లను కొనుట) పేర్కొన్నది. మైత్రాయణీ సంహిత నుండి పై వచనము వంటిదానిని వసిష్ఠ ధర్మసూత్ర ముల్లేఖించి నది. ధర్మసూత్రములలో గాంధర్వ వివాహప్రసక్తి కూడ కలదు. ఆమె సుందరమైన వధువు. చక్కగా నలంకరించుకొని, అనేకమంది పురుషుల మధ్యలో మిత్రుని (పతిని) వరించుచున్నదను మంత్రములు కలవు.

"భద్రా వధూర్భవతి యత్సుపేశా స్వయం సామిత్రమ్ వనుతేజనే చిత్" (ఋ.10.27.12) వీటిలో విద్యార్థి జీవన ప్రశంస కూడ కలదు. (10.109.5)

సామవేదము గానప్రధానమైనది. ఇందుగల మంత్రములు ఋగ్వేదము నందు కాననగును. దీర్ఘ సత్రాదులందు, వివాహాదులందు సామమును గానమును చేయుదురు. యజుర్వేదము ప్రధానముగా శ్రౌతయజ్ఞ సంబంధమైనది. అధ్వర్యువు యజుస్సులను యజ్ఞమున నుచ్చరించును. ఇందు గృహ్య సంస్కారముల ప్రస్తావన లేకపోలేదు. ఆయా సంస్కారములను వివరించునపుడు యజుర్వేద మంత్రములను పేర్కొందును. అథర్వ వేదమున వివాహము, (14.1.2) అంత్యేష్టి (18.1.4) ఒక సంపూర్ణ సూక్తమున వైదిక బ్రహ్మచారి యొక్క ప్రశంస (11.5) గర్భాధానము (3,23,6,81) మొదలగు పెక్కు విషయములు కలవు. ఇందొక మండలమున దీర్ఘాయుర్దాయ నిమిత్తమై ప్రార్థనలు కలవు. ఒక చోట 'ఆయుష్యకర్మాణి' అని పేర్కొన్నది. ఈ ప్రార్థనలందు ముండనము, గోదానము, ఉపనయనము మొదలగు విషయములు ప్రస్తుతింపబడినవి. ఒక సూక్తమున వివాహము, ప్రేమాదుల వర్ణనము. మఱియొక సూక్తమున (6.6) శిశురక్ష నిమిత్తమై ప్రార్థనలు కలవు.

బ్రాహ్మణములు: ఇవి కర్మకాండకు సంబంధించినవి. వీటిలో పెక్కు యజ్ఞవిధులు విపులముగా నుండును. ఇందు శరీర సంస్కారముల ప్రస్తావన కూడ కలదు. గోపథ బ్రాహ్మణమున ఉపనయనమును గూర్చి కొలదిగా కలదు. శతపథమున బ్రహ్మచర్యము, అంతేవాసి, అజినము, గోదాన సంస్కారము; (5.2.1.21; 3.1.2.5.6.) వివాహమును గూర్చి చెప్పబడినది. తాండ్యబ్రాహ్మణమున వ్రాత్యులను, వ్రాత్యస్తోమమును గూర్చి చెప్పబడినది. దీనిద్వారా వ్రాత్యుడు అనగా ఉపనయన కాలము నతిక్రమించిన వ్యక్తి సంస్కృతుడగును. శతపథమున ఉపనయన, స్వాధ్యాయ, (11.5.7) అంత్యేష్టుల ప్రస్తావన కలదు.

ఆరణ్యకములు - ఉపనిషత్తులు: ఇవి కేవలము దార్శనిక విషయ సంబంధము కలవి. సంస్కార దృష్టితో చూచిన తైత్తిరీయ ఆరణ్యకము మహత్త్వపూర్ణమైనది. ఇందుగల 'కుమారీషు కనీనీషు జారిణీషు చ యేహితాః" అను దానిని బట్టి అవివాహిత కన్య గర్భిణియైన పాపముగా

భావించినట్లు తోచును. బ్రహ్మయజ్ఞమును గూర్చి ప్రస్తావన కలదు. అట్లే పితృమేధమున కుపకరించు మంత్రములిందు కలవు.

ఉపనిషత్తులందు ఉపనయనమునకు సంబంధించిన మంత్రము లున్నవి. బ్రహ్మచారి గురుకులావాసము, గోపాలనాది సేవలుచేయుట, సమాజమున గురుమహత్త్వము మొదలగునవి వర్ణింపఁబడినవి. బ్రహ్మవిద్యా ప్రాప్తి గురువువలననే కలుగుట, దాని సఫలత్వము ఛాందోగ్యమున కలదు. "ఆచార్యస్తుతే గతిర్వక్తా ఆచార్యా దేవ విద్యావిదితా సాధిష్ఠం ప్రాపయతి". (ఛా.ఉ. 4.14.1) అందే గురు సమీపమునకు విద్యార్థి యేగుట కలదు. (4.4)

బృహద్రథ: శాకలాయనుల సంభాషణము కల మైత్రాయణీ ఉపని షత్తు నందు గురునింద చేయువానికి, విద్యానింద చేయువానికి, అనృజు, అసావధానియైన విద్యార్థికి విద్యనుపదేశింపరాదని కూడ చెప్పఁబడినది. "అసూయకాయానృజవేఽయ తాయ మమా బ్రూయా వీర్యవతీ తథాస్యామ్" ఛాందోగ్యమున బ్రహ్మచర్యమునకు యోగ్యమైన కాల ముగ్గడింప బడినది. బృహదారణ్యకమున పవిత్ర గాయత్రీ మంత్రమును గుప్తరూపమున తెలిసి కొనవలెనను సూచన కలదు. (5.15) తైత్తిరీయము, గురుకులమును విడిచిపెట్టి వెళ్లు విద్యార్థికి అనేకోపదేశముల నొసంగినది. అందు వ్యావహారికములు కూడ కలవు. ఛాందోగ్యమున చిన్న వయస్సుననే వివాహ ప్రస్తావన కలదు. ఈ ప్రసంగముననే 'ఆటికి' పత్నీచర్చ కలదు. ఇందే నామకరణచర్చ, పుత్రప్రాప్తికై ప్రార్థనలు కాననగును. బృహదారణ్యకమున విస్తృతముగా యజ్ఞవిధానము వర్ణితము. ఛాందోగ్యమున సన్యాసికి ఏ విధమైన అంత్యేష్టి క్రియ జరుగనక్కఱలేదని కలదు. ఈ మాటకర్థము సాధారణ వ్యక్తులు మరణించినపుడు ప్రేతత్వవిముక్తికై చేయు ఏ కర్మలు కలవో అవి లేవనుట.

కర్మకాండ సాహిత్యము: వైదిక యజ్ఞ సంబంధ విధానములు శ్రౌత సూత్రములందు కలవు. ఇక గృహ్యసూత్రములందు గర్భాధానము మొదలు అంత్యేష్టివరకు నుండును. ఏ ఏ సంస్కారములెట్లు చేయవలెనో, అందు

పఠింపఁబడు మంత్రములు మొదలగు పెక్కు వివరణలుండును. అనేక గృహ్యసూత్రములు అంత్యేష్టిని విడిచిపెట్టినవి. నేడు మనకు లభ్యమగునవి పదునెనిమిది గృహ్యసూత్రములు. ఇవి వేదశాఖలను బట్టి వచ్చుటచే కొన్ని అంశములందు మతభేదములు కల్గియున్నవి. ఆపస్తంబ, ఆశ్వలాయన, బోధాయన మొదలగు నామములచే వ్యవహృతములు.

ఈ కర్మకాండ గ్రంథములందు వివిధ కల్పములు, పరిశిష్టగ్రంథములు, కారికలు, ప్రయోగ పద్ధతులిందు చేరును. మానవ, కాత్యాయన, శౌనక, పైప్పలాద, గౌతమ, బౌధాయన హిరణ్యకేశి శ్రాద్ధకల్పములందు, పితృ మేధ సూత్రములందు అంత్యేష్టి సంస్కార వర్ణన కలదు. ఇవి గృహ్యా సూత్రానురూపములే. ప్రయోగ, పద్ధతి, కారికాదులందు నూత్న విషయ ములు గోచరించును. పాణిగ్రహణము, ఉపనయనము, అంత్యేష్టుల గూర్చి విడివిడిగా విస్తృతమైన ప్రత్యేక గ్రంథములు వచ్చినవి.

ధర్మసూత్రములు: ఈ సంస్కారముల నాదేశించువారిని మూడువిధము లుగా పేర్కొనవచ్చును. 1. ధర్మశాస్త్రకర్తలు, 2. స్మృతికర్తలు, 3. ఉపస్మృతికర్తలు. నృసింహప్రయోగ పారిజాత గ్రంథము ఏబది యేడుగు రగువారిని పేర్కొన్నది.

1. ధర్మశాస్త్రకర్తలు: (18) మను, బృహస్పతి, దక్ష, గౌతమ, యమ, అంగిరస, యోగీశ్వర, ప్రచేతస, శాతాతప, పరాశర, సంవర్త, ఉశనస, శంఖ, లిఖిత, అత్రి, విష్ణు, ఆపస్తంబ, హరితులు.

2. స్మృతికారులు: (21) వసిష్ఠ, నారద, సుమంతు, పితామహ, బభ్రు, కారేష్ణాజిని, సత్యవ్రత, గార్గ్య, దేవల, జమదగ్ని, భరద్వాజ, పులస్త్య, పులహ, క్రతు, ఆత్రేయ, ఛాగలేయ, మరీచి, వత్స, పారస్కర, ఋష్యశృంగ, బైజవాపులు.

3. ఉపస్మృతికారులు: (18) జాబాలి, నచికేత, స్కంద, లోగాక్షి, కశ్యప, వ్యాస, సనత్కుమార, శంతను, జనక, వ్యాఘ్ర, కాత్యాయన, జతుకర్ణ్య, కపింజల, బోధాయన, కణాద, విశ్వామిత్ర, పైఠీనస, గోభిలులు.

ధర్మసూత్రములకు, గృహ్యసూత్రములకు దగ్గఱ సంబంధము కలదు. కొన్ని యెడల ఉభయ గ్రంథములందు చెప్పినది ఒక్కటే యగుచున్నది. కర్మకాండ క్రియా కలాపము మాత్రము ధర్మ సూత్రములందుండదు. ఇవి వర్ణాశ్రమ ధర్మములను గూర్చి వ్రాయును. ఆశ్రమ ధర్మాంతర్గతమైన ఉపనయన వివాహాదుల నియమముల విశదవర్ణన మిందుండును.

స్మృతులు: ధర్మసూత్రములతో సమానముగా స్మృతులు కూడ సామాజిక వ్యవహారములను నిర్దేశించును. ఇందు ఆచారకాండ, వ్యవహార కాండ, ప్రాయశ్చిత్త కాండలుండును. ఉపనయన వివాహాదులు, పంచమహాయజ్ఞములు, గృహస్థుని కర్తవ్యములు, ఆధ్యాత్మ సంబంధ విషయములు మొదలగునవి విపులముగా వర్ణింపబడియుండును. మనుస్మృతిని విజ్ఞాన భాండాగార మనవచ్చును. కొన్ని స్మృతులు కేవలము వ్యవహారమునే వర్ణించును. కొన్ని ప్రాయశ్చిత్తమునకై మ్రొగ్గుచూపును. నారద పరాశర స్మృతులిట్టివి. ప్రాయశ్చిత్తములోనే జాతాశౌచ మృతాశౌచములు అంతర్గతములైనవి.

పురాణములు: పురాణములు హిందూ ధార్మిక జీవనమునకు విజ్ఞాన సర్వస్వముల వంటివి. వీనికి, స్మృతులకు ఘనిష్ఠ సంబంధ మున్నట్లు తోచును. ఆపస్తంబ ధర్మసూత్రమునకు, భవిష్యపురాణమునకు, మార్కండేయ పురాణమునకు, గౌతమ స్మృతికి, విష్ణుధర్మోత్తరమునకు, విష్ణుస్మృతికి, చతుర్వింశతి పురాణమునకు, మానవశ్రాద్ధకల్పమునకు, కూర్మ పురాణమునకు, ఔశనస్మృతికి సంస్కార విషయ సంబంధము కలదు. వీటిలో పెక్కు సమాన విషయములు కలవు. యాజ్ఞవల్క్య స్మృతి, అగ్నిపురాణము, గరుడ పురాణము -- శ్రాద్ధకల్పమున ఏకవిషయములే! మనుస్మృతి మొదటి మూడు అధ్యాయములందు గల పెక్కు విషయములు భవిష్యపురాణమున అట్లేయున్నవి. లఘుహారీతస్మృతికి, నృసింహపురాణమునకు భేదమేలేదు. సంస్కారములకు, జ్యోతిశ్శాస్త్రముతో నున్న సంబంధము పురాణములందు కాననగును. వధూవరుల ఎన్నిక విషయమై అనేక సాముద్రిక విషయముల గూర్చి కొన్ని పురాణములు చర్చించినవి. మానవ శక్తుల క్షీణతను

గ్రహించినవి కనుకనే కొన్ని కలివర్జ్యములని బ్రహ్మ, ఆదిత్య పురాణములు పేర్కొన్నవి.

"గోత్రాన్మాతుః సపిండాచ్చ వివాహో గోవధ స్తథా
నరాశ్వమేధౌ మద్యం చ కలౌ వర్జ్యం ద్విజాతిభిః"

--వా.స్మృ.పు. 261

**మహాకావ్యములు:** ధర్మోద్ధరణయే లక్ష్యముగా కలిగిన మహాభారతాదులందు అనేక సంస్కార విషయములు కలవు. పెక్కు నిబంధన టీకా గ్రంథములు మహాభారతమును ప్రమాణముగా స్వీకరించి అనేకాంశములను దానినుండి గ్రహించినవి. మనుస్మృతి, మహాభారతములలో అనేకమైన సమానశ్లోకములు కలవు. వృద్ధ గౌతమ స్మృతి, బృహస్పతి స్మృతి, యమ స్మృతి, మహాభారతమునకు అంగప్రాయములుగా నుండును. రామాయణ, రఘువంశ, కుమారసంభవ, ఉత్తర రామచరితాదులందు కూడ సంస్కార సంబంధవిషయము లెడనెడ ప్రస్తుతములుగా నున్నవి.

**టీకాగ్రంథములు:** పెక్కు ప్రాచీన గృహ్య, ధర్మ, స్మృతి గ్రంథములకు టీకాప్రాయముగానున్న గ్రంథములు అనేక గ్రంథములకు పూరకములుగా, సూచనదాయకములుగా పూర్వగ్రంథ వాక్యోద్ధారకములుగా అధిక పాత్రను వహించినవి.

**నిబంధన గ్రంథములు:** ఇవి అర్వాచీనములు. ఉదా : నిర్ణయ సింధువు, ధర్మసింధువు -- ఇత్యాదులు. కాలక్రమమున పెరిగిన క్రొత్త క్రొత్త విధానములిందు చోటుచేసుకొన్నవి. ఇవి ప్రాచీనములకు నవీనములకు సంగమప్రాయముగా నుండును. సంస్కార కాండము, సంస్కార ప్రకాశము మొదలగు పెక్కు గ్రంథములు తప్పక పరిశీలింపదగినవి. వివిధ ప్రాంతములందు వివిధ నిబంధన గ్రంథము లుదయించినవి. కనుక ఒకే విషయమై భిన్నాభిప్రాయములు వెలువడుటలో తప్పలేదు.

**కులాచారములు - శిష్టాచారములు:** కులాచారములు హిందుధర్మము యొక్క ప్రముఖాధారములనుటలో సందేహములేదు. గౌతమ, ఆపస్తం

బాదులు వీనిని ప్రమాణముగా స్వీకరించినవి. మానవుని నిత్యజీవనమున లోకప్రియములగు ఆచారములకు, విశ్వాసములకు తావు కలదు. వివాహ సంస్కారమును గూర్చి ఆశ్వలాయన స్మృతియం దిట్లుకలదు. "వివిధ జనపదములందు, గ్రామములందు కల కులాచారములు ఒకదానికొకటి భిన్నముగా నున్నవని సామాన్యమైనవానిని నిర్దేశించుచున్నాము."

"అథ ఖలూచ్చావచా జనపద ధర్మా గ్రామ ధర్మాశ్చతాన్
వివాహే ప్రతీయాత్, యత్తు సమానంవక్ష్యామః" -- 1.5.1

ఈ వివాహవిషయమున రుచిభేదములుండుట సహజము. ఆపస్తంబీయము, సనాతన ధర్మములు స్త్రీలకు తెలియునుగనుక అంత్యేష్టియందు స్త్రీల ప్రమాణతను గుర్తించినది. "స్త్రీలు ఎట్లు చెప్పిరో అట్లు చేయుము" అని కలదు. "యత్ స్త్రియ ఆహు స్తత్" (ఆప.ధ.సూ.1.6) బోధాయనము, అశౌచ విషయమున నిట్లు చెప్పుచున్నది. "శేషక్రియలందు లోక పరంపరను పాటింపుడు." "శేషక్రియాయాం లోకోఽనురోధ్యః"

ఈ కులాచారములను మూడు విధములుగా విభజింపవచ్చును. 1) దేశాచారము. ఉదా: దక్షిణదేశమున మేనమామ కూతురిని వివాహము చేసికొనుట కలదు. ఇది అన్యత్ర నిషిద్ధము (బౌ.ధ.సూ. 1.1.17) ఈ పద్ధతిని విద్యారణ్యులు సమర్థించిరి. 2) కులాచారము. ఉదా: శిఖలసంఖ్య, స్థాన నిశ్చయము ప్రవరను బట్టియని ఒక నియమము కలదు. లౌగాక్షి ననుసరించి కముజావసిష్ఠులకు దక్షిణభాగ సమీపమున, అత్రికాశ్యపు లకు రెండు ప్రక్కల శిఖల నుంచవలెననియు, భార్గవులకు ముండనము చేయ వలయునని చెప్పబడినది. "చూడాః కారయేత దక్షిణతః కముజ వసిష్ఠానాం, ఉభయతోఽ త్రికాశ్యపానాం, ముండాః భృగవః" (లౌగాక్షి. వీ.మి.సం.భా. 1. పృ. 315). 3) జాత్యాచారము. ఉదా: రాక్షస వివాహము పనికిరాదు. అయినప్పటికిని క్షత్రియులకు పనికి వచ్చునని మనుస్మృతి (3.23.24) యందు కలదు. పైన చెప్పినవి గ్రంథస్థములు. ఇవి కాక లోకములో చిత్రవిచిత్రమైన ఆచారములుండును. అవికూడ స్వీకరింపఁదగినవని సూత్రకారుల అభిప్రాయము. వీరు ఎంత ఉదారమైన బుద్ధితో సెలవిచ్చిరో గమనింపుడు.

భారత - ఇరానీ దేశ సంబంధము: ఈ సంస్కారములు భారత దేశమునకే పరిమితములుకావు. 'జెండవెస్తా' అను గ్రంథమున నున్న ధర్మములకు, వైదిక ధర్మములకు చాల పోలికలు కలవు. జాతకర్మ, అన్నప్రాశనము, అగ్నిని అర్చించుట మొదలగునవి పారసీక గ్రంథములందు కూడ కలవు. కొన్ని యునాని, రోము ధర్మములు మనవానితో పోలును. వివాహ విషయమున స్థూలముగ హిందు పద్ధతికిని యునాని పద్ధతికిని పోలిక కలదు. భారత జాతి అత్యంత ప్రాచీనము కనుక బహు విషయములు ప్రపంచ వ్యాప్తములైనవి. కొన్ని పోలికలు కనపడినను ఆశ్చర్యపడ నవసరములేదు. అట్లే యూరపు దేశములందు కూడ మన పద్ధతులకు పోలికలు గోచరించును. క్రైస్తవ, ఇస్లాము ధర్మములందు జాతకర్మ (Confirmation) నామకరణము (Baptism), వివాహాది సంస్కారములు కలవు.

ఈ ప్రకరణము ఆధారగ్రంథములను గురించి కనుక తుది నొకమాట. మహామహోపాధ్యాయ (P.V. Kane) వ్రాసిన History of Dharma Sastra, రాజబలిపాండేకృత హిందూ సంస్కార్, రామగోపాల్ వ్రాసిన India of Vedic Kalpa Sutras, స్వామి దయానంద రచిత ధర్మ విజ్ఞాన్, అష్టాదశ కల్పసూత్ర సమీక్ష రెండు భాగములు, కొన్ని వివాహ సంచికలు, శూద్ర కమలాకరము, మనుస్మృతి, గౌతమ ధర్మసూత్రములు మొదలగు పెక్కు గ్రంథములు నా రచన కాధారము.

## హైందవ సంస్కార ప్రయోజనము

విల్ డ్యురంట్ అను పాశ్చాత్య విద్వాంసుడు "History of Civilisation" అను గ్రంథమున సంస్కారములను గూర్చి ఇట్లు నుడివియున్నాడు.

"In every great religion, ritual is as necessary as creed. It instructs, nourishes and often begets belief; it brings the believer into comforting contact with his God; it charms the senses and the soul with drama,

poetry and art; it binds individuals into fellowships and a community by persuading them to share in the same rites, the same songs, the same prayers and at last the same thoughts."

అనగా మతమునకు నమ్మకము ముఖ్యము. "ప్రతి ప్రసిద్ధమైన మతము నందును కర్మకాండ తప్పనిసరియైనది. ఇది ఉపదేశ జనకమై, విశ్వాస పోషకమై, తుదకు విశ్వాసకారకమై విలసిల్లుచున్నది. తాను నమ్మిన పరమేశ్వరునితో ఊఅట, సుఖముతో కూడిన సంబంధమును కలుగచేయుచున్నది. ఇది లలిత కళలతో హృదయమును, ఇంద్రియములను రంజింప చేయుచున్నది. ఒకే విధమైన కర్మకాండతో మంత్ర తంత్ర క్రియాకలాపముచే తుదకు సమాన భావ పరంపరతో ఇది ప్రతి వ్యక్తిని ఒక మధుర బంధముతో ముడివేయుచున్నది."

సర్దార్ కె.ఎమ్. పణిక్కర్ అను మహాశయుడు 'Survey of Indian History' అను గ్రంథమున కేవలము సంస్కారముల వలననే మిగిలిన జాతుల నుండి హిందూజాతిని పృథక్కరించుటకు వీలగుచున్నదని సుదీర్ఘముగా చర్చించెను. కర్మకాండతో సన్నిహిత సంబంధముగల కర్మ సిద్ధాంతము, పునర్జన్మముపై ప్రగాఢ విశ్వాసములు ఇతర జాతులను కూడ ప్రభావితము చేయుచున్నవని వచించెను. చతురాశ్రమములు, చాతుర్వర్ణ్యము -- వీని మూలతత్త్వమును గమనించినచో సర్వజాతులకు శిరోధార్యముగా నుండును. మిగిలినవారు పాటించినను పాటింపకపో యినను హైందవ సంఘమునకుగల ప్రత్యేకతను చూపించుటలో వీనికి అధికాధిక ప్రాముఖ్యము కలదనుటలో సందియములేదు.

ఈనాడు ఆర్థిక శాస్త్రవేత్తలు, రాజకీయ తంత్రజ్ఞులు, ప్రణాళికలు వేయుచు, దీనికి ఏదో ఒక దేశం మూలమని చూపింతురుగాని వారి ప్రణాళికలు బాగుగా పరిశీలించినచో అన్నియు పాక్షికములని తేలును. కాని గృహ్య సూత్ర ప్రణాళిక మొత్తము జీవితమునకు సంబంధించినది. ఇది సర్వ సంపూర్ణము, సమగ్రమని తేలును. సంస్కారముల మహి

మను, ప్రయోజనమును గూర్చి సూత్రకారులు, స్మృతికారులేమి చెప్పిరో విన్నవింతును.

సృష్టిలో అచేతన పదార్థము కూడ వ్యవహార యోగ్యము కావలె ననిన సంస్కారము నపేక్షించును. 1) దోషములను పోగొట్టుట, 2) గుణాతిశయమును కలిగించుట, 3) హీనమైన అంగములను పరిపూర్తి చేయుట అను మూడు విధానముల ద్వారా ఏ వస్తువైనను శోభిల్లును, నిత్య కృత్యమున కుపయోగించును. ఉదాహరణకు ఒక కత్తినే గైకొనుడు. మలిన ముతో కూడిన గనియందు గల లోహమునకు మాలిన్యమును పోగొట్టుట, ఆ లోహమును అగ్నియందు పడవేసి కత్తి ఆకారమును కలిగించుట, తుదకు దానికొక పిడిని సమకూర్చుట అను మూడు దశలే పై చెప్పిన విధానములు. ఇట్లచేతనమునకే సంస్కారము కావలెననిన చేతనములు -- అందున ముఖ్యమగు మనుష్యలోకమునకు సంస్కారావశ్యకత గురించి వేరుగా చెప్పవలయునా? శుక్రశోణిత సంబంధముచే నేర్పడిన శరీరములు పవిత్రవంతములై విరాజిల్లవలెననిన సంస్కారముల అపేక్ష ఎంతయో కలదు. స్త్రీపురుషుల కలయికవలన ఏర్పడిన జీవునకు ఒకానొక పాపము సంక్ర మించును కాన త్రికాలజ్ఞులగు మహర్షులు ఏతత్పాపనివారణమునకై షోడశ సంస్కారములను నిర్దేశించిరి.

"విషేకాద్రైజికం చైనో, గార్భికం చాపమృజ్యతే
క్షేత్ర సంస్కార సిద్ధిశ్చ, గర్భాధాన ఫలం స్మృతం
గర్భాద్భవేచ్చ పుం సూతేః పుంస్త్వస్య ప్రతిపాదనం
విషేకఫలవత్ జ్ఞేయం, ఫలం సీమంతకర్మణః
గర్భాంబుపానజో దోషో, జాతాత్సర్వోపి నశ్యతి
ఆయుర్వర్చోభివృద్ధిశ్చ, సిద్ధిర్వ్యవహృతేస్తథా
నామకర్మఫలం త్వే తత్, సముద్దిష్టం మనీషిభిః
సూర్యావలోకనాదాయు రభివృద్ధిర్భవేద్ధ్రువా
నిష్క్రమాదాయుశ్శ్రీర్వృద్ధి రప్యుద్దిష్టా మనీషిభిః
అన్నాశనాన్మాతృ గర్భ మలాశాదపి శుద్ధ్యతి
బలాయుర్వర్చో వృద్ధిశ్చ చూడాకర్మఫలం స్మృతం

ఉపనీతేః ఫలంత్వేత ద్ద్విజతా సిద్ధిపూర్వకా
వేదాధీత్యధికారస్య, సిద్ధిః ఋషిభిరీరి తా
పత్న్యా సహాగ్నిహోత్రాది తస్య స్వర్గః ఫలం స్మృతం
బ్రాహ్మ్యాద్యుద్వాహ సంభూతః పితౄణాం తారక స్సుతః
వివాహస్య ఫలం త్వేత ద్వ్యాఖ్యాతం పరమర్షిభిః." -- మనుస్మృతి

అనగా గర్భాధాన సంస్కారముచే బీజగర్భదోషములు పోవుచున్నవి. దీనితో పాటు క్షేత్ర సంస్కారము సిద్ధించుచున్నది. గర్భధారణ యైన వెనుక ఆ పిండము పుత్రుడుగా మారుటకొరకు పుంసవనమనెడి సంస్కార ముద్దిష్టమైనది. గర్భాధాన ఫలము సీమంత ఫలము నొక్కటియే! జీవుడు గర్భమందుండి తల్లియొక్క ఆహార రసాదులను పానముచేయుటచే వచ్చు సమస్త దోషములు జాతకర్మవలన నశించును. నామకరణమువలన ఆయుర్దాయము, తేజస్సు, వ్యవహారసిద్ధి యేర్పడును. నిష్క్రమణము వలన మంత్రపూర్వకముగ శ్రీమన్నారాయణమూర్తిని దర్శించి ఆయుర్వృద్ధి, శ్రీవృద్ధి పొందును. అన్నప్రాశన సంస్కారముచే తల్లి గర్భమందలి మలా దులను తినుటచే వచ్చిన దోషము పోవుచున్నది. ఉపనయనము వలన ద్విజత్వసిద్ధి, వేదాధ్యయనాధికారము సంప్రాప్తించును. వివాహానంతరము భార్యతో కూడిన వాడై అగ్నిహోత్రము నర్చించుటవలన స్వర్గప్రాప్తి కలుగును. బ్రాహ్మాది ఉత్తమ వివాహముచే సత్సంతానము కలిగి ఇహపరలోకములను తరించుట దానివలన పితృదేవతలు తృప్తి పొందుట జరుగును.

సశాస్త్రీయముగా భార్యాభర్తలు కూడకపోవుటచే, అపవిత్రమైన మాతృ యోనియం దుండుటచే బీజమునకు, గర్భమునకు దోషము సంక్రమించు చున్నదని కుల్లూకభట్టు పై మనుశ్లోకములపై వ్యాఖ్యానించెను. మితాక్షరి ఈ విషయమై స్పష్టప్రతిపాదన చేసినది. సంస్కారములు, తల్లిదండ్రుల నుండి సంక్రమించిన రోగాది శారీరక దోషములను పోగొట్టునుగాని, అసలే పతితు లగు వారినుండి సంక్రమించిన దోషమును పోగొట్టుటకు కాదని కలదు. "బీజగర్భ సముద్భవం శుక్రశోణిత సంబద్ధం గాత్రవ్యాధి సంక్రాంతి నిమిత్తం వా నతు పతితో త్పన్నత్వాది" "ఏనోఽత్రాప్రాయత్యం మాతుః

పీతాశనా దే రుత్పన్నమిత్యర్థః" అని అపరార్కుడు. సంస్కార తత్త్వమున పేర్కొనబడిన హరితు డిట్లనుచున్నాడు. గర్భాధాన సంస్కారమువలన వేదస్వీకార యోగ్యమగు వీర్యమునుంచుచున్నాడు. పుంసవనమువలన ఆ పిండమును మగశిశువగునట్లు చేయుచున్నాడు. సీమంతమువలన తల్లి దండ్రులనుండి సంక్రమించిన దోషమును, బీజ, రక్త, యోని సంబంధమగు ఐదు విధముల దోషములను జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చూడాక రణ, సమావర్తనములచే పోగొట్టుచున్నాడు. ఈ ఎనిమిది సంస్కారములచే పవిత్రత యేర్పడును. "తత్రహారితః గర్భాధాన వదుపేతో బ్రహ్మగర్భం సందధాతి, పుంసవనా త్పుంసీకరోతి ఫలస్థాపనా న్మాతాపితృజం పాప్మాన మపోహతి రేతో రక్త గర్భోపఘాతః పంచగుణో జాతకర్మణా ప్రథమ మ పోహతి, నామకరణేన ద్వితీయం, ప్రాశనేన తృతీయం, చూడాకరణేన చతుర్థం, స్నాపనేన పంచమమేతై రష్టాభిః సంస్కారై ర్గర్భోపఘాతాత్ పూతో భవతీతి" దానినే మనువీవిధముగా ననుచున్నాడు. "గార్భహోమము (గర్భాధాన సమయమున చేయు హోమము), జాతకర్మ, చూడాకర్మ, మౌంజీ బంధన (ఉప నయన) సంస్కారముల వలన ద్విజులకు గర్భబీజ సంబంధమైన దోషములు దూరమగును.

"గార్భైర్హోమై ర్జాతకర్మ చౌడ మౌంజీనిబంధనైః
బైజికం గార్భికం చైనో ద్విజానామపమృజ్యతే."

ద్విజాతులకు గర్భాధానాది శారీరక సంస్కారములు వైదిక మంత్ర పురస్సరముగా జరుగవలెనని, దానివలన ఇహపరలోకములు పవిత్రమగునని అందే కలదు.

"వైదికైః కర్మభిః పుణ్యైర్నిషేకాదిర్ద్వి జన్మనామ్
కార్యః శరీర సంస్కారః పావనః ప్రేత్య చేహచ." -- మ.స్మృ. 226

యాజ్ఞవల్క్యుడు కూడ నిట్లేయనెను. (1.6)

అంగిరసుడు ఈ సంస్కారములను చిత్రకర్మతో పోల్చెను. చిత్ర కర్మయందు వివిధమైన రంగులు అవసరమైనటుల బ్రాహ్మణ్యప్రాప్తికి వివిధ సంస్కారముల అవసరము కలదు.

"చిత్రకర్మ యథాऽనేకై రంగై రున్మీల్యతే శనైః
బ్రాహ్మణ్య మపి తద్వత్స్యాత్ సంస్కారై ర్విధిపూర్వకమ్."

ఒక నిర్దిష్ట జీవిత విధానమునకీ సంస్కారము లత్యావశ్యకములు. గర్భాధానముతో మొదలిడి, అంత్యేష్టివరకు ఒక క్రమపద్ధతిలో నిది సాగును. గర్భాధానము కేవలము భౌతికవాంఛను తీర్చుకొనుటకేగాక సత్సంతాన ప్రాప్తికై యేర్పడినది. ఆయా ఉద్దిష్ట సమయములందు జరుగు వైదిక క్రియాకలాపముచే ఒక పవిత్ర వాతావరణ మేర్పడి మానసికమైన పరిణతికి తోడ్పడును. గర్భిణీస్త్రీయొక్క నడవడి, ఆలోచనా పరంపర, శిశువుపై ప్రభావము చూపును. శిశువు జన్మించిన వెనుక రాయివలె దృఢత్వము, పరశువువలె బుద్ధి తీక్ష్ణత కలిగి యుండవలెనను ఆశీర్వాదము గమనింప తగినది. (ఆప.గృ. 14. పా.గృ.సూ. 1.16. జై.గృ. 1.8) చూడాకరణ మైన వెనుక అక్షరాభ్యాసము - ఇందిహపరలోక సౌఖ్యమునకు నాంది పల్కుదురు. ఆపై ఉపనయనము - ఇందు కఠోర నియమపాలనముచే భవిష్యజ్జీవనమునకై ప్రస్తావన పలుకఁబడును. ఆపై వివాహము. సమస్త జగత్తునకు ఆధారభూతమైన, మంగళ ప్రదమైన మహోత్తమ సంస్కారము. భౌతిక తృప్తి కొఱకు గాక మనువు చెప్పినటుల గృహస్థ జీవనమున విధింపఁబడు స్వాధ్యాయము, వ్రతము, హోమము, దేవఋషితర్పణము, యజ్ఞము, సంతానోత్పత్తి, ఇజ్య, పంచమహాయజ్ఞముల అనుష్ఠానము వలన బ్రాహ్మీశరీర మగును. అనగా బ్రహ్మప్రాప్తి యోగ్యమైన శరీరమగును.

"స్వాధ్యాయేన జపైర్హోమైస్త్రైవిద్యేనేజ్యయాసుతైః
మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః

ఇట్లు స్వార్థమునుండి పరార్థమునకు, పరమార్థమునకు ప్రాణి పయనించు చున్నాడని చెప్పవచ్చును. పై సంస్కారాదులవలన మృత్యుభయము నుండి ముక్తుడగుచున్నాడు. ఇట్లు వ్యక్తి వికాసమును బొందుటయేగాక సమాజము కూడ సంపూర్ణ వికాసమును బొందుచున్నది.

సంస్కారములు మహత్త్వపూర్ణము లనుటకు హారీతుని వాక్యములను తిలకింపుడు: బ్రాహ్మ సంస్కారములవలన ఋషిస్థితిని పొంది జీవుడు

వారి సమీపమున నుండును. దైవ సంస్కారములను చేసి సంస్కృతుడైన వ్యక్తి దేవతాస్థితిని పొందును. "ద్వివిధః సంస్కారోభవతి బ్రాహ్మో దైవశ్చ, గర్భాధానాది స్మార్తో బ్రాహ్మః, పాకయజ్ఞ హవిర్యజ్ఞ సౌమ్యాశ్చేతి దైవః, బ్రహ్మ సంస్కార సంస్కృత ఋషీణాం సమానతాం సలోకతాం సాయుజ్యం గచ్ఛతి. దైవేనోత్తరేణ సంస్కృతో దేవానాం సమానతాం సలోకతాం సాయుజ్యం గచ్ఛతి."

తురీయ పురుషార్థమే (మోక్షమే) సర్వమానవు లపేక్షించునది యగుటచే సంస్కారములు కూడ దానికి సాధనములుగా పరిగణింపబడినవి. "సంస్కారములవలన సంస్కృతుడై అష్ట ఆత్మగుణములతో కూడిన వ్యక్తి బ్రహ్మలోకమునకేగి బ్రహ్మపదమును పొందును. అందు నుండి చ్యుతుడగుట లేదని శంఖలిఖిత స్మృతియందు కలదు.

"సంస్కారైః సంస్కృతః పూర్వైరుత్తరై రనుసంస్కృతః
నిత్యమష్టగుణైః యుక్తో బ్రాహ్మణో బ్రాహ్మలౌకికః
బ్రాహ్మంపద మవాప్నోతి యస్మాన్నచ్యవతే పునః"

దానినే గౌతముడు కూడ వచించెను. "యస్యై తే చత్వారింశత్సంస్కారా న చాష్టావాత్మగుణాః న స బ్రహ్మణస్సాయుజ్యం సాలోక్యం గచ్ఛతి." అనగా ఎవ్వనికి నలుబది సంస్కారములుండియు, ఎనిమిది ఆత్మగుణ ములు (దయ, క్షాంతి, అనసూయ, శౌచము, అనాయాసము, మంగళము, కార్పణ్యములేమి, అస్పృహత్వము) లేకయుండునో అట్టివాడు బ్రహ్మ సాయుజ్యమును గాని, సాలోక్యమును గాని పొందజాలడు. ఈ ఆత్మగుణములలో ఏకదేశము (కొంత) కల్గినందువలన సాలోక్యమును, సమస్తమును పొందినందువలన సాయుజ్యమును పొందునని, దానిపై హరదత్తుని వ్యాఖ్య. "ఏక దేశ సంయోగాత్సాలోక్యం సమస్త యోగాత్సాయుజ్యమితి." పై వాక్యములను బట్టి నైతిక గుణములకెంత ప్రాముఖ్యము కలదో తిలకింపుడు. సంస్కారములకు అనుబంధముగా గర్భిణీ ధర్మములు, బ్రహ్మచారి ధర్మములు మొదలగునవి పెక్కు నైతిక విధులు విధింపఁబడినవి. వీటిలో వ్యక్తియొక్క నైతిక వికాసము, ప్రగతి సూచింపఁబడినది.

సంస్కారముల వలన వ్యక్తి ఎట్లు క్రమవికాసమును పొందునో వైఖానసమును తిలకించిన తెలియును. "సంస్కారవంతులైన బ్రాహ్మణ స్త్రీ పురుషులకు పుట్టినవాడు జాత్యా బ్రాహ్మణుడు. ఉత్థానాది ఉప నయనాంతము సంస్కరింపబడి గాయత్రిని పఠించువాడు బ్రాహ్మణుడు. ఉపనయన ప్రభృతి వివాహాంతము సంస్కృతుడై పాకయజ్ఞము లొనర్చినవాడు శ్రోత్రియుడు. హవిర్యజ్ఞములు చేసెనేని అనుచానుడని పిలువబడును. ఆపైన సోమయజ్ఞములు కావించెనేని భ్రూణుడగును. నలుబది సంస్కారములకు తోడు యమనియమములు కలిగినచో ఋషి కల్పుడగును. అంగములతో కూడిన చతుర్వేదాధ్యయనము చేసి తపోనిష్ఠాగరిష్ఠుడైనచో ఋషియగును. పరమేశ్వరధ్యాన మగ్నుడై సమస్త ద్వంద్వములకు అతీతుడైన వ్యక్తి మునియగును." దీనికనుగుణముగా అత్రిస్మృతి "జన్మనా బ్రాహ్మణోజ్ఞేయః సంస్కారాద్ద్విజ ఉచ్యతే" అనియున్నది. అనగా బ్రాహ్మణ దంపతులకు పుట్టిన వాడు బ్రాహ్మణుడగునని సంస్కారములచే ద్విజుడగునని అభిప్రాయము. ఇంకను జన్మచే శూద్రుడగుననియు, ఉపనయనముచే ద్విజుడగునని, వేదాధ్యయనమువలన విప్రుడగునని, బ్రహ్మసాక్షాత్కారమువలన బ్రాహ్మణుడగునని మనుస్మృతిని ఎల్లరు పేర్కొందురు. కాని 'జన్మనా జాయతే శూద్రః' అను పాఠమునకు బదులుగా 'జన్మనా బ్రాహ్మణో జ్ఞేయః' అనుపాఠమునే స్వీకరింపవలెనని సంప్రదాయజ్ఞుల అభిప్రాయము.

సమాజమున గల విశేషాధికారములకు సంస్కారములకు సంబంధము గలదు. ఉదా: ఉపనయన సంస్కారము ద్విజులకే విహితమైయున్నది. "అశూద్రాణామదుష్ట కర్మణా ముపనయనమ్." ఈ విషయమై విపులముగా ఉపనయన ప్రకరణమున చర్చింతును. ఇంతవరకు ధార్మిక, నైతిక, సాంస్కృతిక ప్రయోజనములను గూర్చి చర్చించితిమి. ఇంకను సంస్కారములు చేయుటలో ఏయే విశ్వాసములు, ఆరాధనలు, ఉద్దేశ్యములుండునో వివరింతును.

ఒక దివ్య శక్తి కలదనియు, దాని నావాహనము చేసికొనవలెననియు, అట్లే దుష్టశక్తులున్నవని, వాని బారినుండి తప్పించుకొనవలె ననుకొనుట

సర్వసాధారణమైనది. సంస్కారములను చేయుటలో ఈ విశ్వాసమిమిడి యున్న దనుటలో సందేహములేదు.

మన పెద్దలు దుష్టశక్తులను నివారించుటలో అనేక సాధనల నవలంబించిరి. అందు ఆరాధన ప్రథమస్థానమును వహించినది. భూతప్రేతాది అశుభశక్తులను స్తుతించి, వానికి బలిభోజనాదులర్పించు పద్ధతి స్త్రీ గర్భిణిగా నున్నప్పుడు, శిశుజన్మయందు, శైశవ దశయందు అవలంబింపబడినది. శిశువును భూతాదులావహించెనను విశ్వాసముతో శిశువు యొక్క తండ్రి ఇట్లనుచున్నాడు. "శిశువు నాక్రమించు కుర్కుర, సుకుర్కురాదులు ఈ శిశువును విడిచిపెట్టుదురుగాక! హే సిసర్! నీ పట్ల ఆదరమును చూపుచున్నాను". -- (పా.గ్ర.సూ. 1.16.20. ఆ.గృ.సూ. 1.15) దానిపై గదాధరు డిట్లు చెప్పుచున్నాడు. "తతస్సృష్ట తుష్ట ఏనం ఏనం కుమారం ముంచ."

కొన్ని సందర్భములందీ యారాధన అనావశ్యకమని భావించినపుడు వానిని నివర్తనము చేయుటకలదు. ఉదా: ముండనము చేయు నపుడు కత్తిరించిన కేశములను గోమయపిండమున నద్ది గోష్ఠమున ఉంచుట లేక నదియందు వదిలివేయుట --దీనివలన పిశాచాదులు బాధించవను భావన కలదు. "అనుగుప్తమేతం సకేశం గోమయం పిండం నిధాయ గోష్ఠే పల్వాల ముదకాంతేవా." --(పా.గృ. 2.1.20.) ఈ ప్రక్రియ అంత్యేష్టియందు గూడ గాననగును. మృత్యువు సమీపించినపుడు, మరణాసన్న వ్యక్తి యొక్క ప్రతిమూర్తి దగ్ధము చేయబడును. (కౌ.సూ. 48.54.39)

కొన్ని సందర్భములం దా శక్తులను భయపెట్టుటకై చేయు ప్రయత్నము లగుపించును. జాతకర్మ సమయమున శిశువు యొక్క తండ్రి ఇట్లను చున్నాడు. "శుండమర్క, ఉపవీర, శౌండికేయ, ఉలూఖక, మలిమ్లుచ, ద్రోణాస, చ్యవన --మీరందరు ఇక్కడనుండి అదృశ్యమై పొందు -- స్వాహా" --(పా.గృ.సూ. 1.16.12. ఆప.గృ. 1.15)

గృహస్థుడు తనవారిని అశుభ ప్రభావములనుండి నివారింపుడని దేవతలను ప్రార్థించును. ఉదా : పతి, నవ వివాహిత పత్నిని బాధపెట్టు శక్తులనుండి నివారించుటకై అగ్ని, వాయు, సూర్యచంద్ర గంధర్వులను ఆహ్వానము చేయును. "అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తిరసి బ్రాహ్మణస్త్వానాథకామ ఉప ధావామి యాఽస్యై పతిఘ్నితనూస్తామస్యై నాశయ స్వాహా." -- ఇత్యాది. పా.గృ.సూ.

కాని అప్పుడప్పుడు జలముచే, అగ్నిచే వానిని స్వయముగా దూరము చేయును. జలము భౌతికమైన అశౌచమును పోగొట్టుటయేగాక భూతాదులనుండి రక్షించును. శత పథ బ్రాహ్మణమునందు జలము రక్షస్సులను నాశనము చేయునని కలదు. "ఆపోహివై రక్షఘ్నీ" అంత్యేష్టియందు, అవాంఛిత శక్తులను ఆటంకము చేయుటకు చప్పుడు చేయుదురు. ఇట్లే అమంగళకర శక్తులనుండి రక్షించుకొనుటకై విద్యార్థి దండధారణ చేయవలెనని కలదు. (ఆప.గృ. 1.19.101; పా.గృ. 2.5.16) బ్రహ్మచారి దండమును విడువరాదు. విద్యార్థి జీవన పరిసమాప్తియగు నపుడు పూర్వదండమును విడిచిపెట్టినను, సమావర్తన సంస్కారమున దృఢతరమైన వంశ దండమును ధరించవలెనని కలదు. "వైణవం దండమాదత్తే" -- (పా.గృ.2.6.26) ఈ దండధారణము పశువులను కొట్టుటకు, శత్రువులనుండి రక్షించుకొనుటకై కాదు. రక్షస్సులనుండి రక్షించుకొనుటకే యిది యుద్దిష్టము. "విశ్వాభ్యో మానాష్ట్రాభ్య స్పరిపాహి సర్వత ఇతి." -- (పా.గృ.సూ.2.6.26.) అట్లే సీమంతోన్నయనమున కేశములను సంవారణము చేయుటలో ఈ ఉద్దేశ్యమే కలదు. (ఆప.గృ. 14. హి.గృ. 2.2.)

ఈ శక్తులను ఇతరులు భరించునట్లు చేయుట కూడ గమనింపదగిన విషయము. ఉదా: వధువు ధరించిన వస్త్రమును బ్రాహ్మణునకు దానము చేయుట. ఇట్లిచ్చుటవలన అమంగళములు తొలగుననియు, ఆ శక్తుల నుండి బ్రాహ్మణుడు తప్పించుకొనునని తెల్లమగుచున్నది. వైవాహిక వస్త్రములను గోశాలయం దుంచుటగాని, వృక్షముపై వ్రేలాడదీయుటగాని చేయవచ్చును. (అ.వే. 14.2.48.50.; కౌ.సూ. 76.1.79.24;)

ఇట్లశుభములను పోగొట్టుకొనుటయే గాక శుభములకై దేవతాహ్వానమును చేయుదురు. ఒక్కొక్క సమయమున ఒక్కొక్క దేవత అధిష్ఠాతయైయుండును. విష్ణువు గర్భాధాన సమయమున ప్రధాన దేవత. వివాహమున ప్రజాపతి, ఉపనయనమున బృహస్పతి -- ఇత్యాదిగా నుండును. ఇంకను కొన్ని విశ్వాసములు కలవు. శుభవస్తువులను స్పృశించినచో శుభము కలుగునను ఆశకలదు. ఉదా: సీమంతమున ఉదుంబర శాఖలను స్త్రీ గళమున ధరింపచేయుట. ఈ స్పర్శవలన ఉర్వరత అనగా సంతానోత్పత్తి సామర్థ్యము కలుగునని కలదు. అట్లే శిలారోహణము వలన దృఢత్వము కలుగును. ఆచార్యుదు బ్రహ్మచారి. పతి-పత్నుల హృదయస్పర్శ ఐక్యమును సూచించును. శ్వాస జీవనమునకు ప్రతీక. అందువలన తండ్రి అప్పుడే పుట్టిన శిశువునకు శ్వాస ప్రశ్వాసలు బాగుగా నాడవలెనను ఉద్దేశ్యముతో మూడు పర్యాయములు వీచును. పుత్రుడు కావలెనను కోరు తల్లి దధిమిశ్రితమైన యవ మాష బీజములను ప్రాశనము చేయును. పురుష సంతతి కొరకై గర్భిణి స్త్రీ యొక్క కుడినాసికలో వటవృక్షశాఖల రసమును పిండుదురు. వివాహమున సమంజనము వలన వధూవరులకు పరస్పరము ప్రేమ, స్నేహము వృద్ధియగును. "అథైనౌ సమం జయతి-సమం జంతు విశ్వేదేవాః సమాపౌ హృదయాని నౌ, సమ్మాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దధాతు నౌ." -- (పా.గృ. 1.4.14. గౌ.గృ. 2.1.18.) దీనివలన కురూపమైన అశుభమైన దృశ్యములనుండి నివారణ జరుగునని ్రసము.

కొన్ని సందర్భములందు కొన్ని పదములను కూడ మార్చి చెప్పుట కలదు. గర్భిణిని విజన్య యనియు, నకులమును శకులమనియు, కపాలమును భగాలమనుట మొదలగునవి. "గర్భిణీం విజన్యేతి బ్రూయాత్ శకులమితి నకులమ్, భగాలమితి కపాలమ్." (పా.గృ. 2.7.11-13. ఆ.గృ. 3.96)

అపుడపుడు అభీష్టవస్తు ప్రాప్తి కొఱకు నాటకీయఫణితిలో కొన్ని మాటలను పృచ్ఛించుట కూడ కలదు. సీమంతమున బియ్యపురాశిని పతి, పత్నిని చూడుమని చెప్పుచు ఈ విధముగ ప్రశ్నించును. "సంతానము,

పశువులు, సౌభాగ్యము మరియు నాకై దీర్ఘాయువు -- వీనిలో దేనిని చూచుచున్నావు?" "కిం పశ్యసి ప్రజాం పశూన్ సౌభాగ్యం మహ్యాం దీర్ఘాయుష్టం పత్యుః" -- (సామవేద మంత్ర బ్రాహ్మణము. 1.5. 1-5)

ఇక భౌతికోద్దేశము: ధనమును, ధాన్యమును, దీర్ఘ జీవనమును, సంపత్తిని, సమృద్ధిని, శక్తిని, బుద్ధిని ప్రసాదింపుమని పరమేశ్వరుని ప్రార్థించుట కూడ కాననగును. ఇవన్నియు భౌతిక జీవనమున ఆవశ్యకములే. దేవతలు పైవానినిచ్చి తమ అనుగ్రహమును జూపింతురు. ఈ ప్రార్థన వివాహమున సప్తపది యందు చూడనగును.

"ఏకమిషే విష్ణుస్త్వాం నయతు ద్వే ఊర్జే త్రీణి
రాయస్పోషాయ చత్వారి మయోభవాయ
పంచపశుభ్యః షడ్ ఋతుభ్యః" -- శాం.గృ. 1.14.5.

గృహస్థుడు కేవలము రాక్షస శక్తులనుండి తప్పించుకొనుటకు గాని, ఇష్టవస్తు ప్రాప్తికి గాని దేవతారాధన చేయుటకు గాని సంస్కారములను చేయుటయేగాక ఆత్మతృప్తికొఱకు కూడ చేయును. పుత్రోత్సాహము, వివాహాదులందీ తృప్తిని సంగీతము పాడుట, భోజనము పెట్టుట, కానుకలిచ్చుట మొదలగువానిచే వ్యక్తీకరించును.

తత్త్వవేత్తలలో కొందఱు, పాంచభౌతికమైన శరీరమును అవహేళనము చేసి నిర్వాణమునకై యత్నించవలెనని యనగా, కొందఱు ఈ శరీరము కన్న అతిరిక్తమైన వస్తువునకై సమస్తమును వెచ్చించుట అవివేకమని తలంచిరి. కొందరు కేవల కర్మమార్గమును, కొందరు కేవల జ్ఞానమార్గమవలంబించిరి. సంస్కార పద్ధతి ఈ యుభయ మార్గములలో నున్న మంచిని స్వీకరించి మధ్యే మార్గము నవలంబించినది. ఆధ్యాత్మిక పరిణతికి శరీర మన్నివిధముల పరిశుద్ధము కావలెననియు, పరమపదమునకు సోపాన క్రమము అవలంబింపదగినదని భావించినది. అట్లే మనువు శ్లోకములపై మేధాతిథి వ్యాఖ్య గమనింపుడు. "నహికర్మభి రేవ కేవలై ర్బహ్మాత్వ

ప్రాప్తిః ప్రజ్ఞాన కర్మ సముచ్చయాత్ కిలమోక్షః, ఏతైస్తు సంస్కృతః ఆత్మనో పాపనాస్త్వధిక్రియతే." ఈ మార్గము నవలంబించుటచే సమాజము కూడ పవిత్రవంతమగును. యజుర్వేదములో చెప్పినటుల విద్య, అవిద్యల రెంటిని తెలిసికొనినవాడు అవిద్యవలన మృత్యువును దాటి విద్య వలన అమృతత్వమును పొందుచున్నాడు.

"విద్యాం చా విద్యాం చ యస్తద్వేదో భయం పహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే."

ఇట్టి సంస్కార పద్ధతి అనాదినుండి ప్రచలితమైనను కాలక్రమమున మానవ దౌర్బల్యములచే అనేక సంకట స్థితులందు చిక్కుకొన్నది. మంత్రార్థ వివరణ లేకపోవుటచే, భౌతిక వాంఛలు ప్రబలుటచే, సంఘపద్ధతి మారుటచే సంస్కారములు యాంత్రికముగా సాగిపోవుచు నిష్ప్రయోజనము, నిర్జీవమైయుండుటలో ఆశ్చర్యములేదు.

దురదృష్టవశాత్తు సంస్కారములను గూర్చి వ్రాసిన గృహ్య సూత్ర కారుల గురించి మనకందరికి బొత్తిగా తెలియదని చెప్పవచ్చును. వారిని గురించి చారిత్రకాధారములు లభ్యమగుటలేదు. వారి జీవిత చరిత్రల మాట అటుండనిండు. తుదకు వారి గ్రంథములు కూడ కనుమరుగై పోయినవి. కెలాండు ప్రభృతుల కృషివలన కొన్ని బైటకు వచ్చినవి. చరిత్ర ప్రాధాన్యముగల ఏ చిన్న వస్తువుకైనను కొన్ని లక్షలు ఖర్చుపెట్టు పాశ్చాత్యుల విజ్ఞానతృష్ణ మనకుపాదేయము.

ఎన్ని విదేశ దండయాత్రలు సంభవించినను సంప్రదాయము విచ్ఛిన్నము కాలేదు. పోయినవి పోగా, గురుశిష్య సంబంధముచే విషయములు చాలవరకు ముఖస్థములైనవి. ఎన్నియో వేలసంవత్సరముల జీవితమును మథించి, భూతభవిష్యద్వర్తమానములకు సంబంధించిన మానవాభ్యుదయమును ఆకాంక్షించి నిర్మించిన గృహ్య సూత్ర సౌధములను జాగరూకతతో పరిశీలింపవలెను. సూత్రకారుల భావనలో మానవ జీవితమొక మధుర

కళాఖండమనియు, దానిని మలచుకొనుటలోనే మనము శ్రద్ధ వహింపవలె నను సారాంశము గోచరించును. షోడశకళా ప్రపూర్ణుడగు చంద్రునివలె షోడశ సంస్కారముల ద్వారా జీవుడు జీవత్వమును విడిచి బ్రహ్మత్వమును పొందవలెనను ఆకాంక్షతో భగవద్దత్తమైన ప్రజ్ఞాదులచే అనర్ఘమగు మణులచే ఏర్చికూర్చిన. హారమును బోలిన గ్రంథములను సూత్రకారులు పరమేశ్వరున కర్పించిరనుటలో అతిశయోక్తిలేదు.

# సంస్కార శబ్దార్థము -- సంఖ్య

'సమ్' పూర్వక కృఞ్ ధాతువునకు, ఘఞ్ ప్రత్యయమురాగా సంస్కార మైనది. దీనికి అనేకార్థములు కలవు. మీమాంసకులు, యజ్ఞాంగ పురోడాశాదులను శాస్త్రప్రకారముగా శుద్ధిచేయుట అనునర్థమున వాడిరి. "ప్రోక్షణాది జన్యసంస్కారో యజ్ఞాంగ పురోడాశేష్వితి ద్రవ్యధర్మః" (వాచ స్పత్యము). అగ్నియందు ఆహుతి నిచ్చు యజ్ఞసామగ్రిని పరిష్కారము చేయుట అనునర్థమున వాడిరి. "వ్రీహ్యాదేశ్చ యజ్ఞాంగతా ప్రదానాయ వైదిక మార్గేణ ప్రోక్షణాదిః." అద్వైత వేదాంతులు జీవునిపై శారీరక క్రియల యొక్క మిథ్యారోపమే సంస్కారమనిరి. జీవునికి శుద్ధిని కలుగచేయుటకై చేయు స్నాన ఆచమనాదులను సంస్కారములనిరి. "స్నానాచమనాది జన్యాః సంస్కారా దేహే ఉత్పద్యమానాని తదభిధానాని జీవే కల్ప్యంతే." ఏ వేద విహితములైన కర్మల ననుసరించుటచే అంతఃకరణ శరీరాదులందు అతిశయమేర్పడునో అదియే ఇదియని వీరమిత్రోదయము. "ఆత్మశ రీరాంతరనిష్ఠో విహితక్రియాజన్యోఽతిశయ విశేషస్సంస్కారః." జైమిని సూత్రములం దీ పదము బహుపర్యాయములు వాడబడినది. జ్యోతి ష్టోమమునందు యజమానునికి వపన, ముఖప్రక్షాళన, నఖకర్తనములందు వాడబడినది. ఒక వస్తువునుగాని, ఒక పదార్థమునుగాని ఒక విశిష్ట ప్రయో జనము కొరకు యోగ్యమగునట్లుగా చేయునది సంస్కారమని శబరస్వామి వ్రాసెను. "సంస్కారో నామ సభవతి యస్మిం జాతే పదార్థోభవతి యోగ్యః కస్య చిదర్థస్య." ఇవి యోగ్యతను కలుగచేయును. ఆ యోగ్యత రెండు విధములు. ఒకటి దోషమును పోగొట్టుట, రెండవది గుణమును కలిగించుటగా నుండునని తంత్రవార్తికము. "యోగ్యతాం చాదధానాః క్రియాః సంస్కారా ఇత్యుచ్యంతే, యోగ్యతా చ సర్వత్ర ద్విప్రకారా దోషాపనయనేన గుణాంతరోప జననేన చ భవతి." అట్లే శంకరులు వేదాంత సూత్రములందు వ్రాసిరి. "సంస్కారోహి నామ గుణాధానేన వాస్యాద్, దోషాపనయనేనవా." సంస్కారములు శరీరమును సంస్కరించి అదృష్ట ఫలకములైన సర్వవైదిక కర్మలందు యోగ్యతాతిశయమును చేయు

చున్నవని వీరమిత్రోదయము. "ఏతే గర్భాధానాదయః సంస్కారాః శరీరం సంస్కుర్వంతః సర్వేషు అదృష్టార్థేషు కర్మసుయోగ్యతాతిశయం కుర్వంతి. ఫలాతిశయో యోగ్యతాతిశయే చ." కనుకనే జ్యోతిష్టోమాది యజ్ఞకర్మలు సశాస్త్రీయముగా నిర్వహింపబడినను, యజమాని సంస్కారవంతుడు కానిచో సంపూర్ణ ఫలము నీయజాలవు.

సంహితాభాగమునందు సంస్కారశబ్ద ప్రయోగము లేదని, ఉపనయ నాది సంస్కారముల వర్ణన కలదని కాణే ప్రభృతులనుచున్నారు. సంస్కృత అనుమాట తఱచువచ్చునని కాణే అంగీకరించినాడు. పదము భిన్నమైనను అర్థమొక్కటే. ఒక్క వైఖానసమునందుతప్ప ఏ గృహ్య సూత్రమునందును ఈ పదము ప్రయోగింపబడలేదని చెప్పవచ్చును.

సంస్కృత సాహిత్యమున అనేకార్థములందిది ప్రయుక్తము. శిక్షణ, (నిసర్గ సంస్కారవినీత ఇత్యసౌ నృపేణ చక్రే యువరాజ శబ్దభాక్ -- రఘువంశము) వ్యాకరణ సంబంధిశుద్ధి, (సంస్కారవత్యేవ గిరామనీషీ తయా స పూతశ్చ విభూషితశ్చ -- కుమారసంభవము) పరిష్కరణము, (ప్రయుక్త సంస్కార ఇవాధికం బ భౌ -- రఘువంశము), శోభ (స్వభావ సుందరం వస్తు న సంస్కారమపేక్షతే --శాకుంతలము), స్మరణశక్తి, (సంస్కార జన్యం జ్ఞానం స్మృతిః -- తర్కసంగ్రహము), శుద్ధి, ధార్మిక విధివిధానము (కార్యః శరీర సంస్కారః పావనః ప్రేత్యచేహచ -- మనుస్మృతి) మొదలగు అనేకార్థములు దీనికి కలవు.

ఈ పదమును మరియొక భాషలోనికి అనువాదము చేయవలెననిన కష్టము. ఆంగ్లమున 'సెరిమొనీ, లేటిన్ భాషలో 'సింమోనియా' అని వ్యవ హరింపబడు శబ్దములు మన సంస్కార శబ్దముతో సమానములని పూర్తిగా చెప్పలేము. ఈ శబ్దార్థమునకు దగ్గఱగా నుండునది 'Sacrament' అను పదము. 'Religious ceremony or act regarded as out ward visible sign of inward spiritual grace' (Oxford dic) అనగా అంతర సౌందర్యమును వ్యక్తీకరించు ధార్మిక విధివిధానము. ఇది యొక ప్రతీక. ఇందు Baptism (జ్ఞానస్నానమను ఒక క్రియ) confirmation

(ధ్రువపఱచుట) Eacharist (మహాప్రసాద వినియోగము) Penance (ప్రాయశ్చిత్తము) orders (ఆదేశములు), వివాహము, అనుక్రైస్తవ కర్మలందిది వర్తించును. పవిత్రప్రభావము మొదలగు అర్థములందిది ప్రయుక్తము.

ఇట్లు వ్యక్తియొక్క శారీరక, మానసిక శుద్ధిపట్ల సంస్కారము వర్తించును.

**సంస్కార సంఖ్య :--** గౌతమ ధర్మసూత్రములలో ఎనిమిది ఆత్మ గుణముల వెనుక నలుబది సంస్కారములు కలవు. "చత్వారింశత్ సంస్కారాః అష్టా ఆత్మగుణాః" 1) గర్భాధానము, 2) పుంసవనము, 3) సీమంతోన్నయనము, 4) జాతకర్మ, 5) నామకరణము, 6) అన్నప్రాశనము, 7) చౌలము, 8) ఉపనయనము, 9-12) నాలుగు వేదవ్రతములు, 13) స్నానము లేక సమావర్తనము, 14) సహధర్మచారిణీ సంయోగము (వివాహము), 15-19) దేవ పితృ మనుష్య భూత బ్రహ్మయజ్ఞములను పంచమహా యజ్ఞములు, 20-26) అష్టక, పార్వణ, శ్రాద్ధము, శ్రావణీ, ఆగ్రహాయణీ, చైత్రి, ఆశ్వయుజి -- అను సప్తపాక యజ్ఞసంస్థలు, 27-33) అగ్న్యాధేయము, అగ్నిహోత్రము, ధర్శపౌర్ణమాస్య, చాతుర్మాస్య, ఆగ్రాయణేష్టి, నిరూఢపశుబంధము, సౌత్రామణి --అను సప్త హవిర్యజ్ఞములు, 34-40) అగ్నిష్టోమ, అత్యగ్నిష్టోమ, ఉక్థ్య, షోడశి, వాజపేయ, అతిరాత్ర, అప్తోర్యామములను సప్త సోమయజ్ఞ సంస్థలు.

గౌతముడు సంస్కారములతో బాటు శ్రౌతయజ్ఞాదులను కూడ కలిపినాడు. అనగా సమస్త ధార్మిక కృత్యములిందు చేరును. యజ్ఞములు దైవములని, భిన్నభిన్న దశలందు జరుపబడు సంస్కారములు బ్రాహ్మములని హారీతుని వచనము. "ద్వివిధః సంస్కారో భవతి, బ్రాహ్మోదైవశ్చ, గర్భాధానాదిః స్మార్తోబ్రాహ్మః" యజ్ఞము మనుజుని పవిత్రము చేయును. "యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్ (బౌ.గృ.సూ.) కాని దీని ముఖ్య ప్రయోజనము దేవతారాధనయే. తన్మూలమున తనకు తాను సంస్కరించుకొనుట ఫలము. "సంస్కారార్థం శరీరస్య" (మ. స్మృతి).

వైఖానసమునందు శారీర సంస్కారములకు, యజ్ఞములకు భేదము గోచరించును. ఇందు గర్భాధానము మొదలిడి వివాహ పర్యంతము అష్టాదశ సంస్కారములు కలవు. ఆపైన 22 యజ్ఞముల ప్రస్తావన కలదు.

గృహ్యసూత్రములు సాధారణముగ సంస్కారములను వివాహముతో మొదలిడి సమావర్తన పర్యంతము పేర్కొనును. వానియందు అధికముగా అంత్యేష్టి ప్రస్తావన ఉండదు. దీనిని కేవలము పారాశర, ఆశ్వలాయన, బౌధాయనాదులు పేర్కొన్నవి.

హిరణ్యకేశి, భారద్వాజ మానవములు ఉపనయనముతో ఆరంభించినవి. కర్ణవేధ, అక్షరాభ్యాసములు పెక్కు సూత్రములందు లేవని చెప్పవచ్చును. కాని వీటిని స్మృతులు, పురాణములు పేర్కొన్నవి.

1. ఋతుసంగమనము:- గర్భాధానము కంటె భిన్నముగా వైఖానసమున కలదు. "ఋతౌ సంగమనం నిషేక మిత్యాహుః"

2. గర్భాధాన, నిషేక, చతుర్థీకర్మ లేక హోమము:- మను, యాజ్ఞ, విష్ణుధ.సూ. లు నిషేకమును గర్భాధాన పర్యాయవాచిగా పేర్కొన్నవి. సాంఖ్యాయన, పార, ఆప, గృ.లు దీనినే చతుర్థీ కర్మ, లేక చతుర్థీ హోమము లన్నవి. బోధాయన, కాఠక, గౌతమ, యాజ్ఞములు గర్భాధానమన్నవి. వైఖానసము మాత్రము నిషేకము తర్వాత దీనిని పేర్కొనెను.

3. పుంసవనము:- అన్నింట కలదు.

4. గర్భరక్షణము:- సాంఖ్యా. న కలదు. అనవలోభనముతో సమానము (ఆశ్వ.)

5. సీమంతోన్నయనము:- అన్నింట కలదు.

6. విష్ణుబలి:- బౌధా, వైఖా, అంగిరస్‌లో కలదు. గౌతమాదులు పేర్కొనలేదు.

7. శోష్యంతీకర్మ లేక హోమము:- ఖాదిర గోభిలములందు; శోష్యంతీ సవన మని కాఠకము; క్షిప్ర పుంసవనమని ఆప, భారలు. అట్లే బుధస్మృతి.

8. జాతకర్మ:- అన్నియు పేర్కొన్నవి.

9. ఉత్థాన:- వైఖా, సాంఖ్యా.లు పేర్కొన్నవి.

10. నిష్క్రమణము లేక ఉపనిష్క్రమణము ఆదిత్య దర్శనము లేక నిర్ణయనములు:- యాజ్ఞ, పార, మానవాదులందు కలదు. గౌతమ, ఆప లందు లేదు.

11. కర్ణవేధ:- వ్యాసస్మృతి, బౌధ. గృ. శేషసూత్రములు, కాత్యాయన సూత్రము (పార.గృ. నకు అనుబంధము) మొదలగు కొన్ని గ్రంథములే పేర్కొనినవి.

12. అన్నప్రాశనము:- అన్నియు చెప్పినవి.

13. వర్షవర్ధన లేక అబ్దపూర్తి:- గోభిల, సాంఖ్య, పార, బౌధచౌల లేక చూడాకరణ లేక చూడాకర్మ : -- అన్నియు చెప్పినవి.

14. విద్యారంభము:- మార్కండేయమున నున్నట్లు అపరార్కుడు.

15. ఉపనయనము:- అన్నియు నుడివినవి. వ్యాసుడు దీనిని వ్రతాదేశమ నెను.

16. వ్రతములు:- అన్నియు చెప్పినవి.

17. కేశాంత లేక గోదానము:- అన్నియు చెప్పినవి.

18. సమావర్తన లేక స్నానము:- అన్నియు చెప్పినవి.

19. వివాహము:- అన్నియు చెప్పినవి.

20. పంచమహా యజ్ఞములు:- గౌతమ, ఆంగిరస్సు మొదలగునవి చెప్పినవి.

21. ఉపాకర్మ:- ఉపనయనమైన వెనుక వేదారంభమునకై వైఖా, అంగిరస్ మొదలగునవి పేర్కొనినవి.

22. అంత్యేష్టి:- మను, యాజ్ఞవల్క్యులు పేర్కొనిరి.

జాతకర్మనుండి చూడాకర్మవరకు సంస్కారములను ద్విజులకు, మగ పిల్లలైనచో సమంత్రకముగా, ఆడపిల్లలైనచో అమంత్రకముగా చేయవలెను. ద్విజులకు చెందిన స్త్రీలకు వివాహము సమంత్రకమే!

కర్తృత్వము:- పైవానిలో గర్భాధాన, పుంసవన, సీమంత, జాతకర్మ, నామకరణ, అన్నప్రాశన, చౌల, ఉపనయనములు ఈ 8 పితృకర్తృక ములు. వేద వ్రతములను నాల్గింటిని ఆచార్యుడు చేయును. స్నాతక, గర్భాధాన, పంచమహాయజ్ఞములను ఏడింటిని తానే చేయును. అష్ట కాదులు దైవ సంస్కారములు. ఇవి దిన, ఋతు సంబంధము కలవి.

గర్భాధానమునుండి ఉపనయనము వరకు ఉన్న సంస్కారములు ద్విజులకు విహితము. స్నానము (స్నాతకము), వివాహము అనియత ములు. కారణమేమనగా విద్యాపరిపూర్తియైన వెనుక అతడు సన్న్యాసమును గ్రహింపవచ్చును. "అత్రగర్భాధానాది ఉపనయన పర్యంతా ఏవ సంస్కారాః సర్వేషాం నియతాః నపునః స్నానానాదయః, తథాత్వేయ మిచ్ఛే త్కర్తుం తమావసేద్యదివేతరథా బ్రహ్మచర్యా దేవ ప్రవ్రజేత ఇతి విరోధః స్యాత్" -- (స్మృతిచంద్రిక పై వాక్యములు జాబాలోపనిషత్తులోనివి.)

మగ, ఆడ కాని నపుంసకునకు జాతకర్మ చేయవలయునా అక్కర లేదా అని తర్జనభర్జన చేసి చివరకు, సంస్కార ప్రకాశము పనికిరాదనే చెప్పినది.

## శూద్ర సంస్కారములు:

"మదన రత్న"మందు, హిరణ్యా గర్భాదాన ప్రస్తావములో హిరణ్యా గర్భ సాలగ్రామమునకు గర్భాధాన, పుంసవన, సీమంతోన్నయనములు చేయుదు రని చెప్పు సందర్భమున స్త్రీకి జాతకర్మ, నామకరణమూ, నిష్క్రిమణమూ, అన్నప్రాశనమూ, చూడ, వివాహము అను ఆరు సంస్కారములనియు, శూద్రులకైనచో ఈ యారును పంచమహా యజ్ఞములుకలిపి పదునొకండని చెప్పబడినది. ఉపనయనము తప్ప గర్భాధాన ప్రభృతి వివాహపర్యంతము తొమ్మిదని జయపాలుడు, ఇక శార్ఙధరుడు, సంకరజాతులకు కులధర్మాను సారముగా సంస్కారములనియు, వేద వ్రతములు, ఉపనయనము మినహా తక్కిన పంద్రెండు విహితములని చెప్పెను. మంత్రములు లేకుండ శ్లోక

మంత్రములతో ఎందులకు వీరిని సంస్కరింప వలెననిన వీరికి వేదాధ్యయన అధికారము లేకపోవుటయేయని యమస్మృతి. వేదవ్యాసుని ప్రకారము పది. గర్భాధానమునుండి చౌలమువరకు ఏడని బైజవాపుడు, అపరార్క మతప్రకారము గర్భాధానమునుండి చౌలమువరకు 8 సంస్కారములకే అర్హులు. రూపనారాయణ, హరిహరభాష్యము ప్రకారము ఆరే.

ఈనాడు గర్భాధానము, ఉపనయనము, వివాహము తప్ప మిగిలినవి బ్రాహ్మణులే చేయుటలేదు. నామకరణము, అన్నప్రాశనము పురోహితుడు లేకుండగనే జరిపించుచున్నారు. ఉపనయనకాలమున అన్ని మంత్రములను ఏకరువు పెట్టుచున్నారు. సీమంత, పుంసవనాదులు ఇంచుమించు కనుమరుగైపోయినవి. వేద వ్రతములు బొత్తిగా లేవని చెప్పవచ్చును. స్నాతక వ్రతము వివాహమునకు ఒక రోజుముందుగనో లేక ఆనాడే జరిపించు చున్నారు. ఇది నేటిస్థితి.

ఒక్క ఉపనయనము మినహాయించి మిగిలిన సంస్కారములు శాస్త్రోక్త దినములందు జరుపబడనిచో వ్యాహృతిహోమము చేసి జరుపవచ్చునని స్మృత్యర్థసారము. భూః, భువః, స్వః అను వ్యాహృతులను విడివిడిగా, తరువాత కలిపి ఉచ్చరించుచు ఆజ్యమును హోమము చేయుదురు. (హర.గృ. 1.3.4.) ఏ కారణము వల్లనైనను సంస్కారములు జరుగనిచో ఒక్కొక్క దానికి పాదకృచ్ఛ్రము ప్రాయశ్చిత్తముగా విధింపబడినది. చౌలము సకాలములో కానిచో అర్ధకృచ్ఛ్రము. తెలిసియే ఈ సంస్కారములు మానినవానికి ఈ ప్రాయశ్చిత్తము రెండురెట్లు. ప్రాయశ్చిత్తాది పూర్వక తపస్సైన వెనుక గడచిన సంస్కారములన్ని ఒక్కమారే చేయవలెనని కొందఱనుచున్నారు. ఇట్లే చేయుచున్నారు. పాదకృచ్ఛ్ర, అర్ధకృచ్ఛ్రములపై చూడుడు యాజ్ఞ. III. 318. ధర్మసింధువు అనేక సులభమైన ప్రత్యామ్నాయ మార్గములను చెప్పినది. యథాశక్తి దానమును చెప్పి ఆ పాపాదులను పోగొట్టుకొనుటకు ఉపాయములను చెప్పినది. ఇన్ని చెప్పినను ప్రజలు వినుటలేదు.

హరదత్తుడు, గౌతమ సూత్రములపై వ్యాఖ్యవ్రాయుచు, గౌతముడు ముందుగా ఉపనయనమును పేర్కొనుటచే అతని దృష్టిలో ఉపనయనమే ప్రధానమనియు, గర్భాధానాదులు నిర్వర్తింపబడకపోయినను ఉపనయనము చేయవచ్చునని, ఇది చేయనిచో వివాహాదులకు అధికారమే లేకపోవచ్చునని వ్రాసెను.

తుదకొక్కమాట. సర్వ భారతీయులకు సంస్కారములు కలవు. కొంతమందికి సమంత్రకము. కొంతమందికి అమంత్రకము. "శూద్రకమలాకరము"ను తిలకించినచో మంత్రములలోనున్నదే శ్లోకములలోనుండును. పద్ధతి భిన్నముగా నుండవచ్చును. ఈ అభిప్రాయమును గుర్తించినచో పరస్పర ద్వేషములు సమసిపోవును. అధికారిభేదమును గుర్తించినవారు మన పూర్వులు. దీనికి ఆధునికులు విపరీతార్థమును తీయుచున్నారు. కాలప్రభావమట్టిది. "దృఢ బద్ధ ధర్మమూలః, వేదస్కంధః పురాణశాఖాఢ్యః క్రతుకుసుమః, మోక్షఫలః, మధుసూదన పాదపో జయతి." అనగా ధర్మము వేరు; వేదము చెట్టుబోదె; పురాణములు కొమ్మలు; యాగములు పువ్వులు; మోక్షము ఫలము; శ్రీ మహావిష్ణువు ఆ చెట్టునకు ఆధారభూతుడు. జయమగుగాక.

"రాగద్వేష విదగ్ధానాం అజ్ఞాన విషపాయినామ్
చికిత్సా ధర్మశాస్త్రాణి వ్యాధీనామివ భేషజమ్." -- శంఖలిఖితులు

రాగద్వేషములచే బాధపడువారికి అజ్ఞానమనెడి విషమును త్రాగువారికి, వ్యాధులచే బాధపడువారికి ఔషధమువలె ధర్మశాస్త్ర ముపకరించును.

## సంస్కారములు -- అంగములు

సంస్కారములకు ప్రధానాంగమైనది, ప్రథమాంగమైనది అగ్ని. ఇతడు భారతీయులకు ఆరాధ్యమైన దేవత. అగ్ని శబ్దము ఇతర భాషలలో కూడ కొద్ది మార్పులతో వ్యవహరింపఁబడుచున్నది. లేటిన్ భాషయందు ఇగ్నిస్ (Ignis) అని, లిథువానియన్ భాషయందు ఉగ్ని (ugni) యని

వ్యవహరింతురు. ఋగ్వేదమున 'గృహపతి' ఏయర్థమున వాడబడినదో అట్లే జెండవెస్తాయందు అతర్ (Atar = అగ్ని) కలవాడు గృహపతియని కలదు. అగ్న్యారాధనము, ఇరాన్--భారత దేశములలో సమానముగానున్నది. సమస్త ధార్మిక కృత్యములకు, గృహ్యసంస్కారములకు అగ్నియవసర మెంతైన కలదు. దీనిని భారతీయులే కాక ప్రాచీనకాలమున రోమువాసీయులు, యునానీయులు కూడ పరమ పవిత్రముగా భావించిరి.

మనలను అగ్ని రోగములనుండి, రాక్షసిక, అమంగళకర శక్తులనుండి రక్షించునని భారతీయుల (హిందువులు) విశ్వాసము. అందువలన వివిధ సంస్కారములలో అగ్నిని ఆరాధించుట సంభవించినది. "యజ్ఞమునందు సత్యధర్ముడైన అగ్నిని ఉపాసించవలెను. అతడు రోగములను నశింప చేయును" అని ఋగ్వేదమున కలదు. "కవి మగ్ని ముపస్తుహి సత్య ధర్మాణ మధ్వరే, దేవమమీవచాతనమ్."

"అగ్ని రక్షస్సులనుండి దూరముచేయును. అతని జ్వాల ప్రఖరము. అతడమరుడు. అతడు శుచి." "ఓ అగ్నీ! విపత్తునుండి రక్షించుము. ఓ దేవ! నీవు అజరుడవు, అమరుడవు. నీ తపనశీలమైన జ్వాలలచే మా శత్రువులను నాశనము చేయుము." అని అందేకలదు. "అగ్నీ రక్షాంసి సేధతి శుక్రశోచి రమర్త్యః శుచిః పావక ఈడ్యః" "అగ్నే రక్షాణో అంహసః ప్రతిష్మ దేవరీషతః తపిష్ఠైరజరోదహ." --(7.15.10)

మన దైనిక జీవనమునందు కూడ అగ్ని యొక్క వ్యావహారికోప యోగము కలదు. ఇతడు గృహపతిస్థానము నలంకరించెను. "తన పనిని తాను చేయుచు అగ్ని పార్థివగృహములందు నివసించుచున్నాడు. అంతేగాక అతడు దేవుడు. అతనికి మర్త్యలోక సాహచర్యము ప్రాప్తించినది."

"సచేత యన్మనుషో యజ్ఞబంధుః ప్రతం మహ్యా రశనయా న యంతి, సక్షేత్యస్య దుర్యాసుసాధం దేవో మర్త్యస్య సద్మని త్వ మాపత్."

"అతడు పంచ జనుల మధ్యయందు సమానరూపముగా సన్మానితు డగుచున్నాడు. వారి ప్రత్యేక గృహములందు విరాజిల్లుచున్నాడు. అతడు కవి, యువకుడు. అతడు గృహపతి."

"యః పంచచర్షణీ రభినిససాద దమేదమే! కవి ర్గృహపతి ర్యువా."
-- (ఋ.7.15.2.)

అతడు కేవలము గృహపతి, రక్షకుడేకాదు. అతడు పూజింపతగిన పురోహితుడు. దేవమనుష్యుల మధ్యనుండి సందేశ వాహకుడగుచున్నాడు. దేవతలకు హవిస్సుల తెచ్చుచున్నాడు. దీనికి బలకర మగు సూక్తములు ఋగ్వేదమున కలవు.

"ఓ అగ్నీ, నీవు పురోహితుడవు. యజ్ఞదేవతవు, ఋత్విక్కు, హోతయు నగుచున్నావు. శ్రేష్ఠతమమైన రత్నములను తెచ్చుచున్నాడవు. నేను నిన్ను స్తుతించుచున్నాను."

"అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవమృత్విజమ్ హోతారం రత్న ధాతమమ్."
-- (1.1.1.)

"నీవు దేవతలకు ముఖస్థానీయుడ వగుచున్నావు. అందుచే నీ ద్వారమున నిర్దోషమైన, అమరమైన దేవతలను స్తుతించుచున్నాను. నీవు వారికొఱకు హవిస్సును గ్రహించుచున్నావు."
-- (2.1.14.)

"అతడు హోత. అతడు సందేశవాహక కార్యముచే పరిచితుడు. అతడు పృథ్విద్యులోకముల మధ్య వచ్చుచు పోవుచునున్నాడు. అతనికి ద్యులోకమార్గము తెలియును."
-- (7.5.1.)

అతనిని ధార్మిక కృత్యములను నిర్దేశించువానిగానే కాక, నైతిక విధానములకు సంరక్షకునిగా తలంచిరి. అతడు మనము చేయు పనులకు సాక్షిగానున్నాడు. ఉపనయనము, వివాహసంస్కారములలో బ్రహ్మచారి, పతిపత్నులు అగ్నికి చుట్టు ప్రదక్షిణ నమస్కారము చేయుదురు.

"నేను జనులకు రాజైనవానిని, ధార్మిక కృత్యములకు అధిష్ఠాతయైన అగ్నిని స్తుతించుచున్నాను. అతడు నా ప్రార్థనను వినుగాక"

"విశాం రాజానమద్భుతమధ్యక్షం ధర్మణామితమ్ అగ్నిమీళే స ఉశ్రవత్" -- (ఋ. 7-43-24) "అధ్వరములకు రాజైన, ఋతు

వులకు సంరక్షకుడైన, యజ్ఞవేదికయందు ప్రజ్వలితుడై వృద్ధిపొందుచున్న అగ్నిని స్తుతించుచున్నాను."

"రాజన్తమధ్వరాణాం గోపామృతస్య దీదివమ్ వర్ధమానం స్వేదమే."
-- (ఋ. 1.1.7.)

ఈ స్తుతులందు కేవలము భౌతికమైన అగ్నినేకాక దానికధిష్ఠానమైన పరమాత్మస్వరూపమునే ఋషి దర్శించి స్తుతించుచున్నాడు.

**స్తుతులు, ప్రార్థనలు, ఆశీర్వచనము:** సుఖసంపాదన నిమిత్తమై సంస్కారము లందు స్తుతులు, ప్రార్థనలుండును. ఉదా: వివాహమున సప్తపదియందు విష్ణువును గూర్చి ప్రార్థన కలదు. మొదటి అడుగు పెట్టుట మంగళమునకు, రెండవది శక్తికొఱకు (ఊర్జ), మూడవది సమృద్ధికొఱకు, నాల్గవది సుఖజీవనమునకు, ఐదవది పశువుల నిమిత్తమై, ఆరవది ఋతువుల నిమిత్తమై, ఏడవది పతిపత్నులమైత్రి దృఢమగుటకునని కలదు. (ఆ.గృ.సూ. 1.19.9.) ఉపనయనమునందు బ్రహ్మచారి సద్గుణ ప్రాప్తికొఱకు, దుర్గుణ నివారణకొరకు ప్రార్థించును. అందే బుద్ధి ప్రచోదనముక్తై, పవిత్రత, బ్రహ్మచర్యాదులు సమకూరవలెనను ప్రార్థనలు కలవు. సన్మార్గమునందు బుద్ధిని ప్రవర్తింపచేయుమని సూర్యమండలాంతర్గత చిచ్ఛక్తిని ప్రార్థించుటయే గాయత్రీ మంత్ర పరమార్థము.

ఆహుతుల నిచ్చునపుడు బ్రహ్మచారి ఇట్లు ప్రార్థించును: "ఓ అగ్నీ! నాకు అంతర్దృష్టిని, స్మరణశక్తిని, గౌరవశీలమును, తేజస్వితను, దీప్తిమత్త్వమును ప్రసాదించుము." (ఆ.గృ.సూ. 1.22.1.) బ్రహ్మచారి కటిప్రదేశమున మేఖలను ధరించునపుడు ఇట్లనును. "దేవతలకు భగినీ స్వరూపమైన కీర్తిమతియైన మేఖల అపశబ్దములను నివారణచేయును. అది నా వర్ణమును పవిత్రము చేయుచున్నది. అందువలన నా కటిప్రదేశమున త్రిప్పుచున్నాను. అది ప్రాణాపానవాయువులకు బలమును, శక్తిని ఇచ్చుచున్నది.

"ఇదం దురుక్తం పరిబాధమానావర్ణం పవిత్రం పునతీమ ఆగాత్, ప్రాణాపానాభ్యాం బలమాదధానా స్వసా దేవీ సుభగా మేఖలేయమ్."
-- (పా.గృ. 2.2.2.)

ఆశీర్వచనములు కూడ పై లక్ష్యమునే సాధించును. మంత్రోచ్చారణ ప్రభావముచే ఇష్టప్రాప్తి కలుగునను విశ్వాసమే ఇందులకు కారణము. పతి, పత్నికి అధోవస్త్రము నిచ్చునపు డిట్లాశీర్వదించును: "నీకు దీర్ఘాయుర్దాయము కలుగుగాక. ఈ అధోవస్త్రమును ధరించుము. అభిశాపములనుండి రక్షించును. శతసంవత్సర పర్యంతము వర్చస్సుతో కూడిన జీవితమును గడుపుము. వైభవము, సంతతి, దీర్ఘాయుష్యము కొఱకై ఈ వస్త్రమును ధరించుము." "జరాంగచ్ఛ పరిధత్స్వ వాసోభవాకృష్టీనామభిశస్తిపావా, శతం చ జీవశరదః సువర్చారయిం చ పుత్రా ననుసంవ్యయాస్యాయుష్మతీదం పరిధత్స్వ వాసః" -- (పా.గృ.1.4.13.)

జాతకర్మయందు తండ్రి తనయు నిట్లాశీర్వదించును. "నీవు పరశువువలె దృఢముగా, బలముగా, స్వర్ణమువలె దేదీప్యమానముగా నుండి దీర్ఘజీవియగుదువుగాక! నీవు యధార్థముగా పుత్రరూపములో నున్న నా ఆత్మవే! నూరు సంవత్సరముల పర్యంతము జీవించియుందువుగాక."

"అశ్మా భవ పరశుర్భవ హిరణ్యమస్రుతం భవ."

-- (పా.గృ.1.16.14; హి.గృ. 2.3.2.)

**అభిషించనము:** స్నానము, ఆచమనము, వస్తువులపై నీటిని చల్లుట కూడ అంగములే! జలమునందు ఒక దివ్యశక్తి కలదని మనవారు గ్రహించిరి. మన భారతీయులేగాక హీబ్రూ భాషీయులుకూడ 'సజీవ జల'మని పేర్కొందురు. జలమునందు అశుభములను నివారించి దుష్టభూతాదులను నాశనము చేయు శక్తి కలదని ఋగ్వేదమున కలదు. (7.47.49; 10.9.30) స్నానాదులవలన ఆధిభౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక అశౌచములు పోవుటయేగాక వ్యాధులనుండి దూరము చేయు శక్తి కూడ కలదని మన గ్రంథములందు కలదు. గర్భమున పడినది మొదలు మరణ పర్యంతము, మరణానంతరముకూడ జలముచే శుద్ధిని పొందు అవశ్యత కూడ మనకు కలదు. గర్భాధానమైన వెనుక తండ్రి స్నానమును చేయును. ఋతుకాలమున గర్భము కలుగునని శంకించి స్నానము నియమింపఁబడినది. "ఋతౌ తు గర్భ శంకిత్వాత్ స్నానం మైథునినః స్మృతమ్." అని ఆపస్తంబుడు.

జాతకర్మయందు కూడ స్నానావశ్యత కలదు. "శ్రుత్వా జాతం పితా పుత్రం సచేల స్నాన మాచరేత్" -- (వసిష్ఠుడు) చూడా కర్మ, ఉపనయన సంస్కారములకు పూర్వము తప్పక స్నానము చేయవలెను. "మాతా కుమారమాదావాప్లావ్య." (ఆ. గృ. 1.17.) బ్రహ్మచర్యానంతరము స్నానము ముఖ్యాంగము (పా.గృ. 2.6; గో.గృ. 3.4.6.) వైవాహిక కృత్యమునకు పూర్వము వధూవరులను స్నానముచేయింతురు. (గో.గృ. 2.1.10-17.) 'మృతుడైన వెనుక, దహనమునకు పూర్వము శవమును స్నానము చేయింతురు (బే.పి.సూ.). ప్రతి దినము బహుపర్యాయములు ఆచమనము ధర్మశాస్త్రములందు విధింపబడినది. సంస్కారారంభములకు పూర్వము వస్తు సామగ్రులపై నీళ్లు చల్లుదురు. చూడాకర్మ సంస్కారమున బాలకుని శిరస్సును నీటితో తడుపుదురు. యశస్సు, శ్రీ, విద్య, బ్రహ్మవర్చస్సు నిమిత్తమై జలముచే స్నాతకునకు అభిషించనము చేతురు.

"తేనమత మభిషించామి శ్రియై యశసే బ్రహ్మణే బ్రహ్మవర్చసే."
-- (పా.గృ. 2.6.9)

స్వాస్థ్యము, శాంతి, సుఖముల కొరకై వధూశిరస్సును అభిషిక్తము చేతురని పా.గృ. (1.8.5.) యందు కలదు.

**దిఙ్నిర్దేశము:** విభిన్న దిశలను విభిన్న దేవతలు శాసించుచున్నారు. పూర్వ దిశ ప్రకాశమునకు, ఉష్ణతకు, జీవన సుఖసంపదలతో సంబంధము కలిగి యుండుటకునై యున్నది. పశ్చిమము అంధకారమునకు, శీతలమునకు, మృత్యువునకు గుర్తు. దక్షిణపు దిక్కునకు మృత్యుదేవతయైన యముడు అధిదేవత. అందుచేనది అశుభముగా భావించుచున్నారు. ఈ విశ్వాసము ననుసరించి సంస్కారములు చేయుటలో ఏ దిక్కునకు అభిముఖముగా కూర్చుండి చేయవలెనో చెప్పబడినది. సమస్తమంగళ సంస్కారములు పూర్వాభిముఖముగా కూర్చుండి చేయవలెను. అట్లే ప్రదక్షిణములు చేయుటలో సూర్యమార్గము ననుసరించి సవ్యముగా చేయుదురు. అశుభ సంస్కారములకు ఇందులకు విపరీతముగా చేయుదురు.

ప్రతీకత్వము: ప్రతీకము భౌతికమైనది. లోకమునందు సదృశ వస్తువులనుండి సదృశ వస్తువులుత్పన్నమగునను విశ్వాసము కలదు. రాయి, దృఢత్వమునకు ప్రతీకము. దీనిపై ఆరోహించినవారిలో కూడ దృఢత్వము కలుగునని నమ్మిక.

"ఆరోహే మమశ్మాన మశ్మేవ స్థిరా భవ." (పా.గృ. 1.7.1.). ఉపనయన, వివాహ సంస్కారములందు బ్రహ్మచారి, వధువు తన కాళ్లను ఒక రాతిపై నుంతురు. ఆచార్యుని పట్ల, పతిపట్ల దృఢమైన భక్తినిది సూచించును. ధ్రువతారను చూపించుటలో కూడ ఈ యభిప్రాయమే కలదు. "ధ్రువ మసి ధ్రువం త్వా పశ్యామి ధ్రువైధిపోష్యే మయి (పా.గృ. 1.8.9.). లాజలు, బియ్యము, సమృద్ధిని సూచించును. "ఇమాం లాజానావపామ్యగ్నౌ సమృద్ధి కరణం తవ." (ఆ.గృ. 1.7.8.). సమంజనము స్నేహమునకు, ప్రేమకు ప్రతీక. "సమంజంతు విశ్వేదేవా సమాయౌ హృదయానినౌ." (గో.గృ. 2.1.18.); సహభోజనము, ఐక్యమును సూచించును. "అథైనాం స్థాలీపాకం ప్రాశయతి. "ప్రాణాస్తే ప్రాణాన్సందధామి, అస్థిభి రస్థీనిమాంసైర్మాంసాని త్వచాత్వచమ్" (పా.గృ. 1.11.15.). అట్లే హృదయస్పర్శ అను చిత్తతకు చిహ్నము. "మమవ్రతే హృదయం దధామి మమ చిత్తమనుచిత్తం తేఽస్తు." (పా.గృ. 1.8.8.). పాణిగ్రహణము ఉద్ధరించుటను సూచించును. (గో.గృ. 2.2.16.) సూర్యుని చూపించుట, తేజస్సు బుద్ధి తీక్షత కలుగ వలెనను కోరికకు సూచకము. "తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్." (పా.గృ. 1.17.6.). పురుష నక్షత్ర గర్భాధానమును నిర్ధారణ చేయునని విశ్వాసము. (పా.గృ. 1.11.3.).

విషేధములు: శుభ, అశుభదినముల గూర్చి మాసములు, సంవత్సరముల విషయమై అనేక విధినిషేధములు కలవు. ఉదా: "జన్మర్షే జన్మమాసే జన్మ దివసే శుభం త్యజేత్" (పా.గృ. 1.4.8.). "శ్రావణేఽపి చ పౌషేవా కన్యా భాద్రపదేతథా, చైత్రాశ్వయుక్కార్తికేషు యాతి వైధవ్యతాం ఖలు" (రత్నకోశ. వ్యాసుడు) "అయుగ్మే దుర్భగానారీ యుగ్మేతు విధవాభవేత్" (రాజమార్తాండ). గ్రహగతుల ప్రభావము మానవులపై కలదను

ప్రగాఢ విశ్వాసమే ఈ విధినిషేధములకు హేతువు. సముద్రమునకు ఆటుపోటులు, ఉన్మాదికి ఉన్మాదపు హెచ్చుతగ్గులుండుట మొదటి ప్రత్యక్ష నిదర్శనములు. శుభాశుభ ఫలితములు గ్రహములపై ఆధారపడి యుండుననుటలో సందియములేదు. ప్రాకృతిక ప్రకోపములు వచ్చినను, స్త్రీ రజస్వలయైనను, ఆశౌచాదులలో సంస్కారములెంతవరకు చేయకూడదో మొదలగు విషయములు ధర్మశాస్త్రములందు విపులముగా కలవు. ఉదా:

దిగ్దాహే దినమేకశ్చ గృహే పస్తదివావితు
భూకంపేతు సముత్పన్నే త్ర్యహమేవతు వర్జయేత్
ఉల్కాపాతే త్రిదివసం ధూమ్రే పంచదినాని తు
వజ్రపాతే చైకదినం వర్జయేత్ సర్వకర్మసు
వివాహ వ్రత పూజాసు యస్య భార్యా రజస్వలా
తదా న మంగలం కార్యం శుద్ధౌ కార్యం శుభేప్సుభిః"

-- వృద్ధమనువు

భోజన విషయమై అనేక విధినిషేధములు కలవు. ఏ సంస్కారమున నేది భుజించవలెనో కూడ కలదు. ఉదా: వివాహమున మూడు రాత్రులు క్షారలవణ వర్జితముగా భుజించుట మొదలగునవి. "త్రిరాత్ర మక్షార లవణాశినౌ స్యాతామ్" (పా.గృ. 1.8.21.). సంస్కారములను చేసికొనునపుడు శరీరము శుద్ధముగా నుండవలెను. కనుక ఆహారాదుల నియమములేర్పడినవి. ఉపవాసాదులచే శరీరము పవిత్రమగుననుటలో సందేహములేదు. వాటివలన ఆధ్యాత్మిక వాతావరణమేర్పడును.

**అభిచారము:** మానవాతీతమగు క్షుద్రశక్తులున్నవనియు, వానిని వశీకరించుకొని, శత్రువులు తమపై వానిని ప్రయోగింతురని, వాని బారినుండి రక్షించుకొనవలెనను తలంపులు చాలమంది కలిగియుందురు. ఇందు ఆత్మరక్షణ యొక్కటి, శత్రువుపై ప్రయోగించుట రెండవది. దీనిని క్షుద్రప్రయోజనములకొరకుపయోగించువారు లేకపోలేదు. అభిచారము, సురక్షితార్థమై చేయబడు కర్మ. (చూ. జాతకర్మ ప్రకరణము.) అథర్వవేదమున ఈ అభిచారిక ప్రక్రియలు పుష్కలముగా కలవు. కౌశిక

సూత్రములు విభిన్న సంస్కారముల కొఱకు, ఇందు చెప్పబడిన అనేక చమత్కారములను వినియోగించుటను స్వీకరించినవి. ఈ అభిచార ప్రక్రియలు బౌద్ధ జైనులకు నిషేధింపబడినవి. ధర్మశాస్త్రములందు కూడ ఇవి పాపపు పనులుగా, ఇవి చేయువారిని వంచకుల కితవుల పంక్తిలో లెక్కించి దండనార్హులుగా మనుస్మృతి పేర్కొన్నది.

"ఉత్కోచకాశ్చోపధిక్మా వంచకాః కితవాస్తథా మంగలాదేశ వృత్తాశ్చ భద్రాశ్చేక్షణికైః సహ" "అభిచారేషు చ సర్వేషు కర్తవ్యో ద్విశతో దమః"

**జ్యోతిషము:** భవిష్యత్ స్థితిని తెలిసికొనవలెనను ఇచ్ఛ సర్వసాధారణమైనది. గ్రహ తారాదులకు మానవులకు సంబంధము కలదనుట సర్వజాతులందు కల సామాన్య విశ్వాసము. నక్షత్రములు మృతుల నివాస స్థానములని, ఈశ్వర శక్తిద్వారమున నియమితములైనవని, లేక ఈశ్వరీయములని మన వారు భావించిరి. ఈ నక్షత్ర విద్యాప్రభావమును గృహ్య సూత్రముల కన్న నిబంధనగ్రంథములు బహుధా ఉల్లేఖించినవి.

మానవ శరీరమున గల కొన్ని బాహ్యచిహ్నములను బట్టి భవిష్యమును తెలిసికొనవచ్చునని విపులముగా లింగపురాణమున వర్ణింపబడినది. అందు సూచించిన వరవధూ పరీక్షను ఇతర గ్రంథములు గ్రహించినవి. కొన్ని విశ్వాసములను బట్టి కూడ ఈ పరీక్షయుండెడిది. ఉదా: గోభిలుడు, ఆశ్వలాయనుడు మొదలగు సూత్రకారులు కొన్ని రకములైన మట్టి ఉండలను వధువు నెదురుగానుంచి, ఆమె స్వీకరించిన ఉండను బట్టి ఆమె భవిష్యత్ స్థితిని తెలిసికొనవచ్చునని వ్రాసిరి. అట్లే అన్నప్రాశన సమయమున పిల్లవాడు ముట్టుకొనిన వస్తువులను బట్టి వాని భావిజీవితము తెలియుననుట కూడ నట్టిదే!

"కృత ప్రాశనముత్సర్గాత్ ధాత్రీ బాలం సముత్సృజేత్
కార్యం తస్య పరిజ్ఞానం జీవికాయా అనంతరమ్."

-- వీరమిత్రోదయ - సంస్కారప్రకాశ భాగ.1

**సాంస్కృతిక తత్త్వము:** పైన చెప్పబడిన విశ్వాసములలో విధివిధానములలో, నియమములలో, ఆచారమునకు, శరీరారోగ్యమునకు సంబంధించినవి

చాల కలవు. సంపూర్ణ జీవనవిధానములో వీటిలో ఏ ఒక్కటి విడిగా నుండక అన్నియు కలిపియుండును. ఈ సంస్కారముల వలన మానసికమైన, శారీరకమైన, ఆధ్యాత్మికమైన శిక్షణ యేర్పడును. జాతియంతయు పుష్టి మంతముగా, ఆరోగ్యకరముగా నుండుటకు ఈ సంస్కారముల అవశ్యత యెంతైనకలదు. ఉదా: స్త్రీల రజస్వలాధర్మములు, ప్రసవము, అదియైన కొన్ని దినములవరకు సూతికాగృహమున నుండుట, తల్లి పిల్లల ఆరోగ్య మునకై పాటింపబడు కఠోరనియమములు మొదలగు విషయములవలన తల్లి, పిల్లలను అకాలమృత్యువునుండి ఎట్లు పూర్వులు సంరక్షించిరో తెలియగలదు.

సామాన్యమైనవి: ఆయా సంస్కారములలో వివిధ అలంకరణములు సంస్కరించు వ్యక్తిని వేషభూషాదులతో అలంకరించుట మొదలగునవి హర్ష సూచకములు. వివాహమున వధూవరులకు వివిధ వస్తువుల నిచ్చుట, బంగారు ఆభరణములనిచ్చుట, వినోదమునకై జంత్రగాత్ర సంగీతములను వినియోగించుట మొదలగు ఆయా వ్యక్తుల సామాజిక, ఆర్థిక స్థితిగతు లపై ఆధారపడియుండును. సంగీతము వివాహమున తప్పకనుండవలెనని వారాహ గృహ్యసూత్రమున నున్నదనుటను బట్టి ఈ సామాన్య విధుల ప్రాబల్యమెంతవరకు నున్నదో మనమూహింపవచ్చును.

పై విధానములవలన మానవుని మహోత్తమునిగా తీర్చిదిద్దుటయే మన పూర్వులు తలంచిరని భావించవచ్చును.

# గర్భాధానము

అర్థము:

మానవుని జీవనము సంస్కారములకు క్షేత్రము. అందు సంతానమును కనుట ప్రధానము. ధర్మశాస్త్రములు సంతానము కనుటను పరమ పవిత్రముగా పేర్కొన్నవి. సర్వసాధారణముగ ప్రతి గృహ్యసూత్రము గర్భాధానముతో ప్రారంభమగును.

ఈ కర్మ ద్వారా పురుషుడు, స్త్రీయందు తన బీజమునుంచుచున్నాడు కనుక నిది గర్భాధానమైనది. "గర్భః సంధార్యతే యేన కర్మణా త ద్గర్భాధాన మిత్యనుగతార్థం కర్మనామధేయమ్" -- (పూర్వమీమాంస) శౌనకుడిట్లు చెప్పుచున్నాడు. "ఏకర్మ పూర్తియైన తర్వాత స్త్రీ పతి ద్వారా శుక్రధారణను చేయుచున్నదో దానినే గర్భాలంబనమని, గర్భాధానమని యనుచున్నారు." "నిషిక్తో యత్ప్రయోగేణ గర్భః సంధార్యతే స్త్రియా తద్గర్భాలంబనం నామ కర్మప్రోక్తం మనీషిభిః"

ఈ సంస్కారము సమంత్రకముగా జరుగనిచో ఆశ్వలాయన స్మృతి ప్రాయశ్చిత్తమును విధించినది. సమంత్రకముగా చేసికొననిచో గర్భమును నాశనముచేసిన వాడగునని, పుట్టిన శిశువు వ్యభిచారము వలన పుట్టిన వానితో సమానమని దేవల వచనము. గర్భశుద్ధికై రెండు ప్రాజాపత్యములను విధించినది శాస్త్రము.

శ్రీ కృష్ణ భగవానుదు గీతలో ఇట్లు చెప్పుచున్నాడు "ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" అనగా మనుజునియందు ధర్మమునకు విరోధములేని కామమును నేనే యని యర్థము. దీనిని బట్టి ఇది పరమేశ్వర విభూతిగా భావింపవచ్చును. తల్లి దండ్రుల మనో ప్రవృత్తుల ననుసరించి సంతానము యొక్క మనస్సు, శరీరమేర్పడుచున్నవి. కామభావముతో కలిసిన కాముక సంతానము, వీర భావనతో కలిసిన వీరసంతానము, దైవీ భావనతో కలిసిన ధర్మ సంతతి కలుగును. కనుకనే గర్భాధాన

సమయమున పతి, తాను ప్రజాపతి అంశ కలవానిగా, భార్య వసుమతి రూపమని భావించి కలియ వలెననుట ప్రాచీన సంప్రదాయము.

## జన్మ క్రమము:

ఐతరేయమున "పురుషేహవా అయమదితో గర్భో ............" ఆదిగా గల మంత్రమున జీవుడు తండ్రి శుక్రము ద్వారా స్త్రీ యందు ప్రవేశించుట మొదటి జన్మమనియు, శిశురూపమున భూమియందు పడుట రెండవ జన్మమనియు, చనిపోయిన వెనుక అంగుష్ఠ మాత్రమైన సూక్ష్మ శరీరమును ధరించుట మూడవ జన్మమనియు కలదు. ఇట్టి జన్మక్రమమునకు కారణమైనదీ సంస్కారము. గర్భ రక్ష, పుష్టి మొ॥ వానిని కశ్యప ప్రజాపతి వహించును. కనుకనే వేదమునందు 'కశ్యపాత్ సకలం జగత్ -- తస్మాదాహుః సర్వాః ప్రజాః కాశ్యప్యః' అని కలదు. 'కశ్య పః పశ్యకే భవతి' యను మంత్రమును బట్టి లోకమును చూచుచున్న వాడని యర్థము. అట్టి కశ్యప తత్వమును క్రమ క్రమముగా పొందుట యే ఈ సంస్కార ప్రయోజనము.

## వేదములందు దీని ప్రస్తావన:

సంతతి కావలెనను ప్రార్థనలు, వచనములు వేదములందు లెక్కకు మిక్కిలిగానున్నవి. తాను తండ్రి కావలెనని, తాను తల్లి కావలెనను కోరిక అనాది సిద్ధము. "ప్రజాం చ ధత్తమ్, ద్రవిణం చ ధత్తమ్" "పుత్రాసో యత్ర పితరో భవంతి" -- (ఋ. మొ॥ మంత్రములు).

మనుష్యుడు మూడు ఋణములతో పుట్టును. "జాయమానో వై బ్రాహ్మణ స్త్రిభిః ఋణవాన్ జాయతే, బ్రహ్మచర్యేణ ఋషి భ్యో, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్యః, ఏష వా అనృణో యః పుత్రీ యజ్వా బ్రహ్మచారీ వా స్యాదితి." -- (తైత్తి.) పుత్రుడు పుట్టిన వెనుక పైతృకమైన ఋణమునుండి తండ్రి విముక్తుడగుచున్నాడని యర్థము. కనుకనే పుత్రులను కనుట పవిత్ర కార్యముగా భావించిరి.

అథర్వ వేదమున గర్భధారణనిమిత్తమై పర్యంకమునకు రావలసినదిగా 'భార్యకు సూచించు మంత్రములు కలవు. 'ప్రసన్న చిత్తమును కలిగిన దానవై శయ్యనెక్కుము. నీ భర్త నిమిత్తమై సంతతిని కనుము' -- (14-2-2)

"విష్ణువు గర్భాశయనిర్మాణము చేయుగాక .........." ఆదిగా గల మంత్రములు ఋగ్వేదమున కలవు. అందే సహవాసమునకు కూడ స్పష్టమైన వివరణ కలదు. "తాం పూషన్ .........." అను మంత్రములలో స్పష్టముగా ఎట్లు చేయవలెనో కలదు.

గర్భాధానమునకు పూర్వము భిన్న భిన్న పుత్రులను పొందుటకు అనగా శ్రోత్రియుడు, (ఒక్క వేదశాఖాధ్యయనము చేసినవాడు) అనూచానుడు, (వేదవేదాంగములను చదివినవాడు), ఋషికల్పుడు (కల్పములను కూడ చదివినవాడు), భ్రూణుడు (సూత్రములను, ప్రవచనములను అధ్యయనము చేసినవాడు), ఋషి (నాలుగు వేదములను చదివినవాడు), దేవుడు (పై వారి కన్న శ్రేష్ఠుడు) -- ఇందే ఒక్కరినైనను కోరినచో తగిన విధముగా వ్రతానుష్ఠానము చేయవలెనని బృహదారణ్యకమున కలదు (అట్లే బౌధ)

అందే ఇట్లు కలదు. భార్య రజస్వలయైన మూడు రోజుల తరువాత స్నానము చేసి, ధాన్యమును దంచి దానిని ఉడికించునట్లు చేయును. ఆ పిదప భర్త తాను కోరిన కుమారుని బట్టి కొన్ని పదార్థములను చేర్చి కర్మాంతమున భార్యాభర్తలు భుజింతురు. స్థాలీపాకము సిద్ధమైన తరువాత భర్త కొన్ని ఆజ్యాహుతులను అగ్నిలో వేయును. అగ్ని, అనుమతి, సవితృ దేవతలకు అర్పించిన వెనుక మిగిలిన హవిష్యాన్నమును తానుతిని భార్యకు తినిపించును. చేతులు కడుగుకొని పాత్రను నీళ్లతో నింపి ఆ నీటితో ముమ్మారు ఇట్లనుచు భార్య పై చల్లును. 'ఓ విశ్వావసు లెమ్ము, మఱియొక మంచి కన్యకై వెదుకుము' అని చెప్పిన వెనుక భార్యను కౌగిలించుకొనుచు ఇట్లనును: " నేను 'అమ' నీవు 'సా' అగుచున్నావు. నీవు 'సా' నేను 'అమ', నేను సామమును, నీవు ఋక్కు, నేను ఆకాశమును, నీవు పృథ్వి. రమ్ము, మగ సంతతిని కనుటకై యత్నింతము." ఆ వెనుక కొన్ని మంత్రములనుచ్చరించిన వెనుక (ఓం పూషా ...............మొ॥లైనవి) సంగ

మింతురు 'భూమి యందు అగ్నియున్నటుల, ఆకాశమున ఇంద్రుడున్నట్లు, గాలి యెల్లెడల నున్నట్లు నేను నీయందు గర్భముంచుచున్నాను,' అని ఆ స్త్రీ పేరునుగ్రహించి పలుకవలెను. ఇందు గర్భాలంభన, పుంసవన, అనవలోభముల ప్రస్తావన ఉండుటచే ఆశ్వ. పేర్కొనిన ఉపనిషత్తు ఇదియై యుండునని శ్రీ పి.వి. కాణే వ్రాసిరి.

సాంఖ్య, పార, ఆప, భార, హిర, మానవ, గోభి, జైమినులందు చతుర్థీ కర్మమే వర్ణింపబడినది. దీనికి గర్భాధానమునకు తేడా లేనట్లు సూచింపబడినది. బౌధ, కాఠ లందు గర్భాధానము అను పదము వాడబడినను చతుర్థీకర్మకు భిన్నముగా లేదు. మను, యాజ్ఞ, విష్ణు ధ.సూ. గర్భాధానమునకు పర్యాయముగనే వాడిరి. కాని వైఖానసము మాత్రము ఋతుసంగమునకు భిన్నముగా వాడినది. ఋతౌ సంగమనం నిషేక మిత్యాహుః" రజస్వలానంతరము భార్యతో కలియుట నిషేకమని దాని యర్థము. కనుకనే రజస్వలా నియమములను పేర్కొని 'నిషేకమును తరువాత వర్ణించినది. చతుర్థీకర్మను గూర్చిన వివాదమును వివాహమున పేర్కొందును.

విధానము: (మన పద్ధతి-ఆప-సంస్కార దీపిక ననుసరించి)

సంకల్పమైన వెనుక గణపతి పూజ, నూత్న వస్త్ర ధారణమైన వెనుక ఆచమనము చేసి సభకు నమస్కరించి "యోగక్షేమస్య ......................" అనెడి అనువాకముతో బ్రహ్మ గ్రంథిని వేయవలెను. సఫల దక్షిణ తాంబూలములను రెంటిని ఒక పళ్లెమందుంచి ఆ పళ్లెమును వధూవరులు ఒకరినొకరు తాకునట్లు కూర్చుండి పట్టుకొనవలెను. తరువాత 'ఆరోహోరు ...................... సమర్థయ" అను మంత్రములను పఠింతురు. అనగా యజ్ఞమునం దరణిచే మథించి యగ్ని నెట్లు పుట్టింతురో అట్లే మీరు కలిసికొని అమృత సంతానమును కనుడు. శ్రౌత స్మార్త కర్మలందీయబడిన హవిస్సు వర్ష రూపేణ ఓషధులందు ప్రవేశించుటచే ఆ ఓషధుల గర్భము నకు నేనే కారణము. (అంతరాత్మగా సమస్త భూతములలో నున్నానని చెప్పుటయే దీని యర్థము). పితృ దేవతల ఋణమును తీర్చుటకై నా

భార్యయందు సంతానమును పుట్టించుచున్నాను. నా కొడుకులవలన కోడండ్ర యందు సంతానము కలుగుటకు నేనే కారణము" (అనగా తానే పుత్రుడైపుట్టుచున్నాడు గనుక) "విష్ణుర్యోనిం కల్పయతు" అను మంత్రములో "ఓ ప్రేయసీ! నీ భగమును విష్ణువు గర్భాధానమునకు సమర్థమైనదానిగ చేయునుగాక. ప్రజాపతి నాచేత వీర్యముంచబడునట్లు, ధాత ఆ వీర్యమును పిండాకారముగా చేయునట్లు త్వష్టృప్రజాపతి ఆ పిండమునకు అవయవముల నేర్పరచునట్లు చేయుగాక." అను ప్రార్థన కలదు. అంతేకాక "హిరణ్యయీ ..........." మంత్రములవలన బంగారు అరణిచే మథించిన రీతిగా గర్భమును మథించుటచే ఏ అశ్వినీ కుమారులు పుట్టిరో అట్టివారివలె రూపాదులు కలిగిన సంతానము కనుము.

'భూమి వర్షమును కురియుటచే సస్య రూపమైన గర్భమును ధరించి నట్లు, భూమి అగ్నిని ధరించి నట్లు, స్వర్గ లోకము ఇంద్రుని దరించినట్లు, దిక్కులు వాయువును ధరించిన రీతి పుత్రుని గర్భమున ధరింపుము.' అను నర్థమిచ్చుమంత్రములు కలవు. గర్భముననున్న శిశువును 'నేజమేష' అను గ్రహము బాధించునని దానిని తొలిగి పొమ్మని అనును. అంబుల పొదియందు బాణమున్నట్లు నీ యోనియందు పురుషుడు ప్రవేశించి పరాక్రమో పేతుడైన శిశువుగా పుట్టుగాక." "అతే యోనిం గర్భ ఏతు పుమాన్ బాణ ఇవేషుధిమ్, ఆవీరోఽత్ర జాయతాం పుత్రస్తే దశమాస్యః' అను మంత్రము అథర్వవేదమున కూడ కలదు. (సాంఖ్య. హిర. పేర్కొనినవి) ఇట్టి అర్థవంతములైన మంత్రములను పఠించును. "యాని భద్రాణి................" అను మంత్రముల వలన 'ఆవు తన దూడలను పాలిచ్చి పోషించునట్లు నీ పిల్లలను పోషించి పాలింపుము' అని తేలుచున్నది. ఆ వెనుక 'ఆభ్యుదయికమైన కర్మతో పరిసమాప్తి జరుగును. అదియే బ్రాహ్మణాశీర్వచనము.

ఇక మిగిలిన తంతులను సూక్ష్మముగా పేర్కొందును.

బౌధా. గృ. నందు ఉపమాభూషితమైన వాణి కలదు. 'అథైనాం పరిష్వజతి అహమస్మి సాత్వం ద్యేరహం పృథ్వీ తం, రేతోఽహం రేత

భృత్ త్వమ్" నేను స్వర్గ స్థానీయుడనగు చున్నాను. నీవు పృథ్వివగు చున్నావు. నేను రేతస్సును, నీవు రేతస్సును భరించుదానవు' అని పలికి పతి వధువును ఆలింగనము చేసికొనిన తర్వాత హృదయమును స్పృశించును. ఆమె కుడి భుజముపై వంగి నూరుశరత్తులను చూచెదమా? అని ప్రశ్నించును.

కౌషీతకి యందిట్లు కలదు: కొన్ని ఆహుతులు వేసిన వెనుక భర్త ఫలినీ (ప్రేంకణము) మూలమును నస్య యోగ్యముగా నూరి దాని రసముచే రెండు బుక్కులను పఠించుచు వధువు కుడి ముక్కున పిండును. ఇది గర్భశుద్ధికై చేయును.

వైఖయందిట్లు కలదు: నూత్నవధూవరులు వివాహమైన వెనుక మూడు రాత్రులు హవిష్యమును భుజించుచు బ్రహ్మచర్యమును పాటింప వలెను. అగ్ని, వాయు ఆదిత్యులకు ఆహుతుల నిచ్చిన వెనుక ఈ కర్మ ప్రారంభ మగును. వారు శాలి వ్రీహి యవ ధాన్యముల యన్నమును క్షీరముతో తడిపి తినవలెను. లక్ష్మి, వటశుంగము, సహదేవి యను ఓషధు లలో దేనినైనను నూరి తీసిన రసమును పుత్రకామి యైనచో ఆమె కుడి ముక్కు నందు, స్త్రీ సంతానమును కోరినచో ఆమె ఎడమ ముక్కునందు పిండవలెను. (అ.క. సమీక్ష)

వారాహము ననుసరించి పతి, కరత్ అనిపలికి పత్నీ గుహ్యేంద్రియ మును జననీ అని పలికి తన గుహ్యమును స్పృశించవలెను. సంయోగమైన వెనుక బృహత్ అని పలికి భార్య గర్భాశయమును ముట్టుకొనవలెను.

లౌగాక్షి ప్రకారము వివాహానంతరము ఒక సంవత్సరము బ్రహ్మ చర్యమును పాటింపవలెను. లేదా 12 రోజులు కాని, 6 రోజులు కాని లేదా ఒక రాత్రి గాని పాటించి కలిసికొన్నపుడు, పురుషుడు కరత్ అని స్త్రీ గుహ్యప్రదేశమును స్త్రీ 'భసత్' అని పురుషుని గుర్తును తాకవలెను. పురుషుడు వీర్యమునుంచునపుడు బృహత్ అని విడువవలెను. సంతానము కనునట్లు చేయుమని బహుపుత్రజనన సమర్థము కమ్మని అర్థము. (అ.క.స.)

సాంఖ్యాయనమున హోమములైన వెనుక భర్త అధ్యాండ అను ఓషధి మూలమును దంచి ఆ రసమును రెండు మంత్రము లుచ్చరించుచు (ఋక్ X.121.10) ఆమె నాసిక యందు స్వాహాంతముగ పిండవలెను.

'ఆతే యోనింగర్భ......................" అను మంత్రములు ప్రతి సంగమమున జీవితాంత ముచ్చరింప వలెనని ఆత్రేయుడనుచున్నాడు. కాని బాదరాయణుడు మాత్రము ప్రథమ సంగమముననే (ఋతుకాలముననే) ఉచ్చరింప వలె ననెను.

హిర. గృ. భారలు నాల్గవ రోజున స్త్రీ స్నానము చేసిన వెనుక తెల్లని శుభ్ర వస్త్రములను కట్టుకొని అలంకరించుకొని యోగ్యులగు బ్రాహ్మణులతోనే మాట్లాడవలయు ననినవి.

సమయము:

శారీరకముగా సమర్థురాలైనపుడు ఋతుకాలమున ఈ సుఖము ననుభవింపవలెనని సర్వ గ్రంథముల యభిప్రాయము. పత్ని ఋతుస్నాతయైన నాల్గవ రాత్రి నుండి పదియారవ రోజువరకు గర్భధారణ కుచితకాలమని మను స్మృతి (3-2) నాల్గవ రాత్రి కూడ గర్భధారణకు శుద్ధ దివసమని బహు స్మృతికర్తల అభిప్రాయము. కాని ఇందులకు భిన్నముగ గోభిలమున వివేచనా పూర్ణమైన విచారము వ్యక్తమైనది. నాల్గవరోజున కూడ అశుద్ధ రక్తము ప్రవహించునని, నాల్గవరాత్రికి పూర్వము స్త్రీ అస్పృశ్య కనుక, దుష్టరక్తదూషితయైన స్త్రీతో సంగమము దోషావహము కనుక, అకాలోత్పత్తి కారకుడైన పురుషుడు దోషియగుచున్నాడని, వీర్యమును వ్యర్థము చేయుచున్నాడు కనుక దూష్యమని సిద్ధాంతము చేయబడినది. "విరుజాయాస్తస్మిన్నేవ దివా" "వ్యర్థీకారేణ శుక్రస్య బ్రహ్మహత్యామవాప్నుయాత్" (ఆశ్వ.వీ.మి.) గర్భాధానమునకు రాత్రి కాలమే విహితమని పగలు అనుచితమని సర్వ స్మృతికర్తలు 'ఉపేయాత్ మధ్యరాత్రాంతే' (వీ.మి.) ఇందులకు కారణము చెప్పిరి. పగలు చేయువాని ప్రాణవాయువు, అధికమైన తేజస్సు నష్టమగును. రాత్రి పత్నీ సమీపమునకు వెళ్లువాడు బ్రహ్మచారితో

సమానుడు. పగలు సంగమము చేయువానికి అభాగ్యశాలి, శక్తిహీనుడు, అల్పాయువునగు సంతతి కలుగును. "ప్రాణా వా ఏ తే స్కందంతి యే దివా రత్యా సంయుజ్యంతే బ్రహ్మచర్యమేవ తద్య ద్రాత్రౌరత్యా సంయుజ్యంతే' అని ప్రశ్నోపనిషత్తు. 'నార్తవే దివా మైథున మర్థయే దల్ప భాగ్యాః అల్పవీర్యాశ్చ దివా ప్రసూయంతేఽల్పాయుశ్చేతి." (వీ.మి.) దీనికొక అపవాదముకలదు. చాలకాలము దూరదేశముననుండి వచ్చినవాడు అత్యంత కాముకురాలైన స్త్రీతో పగలైనను సంగమించ వచ్చునని కలదు.

"అనృతావృతుకాలే వా దివా రాత్రా వథాపివా
ప్రోషితస్తు స్త్రియం గచ్ఛే త్ప్రాయశ్చిత్తీ భవేన్న చ." -- వ్యాసుడు.

ద్వితీయాపవాదమందు నిహితమైన అభిప్రాయము స్త్రీలను సర్వదా రక్షించవలెను. కారణమేమన పదభ్రష్టలు కాక యుండుటకే. 'యస్మాత్త స్మాత్ స్త్రియః సేవ్యాః కర్తవ్యాశ్చ సురక్షితాః" -- మ.స్మృతి.

రాత్రులందు కూడ నాల్గవరోజునుండి 16వ రోజు రాత్రి వరకు ఉత్తరోత్తరములు ప్రశస్తములు. బోధాయనుడు పురుషుడు స్త్రీతో నాల్గవ రాత్రి నుండి పదునారవ రాత్రి వరకు సమీపించుటకు యోగ్యుడైనను విశేషించి చిట్ట చివరి రాత్రులందు కూడుకొనవలెనని చెప్పెను. హరితుడు, ఆపస్తంబుడు మొll వారు కూడ ఇందులకు పోద్బలకముగా వక్కాణించిరి. "తత్రాప్యుత్తరోత్తరాః ప్రశస్తాః" చివరి రాత్రులందు పుత్రుడు కలిగినచో అధిక భాగ్యవంతుడు, గుణవంతుడు కలుగునని సర్వ స్మృతికర్తలు చెప్పచున్నారు.

నాల్గవ దినమున పుత్రుడుదయించిన ఆ బిడ్డ అల్పాయువును పొందును. 5న నిల్చిన గర్భమున స్త్రీ శిశువు కల్గును. సంతానవతి యగును. 6 నాడు పుత్రుడు కల్గును. సామాన్యుడు (మధ్యమః) పుట్టును. 7న ఆడుబిడ్డ. వంధ్యయగును. 8 నాడు ధనస్వామియైన పుత్రుడు, 9న సుభగ, సాధ్వి యైన స్త్రీ శిశువు, 10న బుద్ధిమంతుడు, 11న భ్రష్టురాలైన కన్య, 12న శ్రేష్ఠ పురుషుడు, 13న వ్యభిచారిణి, 14న ధార్మికుడు, కృతజ్ఞుడు, దృఢవ్రతుడు, ఆత్మవేదియైన పుత్రుడు, 15న విశేష సంతానవతి, భోగము లననుభవించు పతివ్రత, 16న (ఏకాదశి, అమావాస్య, పౌర్ణమి మున్నగు

నిషిద్ధ దినములు కానిచో) ఆనాడు విద్వాంసుడు, శ్రేష్ఠుడు, సత్యవాది, జితేంద్రియుడు, జీవరాశిని ప్రేమించుచు ఆశ్రయుడుగా నుండువాడు, మహాపురుషుడు జన్మించును." (వ్యాస.)

గర్భాధానమున రాత్రి సంఖ్యలననుసరించి శిశువు యొక్క లింగము కూడ మారునని కలదు. పురుష సంతతిని కోరువాడు సమరాత్రులందును (4,6,8,10,12,14,16), స్త్రీ సంతతిని కోరువాడు బేసిరాత్రులందును (5,7,9,11,13,15) సంగమింపవలెనని కలదు. "యుగ్మాసుపుత్రాజాయంతే స్త్రి యోఽయుగ్మాసురాత్రిషు." -- (మ.స్మృ.)

శుక్రాధిక్యముచే పురుషుడు, రజస్సు యొక్క ఆధిక్యముచే స్త్రీ కలుగునని కూడ అందే కలదు.

"పుమాన్పుంసోఽధికే శుక్రే భవత్యధికే స్త్రియః
సమేఽపుమాన్పుంస్త్రి యౌ వా క్షీణేఽల్పే చ వి పర్యయః"

మాసమున కొన్ని దినములు సంగమమునకు నిషిద్ధములు. అష్టమి, చతుర్దశి, పూర్ణిమ, అమావాస్య, పర్వదినములు వర్జింపదగినవి. "పర్వ వర్జం వ్రజేచ్చైనాం తద్వ్రితో రతి కామ్యయా" -- (మ.స్మృతి) పై నియమములను పాటించిన వ్యక్తి గృహస్థుడైనను సదా బ్రహ్మచారియే. ఇందులకు భిన్నముగా వ్యవహరించిన వ్యక్తి విణ్మూత్ర భోజనమను నరకమును పొందునని విష్ణుపురాణము.

"పర్వాణ్యేతాని రాజేంద్ర రవి సంక్రాంతిరేవ చ
తైల స్త్రీ మాంస భోగీ పర్వస్వేతేషు యః పుమాన్
విణ్మూత్ర భోజనం నామ నరకం ప్రతిపద్యతే." (విష్ణు.)

మనువు ఏకాదశి, త్రయోదశులను కూడ నిషేధించెను. "తాసామాద్యాశ్చ తస్రస్తు నింది తైకాదశీ చ యా, త్రయోదసీ చ శేషాస్తు ప్రశస్తాః దశరాత్రయః" 13 వ రోజును సుశ్రుతము కూడ నిషేధించినది.

మఘ, మూల నక్షత్రములు కూడ పనికి రావని యాజ్ఞ. "ఏవంగచ్ఛన్ స్త్రియం క్షామాం మాఘం మూలం చ వర్జయేత్."

రజస్వలయైన వెనుక స్త్రీ 4వ రోజుననే శుద్ధియగునని కాత్యాయన పారాశరులు చెప్పగా, లఘు. ఆశ్వ. న నాల్గవరోజుదాటిన తరువాత అని దోషయుక్తమైన రజస్సు లేనిచో నాల్గవరోజు పనికి వచ్చునని స్మృతి చంద్రిక చెప్పినవి. చవితి, షష్ఠి, శ్రాద్ధ దినము, తత్పూర్వ దినము పనికిరావని, శని, ఆది, మంగళ వారములు, భరణి, కృత్తిక, ఆర్ద్ర, మఘ, పుబ్బ, విశాఖ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్రపద, త్రిజన్మ, సంక్రమ, వ్యతీపాత, వైధృతులను కూడ విడిచి పెట్టవలెనని శూద్రకమలాకరము.

పై చెప్పిన దివసములు ధార్మిక కృత్యములకు అనుకూలము గనుక సంగమము నిషిద్ధమనిరి. ప్రాచీన భారతీయులు జ్యోతిష విద్యాపారంగతులు గనుక సూర్యచంద్రుల గమనాను గుణముగ పై తిథులందు వికృతు లేర్పడునని దివ్య చక్షువుచే గ్రహించుటవలన నిషేధించిరి. ప్రత్యక్షముగ మనమీ వికృతులను చూచుచున్నాము. పూర్ణిమనాడు చంద్ర ప్రభావముచే సముద్రము పొంగుట, మిగిలిన రోజులలో సామాన్యముగనుండుట, అనగా భూమి యొక్క భౌతిక దశ మారుట ఇత్యాదులు. ఆ తిథులందు ప్రాణిజగత్తునకు స్వస్థత కూడ తక్కువగా నుండుటచే వానిని నిషేధించిరి.

## పవిత్రమైన ఆవశ్యక కృత్యము:

పత్నిని ఋతుకాలమున పురుషుడు సమీపించవలెనని మనువు యొక్క ఆదేశము. "ఋతుకాలాభిగామీ స్యాత్ స్వదారనిరతః సదా". పరాశరుడీ ఆదేశమునిచ్చుటయే కాదు, దీని నతిక్రమించినచో పాపము సంభవించునని కూడ చెప్పెను. 'స్వస్థుడైయుండి ఋతు కాలమున పత్నీ సమీపమునకు వెడలని వ్యక్తి బ్రహ్మహత్యా దోషియగుచున్నాడు. చనిపోయిన వెనుక సూకరియగునని అందే కలదు. యముడీ విషయమున దండమును కూడ విధించెను.

## అపవాదము:

శారీరక మానసి కాధారములను బట్టి ఇందులకు కొన్ని అపవాద ములు కలవు. "వృద్ధురాలు, వంధ్య, దుశ్చరిత్ర కలది, ఆర్తవములేనిది,

మృతాపత్యయైనది, రజస్వలకానిది, అనేక పుత్రులకు తల్లియైన స్త్రీలతో సంగమము చేయకపోయినను పాపములేదని మదనరత్నము పేర్కొన్నది. విష్ణుపురాణము ననుసరించి ఈ దిగువ పేర్కొనబడిన స్త్రీలతో సంగమము కూడదని కలదు. "స్నానము చేయని దానిని, పీడితురాలైన దానిని, రజస్వలయైన దానిని, ప్రశంసనీయురాలు కాని దానిని, క్రుద్ధురాలైన స్త్రీని, ఇష్టపడని దానిని, అన్య పురుషుని ప్రేమించుదానిని, ఆకొన్నదానిని, అత్యధికముగా భుజించినదానిని సంగమింపరాదు.

ప్రతిమాసమున ఋతుకాలమున సంగమించుట యనునది సంతానహీనునకు చెల్లునేమో యని తోచుచున్నది. ఒక పుత్రుడు కలిగిన వెంటనే ఈ విధి వైకల్పికమని గోచరించును. "ఒక పుత్రుడు కలుగునంత వరకు పురుషుడు ప్రతి మాసమున ఋతుకాలమున కూడవలెను. దశపుత్రులు కలుగవలెనను వైదిక ప్రార్థన కేవలము స్తుతిమాత్రమైనద"ని కూర్మపురాణమున కలదు. "ఋతుకాలాభిగామీ స్యాద్యావ త్పుత్రోభిజాయతే దశాస్యాం పుత్రానాధేహి ఇతి ప్రశంసార్థాశ్రుతిః" మను విట్లనుచున్నాడు. "ముందు పుత్రుడు కలిగినంతనే తండ్రి పుత్రి పుత్రవంతుడు యగు చున్నాడు. పితౄణమునుండి విముక్తుడగుచున్నాడు. ఆ పుత్రుడు ధర్మజుడు. ఇంకను సంతానము కలిగినచో వారు కామజులని పిలువబడుదురు." "జ్యేష్ఠేన జాతమాత్రేణ పుత్రీ భవతిమానవః పితౄణామనృణశ్చైవ స తస్మాత్సర్వ మర్హతి యస్మిన్నృణం సన్న యతి యేన చానంత్య మశ్నుతే స ఏవ ధర్మజః పుత్రః కామజా నితరాన్విదుః."

## బహుపత్నీక గృహస్థుడు:

చాలమందిని వివాహము చేసికొనినవాడు ఋతుకాలములోనున్న స్త్రీలను ఎట్లు పొందవలెనను ప్రశ్న కలదు. పూర్వయుగములలో బ్రాహ్మణుడు నాలుగు వర్ణము స్త్రీలను, క్షత్రియుడు మూడు వర్ణములవారిని (తన వర్ణము నుండి) వైశ్యుడు ఇద్దరిని వివాహమాడెడివారు. ఆపైన బహు పత్నీకత్వము రాజపురుషులలో నుండెడిది. ఈ యుగమునం దిది నిషిద్ధము. పై సమస్యను దేవల స్మృతి ఇట్లు పరిష్కరించినది. పతి

వర్ణక్రమానుసారముగాని, లేక వారిలో ఎవరికి సంతానము లేక పోయిన, వివాహముయొక్క జ్యేష్ఠత్వమును బట్టి పొందవలెను.

కర్త:

పతియే ఈ సంస్కారమునకు కర్త యనుటలో సందేహము లేదు. కాని పూర్వకాలమున నియోగ పద్ధతి యుండెడిది. భర్త యుండగా సంతానము లేక పోయినను సంతాన రహితుడై మృతుడైన వెనుక ఆతని భార్యకు లౌకికముగా పారమార్థికముగ సంతానము కావలెను కనుక దేవరునితో అనగా మఱదితో కలిసి సంతానము కనుటను దేవర న్యాయమందురు. మనువు ఇతర స్మృతికర్తలు, విధవ, నపుంసకుని భార్య, అయుక్తుడగువాని భార్య, దేవరునిగాని, సగోత్రుని నుండిగాని సంతానము పడయవచ్చునని అనుమతి యొసంగిరి. అయినప్పటికి అన్యత్ర ఈ విషయమై అసమ్మతిని ప్రకటింపకపోలేదు. సారాంశమేమనగా దీనిని అగతికమైనపుడే యంగీకరింపవలెను.

"దేవరాద్వాసపిండాద్వాస్త్రియా సమ్యఙ్నియుక్త యా
ప్రజేప్సితాధి గంతవ్యా సంతానస్య పరిరక్షయే."

మహాభారతమునందు సత్యవతి కోడండ్రకు సంతానము కలిగించుటకై వ్యాసుని పిలిపించుటలోని ఔచిత్యమును భీష్ముడు చాటి చెప్పెను. యాజ్ఞవల్క్యుడు ప్రతినిధిత్వమై ఆజ్ఞనొసంగెను. "వృద్ధుల ఆజ్ఞను గైకొని నేతిని ఒంటినిండ పూసికొనిన మఱదితో ఋతుకాలమున కూడవలెను. అతడు లేనిచో సగోత్రుడైనను, సపిండుడైనను పనికి వచ్చును.

"అపుత్రాం గుర్వనుజ్ఞాతో దేవరః పుత్రకామ్యయా సపిండోవా సగోత్రో వా ఘృతాభ్యక్త ఋతావియాత్." బహు నియమములు పాటించి ఒకేమారు మఱదితో కూడవలెను. కేవల సంతానాపేక్ష కలిగి నిగ్రహముతో నుండుట కలియుగమున అసాధ్యము కనుక దీనిని ఈ యుగములో నిషేధించిరి. ఆదిత్య, బ్రహ్మపురాణములు కలివర్జ్య సూచిలో దీనిని పేర్కొన్నవి. మనుస్మృతి దీనిని పశు ధర్మమని నిందించినది. "పశుధర్మో

విగర్హితః". ఇతర స్మృతికర్తలు దీనినొక ప్రత్యేక సంస్కారముగా పరిగణించిరి. "పతి మృతుడైనను, జాతిచ్యుతు డైనను, సన్న్యాసియైనను, విదేశమునకు పోయినను వాని గోత్రమున శ్రేష్ఠమైన వ్యక్తి ద్వారా పుంసవనాది సంస్కారములు చేయవలెను." అని ఆశ్వ. స్మృతి "పత్యౌ మృతే వా పతితే సంన్యస్తే వా విదేశగే తద్గోత్రజేన శ్రేష్ఠేన కార్యాః పుంసవనాదయః" -- (వీ.మి.) కౌటిల్యుని కాలములో విధవ ఈ విధముగా సంతానమును కనుట నిషిద్ధము.

## గర్భ సంస్కారమా? లేక క్షేత్ర సంస్కారమా?

ఈ విషయమై రెండు సంప్రదాయములు కలవు. మొదటిదేమనగా గర్భస్థ శిశువునకే సంస్కారమని యాజ్ఞ, మనువుల అభిప్రాయము. ద్విజునకు గర్భాధానము మొదలు అగ్ని దాహపర్యంతము సమంత్రకముగా చేయవలెను. "నిషేకాది శ్మశానాంతో మంత్రైర్యస్యోదితే విధిః". అట్లే గౌతముడు కూడ. రెండవ సంప్రదాయము ననుసరించి ఇది క్షేత్రసంస్కారమని, దీని వలన స్త్రీ శుద్ధురాలగునని అభిప్రాయము.

విశ్వరూపుడు యాజ్ఞ స్మృతిపై వ్యాఖ్య చేయుచు సీమంతము తప్ప అన్ని సంస్కారములు ప్రతిగర్భమున చేయవలెనని వ్రాసెను. సీమంతము ఒక్కమారే చేయవలెననెను. లఘు. ఆశ్వ కూడ ఇట్లే అన్నది. మేధాతిథి, మరికొందరి మతప్రకారము వివాహమైన వెనుక ప్రథమ సంగమ కాలముననే మంత్రపూర్వకముగా ఒక మారు చేసిన చాలుననియు, మఱికొందరు ప్రతి ఋతుకాలమున గర్భము ధరించు వరకు చేయవలెనని యనుచున్నారని వ్రాసెను. తరువాత గ్రంథములగు స్మృతి చంద్రికాదులు గర్భాధాన సీమంత పుంసవనములు స్త్రీకి సంబంధించినవే యని చెప్పుచు హారీతవాక్యములను పేర్కొనినవి. అపరార్కుడు సీమంతము ఒక్కమారే చేయవలెనని, పుంసవనము ప్రతిగర్భమున చేయవలెనని వ్రాసెను. పార.గృ. ప్రభృతులట్లే యనిరి.

రెండవ సంప్రదాయము ననుసరించి ఒకమారు స్త్రీతో సహవాసము చేసినచో అనంతర సహవాసము మంత్రరహితమైనను శుద్ధమైన సంతతి కలుగుటకు హేతుభూతమగును.

ఈ సంస్కార మంత్రములను సూక్ష్మముగ పరిశీలించినచో ఉభయ సంస్కారమైనట్లు తోచును. ఉదా: వైశ్వదేవము. ఇది అన్నసంస్కారం ద్వారా ఆత్మ సంస్కారమని కొందరు, ఆత్మ సంస్కారం ద్వారా అన్న సంస్కారమని కొందరను నటుల గర్భాధానముకూడ గ్రహింపవలెనని పెద్దల అభిప్రాయము. కాని అన్ని కర్మలు ఆత్మ సంస్కారముకొరకే కనుక అన్న సంస్కారమనియు ఆత్మ సంస్కారార్థమని చెప్పనక్కరలేదు. కాని మను స్మృతిలో "పంచసూనా గృహస్థస్య" అని చెప్పిన విధముగా పంచ సూన నివృత్తి కొరకే ప్రధానముగా సంకల్పము చేయ వలెను. దానివలన ఆత్మ సంస్కారము సిద్ధించును. అట్లే ఈ గర్భాధాన సంస్కారము గర్భ సంస్కారమే యనుట న్యాయము.

సంభోగ నియమములు:

శారీరక మానసిక ఆరోగ్యము, తృప్తి, సత్సంతానము కావలెనన్నచో తప్పక నియమములను పాటింపవలెను. "ఋతుకాలమున స్త్రీ ఏ భావముతో కూడియుండునో అట్టి సంతానమునే కనును. నీల వృషభము నుండి నీలమైనది, శ్వేతమునుండి తెల్లనిది కలుగుచున్నదని శంఖలిఖితుడు వ్రాయుచున్నాడు. "యస్మిన్ భావోఽర్పితః స్త్రీణామార్తవే తచ్ఛీలం జన యంతి, యథానీల వృషేణ నీలవృష వత్సప్రభవః శ్వేతేన శ్వేత ఏవ జాయతే." అనుటచే పతి పత్నులు ఎట్టి భావముతోనున్నారో అట్టి అనురూపమైన సంతానమును కనుచున్నారు. ఈ విషయమున ధర్మ సూత్రములందు, స్మృతులందు పెక్కు నియమములు కలవు.

ఆపస్తంబుడు, శాతాతపుడు సంసార సుఖము ననుభవించిన తరువాత పతి స్నానము చేయవలెనని, పత్ని జలముచే శుద్ధి చేసికొనిన చాలునని, స్నానమక్కఱలేదని చెప్పిరి. పతి గర్భముకలుగునను శంకచే స్నానము

చేయుచున్నాడు. "ఋతౌతుగర్భశంకిత్వాత్ స్నానం మైథునినః స్మృతమ్". "ఉభావప్యశుచీ స్యాతాం దంపతీశయనం గతౌ శయనా దుత్థితా నారీ శుచిః స్యాదశుచిః పుమాన్." శయనము నుండి లేచిన వెంటనే స్త్రీ శుచియగునని తాత్పర్యము.

కుడిపాదమును పెట్టి పురుషుడును, ఎడమపాదము పెట్టి స్త్రీయును శయ్యపైనెక్కవలెనని చరకము "స్త్రీని బోరగిల పరుండబెట్టియు, ప్రక్క వాటున పరుండబెట్టియు సంభోగము చేయరాదు. స్త్రీ యధోముఖము గానున్నచో వాతము బలవత్తరమై యోనికి బాధకల్గించును. కుడివైపున పరుండినపుడు ఆప్రక్క నున్నశ్లేష్మము స్వస్థానమునుండి జారి గర్భాశయ ద్వారమును మూయును. ఎడమ ప్రక్కన పిత్తముండును. ఆ వైపుగ పరుండినపుడు ఆ పిత్తము పీడితమై రక్త శుక్రములను దహింప చేయును. సంభోగము నుండి విరమించిన వెంటనే యా స్త్రీని చల్లని నీళ్లచే తడుప వలెను -- (చరకము). ఇందు జపించవలసిన మంత్రమును కూడ పేర్కొనినది:

"అహిరసి, ఆయురసి, సర్వతః ప్రతిష్ఠాఽసి, ధాతాత్వాద ధాతు,
విధాతా త్వా దధాతు, బ్రహ్మవర్చసా భవ."
"బ్రహ్మే బృహస్పతి ర్విష్ణుః సోమ స్సూర్య స్తథాశ్వినౌ భగోఽథ
మిత్రావరుణౌ వీరం దధాతు మే సుతమ్."

'పుత్రం వీరం దధాతుమే' అని కూడవలెను. "బ్రహ్మ, బృహస్పతి, విష్ణువు, సోముడు, సూర్యుడు, అశ్వినీ కుమారులు, భగుడు, మిత్రావరుణులు, వీరందరును నాకు వీరుడగు పుత్రునిత్తురుగాక" అని అర్థము.

తన గృహమున తూర్పు దిక్కుగా, అత్తవారింటిలో దక్షిణముఖముగ, మరొకచోటికి వెడలినపుడు పడమరగా పరుండవలెనని, ఉత్తర ముఖముగా ఎప్పుడు కూడదని ఒక శ్లోకము కలదు.

"స్వగృహే ప్రాఙ్ముఖః కుర్యాత్, శ్వాసురే దక్షిణాముఖః
ప్రత్యఙ్ముఖః ప్రవాసే చ, న కదాచిత్ ఉదఙ్ముఖః"

దీపములేకుండ కూడరాదని, కూడినచో కలిగిన సంతానము దరిద్రు లగుదురని శాస్త్రము చెప్పుచున్నది.

"దీపనష్టే తు యస్సంగం కరోతి మనుజో యది
యావజ్జన్మ దరిద్రత్వం సంతతే ర్నాత్ర సంశయః"

పదునారు సంవత్సరములలోపు వయస్సు కలిగిన స్త్రీని కూడినచో ఆ గర్భము స్రావముచే గాని గర్భ పతనరూపముగ గాని నశించు నని, పుట్టినను దుర్బలేంద్రియములు కలిగిన శిశువు జన్మించును కనుక కూడరాదని, 25 సంవత్సరములు లోబడిన పురుషునకు అధికారములేదని సుశ్రుతము.

ఒక మాసము వరకు బ్రహ్మచర్యము నాచరించిన పురుషుడు సాయం కాలమందు శరీరమునకు నేతిని పూసికొని స్నానము చేసి, ఘృతక్షీరముంతో నున్న శాల్యన్నమును భుజించి; ఒకమాసము వఱకు బ్రహ్మచర్య నియ మముకలదై, సాయంకాలమున ఒంటికి నూనెను పూసికొని స్నానముచేసి నూనె, మినుములు అధికముగా కలిసిన ఆహారమును భుజించియుండు స్త్రీని, మంచి మాటలచే నూరడించి కలియవలెనని సుశ్రుతము.

"హేమంత ఋతువులందు రతి క్రియ ప్రతిదినమును చేయవచ్చును. వసంత శరదృతువుల యందు మూడు దినములకొక సారియు, వర్షగ్రీష్మ ఋతువులయందు పదునైదు దినములకొకసారియు చేయవచ్చును" -- (భావప్రకాశ).

సుశ్రుతుడైనచో సర్వ ఋతువులయందు మూడేసి దినములకొకసారి స్త్రీని కూడవచ్చునని, గ్రీష్మఋతువునందు మాత్రము పదునైదురోజుల కొకసారియనెను. సంధ్యాకాలము, అర్థ రాత్రి కూడదని భావప్రకాశ.

"ఆకలిగొన్నవాడును, తొట్రుపడిన మనస్సు కలవాడును, మధ్యాహ్న మందును, దప్పిగలవాడును, దుర్బలుడును కూడినచో శుక్రహాని, వాత ప్రకోపము కలుగును. రోగి సంభోగించినచో బాధ, ప్లీహవృద్ధి, మూర్ఛ, మృత్యువును కలుగును. ప్రత్యూషమందైనను, అర్థ రాత్రమందును వాత పిత్తప్రకోపము కలుగును. జంతువులతో కూడినను దుష్టయోనియందు

కూడినను ఉపదంశము, వాత ప్రకోపము, శుక్రక్షీణతయు కలుగును. మలమూత్రములను అడ్డగించి నను, శుక్రమును అడ్డిగించి నను, వెల్లకిల కూడినను వానికి శుక్రాశ్మరి (శుక్రము రాయివలెనగుట) కలుగును. కనుక శుక్రమును నిగ్రహించరాదు. అనంతరము స్నానము, పంచదారతో కలిసిన పాలను, చెఱకు రసముతో తయారైన భక్ష్యమును తినుట, చల్లనిగాలి, మాంసరసము సేవించుట. నిద్ర, ఇవి చాల ప్రశస్తములైనవి. రతి కార్యము హెచ్చుగా చేయుటవలన శూల, కాస, జ్వర, శ్వాస, పాండువు, క్షయ, కార్శ్యము కలుగునని భావప్రకాశయందు కలదు.

"గర్భిణితో కూడినచో గర్భమునందు పీడ కలుగును. పుంసవనమైన తర్వాత గర్భిణి నదీ తీరమును, దేవఖాతము (ఎవరిచేతను త్రవ్వబడనిగుంట) నందలి ఉదకమును, భర్త యొక్క శయ్యను, సంతానమునశించిన స్త్రీతో సంభాషణమును, మాంసభోజనమును మానవలెను. దేవాలయములకు, ఉద్యానవనములకు, నదీ తరణమునకై యానము, పురుషునితో సంభోగము గర్భిణికి పనికిరాదను వ్యాసవచనమును ఉదాహరించినది" భావప్రకాశయను వైద్యగ్రంథము.

## రజస్వలా సంభోగ నిషేధము:

రజస్వలయైన స్త్రీని కూడిన పురుషుని ఆయువు క్షీణించుటయేగాక యాదినమున ధరించిన గర్భము కూడ నశించును. అట్లే రెండు మూడు రోజులలో కూడిన, పుట్టిన శిశువు వెంటనే నశించుటగాని కొద్ది రోజు లుండి నశించుటగాని జరుగును. నది యందు ప్రవాహమున కెదురుగా వేయబడి, తేలునట్టి స్వభావముగల కాష్ఠాదులు ప్రవాహమున కెదురుగా బోక మరల తిరిగి వచ్చు రీతి, యోని నుండి రక్తము స్రవించు చుండగా అందు ప్రవేశించిన శుక్రము గర్భకోశమును చేరుటకసమర్థమై రక్తముతోడనే బయటకు వచ్చును. దుష్టార్తవయగు స్త్రీకి 12 రోజులు ఋతుకాలమని అది గడచిన వెనుకనే కూడవలెనని సుశ్రుత వైద్య గ్రంథము సుదీర్ఘముగా చర్చించినది. (సుశ్రుత వైద్యగ్రంథము)

రజస్వలా నియమములు:

వైఖ. మొ॥ గ్రంథములు ఈ నియమములను పేర్కొన్నవి. భావి యందు శుద్ధ సంతానమును బడయుటకై ఈ నియమములు యేర్పడినవి. ఇవి ముఖ్యముగా ఆరోగ్యమునకు సంబంధించినవి. స్త్రీ ఋతుకాలమున మూడు రాత్రులు మలిన వస్త్రములను ధరించుచు స్నానాదులను వీడవలె నని, ఒక్క పూటే భుజించవలెనని, దోసిలితో గాని ఇనుప పాత్రలో గాని నీటిని త్రాగవలెనని, రాగి పాత్రతో త్రాగరాదని, గ్రహములను చూచుట, పగటి నిద్ర పనికిరావని వైఖ. యందు కలవు. ఆమె నాల్గవ రోజున దంత ధావనము చేసికొని సుగంధ జలములో స్నానమాడి, తెల్లని శుభ్రమైన వస్త్రములను కట్టుకొని, దుష్టులతో మాట్లాడక పరపురుషుని చూడక తన పతినే చూడవలెనని, ఏ పురుషుని చూచునో అట్టి సంతానమునే పొందునని అందే కలదు.

బహిష్ఠయైన స్త్రీని కూడిన దొంగపుట్టును. పిరికివాడు పుట్టును. ఆ మూడు రోజులలో స్నానము చేసినచో ఆ వెనుక కూడుటవ లన పుట్టబోవు సంతానము నీళ్లలో పడి చనిపోయెడివాడు పుట్టును. తలంటు కొన్నచో కుష్ఠ, శ్వేత మొ॥ చర్మరోగములు కలిగినవాడు, వ్రాత వ్రాసినచో బట్టతలగలవాడు, కాటుక పెట్టుకొన్నచో గ్రుడ్డివాడు, పండ్లు తోముకొన్నచో పుప్పిదంతములవాడు, గోళ్లతోచించుట, కుట్టుట మొ॥నవి చేసినచో పుప్పిగోళ్లు కలవాడు, నపుంసకుడు పుట్టును. తాళ్లు పేనినచో ఉరిపోసికొని చనిపోవువాడు, ఆకులలో నీటిని త్రాగిన పిచ్చివాడు, చిన్న చెంబులతో నీటిని త్రాగిన చాల పొట్టి సంతానము కలుగునని వేదమునందు కలదు. ఆపస్తంబీయము పూర్తిగా అలంకారాదులను పై మూడు రోజులలో నిషేధించినది. (ఆపస్తంబీయము)

ఆ బాలికకు నూనె బెల్లము కలిపిన అన్నమును, క్షీరాన్నమును, ఇతర పిండి వంటలను, నేతిని క్రొత్త మూకుడులో పోసి పెట్టు ఆచారము కలదు. ఈ దీక్ష బ్రాహ్మణులలో మూడు రాత్రులు, వైశ్యులలో నాలుగు రాత్రులు, రాజులలో 5 రాత్రులు, మిగిలిన వర్ణములలో 9 రాత్రుల వఱకును పైవిధముగా జరుపుచుందురు.

స్త్రీ పుష్పవతియైన తిథి వార నక్షత్రములను బట్టి ఆమె భావి గతిని నిర్ణయించుట, శాంత్యాదులను జరుపుట కూడ కలదు. (చూడుడు: పంచాంగ విధులు.)

ఎన్ని నియమములు పాటించినను సంతానము కలుగక పోవుటకు కారణములు: (1) శుక్ర రజస్సులం దేయొకటి యైనను మూర్ఛిత మగుట, (2) గ్రహదోషము, (3) పితృదోషము, (4) సర్ప దోషము. సర్పములు కర్మ సర్పములు, దేవ సర్పములని రెండు విధములు. కర్మ వశమున పుట్టునవి కర్మ సర్పములు, ఏ ప్రాణదేవత సర్ప శరీరములను ధరించి యాధికారిక కర్మ పూర్తియగు వఱకు, సర్పశరీరములో నియుక్తమై యున్నవో అవి దేవ సర్పములు. అజ్ఞానముచే ఇట్టి దేవసర్పములను చంపిన సంతానము కలుగదు. సువర్ణమయ సర్ప ప్రతిమాదానముచే రామేశ్వరమునందు సర్ప ప్రతిష్ఠాదులు చేయుటచే తొలగును.

(5) నాడీ దోషము (27 నక్షత్రములకు 3 నాడులు. వాని పొంతనరేనిచో సంతానము లేదు.) (6) కర్మ దోషము, (7) వ్యాధి దోషము, (8) అతివ్యవాయ దోషము అని వర్ణాశ్రమ సంస్కార విజ్ఞానమున కలదు.

ఆయుర్వేదమున గర్భాధానమున కనేక ఉపాయములు కలవు. (చూ: వైద్యగ్రంథములు) వాటిలో కొన్నింటిని పేర్కొందును. కొన్నింటికి గృహ్యా సూత్రములను పేర్కొని ఇంతకు ముందే వ్రాసితిని. ఒకటి ఆమ్రమంజరీ రస ప్రయోగము (మామిడిపూతతో చేసిన ఔషధము) కాసఘ్ని, నిదిగ్ధికా, స్పృహి, వ్యాఘ్రి, బృహతి, ప్రచోదని, దుఃస్పర్శ, అనాక్రాంత, భంటాకీ, సింహి, ధావనిక, చిత్రఫల మొ॥ పేర్లుతోనున్న తెల్ల వాకుడు ఓషధిని "ఇయమోషధీ త్రాయమాణా' అను మంత్రమును చెప్పుచు భర్త పత్నీ దక్షిణనాసాపుటమున దీని రసమును పిండవలెనని కూడ పై గ్రంథమున కలదు.

చరకమునందిది విస్తృతముగా కలదు. మహోత్తముడైన పుత్రుడు కావలెననిన స్త్రీ స్నానము చేసినది మొదలు సత్తుపిండిని, తేనె, నేతియందు కలిపి దానిని తెల్లని దూడగల తెల్లని యావు యొక్క పాలతో కలిపి వెండి పాత్రలోనైనను కంచు పాత్రలోనైన నుంచి రోజునకు రెండు పూటలవంతున ఏడు దినముల వరకు త్రాగ వలెను. ప్రాతః కాలమున శాలిధాన్య, యవల అన్న వికారములను పెరుగునందును, తేనె యందును, నేతి యందును కలిపి భుజింపవలెను. శుద్ధమైన వస్త్ర భూషాదులచే అలంకరించుకొని తెల్లని వృషభము నైనను, తెల్లని గుఱ్ఱము నైనను, తెల్లని చందనము నైనను, అంగదము లైనను సాయంప్రాతః కాలములందు రెంటియందును పలుమారు చూడవలెను. ఆ స్త్రీకి అనుకూలమైన సౌమ్యమైన కథలు వినిపించవలెను. భర్త కూడ పైనియమములను పాటింపవలెను. ఇట్లు నియమములో ఏడు రాత్రులు గడిపి ఇద్దరు కలియక ఎనిమిదవ దినమున శిరస్స్నానముచేసి శుభ్రవస్త్రములు, పుష్పమాలికలు, ఆభరణములను ధరించి కూడవలెనని చరకము చెప్పుచున్నది. కోరిన పుత్రులు కల్గుటకై పుత్రకామేష్టిని గూడ చెప్పినది చరకము. పూర్తి ఆచరణ విధానమందు కలదు.

### హోమము:

ఈ సంస్కారమున హోమమున్నదా? లేదా యని ఒక శంక. కుల్లూకుని మత ప్రకారము, (మను. 2-27) స్మృతి చంద్రిక ప్రకారము గర్భాధానమున హోమము లేదు. ప్రథమ ఋతుకాలమున గృహ్యాగ్ని యందు హోమము చేయవలెనని మిగిలిన ఋతుకాలములలో అక్కరలేదని ధర్మసింధువున కలదు. హోమము పేర్కొనని సూత్రముల వారు ప్రథమ ఋతుకాలమున గర్భాధాన మంత్రముల నుచ్చరింపుచు ఈ కర్మ పూర్తి కావించ వలెననిరి. గృహ్యపరిశిష్టమును పేర్కొనుచు సంస్కార కౌస్తుభ మిట్లు చెప్పినది. హోమముండవలెనని, వండిన యన్నమును ప్రజా పతికి, మూడు విష్ణుర్యోని మంత్రములతో, మూడు నేజమేష మంత్రములతో, ఒకటి ప్రజాపతేన మంత్రముతో సప్త విధములైన ఆజ్యాహుతులను అగ్నికి సమర్పించవలెను. ఆశ్వలాయనులకు కూడ హోమము కలదు.

శూద్రులకు:

కర్త భార్యతో సంకల్పించి గణేశపూజ, పుణ్యాహవాచన, మాతృకా పూజ, నాందీ శ్రాద్ధములు చేసి యలంకరించుకొని అశ్వగంధ రసమును, దూర్వల రసమును భార్యయొక్క కుడి ముక్కులో పిండవలెను. నీరాజనమైన వెనుక సూర్యునకు నమస్కరింపవలెనని, ఆ రాత్రి శయ్యపై నధిరోహించి 'విష్ణవేనమః, త్వష్ట్రే నమః, ప్రజాపతయే నమః, ధాత్రే నమః, సినీవాల్యై నమః, సరస్వత్యై నమః, అశ్విభ్యాం నమః, పర్జన్యాయ నమః" అని స్త్రీ యోనిని స్పృశించి సంగమించవలెనని శూద్రకమలాకరమున గలదు. శౌచము కొరకు కర్త ఋతువునందు స్నానము చేయవలెనని, ఋతువుకానిచో మూత్ర విసర్జనమునందు వలె శౌచము ఆచమనమని చెప్పబడినది.

* * *

# పుంసవనము

## శబ్దార్థము:

గర్భధారణమైన వెనుక గర్భస్థ శిశువునకీ సంస్కార ముద్దిష్టము. 'పురుష జన్మ కలుగుగాక' అని దీని అభిప్రాయము. "పుమాన్ ప్రసూయతే యేన కర్మణా తత్ పుంసవన మీరితమ్" -- (శౌనక. వీ. మి) 'పుంసవన మితి కర్మ నామధేయం, యేవ కర్మణా నిమిత్తేన గర్భిణీ పుమాంస మేవ సూతే తత్పుంసవనమ్' అని ఆప. గృ. 14-9 పై వ్యాఖ్య. తచ్చ పుమాన్ సూయతే అనేన కర్మణేతి వ్యుత్పత్త్య గర్భస్య పుంసూప తాపాదకః కర్మ విశేషః".

అథర్వవేదమున 'అశ్వత్థ వృక్షము శమీ వృక్షాగ్రము పైనున్నది. పుంసు వన మేర్పడినది' అని కలదు. "శమీ మశ్వత్థ ఆరూఢ స్తత్ర పుంసువనం కృతం" ఈ సందర్భమున చదువబడు మంత్రములందును, గీతము లందును పురుష సంతతియే కోరబడుచున్నది. ఉదా: అథర్వవేదమంత్రము: "పుమాంసం పుత్రం జనయతం పుమానను జాయతామ్ భవాసి పుత్రాణాం మాతా జాతానాం జనయశ్చయాన్"

సమాజమున పుత్రోదయమునకు గణనీయ స్థానము కలదు. పితౄణ విమోచనకై పురుషుడుపయోగ పడుటయేగాక యుద్ధాదులందు పురుషావ శ్యకతను బట్టి కూడ పురుష సంతానమునకే అగ్రతాంబూలము. స్త్రీ సంతతి కలిగినను మహోత్తమ పురుషులు వీరి వలన కలుగుదురుగాక యను ఆశాభావము కూడ దీనిని బలపఱచుచున్నది.

## వేదములలో ప్రస్తావన:

అథర్వవేద, సామవేదమంత్ర బ్రాహ్మణములందు పురుష సంతతి కొఱకై చేయు ప్రార్థనలు కలవు. "ధనుస్సునకు బాణము అను సంధానింప బడినటుల నీ యోనియందు (గర్భాశయమునందు) పుత్రోత్పత్తి కారణమగు గర్భాధాన మగుగాక! దశమాసములు నిండిన వెనుక నీ గర్భము నుండి

వీరపుత్రుడు జన్మించుగాక. నీవు పురుషుని కనుము. మరల పురుషుని కనుము" "తే యోనిం గర్భ ఏతు పుమాన్ బాణ ఇవేషుధిమ్, ఆవీరోஉత్ర జాయతామ్ పుత్రస్తే దశమాస్యః" ఈ కృత్యమునకు ప్రాజాపత్యమని పేరిడిరి. అంటే నేను ప్రాజాపత్యమును (ప్రజాపతి సంబంధ సంస్కారము) చేయుచున్నాను మొ॥ వాక్యములు గలవు. 'కృణోమి తే ప్రాజాపత్యమ్' (అథ) దీని వెనుక గర్భిణికి ఉపయోగించు ఓషదుల ప్రస్తావన కలదు.

'ఎట్లు ఓషధులకు ఆకాశము తండ్రి, పృథ్వి తల్లి, సముద్రము మూలమో అట్లు దివ్యమైన ఓషధులు పుత్రప్రాప్తి నిమిత్తమై నీకు సహాయము చేయుగాక"

"యాసాం ద్యౌః పితా పృథివీ మాతా సముద్రో మూలం వీరుధాం బభూవ, తాస్త్వా పుత్ర విద్యాయ దైవీః ప్రావన్త్వోషధః" (అథ) ఈ విధముగా బహుధా ఇది స్తుతింపబడినది.

ఈ సంస్కారమునకు పుంసువనం అని కూడ పేరు.

ఆప. హిర. భార. గృ. లందు సీమంతోన్నయనము వెనుక పేర్కొనబడినది. కొంతమంది ముందు పేర్కొనిరి.

ఉచిత కాలము:

మనువు, పార, విష్ణు. ధ. సూ, యజ్ఞ. గర్భాశయమున పిండము తిరుగుటకు పూర్వ ముచితకాలమని చెప్పిరి. "గర్భాధాన మృతౌపుంసః సవనం స్పందనాత్పురా" (యాజ్ఞ) శంఖ స్మృతి కూడ అట్లే చెప్పినది. బృహస్పతి మతానుసారము, గర్భాశయమున స్పందనము కలిగిన తర్వాత చేయవలెను. "సవనం" స్పందితే శిశౌ (వీ.మి.) ముందు చెప్పిన మత ప్రకారము గర్భమునుండి పురుషుడు పుట్టునో స్త్రీ పుట్టునో ఏది పుట్టునది నాల్గు నెలల వరకు నిర్ణయింప వీలు లేదు. కనుక ఇది తెలియబడక ముందే చేయవలెను. నాల్గునెలలకు పూర్వము పురుష స్త్రీ చిహ్నములు సాధారణముగా ఏర్పడకపోవును.

పార, జాతుకర్ణ్యుడు, భైజవాపుడు, శౌనకుడు గర్భముబాగుగా అగు పడిన తర్వాత, అనగా రెండవలేక మూడవ మాసమున ఉచితమని ప్రతిపాదించిరి. 'చతుర్థే మాసి స్థిరత్వ మాపద్యతే గర్భః' అని చరకుడు. చరకమునందు "తృతీయే మాసి సర్వేంద్రియాణి సర్వాంగావయవాశ్చ యౌగ పద్యే నాభివర్తన్తే' అనుటచే మూడవ మాసమున అంగప్రత్యంగములు వ్యక్తములు కావు కనుక 'ప్రాగ్వ్యక్తీభావాత్' అనుచోట రెండవ మాసము పూర్తియగులోపలనే ఇది చేయవలెనని చరకము పై ఆంధ్రవ్యాఖ్యానము.

సంస్కారానుష్ఠాన సమయము రెండవ మాసమునుండి ఎనిమిదవ మాసము వరకు ఉచితకాలమనియే తోచుచున్నది. ఇందులకు కారణము భిన్న భిన్న స్త్రీలలో గర్భధారణ చిహ్నములు ఏకకాలీనములు కాక పోవుటయే. కులాచారముల ప్రకారము కూడ ఈ వైవిధ్య మేర్పడియుండును. ఈ భేదమునకు కారణము బృహస్పతి మాటలలో గోచరించును. ప్రథమ గర్భమైనచో మూడవ మాసమున, రెండవ చూలైనచో నాల్గవ లేక ఆరవ లేక ఎనిమిదవ నెలలలో చేయవచ్చునని వ్రాసెను.

తృతీయే మాపి కర్తవ్యం గృష్టే రన్యత్ర శోభనమ్,
గృష్టేశ్చతుర్థే మాసే తు షష్ఠే మాసేఽథవాఽష్టమే.

సప్తమ గర్భమాసము గడచిన పిమ్మటయని, లౌగాక్షి; గర్భతృతీయ మాసమున మొదటి పది రోజులని గోభిలము. మూడవ మాసమున పత్నిచే పునర్వసు నక్షత్రమున ఉపవాసము చేయించి పతి పుష్యమి నక్షత్రమున దీనిని చేయవలెనని ఆశ్వ.న కలదు. మూడవ మాసమని కౌషీతకి, 3నగాని 4నగానియని ఆప. కాఠకము పై దేవపాలుడను భాష్యకారుడు శిష్టులు 8వ మాసమున చేయుచున్నారని వ్రాయగా, బ్రాహ్మణబల అను మరి యొక వ్యాఖ్యాత ఏడవ లేక 8 వ మాసమున చేయవచ్చునని వ్రాసెను. హిరణ్యాఖాదిరములు 3వ, 8వ మాసమును పేర్కొన్నవి.

ఈ దిగువ పేర్కొనబడిన నక్షత్రములున్న రోజులందీ సంస్కారము చేయవలెను. హస్త, మూల, శ్రవణ, పునర్వసు, మృగశిర, పుష్య నక్షత్రము లకు పురుష నక్షత్రములుగా స్మృతి చంద్రిక పేర్కొన్నది. నారదీయము

ప్రకారము రోహిణి, పూర్వాభాద్రపద, ఉత్తరాభాద్రపదము, వసిష్ఠననుస రించి స్వాతి, అనూరాధ, అశ్విని కూడ పుంనక్షత్రములే. చవితి, నవమి, చతుర్దశి, అమావాస్యలు వదలి మిగిలిన తిథులు, సోమ, బుధ, గురు, శుక్రవారములు, వృశ్చికం, సింహరాసులు వదలి మిగిలిన లగ్నములు, సప్తమ నవమరాసులు ఉచితమని జ్యోతిషగ్రంథములందు కలదు.

## పుంసవన ప్రత్యేకత:

శౌనకు డిట్లనుచున్నాడు. గర్భధారణ తరువాత ఈ సంస్కారము చేసినచో గర్భము పవిత్ర మగును. ఓషధీసేవనము వలన శుద్ధమగును. ఇందుచ్చరింపబడు మంత్రముల ప్రభావము వలన 'గర్భస్థ శిశువునకు గత జన్మల గురించి స్మరించుటకు వీలగును. (వీ.మి.) యాజ్ఞ. పై మితాక్షరి వ్యాఖ్యననుసరించి సీమంతము, పుంసవనము క్షేత్ర సంస్కారములనియు, ఒక్క మారుచేసిన చాలుననియు, ప్రతి గర్భమునకు అనావశ్యకములని తెలుచున్నది. "ఏతే చ పుంసవన, సీమంతోన్నయనే క్షేత్ర సంస్కార కర్మత్వాత్ సకృదేవ కార్యే న ప్రతి గర్భమ్." ఇది గర్భ సంస్కారము కనుక ప్రతి గర్భమునకు చేయతగినది యని ఆశ్వలాయనము.

## విధానము:

మనదేశ పద్ధతి (ఆ.ప.) సంస్కారదీపిక: ప్రాతఃకాలమున చేయ దగు నిత్యోపాసనము చేసిన వెనుక గణపతి పూజ, పుణ్యాహవాచనము చేయవలెను. సంకల్పము చెప్పి భార్యకు ఉత్తరపు వైపున ఆసీనుడు కావలెను. ఆపైన రక్షాబంధనము. 'ధాతా దదాతు' మొ॥గా కల ఎనిమిది హోమములు చేయవలెను. బ్రహ్మ మాకు ధనము నిచ్చు గాక. ఈ బ్రహ్మయే యజమానునికి సంతానమిచ్చును. గనుక అట్టి బ్రహ్మకు హవిస్సు నర్పించుచున్నాను. సమస్త మైన దేవతలును అదితియు నాయందు ప్రేమ కలవారగుదురుగాక" అని అర్థమిచ్చు మంత్రములను భర్త పఠించును. ఆపైన జయాది హోమములను చేయును. తరు వాత రజస్వలకాని కన్యచేత కల్వమందు పాత్రముతో జంట పండ్ల మట్టి

చిగురును నూరించి క్రొత్తబట్టతో వడపోయించి అగ్నికి పడమరగా, గర్భవతిని తూర్పు శిరస్సుగా ముఖము పైకుండునట్లుగా పరుండునట్లు చేపి 'పుగ్ం సువనమసి' ఆదిగాగల మంత్రములను చెప్పి భర్త తనబొటన వ్రేలితో భార్య కుడి ముక్కు రంధ్రములో పిండవలెను. ఆ రసమును ఆస్త్రీ యుమియరాదు. ఆ మంత్రమున కర్థమిది: పది మాసములు భరించిన శిశువును గనుటకు ఈ పది వ్రేళ్లతోను నిన్నంతట స్పృశించుచున్నాను. ఎట్లు సోమరసము జారుచున్నదో, సముద్రము గాలిచే కదులునో ఆట్లే నీ గర్భమునుండి శిశువు బయటికి వచ్చుగాక. ఆయుస్సు, వర్చస్సు, కీర్తి, పరాక్రమము, ఆహారమును తినుటయందు పటుత్వము కలిగియుండుగాక. శిశువు అపాయము లేనిదై నీకు అపాయము కలుగ కుండ వచ్చుగాక. (మావిని సంబోధించి) మాంసమును నాడులను పడనీయక నాడులతో చుట్టబడక కుక్కలు తినుటకు వీలైనదై పడుగాక."

తూర్పునగాని, ఉత్తరమునగాని ప్రసరించిన జంట పండ్లుగల మఱ్ఱి చిగురును తేవలెను. గర్భిణికి రెండు మూడు మాసములలోగాని, సీమంతపు రోజునగాని దీనిని చేయవలెనని విధి.

మిగిలిన సూత్ర విశేషములను వ్రాయుదును.

పార, బౌధలు పుష్య నక్షత్రము శ్రేష్ఠతమమని చెప్పినవి. ఆ రోజున గర్భిణి ఉపవాసముండి స్నానానంతరము క్రొత్త బట్ట కట్టుకొన వలెనని రాత్రియందు వటవృక్షము యొక్క బెరడును దంచి దాని రసమును స్త్రీ యొక్క కుడి నాసికయందు 'హిరణ్యగర్భ' మొ॥ మంత్రములను ఉచ్చరించిన వెనుక పిండవలెనని పార.లో కలదు. కొన్ని సూత్రములందు పై మంత్రములనుచ్చరించిన వెనుక కుశకంటకములను, సోమలతను దంచి దాని రసమును కూడ ఉపయోగించ వలెనని కలదు. పుత్రుడు, వీర్యవంతుడు కావలెననినచో ఒక జలపాత్రను, లేక కొందరి మతప్రకారము తాబేలు బొరుసు స్త్రీ యొక్క అంకముపైనిడి ఆమె ఉదరమును స్పృశించి 'సుపర్ణోఽసి' మొ॥ మంత్రములను పఠింపవలెను. (పా.సూ.)

వటవృక్షరసమును పిండుటచే గర్భపాత నిరోధము, పుంసంతతి కలుగుట అను ఉత్తమప్రయోజనములు కలవు. సుశ్రుతము ననుసరించి ఈ రసము గర్భకాలీన సమస్త దోషములను, దాహాదుల నివారించునని కలదు. ఇంకను సులక్ష్మణ, వటశుంగము, సహదేవి విశ్వేదేవి అను ఓషధుల రసములను (పాలను) మూడునాలుగు బొట్లు పిండవలెను. "లబ్ధగర్భాయాశ్చైతేష్వహః సులక్ష్మణా, వటశుంగ, సహదేవీ, విశ్వే దేవా నామన్యతమం క్షీరే ణాభిషుష్య త్రీంశ్చతురో వా బిందూన్ దద్యాత్ దక్షిణే నాసాపుటే పుత్ర కామాయై న చ తన్నిష్ఠీవేత్" (సుశ్రుతము).

గోభిలమునందు ఇంకను విస్తృత వర్ణన కలదు. భర్త భార్యనాభిప్రదేశమును "పుమాంసౌ మిత్రావరుణౌ" అని జపించుచు తాకవలెను. అనగా మిత్రావరుణులనెడి ఇరువురు దేవతాపురుషులు, అశ్వినీకుమారులనెడివారు. అగ్ని, వాయువులిరువురు పురుషులే. నీ గర్భమందు పురుషుడే యున్నాడని" యర్థము. దీని తరువాత శుంగాకర్మసంజ్ఞకమగు ద్వితీయ పుంసవన సంస్కార మాచరింపవలెననియు అనగా వటవృక్షపు ఈశాన్యదిక్కున ఒక మొగ్గను వాడిపోవనిది, కృములతో లేనిది తేవలెనని, కుశలతో బంధించి తీసికొని రావలెనని, ఒక గుండ్రాతిని కడిగి బ్రహ్మచారి, పతివ్రత, లేదా కుమారిగాని ఆ శుంగమును నూరకుండ చితుకకొట్టి ఆ రసమును కొన్ని మంత్రములలో పిండవలెనని విపులముగా వర్ణించినది.

ఆశ్వలాయనము నందీ విశేషముకలదు. ప్రజాపతి దేవతాకమైన స్థాలీపాకము చేసి (దూడకలిగిన) ఆవు పెరుగుచే ఆమె దోసిలి నింపి దానిలో రెండుమినుపగింజలు, ఒక యవబీజమునుంచి ఆ పెరుగును ఆమెచే త్రాగించవలెను. ఇచ్చట మినుపగింజలను వృషణద్వయముగా యవబీజమును లింగముగా నూహింపవలెను. ఏమి త్రాగుచున్నావనగా పుంసవనమని మూడుసార్లనును. ఆపైన గుండ్రని శాల నిర్మించి దాని నీడలో ఆమెను కూర్చుండపెట్టి పచ్చి తెల్లగరికను నూరి దాని రసమును ఆమె నాసికయందు పిండవలెను.

కౌషీతకి యందు లేత సోమలత రసముగాని, దర్భల రసముగాని, మఱ్ఱికొమ్మ మొగ్గ రసముగాని, యూపము (గంగరావిచెట్టు) చివరి చిగురు కాని యజ్ఞము పూర్తి యైనవెనుక జూహువు నుండి స్రవించుదానినిగాని నస్య కర్మకు యోగ్యమగునట్లు చేసి వాడవలెనని కలదు.

వైఖానసము ప్రకారము యవలను త్రివృత్తుతో కలిపి స్త్రీచే త్రాగించ వలెనని కలదు. త్రివృత్తనగా పాలు, పెరుగు, నేయి సమభాగములుగా గ్రహించినది.

దేవతలకు ఆహుతుల నిచ్చిన వెనుక ఆజ్యభాగశేషమును భార్యనోటిలో నుంచవలెనని బౌధాయనము.

హిరణ్య జైమిని సూత్రములకు ఇందు భేదములేదు. పైన చెప్పిన ఆశ్వలాయనపద్ధతి, ఆప. పద్ధతి కలిసియుండును.

ఓషధుల రసమును పిండునపుడు ఉచ్చరింపబడు మంత్రములు ఒక దానికంటె నొకటి భిన్నముగానున్నవి. ఉదా: ఖాదిరము మంత్ర బ్రాహ్మణమున (1-4-8), కాఠకము కాఠక సంహితను పేర్కొన్నవి.

అర్వాచీనమగు 'సంస్కార రత్నమాల' ఇందు హోమము చేయువలె ననియు, భర్తలేనిచో భర్త సోదరుడుగాని, లేదా దగ్గఱ బంధువుగాని గృహ్యాగ్ని యందు చేయువలెనని, ఇట్లే సీమంతము కూడ చేయవచ్చునని వ్రాసినది.

చరకమున పెక్కు విశేషములు కలవు. "గోవులు మామూలుగ నిలుచు స్థలమున పుట్టిన మఱ్ఱి చెట్టు యొక్క తూర్పు దిక్కునను, ఉత్తర దిక్కునను వ్యాపించి యుండు కొమ్మలనుండి దిగిన శుంగములను రెంటిని కీటాదులచే చెడకుండు వానిని గ్రహించి, రెండు ధాన్యమాషముల తోడను, రెండు తెల్లావగింజల తోడను చేర్చి పెరుగున కలిపి పుష్యమి నక్షత్రమునాడు త్రాగవలెను. అట్లే జీవకము, ఋషభకము, ఉత్తరేణి, గోరంట వీని నన్నింటినైనను, ఒక్కొక్కదానినైనను యథాసంభవముగ రెండేసి మూడేసి నైనను కల్కముచేసి పై చెప్పిన రీతిగా పాలతో కలిపి

సంస్కరించి త్రాగవచ్చును. మరియు కుడ్యకీటమును (గోడలయందుండు కీట విశేషము) కాని చిన్న చేపపిల్లనైనను అంజలి పరిమితమగు జలము నందుంచి త్రాగవలెను. మరియు బంగారుతోనైనను, వెండితోనైనను, ఇనుముతోనైనను మిక్కిలి సూక్ష్మరూపముగా నుండునట్లు పురుషాకార ప్రతిమలచేసి, అగ్నితో సమానమైన వర్ణమునుకలిగించి, వానిని పెరుగునందైనను, పాలయందైనను, ఉదకాంజలి యందైనను ఉంచి దానిని నిశ్శేషముగ పురుషుడు త్రాగ వలెను. మరియు పుష్యమినాడు శాలిధాన్యపిష్టము నుడికించి దాని యావిరి అఘ్రాణించి, ఆ పిండి జలమున పైచెప్పిన మఱ్ఱి యూడల రసమును కలిపి గర్భిణియగు స్త్రీని, వాకిటి కొయ్యకడవపై నుంచి, ఆమె కుడిముక్కు రంధ్రమున పైచెప్పిన రసమును ప్రత్తితో పురుషుడు స్వయముగ విడువవలెను." (చరకము)

నస్యకర్మకు లక్ష్మణ యను మూలికను వాడవచ్చునని సుశ్రుతము. ఈ మూలిక గుడ్లగూబ శరీరమువలె కొన్ని స్థలములందు రక్తతుల్యమైన బిందువులతో కూడియుండునట్టి యాకులు కలదిగ, కుక్కవాయింటాకు యొక్క ఆకారము కలిగినదిగ నుండును. కావున శరత్కాలములందు పుష్పఫలములతో కూడియుండునపుడు ఆ మూలికను చూచి యునిచి శనివారము సాయంకాలము నందు దానికి నాలుగు ప్రక్కలను చంద్రమేకులను నాటి, మరునాడు హస్త, మూల, పుష్యమి నక్షత్రములలో దేనియందైన సూర్యుడు కూడి యుండునపుడు మంత్రపూర్వకముగ గ్రహించి యామూలికతో సమానమైన రంగుగల దూడగల యావుపాలతో నూరి శాస్త్రోక్తముగ స్త్రీకి నస్యము చేయించవలెనని కలదు.

## గర్భరక్షణము లేక అనవలోభనము:

ఇది ఆశ్వలాయనమున పుంసవనము కంటె భిన్నముగా కలదు. దీని వలన గర్భపాతము జరుగదు. పుంసవనము, అనవలోభనము శుక్ల పక్షమున శుభదినమున పున్నామ నక్షత్రమున చేయవలెను. దీనిని బట్టి ఒకే రోజున చేయవలసినట్లు తోచును. అతనిదే మరియొక సూత్రమునుబట్టి రెండవ లేక మూడవ మాసమున రెండును ఒకే రోజున చేయవలెనని సంస్కార

మయూఖము పేర్కొన్నది. దీని వలన పిండము నాశమగుటగాని, పతనమగుటగాని జరుగదు. ఇది అసలు అనవలోభనము. అవపూర్వక లుప్ ధాతువు (భకారము ఛాందసము). ఈ భావమునే శౌనక కారిక చెప్పుచున్నది. "నక్షుభ్యేన్నప్రవేద్యేన తత్కర్మానవలోభనమ్" స్మృత్యర్థ సారమున నిది 4వ మాసమున చేయవలెనని, లఘు - ఆశ్వలాయనమున, అనవలోభనము, సీమంతము 4, 6 లేక 8వ మాసములందు చేయవలెనని కలదు. కుమారిలుని ఆశ్వ. గృ, కారికలందు ప్రతిగర్భమునందు చేయవలెనని ఉండగా మిగిలిన గ్రంథకర్తలు మాత్రము ఒక్కమారిది చేయవలయునని చెప్పిరి. దీనిని ఆపస్తంబుడు చెప్పలేదు. దీనిని చేయనిచో ప్రాజాపత్య ద్వయమును చేయవలెనని హేమాద్రి చెప్పెను.

ఫలస్నానము:

మానవ గృహ్యము ప్రకారము 8వ నెలలో దీనిని చేయవలయును. జయాది మంత్రములతో ఆహుతులు వేసిన వెనుక ఫలములతో కూడిన నీటితో భర్త భార్యను స్నానము చేయించును. అనంతరము భార్య క్రొత్త బట్ట కట్టుకొనును. పువ్వులతో నీమె నలంకరించును. ఫలములతో కూడిన మాలను ఆమె మెడపై వేయును. ఆపైన అగ్ని ప్రదక్షిణము, బ్రాహ్మణ భోజనము, ఫలప్రదానము, ఆశీర్వచనముతో సమాప్తి అగును. చింతామణి భట్టాచార్య మొ॥ వారు దీనిని పుంసవనముతో అన్వయము చేయుచున్నారు.

పుంసవన మయినది మొదలు ప్రసవ పర్యంతము స్త్రీ ఎక్కువగా నేతి అన్నమును తినవలెనని బోధాయనము. "అతః ప్రభృతి ప్రసవ పర్యంతం బహుసర్పిషమన్నం పత్నీ భుంజీత."

గర్భము నిరపాయముగా నుండుటకై ప్రాచీన వైద్యులు పెక్కు ఉపాయములను సూచించిరి. చరకము నందిట్లు కలదు. "చేదు పుచ్చ, సరస్వతి యాకు (వల్లారాకు) శతవీర్య, సహస్రవీర్య యను గరిక భేదములు, పాదిరి చెట్టు, తిప్పతీగ, కరకకాయ, కటుకరోహిణి, వాట్యపుష్టి, (పచ్చని పువ్వులు

గల చిట్టాముట్టి) విష్వక్సేనకాంత (ప్రేంకణము) అను నీ యోషధులను శిరస్సునందును, కుడిచేతియందును ఉంచుకొని యుండుట, ఈ ఓషధులనే చేర్చి సిద్ధము చేయబడిన పాలనైనను, నేతినైనను పానము చేయుట, ఈ ఓషధులనే చేర్చి కాచబడిన నీళ్లలో ప్రతిపుష్య నక్షత్ర దినమున స్నానము చేయుట, ఎల్లపుడు వానిని స్పృశించుట మొ॥ ప్రక్రియల ద్వారా గర్భమును రక్షించుకొనవచ్చును. ఇట్లెన్నో ఉపాయములను చెప్పినను ప్రజలకు ఆ దృష్టిలేదు. అవన్నియు పాతకాలపుటాచారములని త్రోసివేయుచున్నారు.

ఇక శూద్రులకు ఆశ్వలాయన పద్ధతిలోనున్నట్లే యుండును.

మఱి యొక విశేషమును పేర్కొని ముగింతును. సుఖప్రసవమునకై మంత్రోపదేశప్రక్రియ చరకమునందు కలదు.

"క్షితిర్జలం వియత్తేజో వాయుర్విష్ణుః (ఇంద్రః) ప్రజాపతిః సగర్భాంత్వాం సదాపాన్తు వైశల్యంచ దిశన్తుతే ప్రసూష్వత్వ మవిక్లిష్టం అవిక్లిష్టాశుభాననే కార్తికేయ ద్యుతిం పుత్రం కార్తికేయాభిరక్షితమ్." అనగా సమస్త దేవతలు ఈమెను రక్షింతురుగాకయని, ఉత్తమ పుత్రుడు కనవలెనని ఆశంక. మిక్కిలి యనుకూల వతియైన స్త్రీ, గర్భిణి చెవిలో జపించవలెనని చరకుడు.

* * *

# సీమంతము

## అర్థము:

గర్భమునకు చేయు మూడవ సంస్కారమే సీమంతోన్నయనము. దీని అర్థమేమనగా గర్భిణి యొక్క కేశముల (సీమంత)కు ఉన్నయనము (ఎత్తి పెట్టి కట్టుట) ఈ సంస్కారమువలన జరుగును. "సీమంత ఉన్నీయతే యస్మిన్ కర్మణి తత్ సీమంతోన్నయనమితి కర్మనామధేయమ్" (వీ.మి.)

యాజ్ఞ, వేదవ్యాసులు దీనిని సీమంత మనిరి. గోభిల, కాఠకములు సీమంతకరణమన్నవి. ఆప. భార.లు పుంసవనము కన్న ముందు పేర్కొన్నవి. దీనిని మనువు పేర్కొన లేదు. యాజ్ఞ. పేర్కొనెను. సీమంతమునకు ఫల స్నపనమని మారుపేరు కూడ కలదు. "సీమః తః కథ్యతే స్త్రీణాం, కేశమధ్యే తు పద్ధతిః" అనుటచే పాపట నేర్పరచుట. "సీమానం అంతతి బ " హద్దును ఏర్పరుచుట యని నిర్వచనము.

## ప్రయోజనము:

గర్భిణిని అమంగళకరమైన శక్తులు ఆవహించి యుండునని, వానిని నివారించుటకై ఈ సంస్కారముద్దిష్టమైనట్లు తోచును. ఆశ్వలాయనస్మృతి యందీ అభిప్రాయము గోచరించును. "రుధిరాశన తత్పరలైన రాక్షస శక్తులు ప్రథమ గర్భమును తినుటకు వచ్చును. భర్త వానినుండి తన స్త్రీని రక్షించు కొనుటకై శ్రీని ఆవాహనము చేయవలెను. అందులకై ఈ సంస్కారమును చేయవలెను.

"ప్రత్న్యాః ప్రథమజం గర్భమత్తుకామాః సుదుర్భగాః
ఆయాంతి కాశ్చిద్రక్షస్యో రుధిరాశన తత్పరాః
తాసాం నిరసనార్థాయ శ్రియమావాహయేత్ పతిః
సీమంత కరణే లక్ష్మీ స్తామావహతి మంత్రతః — వీ.మి.

తల్లికి ఐశ్వర్యమును కలిగించుట, అనుత్పన్న శిశువునకు దీర్ఘాయుష్యమును కలిగించుట దీని ప్రయోజనముగా భావింపవచ్చును. ఇది

హిందువుల మనో విజ్ఞాన విషయక జ్ఞానమును కూడ సూచించును. గర్భములో నున్న శిశువునకు ఐదవ మాసము నుండి మానస్సు ఆరంభమగును. "పంచమే మనః ప్రతిబుద్ధతరం భవతి, షష్ఠే బుద్ధిః" (సుశ్రుతము) ఈ సంస్కారము వలన శారీరక ఆఘాతములు లేకుండుట, బలవృద్ధి సిద్ధించును. హర్షదాయకమైన క్రియల ద్వారమున గర్భిణి ఉల్లాసమును పొందును. దీని ప్రతిఫలము గర్భిణిపై, శిశువుపై కూడ నుండును. "రాకా" 'సుపేశా' మొ॥ శబ్దముల ద్వారా ఆమెను సంబోధించుట, స్వయముగా పతి ఆమె కేశములను ముడివేయుట మొ॥ క్రియల ద్వారా ఉల్లసిత హృదయ యగును (బే.గృ. 1-10-7)

**ఇతిహాసము:**

ప్రాక్సూత్ర కాలమున సామవేదమంత్ర బ్రాహ్మణమున దీని ప్రస్తావన కలదు. సీమంతోన్నము చేయుచు భర్త ఇట్లనుచున్నాడు. "ప్రజాపతి మహైశ్వర్య నిమిత్తమై ఏ ప్రకారముగా అదితి యొక్క సీమను నిర్ధారణ చేసెనో అట్లే సంతతి యొక్క దీర్ఘాయుష్య నిమిత్తమై ఈమె కేశములను విభజించుచున్నాను. లేక సంవారణము చేయుచున్నాను (సీమానం నయామి) పుత్ర పౌత్రాదులను కలిగించి నా ముసలి తనము వరకును దీర్ఘ జీవిని చేసెదను." "ఓమ్ యేనాదితేః సీమానం నయతి ప్రజాపతిర్మహతే సౌభగాయ తే నాహమస్యై సీమానం నయామి ప్రజామస్యై' జరదష్టిం కృణోమి." ఇందే ఉదుంబర వృక్షము, బహుసంతతి కలిగిన స్త్రీకి ఉపమాన వాచకమైనది." ఈ వృక్షమువలె ఫలవతి యగుగాక." అని గృహ్యసూత్రములందు బహుధా ప్రస్తుతింపబడి వివృతమైనదీ సంస్కారము.

**విహితకాలము:**

చాలమంది ప్రథమ గర్భమందే దీనిని చేయవలెననిరి. ఆశ్వ. హిర. ఆప. భార. బౌధా. ప్రకారము 4వ మాసమున; జైమిని, గోభి ప్రకారము 4,6,8, ఖాదిరము 4,6,8 న; పార, యాజ్ఞ, విష్ణ, ధ.సూ, శంఖ ప్రకారము 6,8; వైఖా, వేదవ్యాసుడు 8 న; సాంఖ్య 7; కారకము 3; మానవమున

3,6,8 మాసములలో చేయ వచ్చునని కలదు. "ప్రథమ గర్భాయా శ్చతుర్థేమాసి సీమంతోన్నయనమ్" (బౌధ. ఆ. ఆప.) "షష్ఠేఽష్టమే వా సీమంతః" (యాజ్ఞ.) జ్యోతిష గ్రంథముల ననుసరించి శిశు జన్మ పర్యంతము, వీలగునపుడు చేయవలెను.

కొంతమంది లేఖకులు ఈ విషయమై ఇంకను ఉదారబుద్ధిని ప్రకటించిరి. సీమంతము జరుగుటకు ముందే ప్రసవము కలిగినచో ఆ శిశువును తల్లి అంకముపై పరుండబెట్టి ఈ సంస్కారమును చేయవలెనని కలదు.

"స్త్రీ యద్య కృత సీమంతా ప్రసూయతే కదాచన
గృహీత పుత్రా విధివత్ పునః సంస్కార మర్హతి
తదానీం పేటకే గర్భం స్థాప్య సంస్కార మాచరేత్"

-- గార్గ్య. వీ. మి.

శుక్లపక్షమున చంద్రుడు పురుషనామధేయ నక్షత్ర ఘటికల నడుమ ముప్పది గడియల కాలముతో కూడియుండునపు డీ కర్మ చేయ తగునని ఆశ్వ. న కలదు. పుష్యమి, హస్త, శ్రవణములు మొ॥ పున్నామ నక్షత్రములు.

లౌగాక్షి (కాఠక) ననుసరించి పుంసవనమునకు ముందే ఇది విహితము.

దైవవశాత్తు ప్రథమ గర్భమున ఈ సంస్కారము చేయక మునుపే ఆమె ప్రసవించినచో ద్వితీయ గర్భమున చేయవలెనని గోభిలము చెప్పుచున్నది.

శుద్ధి ప్రయోజనము:

ఆశ్వ, బౌధా, ఆప, పార మతానుసారము ఇది క్షేత్ర సంస్కారము కనుక ఒక్కమారే చేయవలెను. హారీతుడు, దేవలుడు వీరి మతమునే అనుసరించిరి. స్త్రీకి సంబంధించిన సంస్కారమే ఇదియని విష్ణువు. కాని యందే ఇది పిండమునకు సంబంధించినదని కొందరనుచున్నారని, ప్రతి గర్భమునకు చేయవలెనను అభిప్రాయము సూచింపబడినది. "తథా చ విష్ణుః సీమంతోన్నయనం కర్మ తత్ స్త్రీ సంస్కార ఇష్యతే. కేచిద్గర్భస్థ సంస్కారో గర్భంగర్భం ప్రయుంజతే" (స్మృతిచంద్రిక).

స్త్రీ ఒక మారు పవిత్రయైనచో ప్రతి గర్భము పవిత్రమైనట్లే (వీ.మి.) ఇది గర్భ సంస్కారమైనచో మూడవమాసమున చేయుట దోసమగునని, ఆధార సంస్కారమైనచో మాస నిర్ణయముతో పనిలేదు అని వాదింతురు. మఱి కొందరు ఇది ఉభయ సంస్కారమని అనుచున్నారు. ఈ పక్షములలో ఆధార సంస్కార పక్షమే వేదవేత్తల సమ్మతమని దేవపాల భాష్యనిర్ణయము. ఆచార మందును పలువురు ఒక సారి మాత్రమే చేయుట కనపడుచున్నది. గర్భ సంస్కారమైనచో ప్రతి గర్భమందు చేయవలయును గదా!" (అ.క. సమీక్ష)

దీని సారాంశ మేమనగా అమంగళకర శక్తుల నుండి ప్రతి పర్యాయము గర్భము రక్షింపబడినచో సంపూర్ణ ఫలదాయకమగునని యొక భావన. ఒకమారు పవిత్ర వంతమైనచో మరల మరల అవసరము లేదని ఒక భావన. వివాహ సమయమున ఒకమారు, పుంసవనము తరువాత ఒకమారు దీనిని చేయవలెనని వారాహ, మానవములందు కలదు.

### విధానము: (తంతు)

మన ప్రాంతపు ఆచారమును ముందు పేర్కొని (ఆపస్తంబ పద్ధతి -- సంస్కార దీపిక ననుసరించి) మిగిలిన సూత్ర విశేషములను తరువాత పేర్కొందును.

ప్రాతః కాలమున చేయదగు ఔపాసన చేసి గణపతి పూజ, పుణ్యాహ వాచనము చేసి రక్షాబంధనమైన వెనుక ఇది ఆరంభమగును. 'ధాతా దదాతు' అను ఎనిమిది హోమములు కర్త చేయును. అగ్నికి పడమట భార్యను తూర్పు ముఖముగా నుండునట్లు కూర్చుండ బెట్టవలెను. మూడు మచ్చలు గల ఏదుబందిముల్లుతోను (మొదట నలుపు, ఎరుపుతో కూడిన నలుపు, తెలుపు రంగు) 3 బర్హిస్సు కట్టలతోను, బ్రహ్మమేడిపండ్ల గుత్తితోను అనగా ఇవియన్నియు కలిపిన కట్టతో పాపిడిని పైకి రేపవలెను. తరువాత 'రాకామహగ్ం' ఆదిగాగల మంత్రములను చదువుదురు. "పూర్ణిమను పిలుచుచున్నాను. ఈ కర్మను నెరవేరునట్లు చేయుగాక. మంచి బుద్ధి, దాన

గుణములు కలిగిన కొడుకునిచ్చుగాక" అని ఈ మంత్రములకు అర్థము. పై చెప్పిన కట్టతో బొడ్డు మొదలు పైకి రానిచ్చి పాపిడి పొడుగున తుడిచి దానిని పడమటకు పారవైచును. 'యౌగంధరి ................" మొదలగు మంత్రములలోని చరిత్రను పాడుడని వీణాగాయకులను ఆజ్ఞాపించును. మొదటిది సాల్వ దేశమందున్న బ్రహ్మక్షత్రియ వైశ్యుల చరిత్ర. రెండవది ఇతర దేశస్థులైన బ్రాహ్మణుల చరిత్ర. 'ఓ యమునా! సాల్వదేశములో నున్నవారు తమ దేశమందు సరియగు రాజపాలనలేని వారగుటచే నీ ఒడ్డున కూర్చిండి మాకు యుగంధరుని సంతానమే ప్రభువుగా నుండవలెననిరి' 'బ్రాహ్మణులు మాకు సోముడే రాజుగా నుండవలె ననుచున్నారు.' ఏ నది ఒడ్డుననున్న వారు ఆ నది నామమును చివర చేర్పవలెనని కలదు.

మొలకెత్తిన యవధాన్యమును దారమునకు దండగా గ్రుచ్చి గర్భిణి యొక్క కొప్పునకు కట్టుదురు. దంపతులిద్దరు నక్షత్రములు కనపడు వరకు మాట్లాడకుండ తూర్పుగాగాని, ఉత్తరపువైపునకు గాని నడిచి ఆవుదూడను ముట్టుకొని వ్యాహృతులను జపించి మౌనమును విడిచి పెట్టవలెను.

ఇక మిగిలిన సూత్ర విశేషములు:

భూతప్రేతముల బాధను నివారించుటకు పాపటపై కుంకుమను చల్లుట కలదు. (వా.గృ.)

సంతతి, పశుసమృద్ధి, సౌభాగ్యము, పతియొక్క దీర్ఘాయుష్యము కొఱకు ధాన్యరాశి, తిలలు, నేతిని చూడమని పతి భార్యతో చెప్పను. "కింపశ్యసి, ప్రజాం పశూన్ సౌభాగ్యం మహ్యాం దీర్ఘాయుష్వల పత్యుః" (సామవేదమంత్ర బ్రాహ్మణము 15-1-5. గో.గృ.సూ.) కొన్ని ధర్మశాస్త్రములలో గర్భిణి దగ్గరనున్న బ్రాహ్మణ ముత్తైదువుల ద్వారా మంగళ సూచకములైన వాక్యముల నుచ్చరింప చేయవలెనని కలదు. ఉదా: "నీవు వీరపుత్రులకు తల్లివగుదువు గాక, జీవపుత్రులను కలిగి యుదువు గాక! "వీర సూర్జీవ పత్నీతి బ్రాహ్మణ్యో మంగల్యాని వాగ్భిరుపాసీరన్ సూర్జీవపత్నీతి". అపుడు పతి ఇద్దరు వంశీవాదకులను గూర్చి చెప్పుచున్నాడు. "గానము

చేయుదు. రాజును కీర్తింపుదు. ఇంతకంటె శక్తిమంతుదు ఎవ్వరైన, ఎక్కడైన కలడా?" ఈ ప్రార్థనల వలన మన కవగతమగున దేమనగా ఆర్యజాతి, యోద్ధజాతి యని తేలును. నిత్యనవజీవనమునకు ఉత్సుకతను ప్రకటించుట, వీరసంతతికై కోరిక వ్యక్తీకరించుట కాననగును. ఈ భావన తల్లిపై, కలుగబోవు శిశువుపై ప్రభావమును చూపును. కోడెదూడను స్పృశించుట పుంసంతతికి ప్రతీక. ఎద్దు చర్మము పై కూర్చుండి చేయ వలెనని ఆశ్వ.నకలదు. కర్త వృషభమును బ్రహ్మకు దక్షిణగా నీయవలెనను విశేషము లందుకలవు.

సాంఖ్యాయనమున పతి లలాట మధ్యదేశము నుండి పాపటి తీయు టను, నాభివద్దనుండి ప్రారంభించి పాపట తీయుటను అను రెండు పద్ధతులను పేర్కొన్నది. త్రివృత్ (తెల్లతెగడ) దారముతో మేడికాయలను కట్టవలెను. నీటితో నిండిన పాత్రయందు వ్రీహులనుగాని, యవలనుగాని ఉంచి 'విష్ణుర్యోనిం కల్పయతు' యను ఏడు ఋక్కులచే ఏడు చేరల నీటిని భార్యచే త్రాగించవలెనని అందే కలదు. (అ.క. సమీక్ష)

ఇంతకు ముందు చెప్పినట్లు వివాహమున పుంసవనము వెనుక రెండుసార్లు సీమంతమును వారాహము విధించినది. వివాహ సమయమున చేయుదానిలో పతి, వధువునకు పాపట తైలముతో దువ్వి, దువ్వెనతో సరి చేసి, జీవించి యున్న గొట్టె బొచ్చుతో పేనిన త్రాటితో కలిపి 'సమస్యకేశాన్' అని జడవేసి బంధించును. వధూవరులు దధి మధువులను కలిపి ఒకేసారి భుజింతురు. పుంసవనము తరువాత చేయుదానిలో కేశములను వెన్నతో మర్దించుట, ఏదుపంది ముల్లుతో పాటు శమీపత్ర శాఖ నుపయోగించి పాపట దువ్వుట, పతి, నీలలోహిత తంతువుచే గాని, జీవించియున్న గొట్టెయున్ని త్రాటితో గాని రెండు జడలు వేసి బంధించుట మొ॥ విశేషములు కలవు.

లౌగాక్షి యందు, కర్మాంతమున వాగ్దత్తలైన కన్యలకు పటోద్ధరణ కర్మ కలదు. అనగా సర్వౌషధి కుంకుమ ప్రభృతుల అనులేపనము పాపట యందు చేయుట.

నీటిలో బంగారము వేసిన కంచుపాత్రను పతి పత్నికి చూపించి ఏమి చూచుచున్నావని యడుగగా, సంతానాదులను, ఆయుర్దాయమును చూచుచున్నానని ఆమెతో అనిపించవలెనని జైమిని గృ.సూ.న కలదు. హిర. భారలు వీణావాదకులను గూర్చి చెప్పలేదు.

అగ్ని ముందు మూడు హవిష్యాన్నపు పాత్రలను, నీటితో నిండిన మరియొక పాత్రనుంచి ఏమి చూచుచున్నావని పతి అడుగగా పైవిధముగా నామెతో ననిపించవలెనని, కర్మాంతమున బ్రాహ్మణులకు బ్రాహ్మణ స్త్రీలకు ఆ హవిస్సునిచ్చి మూడవ పాత్రలో నున్నది పత్ని, బాలురు తినవలెనని, నక్షత్రోదయము వరకు మౌనముతో నుండ వలెనని భార.గృ.సూ. న కలదు. బౌధ. లో ప్రత్యేకత లేదని చెప్పవచ్చును. అగ్నివేశ్య గృ.న కు హిర.గృ.నకు తేడా లేదు.

హిర.గృ. ఒక్కటే ఈ సంస్కారమును గుండ్రనైన స్థలమునందు చేయవలెనన్నది.

కర్మాంతమున భార్యాభర్తలు ఇద్దరు మౌనముగా నుండవలెనా లేక స్త్రీ యొక్కతయే మౌనముగా నుండవలెనా? అనునది ప్రశ్న. ఇద్దరూ మౌనముతో నుండవలెనని కొందరు, భార్యకే చెందునని కొందరు అనుచున్నారని ఆప. పై సుదర్శనుడు చెప్పెను. మొలచిన యవాంకురములను దారముతో ఆమెయే కట్టుకొనునని, భర్త కాదని కొందరర్థము చెప్పుచున్నారు.

మూడు మచ్చలు కలిగిన ఏదుబంది ముల్లు ప్రత్యేకతను గుర్తింపుడు. మూడు మచ్చలు, మూడు ఛందస్సులను, మూడు సవనములను, మూడు భువనములను సూచించునన్ని తై.బ్రా.న కలదు. "త్రేణ్యా శల్ల్యాని వర్తయేత, త్రీణి వై దేవా నా మృద్ధాని, త్రీణి ఛందాంసి, త్రీణి సవనాని త్రయ ఇమే లోకాః"

ఈ సంస్కారము మన ప్రాంతమున ఏనాడో లోపించినదని చెప్ప వచ్చును. పువ్వులు ముడిపించుట, గాజులు పెట్టించుట మొ॥ లౌకికాచారములనే పాటించుచున్నారు. పశ్చిమ ప్రాంతీయులలో 8వ నెలలో మేడిపండ్ల గుత్తులను కట్టుట మొ॥ ఆచారములు మిగిలినవి.

ఇక శూద్రులకు శూద్రకమలాకరములో చెప్పబడిన విధానము వ్రాయుదును. 4,6,8 మాసములలోగాని ప్రసవమునకు ముందుగా గాని సీమంతము చేయవలెనని, గణేశపూజ, పుణ్యాహవాచన, మాతృకా పూజ నాందీ శ్రాద్ధములు చేసి దూర్వల రసమును భార్య కుడిముక్కులో వేయునపుడు అగ్నయే నమః, రాజ్ఞే వరుణాయ నమః అని యుచ్చరింపవలెనని, తెల్లని ఏదుబంది ముల్లు మూడు దర్భలతోను బొడ్డపళ్లగుత్తితోను కలిపి పట్టుకొని పత్ని వెనుక నిలిచి 'ప్రజాపతయే నమః' అని భ్రూమధ్యమునుండి శిరస్సునందు కొప్పురెండు భాగములుగచేయుచు మూడు పాపటలు తీర్చవలెనని, ముమ్మారిట్లు చేయవలెనని, ఆపైన నీరాజనమిచ్చి భార్యతొడపై ఫలము, లడ్డుకములు మొ॥ మంగళద్రవ్యములుంచి, విప్రులకు పదుగురికి భోజనసామగ్రిని దక్షిణగా నీయవలెనని చెప్పబడినది.

## గర్భిణీ స్త్రీ ధర్మములు:

ప్రాచీన ధర్మశాస్త్ర గ్రంథములు గర్భిణీ, ఆమె పతికి విధించబడిన ధర్మములను పేర్కొన్నవి.

ఈ విధులను మార్కండేయ పురాణము విపులముగా చర్చించినది. అనేక దుష్టశక్తులు గర్భమును భక్షించుటకై, రుధిర పానాసక్తములై యుండును కనుక పవిత్ర మంత్రములను వ్రాయుట, సుందర సురభిళ మాలాదులను ధరించుట మొ॥ వాని ద్వారా రక్షించుకొనవచ్చు నని వ్రాసినది. విరూపశక్తి, వికృత శక్తి తరచుగా వృక్షములపై, సముద్రములపై, మురికిగుంటలు, అగడ్తలు, పర్వతములందుండుటచే గర్భిణి పై ప్రదేశములలో నివసించరాదు. విఘ్నశక్తి గర్భహంత్రి. దాని కూతురు మేహిని. విఘ్నము పిండమును తినుటకు, మేహిని గర్భపాతము చేయుటకు ప్రయత్నించుచుండును. మేహిని యొక్క దుర్మార్గమువలన గర్భాశయము నుండి సర్పము, కప్ప, మొసలి వంటి ఆకారములు కలిగిన శిశువులు జన్మింతురు. (మార్కం. వీర.మి.)

కశ్యప అదితి సంవాద రూపమున పద్మపురాణములో చాల వివరములు కలవు. గర్భవతి నది యందు స్నానము చేయరాదు, పాడుపడిన

గృహములలో నివసించరాదు, పురుగులు దొలిచి గుట్టగా చేసినమట్టి మొ॥ వానిపై కూర్చుండరాదు, మానసిక అశాంతికి దూరముగా నుండవలెను, గోళ్లతోగాని, బొగ్గుతోగాని నేలపై గీయరాదు. ఎల్లపుడు నిద్ర పోరాదు. శ్రమకరమైన పనులను విడిచి పెట్టవలెను. మాటిమాటికిని తలగోకుకొనుట, జుట్టు విరియబోసికొనియుండుట, ఉత్తర దిక్కుగా తలనిడి పరుండటు, ఒళ్లు విరుచుకొనుట, తడి కాళ్లతోనుండుట, అమంగళకర వాక్కులను పల్కుట, అధికముగా నవ్వుట, బొగ్గు, బూడిదలను మాటిమాటికి స్పృశించుట మొ॥ చేయరాదు.

కశ్యపుడు దితితో ఇట్లు చెప్పినట్లు మత్స్యపురాణమున కలదు. గర్భిణి గోధూళి సమయమున భుజించుట, వృక్షమూలమునకు వెళ్లుట, కూర్చుండుట కూడదు. ఓషధులతో కూడిన వేడినీటి స్నానము చేయుట, దేవపూజ, భిక్షాదానము మొ॥ చేయవలెను. మాసము యొక్క మూడవ దినమున పార్వతీ వ్రతముల నాచరించవలెను. అంబారీల నెక్కుట, గుఱ్ఱపుస్వారి, పర్వతము నెక్కుట, భవనాదుల నెక్కుట, వ్యాయామము, ఎడ్లబండిపై యాత్ర, రాత్రి జాగరణము, పాసిపోయిన అన్నము తినుట మొ॥నవి విడువవలెను.

వరాహ స్మృతి సామిష భోజనమును నిషేధించెను.

## పతి ధర్మములు:

గర్భిణి కోర్కెలను పతి తీర్చవలెను. ఈమె కోరికలు తీరనిచో గర్భము దోషయుక్త మగునని విరూపమైన శిశువు కలుగునని యాజ్ఞవల్క్యుని మాట. "దౌహృదస్యా ప్రదానేన గర్భోదోష మవాప్నుయాత్ వైరూప్యం నిధనం వాఽపి తస్మాత్ కార్యం ప్రియం స్త్రియః"

ఆశ్వ. స్మృతి ననుసరించి పతికి ఆరవమాసము తరువాత వపనము కూడదు. అతడు మైథునము, తీర్థయాత్ర శ్రాద్ధమును వర్జింపవలెను.

"వపనం మైథునం తీర్థం వర్జయేత్ గర్భిణీపతిః
శ్రాద్ధశ్చ సప్తమాన్మాసా దూర్ధ్వం చాన్యత్ర వేదవిత్."

శవానుగమనము, నఖకృంతనము, యుద్ధములో పాల్గొనుట, వాస్తు కరణము, దూరప్రయాణము, ఉద్వాహము, సముద్ర స్నానము మొ॥ పనికిరావని, చేసినచో ఆయుఃక్షీణము కలుగును. మరియొక స్మృతి యందు, చెట్లను నరకరాదని కలదు. "సింధు స్నానం, ద్రుమచ్ఛేదం, వపనం, ప్రేతవాహనమ్"

పై చెప్పిన నియమములు సుశ్రుతములో కూడ కలవు. గర్భమును ధరించిన సమయమున కామ తీవ్రతలేకుండ, ప్రసన్నురాలైయుండినచో ఆమెకు కలుగు సంతానము దివ్యమై, ధార్మికమై యుండగలదు. ఇట్ల మంగళకర శక్తులనుండి దూరమై, శారీరక మానసిక, స్వస్థతతో నున్న స్త్రీ ధార్మిక సంతానమును కనును.

* * *

# విష్ణుబలి

ఈ సంస్కారము వైఖానసము మొ॥ కొన్ని గ్రంథములలోనే కలదు. వసిష్ఠుని వాక్యములను సంస్కార ప్రకాశము పేర్కొన్నది. (పు. 178) గర్భిణికి 8వ మాసమున శుక్లపక్షమున విదియ, సప్తమి, ద్వాదశి తిథులందు శ్రవణ, రోహిణి, పుష్య నక్షత్రములందిది చేయవలెను.

ప్రయోజనము:

ఇది పిండమునకు కలుగబోవు హానిని పోగొట్టి సుఖప్రసవమునకై చేయవలెను. ప్రతి గర్భముననిది విహితమని కలదు. దీనికి ముందు రోజు నాంది శ్రాద్ధము, ఆజ్య భాగము వరకు హోమము చేయవలెను. అగ్నికి దక్షిణ భాగమున మఱియొక స్థండిలమును స్వస్తికాకారముగా గాని, పద్మాకారముగాగాని తీర్చి దిద్దవలెను. దానిపై హవిష్యాన్నముతో నున్న 64 ఆహుతులను విష్ణువున కుంచవలెను. కొందరు అగ్నిలోనే ఆహుతి నిత్తురు. ఋక్. 1-22. 16-21, ఋక్. 1-154. 1-6, ఋక్. VI 69.1-8, ఋక్ VII 104.11. ఋక్. X 90.1-16, ఋక్. X 184.1-3 మంత్రములతో, అగ్నికి ఈశాన్యమూలలో నలుచదరముగా గోమయముతో అలికి 64 భాగములుగా తెల్లని పిండితో పట్టుపట్టి ఈ హవిష్యాన్నమును పై మంత్రముల నుచ్చరించుచు ఉంచవలెను. అందు మధ్య 'నమోనారాయణాయ' అని గట్టిగా ఉచ్చరించుచు ఒక అన్నపుముద్దను విష్ణువునకై ఉంచవలెను. భార్యా భర్తలు విడివిడిగా ఆ అన్నము నుండియే రెండు ముద్దలను గ్రహింపవలెను. ఆ పైన అగ్ని స్విష్టకృత్‌నకు ఆహుతి నిచ్చుట బ్రాహ్మణులకు దక్షిణ నిచ్చుట బ్రాహ్మణ భోజనముతో సమాప్తియగును.

8వ మాసమున విష్ణు మంత్రములతో (ఋ. 1-154) విష్ణువునుద్దేశించి ఆహుతులు వేసిన వెనుక బలి కూడ వేయవలెనని, ఈ నెల నుండి విష్ణువు అధి దేవతయని బౌధా.న కలదు. "వైష్ణవో హ్యేసమాసో విజ్ఞాయతే. విష్ణుర్గిగర్భస్యదేవతా." (బౌ. 1.10.13-16) వైఖానసమునందిట్లు కలదు. "ఉత్తర ప్రణిధియందు, అగ్న్యాది దేవతల నావాహనమొనర్చి సప్రణవ

వ్యాహృతి పూర్వకముగా పురుష శబ్దముచే పురుషు నావాహనము చేసి ఆ విధముగనే నిర్వోపాదులను చేయునది. పిమ్మట ఆఘారాంతము చేయునది. ఇచ్చట ఆఘారమనగా వైష్ణవహోమ పర్యంతము తరువాత అగ్నికి పూర్వ దిగ్భాగమున స్థండిలమందు దర్భాసనములు పఱచి అందు ద్వాదశనామములచే తన హృదయము నుండిగాని, సూర్య బింబమునుండి గాని విష్ణువు నావాహనము చేసి ఆపో హిరణ్య పవమాన సూక్తములచే స్నపనచేసి ప్రత్యేకముగా సకలోపచారములు చేయుట. తరువాత "అతో దేవాది" షడ్వైష్ణములు "విష్ణోర్నుకం" అను మంత్రములచేతను పండ్రెండు ఆజ్యాహుతులు ఆజ్యముతో వేల్చి, ఆజ్యసంయుక్తమైన పాయసమును నారాయణునకు నివేదించి, ద్వాదశనామములతోను అతోదేవతాదులతోను విష్ణోర్నుకాదులతోను హోమమును చేయునది. పిమ్మట దేవతాకములైన నాల్గు వేదమంత్రములచేతగాని చతుర్వేద పఠితమగు పురుషసూక్తముచేత గాని శ్రీమన్నారాయణుని స్తుతించి నమస్కరించునది. పాయసశేషమును పత్నిచే ప్రాశనము చేయునది." (అ.క. సమీక్ష నుండి.)

* * *

# జాతకర్మ

ఇతిహాసము:

ఋగ్వేదమున 'జన్మన్' శబ్దము యొక్క ప్రయోగము రెండు స్థానములందు కలదు. అచ్చట నిగి స్తోత్రాది సంబంధార్థమున నే ప్రయుక్తము. అయినను జాతకర్మకు సంబంధించిన విషయము మృగ్యమని కొందరందురు. కాని అథర్వవేదమున ఒక సంపూర్ణ సూక్తమునందు సుఖ ప్రసవనిమిత్తమై ప్రార్థనములు, ఉపచారములు వర్ణితములు. ఆ సూక్తార్థమిది హే పూషన్! ఈ ప్రసూతి సందర్భమున విద్వాంసుడు, మరియు శ్రేష్ఠుడైన హోత నీకు యజనము చేయుగాక! స్త్రీ (గర్భిణి) చక్కగా శిశువును కనుగాక! స్త్రీ శరీర సంధిస్థానములు, ప్రసవమునకై విశేషించి వదులుగా నుండుగాక! ద్యులోకమున నాల్గు దిశలు కలవు. మరియు భూమిని నాలుగు దిక్కులు ఆవరించినట్లే గర్భము కూడ నాలుగు దిశలచే ఆవరింప బడియున్నది. భగవంతుడు దానికి గతి కలిగించును. ఆయనే ప్రసూతికై శిశువును గర్భాశయమునుండి బైటికి పంపుగాక! మనము ఆమె యోనిని విస్తరింతుముగాక! హే సూషణే (సుఖప్రసవిని స్త్రీ) నీవు నీ యువ యవమును వదులుగా నుంచుము. హే విష్కలే! నీవు ఈ గర్భమును క్రిందకు త్రోసి వేయుము. మావి అంగములలోపల స్పృశించినట్టిదై నీటిపై తేలియాడు నాచువలె కుక్కలు తినుటకై బయటకు వచ్చుగాక! నేను నీ మూత్రద్వారమును విడదీయు చున్నాను. మరియు యోనిని విస్తృత పఱచుచున్నాను. యోని మార్గముననున్న రెండు నాడులను పృథక్కరించు చున్నాను. తల్లిని శిశువును విడదీయుచున్నాను. మరియు శిశువును మావిని విడదీయుచున్నాను. గాలి, మనస్సు, పక్షి, ఏవిధముగా బయల్వెడలి ఎగురసాగునో అట్లే దశమాసములు గర్భములో నున్న శిశూ, నీవు బయటకు రమ్ము. మావి కూడ బయటకువచ్చుగాక'. ఈ సూక్తమున ప్రార్థన కలదు. భార్యవేదనను చూచి భర్త పడు ఆవేదన, శీఘ్రముగా ప్రసవము కావలెనను కోరిక ఇందభివ్యక్తములైనవి. శోష్యంతీకర్మ సందర్భమున ఈ సూక్తమున గల మూడవ మంత్రము పఠింపబడుచున్నది.

తై. సంహిత యందు కుమారుడు పుట్టిన వెనుక వైశ్వానరేష్టి చేయువలెనని కలదు. కనుక ఇది ఎంత ప్రాచీనమో అవగతమగును. "వైశ్వానరం ద్వాదశ కపాలం నిర్వపేత్పుత్రే జాతే..............యస్మిం జాత ఏతామిష్టిం నిర్వపతి పూత ఏవ తేజస్వ్య న్నాదః ఇంద్రియావీ పశుమాన్ భవతి" ఈ ఇష్టి వలన ధనధాన్య సమృద్ధి కలుగునని కలదు. జైమిని ఈ ఇష్టి వలన తనయునకే లాభము కాని తండ్రికి కాదని చెప్పెను. దీనిపై శబర స్వామి ఈ ఇష్టి జాతకర్మానంతరము జరుగవలెనని, పుట్టిన వెంటనే కాదని, పదిరోజులు వెనుక పూర్ణిమనాడుకాని ప్రతిపత్ తిథి (పాడ్యమి) యందుగాని చేయవలెనని వ్రాసెను.

బృహ. ఉప. న ఇట్లు కలదు. "తస్మాత్కుమారం జాతం ఘృతం వైవాఽగ్రే ప్రతి లేహయంతి స్తనం వా అనుధాపయంతి" అనగా పిల్లవాడు పుట్టిన వెనుక నేతిని ముట్టించవలెనని తరువాత తల్లిపాలు ఈయవలెనని యర్థము. ఉపనిషత్తు చివరి భాగమున విపుల ప్రస్తావన కలదు. శిశువు పుట్టిన వెనుక 'అగ్నిని ప్రజ్వలింపజేసి, శిశువును తొడ మీద పెట్టుకొని నేయి, పెరుగు కలిపి ఒక కంచు పాత్రలో పోసి ఈ దిగువ మంత్రములతో ఆహుతులనీయవలెను. "వేయి సంవత్సరములు సంతాన సమృద్ధితో అవిచ్ఛిన్నముగా నుందునుగాక. స్వాహా! అధికముగా గాని అల్పముగా గాని నేను చేసిన ఈ కర్మ స్విష్టకృత్తగు అగ్ని సుసంపన్నమగునట్లు చేయునుగాక -- స్వాహా!" ఆ వెనుక తండ్రి తన నోటిని శిశువుకుడి చెవి దగ్గరకు తీసికొని వచ్చి 'వాక్' యని మూడు సార్లనును. దధి, మధు, ఘృతములను దేవతకు అర్పించిన వెనుక బంగారు శలాక (చెంచా) తో భూః, భువః, స్వః, భూర్భువస్స్వః లను ఉంచుచున్నానని వానిని తినిపించును. నీవు వేదమగు చున్నావని ఒక నామమిడును. అది గుహ్య నామము. తల్లి కిచ్చి పాలు పిల్లవాడు త్రాగునట్లు చేయును. అక్కడ ఈ మంత్రము నుచ్చరింపవలెను. 'ఓ సరస్వతీ స్తనమును కుడుచునట్లు చేయుము. దేని వలన సుఖము కలుగుచున్నదో, సమస్తప్రాణులు పోషింపబడుచున్నవో ఏది రత్నప్రదాత్రి యో దానిని సిద్ధము చేయుము.' పిదప తల్లిని ఈ మంత్రములో సంబోధించును. 'ఓ మైత్రావరుణీ! (మైత్రావరుణుడు

వసిష్ఠుడు, అరుంధతి మైత్రావరుణి కావచ్చును) ఓ దృఢమైన దానా! నీవు ఇళ (భూమి అనికాని ఆహారమనికాని యర్థము). ఆమె (తల్లి) మంచి వీరుని కన్నది. సువీరులను కనుము. ఇప్పుడు కనినట్లుగానే మిగిలినవారు అనగా ఆశీర్వచనము చేయువారు శిశువునుద్దేశించి యిట్లనవలెను. నీవు నీ తండ్రిని మించితివి. ని తాతను మించితివి. భాగ్యము, కీర్తి ప్రతిష్ఠలు, బ్రహ్మజ్ఞాన సంపత్తి పొందుదువుగాక" ఇట్లు జాత కర్మ వేదవాఙ్మయమున కీర్తితమైనది.

ప్రసవమునకు ముందు విధులు :

శిశువు ఒక మాసమునకు జన్మించుననగా అందులకు తగినట్లు ఏర్పాట్లు జరుగవలెను. 'ఆసన్న ప్రసవేమాసి కుర్యాచ్చైవ విశేషతః (రత్నాకర.వీ.మి.). దీనికి సంబంధించినది ప్రప్రథమమున సూతికాగృహము. గృహమున ఏ భాగము అనుకూలమో గ్రహించి శుభదినమున అనుకూల రాసులందు, అనుకూల దిశయందు ఏర్పాటు చేయుటను పెద్దలు సూతికా భవనమందురు. "వారేఽనుకూలే రాశౌ తు దినే దోషవర్జితే, స్వానుకూల దిశం ప్రోక్తం సూతికా భవనం బుధైః" (గర్గ - వీ.మి.)

వసిష్ఠుడు సూతికాగృహము నైఋతి దిశయందు నిర్మాణము కావలె నని నిర్దేశించెను. "నైఋత్యాం సూతికాగృహమ్" "వాస్తువిద్యా విశారదుల ద్వారా ఇది నిర్మితము కావలెను. సమతల భూమి కావలెను. గృహము యొక్క ద్వారము పూర్వముగా గాని, ఉత్తరముఖముగా గాని యుండవలెను. అది సుదృఢము, శుభావహమై యుండవలెను." అని విష్ణుధర్మోత్తరము. "సుభూమౌ నిర్మితం రమ్యం వాస్తు విద్యా విశారదైః ప్రాగ్ద్వార ముత్తర ద్వార మథవా సుదృఢం శుభమ్." శంఖలిఖితుల ననుసరించి మంగళ వాద్యములు వాయించుచుండగా శుభసూచకమైన మంత్రములను పఠించు చుండగా దేవతలను, బ్రాహ్మణులను, గాయకులను పూజించి భావిమాత ఒకటి రెండు దినములలో ప్రసవించుననగా సూతికాగృహమున ప్రవేశించ వలెను. ఆమె వెంట పుణ్యస్త్రీలు, సంతానమును కనినవారు, అనుభవము కలిగిన ముత్తైదువు లనుసరించి యుందురు. వారు ఆమెకు సకల

విధములైన పరి చర్యలు చేయుదురు. అందే దుష్టశక్తుల బారినుండి తప్పిం చుకొనుటకు కొన్ని విధులను పాటింతురు. మంత్రపూర్వక జలముచే ఆ స్థలము ప్రోక్షితము కావలెను.

కాకాదని (కాకిదొండ) మేచకరాతిని (కామంచి) కోశాతకి (ఆవడ చెట్టు) బృహతి (వాకుడు) కాలక్లీతకము (నల్లగురివెంద) వీని మూలములను గొనివచ్చి నూరి స్త్రీ ప్రసవింపబోవు సూతికాగృహము నలుకవలెనని ఆ యింట పిశాచాదులుండవని కౌషీతకి గృ. న కలదు. (ఆ.క. సమీక్ష)

సూతికా గృహమును నిర్మించి, అందు వృషభములను కొంతకాలము నివసింపచేసి, ఆ పిమ్మట నువ్వులు, ఆవాలు కలిపి ధూపమువేసి ఆసన్న ప్రసవమైన గర్భవతిని ప్రవేశపెట్టవలెనని వైఖ.న కలదు". (అ.క. సమీక్ష)

సూతికాగృహము ఇట్లుండవలెనని సుశ్రుతము: బ్రాహ్మణులకైన తెలుపు వర్ణముగల భూప్రదేశము నందు మారేడు మ్రానులచేతను, క్షత్రియులకైన ఎఱుపు వర్ణముగల భూ ప్రదేశమందు మఱ్ఱిమ్రానుల చేతను, వైశ్యులకు పసుపు వర్ణపు ప్రదేశమునందు నల్లతుమికి మ్రానుల చేతను శూద్రు లకైన నలుపు వర్ణముగల ప్రదేశమందు నల్లజీడిమ్రానులచేతను తయారు చేయబడిన మంచములుండవలెను. తూర్పునగాని, దక్షిణమునగాని ద్వారము కలిగి 8 మూరల పొడవు, 4 మూరల వెడల్పు కలిగి తెల్లయావాలు మొ॥ మంత్రోపమంత్రిత ఉదకకుంభములు, మంగళ తోరణాదులు కలిగి యుండ వలెను. వధువు ఆసన్న ప్రసవగానున్నపుడు ఆమెకు సుఖప్రసవార్థమై శోష్యంతీహోమమును భర్త చేయవలెనని గోభిలము.

## శోష్యంతీ హోమము, క్షిప్రప్రసవనము:

ఇది చాల ప్రాచీనమైనదిగా కన్పించును. పదినెలలు మాతృగర్భమున నిద్రించిన శిశువు, ఎట్టి హానిలేకుండ సజీవముగా, సుఖముగా తల్లినుండి బయటకు వచ్చుగాక అనునర్థమిచ్చు మంత్రములను పఠింతురు. బృహదార ణ్యకమున కూడ ఇవి కలవు. స్త్రీ యోని నుద్దేశించి 'ఇది ఇంద్రస్థానము, విశ్రాంతి స్థానము. ఓ ఇంద్రా! దీనిని వదిలి పెట్టి పిండముతో కూడిన

వాడవై రమ్ము' అను మంత్రములు కలవు. "క్రొత్త ? మూకుడుతో ప్రవాహానుగుణముగ నీటిని తెచ్చి, దాని క్రిందుగ తూర్యంతి యనునోషధినుంచి ఆ నీటిని, ప్రసవ పీడ నొందుచున్న స్త్రీ శిరమున నొక మంత్రముతో తాకి పైమంత్రములతో చల్లును. మావి పడనపుడు కూడ పై మంత్రములతో నిట్లే చల్లవలెనని" (ఆప.అ.క. సమీక్ష)

"కష్టప్రసవ మైనచో పాటలగన్నిని గాని, ప్రొద్దుతిరుగుడుచెట్టును గాని నూరి యోనినందుంచునది. మరువమును గాని, కృష్ణసర్పకుబుసమును గాని పొగవేయునది. నాగేటిగడ్డను నూరి హస్త పాదములం దుంచునది. ఇట్లైనచో శీఘ్రప్రసవమగును" అని వైఖ. అ. క. స.

భర్త తలనుండి హృదయమువరకు స్త్రీని నిమిరి (తడిచేతితో) గాలి కదలునటుల, సముద్రము చలించునటుల గర్భపిండము కదలవలెనను అర్థమిచ్చు మంత్రమును పఠించవలెనని కాఠక. గృ.న కలదు. తూర్యంతి ఓషధిని (పెద్దసదాప) పాదముల దగ్గర, శోష్యంతి ఓషధిని (పొత్తిదుంప, అడవినాభి, అగ్నిశిఖ) తలక్రింద పెట్టవలెనని అందే కలదు.

గోభి, ఖాదిర, హిర. లందు ఈ కర్మ సూక్ష్మముగా కలదు. హిర.కు. ఆప.కు తేడాలేదు. ఆప.తో.భార. సమానమైనను కొన్ని మంత్రములను భిన్నముగా ప్రతిపాదించినది. మావి పడుటకై పఠించు అథర్వమంత్రములను ఇంతకు ముందే చెప్పితిని. కారకముపై ఆదిత్యదర్శనుడు, ఇది సంస్కార ములలో గణింపదగినది కాదని అనెను. ఇది దృష్టఫలము నిచ్చుచున్నదని, అదృష్టఫలకములే సంస్కారములని దేవపాలుని భాష్యము.

సుఖప్రసవమునకై మంత్రోపదేశము చరకమునందు కలదు. ఆ సమయమున మిక్కిలి అనుకూలవతి యగు స్త్రీ గర్భిణి చెవిలో నిది చెప్పవలెనని కలదు.

"క్షితిర్జలం వియత్తేజో వాయుర్విష్ణుః (ఇంద్రః) ప్రజాపతిః
సగర్భాం త్వాం సదాపాన్తు వైశాల్యం చ దిశన్తు తే
ప్రసూష్వ త్వమవిక్లిష్టం అవిక్లిష్టా శుభాననే
కార్తికేయద్యుతిం పుత్రం కార్తికేయాభిరక్షితమ్".

అనగా సమస్త దేవతలు ఈమెను రక్షించవలెనని దీప్తిమంతుడగు పుత్రుడు పుట్టవలెనని ఆకాంక్ష వ్యక్తమైనది.

ఎంతసేపటికి పురుడురానిచో, ఆమె భర్తను స్నానము చేయించి శివాలయమునకు పంపి శివున కభిముఖముగానున్న నందిని వెనుకకు త్రిప్పించు ఆచారము కలదు. కొన్ని అరుణమంత్రములు చదివి ఆ మంత్రోదకమునిచ్చు ఆచారముకూడ కలదు.

**సమయము:**

జాతకర్మ బొడ్డుకోయుటకు పూర్వమే జరుగవలెను. "ప్రాజ్ నాభివర్ధ నాత్ పుంసో జాతకర్మ విధీయతే, మంత్రతః ప్రాశనంచాస్య హిరణ్య మధు సర్పిషామ్" (వీ.మి.) కాని కొందరు ఏ కారణము వల్లనైన మృతాశౌచము సంభవించినచో ఈ మైల పూర్తియైన తర్వాత జాతకర్మ చేయవలెననిరి. (స్మృతి సంగ్రహము). పుత్రుడు, పుత్రికలు కలుగుటలో భిన్నభిన్నాశయములు కలవు. ముందు పుత్రుడు కలిగినచో పితౄణమునుండి తండ్రి ముక్తుడగుచున్నాడు. పుత్రిక కలిగిన వెంటనే పుణ్యము లభించకపోయినను వివాహ సమయమున కన్యాదానముచే పుణ్యప్రాప్తికి కారణమగును. తండ్రి అప్పుడే పుట్టిన శిశుముఖమును చూచుటకు భార్య సమీపమునకు వెళ్లును. "తండ్రి సమస్త ఋణములనుండి విముక్తుడై అమృతత్వమును పొందుచున్నాడు." "ఋణమస్మిన్ సన్నయతి అమృతత్వం చ గచ్ఛతి, పితాపుత్రస్య జాతస్య పశ్యేచ్చే జ్జీవతో ముఖమ్." (వ.స్మృ.) పుత్ర ముఖమును చూచిన తర్వాత, సచేలస్నానముచేసి పెద్దలను ఆహ్వానించి, నాందీ శ్రాద్ధము, జాతకర్మ చేయవలెనని బ్రహ్మపురాణోక్తి" ఇందు నాందీ శ్రాద్ధమును చేసినచో పితృదేవతలు సంతోషింతురు. బ్రాహ్మణులను పిల్చి తిలలు, స్వర్ణపాత్రలతో ఈ శ్రాద్ధమును చేయవలెనని హారీతుని వచనము. బ్రహ్మపురాణమునందు కూడ నాంది శ్రాద్ధము కలదు.

"కుమారే జాతే సతి జన్మదివస మారభ్య దశదిన పర్యంతం దశ దినమధ్యే యస్మిన్ కస్మిన్ దివసే తజ్జాత కర్మ పుత్ర విషయే కుర్యాత్"

అను విధి ప్రకారము పుట్టినపుడుగాని, పదిరోజులలో ఏ రోజైనను లేదా పదియవ దినమందైనను ఈ సంస్కారమును చేయువలెను. 'ఏకాదశే ప్రతిష్ఠాప్య జాతకాగ్నిం యథావిధి' యున్నట్లు పదునొకండవ రోజున విధి చేయుచున్నారు.

విధానము:

(మన ప్రాంతపు ఆచారము. ఆ.ప. పద్ధతి--సంస్కారదీపికానుసారము)

సంకల్పము చెప్పిన తరువాత పుట్టిన శిశువును వత్సప్రమహర్షిచే దర్శింప బడిన దివస్పరి అను అనువాకమును తండ్రిచెప్పి ముట్టుకొన వలెను. దాని కర్థమిది -- "అగ్ని ఆకాశమునందు సూర్యునిగా నున్నాడు. యజమాని వలన పుట్టుచున్నాడు. తరువాత బడబాగ్ని రూపకముగా ఉదకములందు ప్రభవమందెను. అట్టి అగ్నిని మనుష్యుడు ప్రజ్వలింపచేసి స్తుతించుచున్నాడు. 'ఓ అగ్ని! పృథ్వి, ఆకాశ, స్వర్గములందు అగ్ని వాయు ఆదిత్యులుగానున్న నీ మూడు రూపముల నెరుగుదును. గార్హపత్య, ఆహవ నీయ దక్షిణాగ్నిరూపములైన నీ స్థానములను గుర్తించితిని. ఆకాశమందు మేఘుడున్నట్లు భూమియం దగ్నియంతటను వ్యాపించి తన దీప్తిచే ప్రకా శించు చున్నాడు. సమస్త జంతువుల గర్భములందు వైశ్వానర రూపముగా నున్న అగ్నిని, అయిదు వర్ణములవారు పూజించిన, పర్వతమునైనను భేదించిరాగలరు. పూర్వము దేవతల ధేనువును రాక్షసులు దొంగిలించగా, బృహస్పతి మొదలగువారు నిన్ను తీసికొని వెళ్లగా, వారికి చీకటియందు మార్గమును చూపించగా వారు గోవును తెచ్చుకొనిరి. వర్షమే రేతస్సుగాగల ఆకాశము, హవిస్సు రూపమైన అన్నముచే ఎప్పుడు పుట్టించినదో అప్పుడే అగ్ని ప్రాణుల యొక్క ఆయుస్సు, సంపత్తి కొరకు నశింపనివాడుగా నున్నాడు."

ఆ పైన అగ్నిన్నాహగ్ంఅను మంత్రమును చెప్పి తన యొడిలో శిశువునుంచుకొనవలెను. అనగా శిశువు, స్వతంత్రముగా జీవించవలెనని యర్థము. 'అంగాదంగాత్..................' అనుమంత్రముచే శిశు శిరస్సును అభిమంత్రణము చేయవలెను. అనగా నా ప్రతి అవయవమునుండి, హృద

యము నుండి పుట్టితివి గాన కుమారుడవై నా స్వరూపమైతివని, రాయివలె స్థిరముగా, గొడ్డలివలె అసాధ్యునిగా, బంగారము వలె ప్రకాశించువానిగా నుండవలెనని కోరుచు, పశువులు ప్రేమతో దూడలనెట్లు వాసన చూచునో అట్లే నిన్ను ఆఘ్రాణించుచున్నానని శిరస్సును మూర్కొనును. ఆ మంత్రములనే కుడి చెవిలో జపించును.

"మేధాంతే......................." అను మంత్రములను చదువుదురు. అనగా సూర్యుడు, సరస్వతి, పద్మమాలికలు ధరించిన అశ్వినీ కుమారులు నీకు మంచి బుద్ధినీయ వలెనని, అగ్ని తెలివి, సంతానము, కాంతిని, ఇంద్రుడు తెలివి, సంతానము ప్రకాశము నిత్తురుగాక" అని చెప్పి తేనెను నేతిని కలిపి బంగారముతో రంగరించిన దానిని పిల్లవానికి ప్రాశనము చేయింపవలెను.

ఆపైన 'క్షేత్రియై.......................' అను మంత్రముల చదివిన వెనుక పిల్లవానికి స్నానము చేయింపవలెను. అనగా వ్యాధి, రాక్షస భయము, ఇతరులు చేయు ద్రోహము, వరుణపాశభయము లేకుండ నుండుగాక. భూమ్యంతరిక్షములు, ఉదక సహితుడైన అగ్ని, ఓషధులుతో కూడిన స్వర్గ భూలోకములు, వాయు సహితమైన అంతరిక్షము, దిక్కులు నీకు శుభమును చేయునుగాక. దిక్కులుందునంతవరకు ఉండుగాక. క్షయ నిన్ను విడిచి పెట్టి నిర్‌ఋతిని పొందుగాక. రాహు గ్రహణము పట్టిన సూర్యుని దేవతలు ప్రాయశ్చిత్తపూర్వకముగా పాప నివృత్తి చేసినట్లు వ్యాధి, సోమరితనము వరుణపాశముల నుండి నిన్ను విడిపించెదను."

తరువాత వ్యాహృతులతో హోమము జరుపవలెను. 'మాతే కుమారగ్ం.............' అనుమంత్రమును చెప్పి తల్లి యొక్క ఒడిలో శిశువు నుంచవలెను. ప్రేమతో ఆవు దూడను కఱచు సమయమున ఇతరులను లక్ష్యపెట్టినట్లు, నీవు పుత్రుని చూచు సమయమున ఇతరులను నిర్లక్ష్యము చేయవద్దని అనును. "అయం కుమారో.........................." మంత్రమును చెప్పి కుడిచన్నును కుడుపవలెను. 'ఓ స్తనమా! నీ క్షీరముల నీతడు పానము చేయుగాక. శిశువు ఆయుర్దాయము కలిగియుండుగాక' అని యర్థము.

'యద్భూమే............' అను మంత్రముతో దుఃఖము లేకుండుగాక అని భూమిని ప్రార్థించి, భూమిని ముట్టుకొనవలెను. ముట్టుకొనినచోట తల్లిచే శిశువును పరుండబెట్టవలెను. అక్కడే ఉదకుంభముంచుదురు. ఆ పైన పిశాచ చండాలాదుల నుండి రక్షణ కొరకు తవుడుతో కూడిన ఆవాలను దోసిట పెట్టుకొని 'అయం కలిం' మొ॥గా గల మంత్రములతో హోమము చేయును. శ్రోత్రియగృహము నుండి అగ్నిని తీసికొని వచ్చి హోమము చేయుదురు. 'కలియను పేరు గల భూతము, శండేరథ, శండికేర, ఉలూఖల, చ్యవన, శండ, మర్క, ఉపవీర, కేశిని, శ్వలోమిని, అజాప, అజోపకాశిని మొ॥ రాక్షసులు నశింతురుగాక. అగ్ని, ఇంద్ర, బృహస్పతులు, పిశాచములను వెడలగొట్టుదురుగాక' అను నర్థమిచ్చు మంత్రములను పఠింతురు. బొడ్డుకోయగనే పురుడు మొదలు అగును. ఇది మన పద్ధతి. మిగిలిన సూత్ర విశేషములను పేర్కొందును.

ఈ సంస్కారమునందు 1) హోమము, 2) వాక్ అని జపించుట, 3) ప్రాశనము, 4) గుహ్యానామమిడుట, 5) స్తన్యప్రదానము, 6) కొన్ని మంత్రములలో తల్లిని సంబోధించుట, 7) ఐదుగురు బ్రాహ్మణులను శ్వాసప్రశ్వాసలకై అర్థించుట 8) ఆయుష్యము, 9) అశ్మాభిమర్శనము 10) దేశాభిమంత్రణము, 11) దుష్టశక్తులను పారద్రోలుట మొ॥నవి ఉండును. ఇందు కొన్నింటిని కొంతమంది సూత్రకారులు పేర్కొనిరి. అన్నింటిని అందరు పేర్కొనలేదు. వీటి క్రమము కూడ భిన్నముగా నున్నది.

1. హోమము: పుట్టిన వెంటనే అని బృహ, ఉప, మాన, కాఠ విధించినవి. ఆశ్వ.గృ. పరిశిష్టము అగ్నికి, ఇతర దేవతలకు హోమము చేయవలె నన్నది. శిశువు ఘృతప్రాశనము చేసిన వెనుక ఆహుతు లీయవలెనని కలదు. శోష్యంతి కర్మ యందేయని గోభిలఖాదిరములు. కర్మాంతముననని బౌధా. ఆశ్వ. సాంఖ్యా. దీని నెత్తుకొన లేదు. పార. హిర. భార.లు ఔపాస నాగ్నికాక సూతికాగ్ని యందే యున్నవి. దీనినే ఉత్థాపనీయ' అందురు. వైఖా. జాతకాగ్ని యన్నది.

2. మేధాజననము: రెండర్థములు కలవు. ఈ మాట బృ. ఉప. నందు లేదు. కాని 'వాక్' అని అనమని చెప్పి ప్రాశనము విధించినది. కుడి చెవిలో కొన్ని మాటలనుటగాని, మంత్రములను జపించుటగాని అనుదానిని మేధా జననమని ఆశ్వ. సాంఖ్య,ముల వలన తెలియుచున్నది. పై రెండు 'వాక్' అనమనెను. వైఖ. హర. గోభిలములు దధి, మధు, ఘృత ప్రాశనము, యవలు, అన్నము ముట్టించుట, నాకించుట, లేదా తినిపించుటను మేధా జననమన్నవి. బౌధా.గృ. దధి, ఘృత, మధువులను పదిసార్లు పది మంత్రములతో (త్రై.బ్రా. II.5-1) ప్రాణోర్రక్షతి' అనెడి అనువాకముతో నాకించవలెనన్నది. వస, ఘృత, మధువులు మేధాకారణములని వైఖా; సువర్ణముతో మధు, ఆజ్యములను ముట్టించుటను మనువు; తేనెను నేతిని ప్రాశనము చేయుటయే ముఖ్యమని సంస్కారమయూఖము. నేను నీ యందు భూః, భువః, సువః, అను వ్యాహృతుల నుంచుచున్నాను' అనియనును. పై వ్యాహృతులు బుద్ధికి ప్రతీకలు. ఇవి మూడు వేదములను, మూడు భువనములను సూచించును. గాయత్రీ మంత్రమున వీని నుచ్చరింతురు. ఇందు బుద్ధిని ప్రేరేపించే ప్రార్థనయుండును. తేనె, నేయి, మొ॥ వానిని శిశువునకు ముట్టించుట ద్వారా మానసిక వికాసమేర్పడును. సుశ్రుతుని అనుసరించి "అది సౌందర్య జనకము, యోషాపస్మారము, శిరోవేదన, జ్వరము, అపస్మారము, గుల్మములను నివారించును. పాచనశక్తి, స్మృతి, బుద్ధి, ప్రజ్ఞ, తేజస్సు, మధురధ్వని, వీర్య ఆరోగ్యవర్ధకము."

కాంస్య పాత్ర యందు గాని, చమస పాత్రయందుగాని, ఆజ్యాహుతిధారలను బట్టి దాని యందు సువర్ణమును అరుగదీసి దానిని వ్యాహృతి చతుష్టయము నుచ్చరించుచు పిల్లవానిచే ప్రాశనము చేయింపుమని వారాహ.గృ. సువర్ణమును ఉదకమందు అరుగదీసి ద్వాదశ వర్షపర్యంతము ప్రాశనము చేయింపవలెనని అందే. (అ.క.స.)

వ్రీహి, యవలను కలిపి నూరి శిశువు నాలుకపై పిండవలెనని గోభిలము.

"బూడిద రంగుగల వృషభమునుండి, బూడిద రంగుగల రోమము లను, ఎట్టిని రోమములను గ్రహించి ప్రాశనయోగ్యముగానూరి దధి మధు మిశ్రద్రవ్యమున కలిపి ప్రాశన చేయింపవలెనని కౌషీతకి.గృ. (అ.క.స.)

సావిత్రి, సరస్వతి, అశ్వినీ కుమారులు మేధను కలిగింతురుగాక అని ఆశ్వ.గృ.

గర్భమునుండి భూమి పై పడెడి సమయమందు మహామోహ మావరించి యుండును. బిడ్డకు గర్భమందున్న స్మృతిలోపించును కనుక అట్టి స్మృతిని తిరిగి ప్రసాదించుటయే దీని ఉద్దేశ్యము. శిశు శరీరమందు కఫముండును, ప్రేగులలో మలముండును. దానివలన శరీర బాధ లుదయించును. అవిపోవుటకు బంగారముతో కూడిన తేనెను నాకింతురు.

3. ఆయుష్యము: నాభిపైన గాని (పార) లేదా శిశువు చెవిలో గాని దీర్ఘ జీవన సూచకములైన మంత్రముల నుచ్చరించుట. (ఆశ్వ.); భార. అట్లే కలదు. మానవ. లో అగ్నే ఆయురసి' (కాఠక సం) అనెడి అనువాకముతో 21 ఆహుతుల వేల్చుట. 'ఆయుష్మత్' అను పదము ఇందు చాలసార్లు వచ్చును. ఆజ్య భాగశేషములో దధి, మధు, జలములను కలిపి బంగారముతో రంగరించి మూడుసార్లు పిల్లవానికి పట్టించుటను మానవ. గృ. చెప్పినది. "అగ్ని, సోముదు, బ్రహ్మ, ఋషి, యజ్ఞము, సముద్రములు (పా.ర.గృ.) వృక్ష, వనస్పతి, అమృతము, యజ్ఞాగ్ని, నదుల ద్వారా దీర్ఘ జీవనులగు చున్నారు. అట్టిది నీ కగుగాక."

4. అశ్మాభిమర్శనము: ఆప. యందు తండ్రి 'వాతప్వరి' అను వాకముతో కుమారుని స్పృశించునని, పార. బార. లందు ఒకమారు స్పృశించునని కలదు. లేక రాయివికమ్ము, గొడ్డలివి కమ్ము (అని పార) 'అతడు వృద్ధి పొందు గాక (భార.) అను మంత్రములతో ఒకమారు స్పృశించునని కలదు. సాంఖ్య దీనిని విడిచిపెట్టినది. ఇందు తండ్రి, శిశువునకు దార్ఢ్యము, శుద్ధ జీవనము, వీరత్వమునకై ప్రార్థించును.

5. మాత్రాభిమంత్రణము: (తల్లిని సంబోధించుట.) సమస్తాశలకు కేంద్ర భూతమైన పుత్రుని కనినందులకు భార్యను, భర్త ఈ విధముగా స్తుతించును. 'నీవు ఇడవు. మైత్రావరుణివి. వీరమాతవై వీరపుత్రు నొసంగితివి. నీవు వీరవతివగుము. 'ఇడాఽసి మైత్రావరుణీ వీరే వీరమజీజనయః సా త్వం వీరవతీ భవ యాఽస్మాన్ వీరవతీఽకరదితి." (పార.) చాల సూత్రములు దీనిని విడిచి పెట్టినవి.

6. పంచబ్రాహ్మణ స్థాపనము: ఐదుగురు బ్రాహ్మణుల నైదు దిక్కులందు తండ్రి కూర్చుండబెట్టి శిశువునకు శ్వాసప్రాశ్వాసలు జరుగు నిమిత్తమై ప్రార్థించును. నల్గురు బ్రాహ్మణులు నాలుగు దిక్కుల కూర్చుని శ్వాస, ప్రతిశ్వాస, నిశ్వాస, బహిఃశ్వాస అనగా మరియొకడు పైకి చూచుచు ఉచ్ఛ్వాస అనును. వారు లభించనిచో తండ్రియే చుట్టు తిరుగుచు పై విధముగా నుచ్చరించును. (హిర.గృ.) శ్వాసము జీవన హేతువు గనుక ఆ శ్వాస సబలమైనచో దీర్ఘ జీవనమగునను ఉద్దేశముతో ఈ విధానమేర్పడినది. నాభిచ్ఛేదము కాకమునుపే ఇట్లు చేయవలెనని శత.బ్రా.న కలదు. ప్రాణాపాన వ్యానోదాన సమానములు సరిగానుండవలెనను ఉద్దేశ్యముతో పంచ బ్రాహ్మణ స్థాపన చేయునట్లు సాంఖ్య. వలన తెలియుచున్నది. దీనిని చాల సూత్రములు పేర్కొన లేదు.

7. స్తన్య ప్రదానము: మేధా జననమైన వెనుకనిది చేయవలెనని గోభిలము. 'నాభిచ్ఛేదనమును చేయుడు. స్తన్యమిమ్ము' అని తండ్రి యనును. 'జీవనము, దీర్ఘజీవనము, సత్యము, బలము, భాగ్యము, జ్ఞానములను త్రాగుము' అను నర్థమిచ్చు మంత్రములతో ఇది జరుగవలెనని కాఠకము హిర.గృ.న భర్త ఆమె కుడిస్తనమును కడిగి పైవానికై ప్రార్థించును. అట్లే ఎడమవైపుకూడ చేయును.

8. దేశాభిమర్శనము: శిశువు పుట్టిన చోటును ముట్టుకొని భూమిని సంబోధించుట పార. భార. ఆప. హిర. పేర్కొన్నవి. భూమి సమస్త జీవులకు జన్మకారణము కనుక కృతజ్ఞతా పూర్వకముగా తండ్రి ధన్యవాదము లర్పించును. 'ఓ పృథ్వీ! నేను నీ హృదయము నెరుగుచున్నాను. వంద శరత్తులను చూచుదుముగాక' (పార.)

9. నామకరణము: గోభి.న శిశువు యొక్క చెవియందు 'నీవు వేదము' అను వాక్యముచ్చరించి ఒకనామ మిడవలెను. అది గుహ్యా నామము. అది కేవలము తండ్రి, తల్లి కే తెలియును. అది వెల్లడించినచో శత్రువులు 'చేతబడులు' ఇత్యాదులు చేసి శిశువును మట్టు పెట్టుదురను శంకయే కారణము కావచ్చును. బృహ, ఉప, ఆశ్వ, సాంఖ్య, గోభి, ఖాది మొ॥ పుట్టినపుడే నామమిడుటను చెప్పగా ఆశ్వ. రెండు పేర్లు ఆ రోజుననే యని ఒకటి వ్యవహారనామము, రెండు గుహ్యా నామమని చెప్పినది. సాంఖ్య, గుహ్యా నామ మానాడు, వ్యవహార నామము 10వ రోజున; ఆప. పుట్టిన రోజున నక్షత్రనామము (అదే రహస్య నామము కూడ) పదియవ రోజున వ్యవహారమని; గోభి, ఖాది లందు శోష్యంతి కర్మయందే గుహ్యా నామమని చెప్పినవి.

నామము నాల్గక్షరములు కలిగియుండ వలెనని అందు మొదట ఘోషప్రయత్నముగల వర్ణము, మధ్య అన్త స్థవర్ణ ముండవలెనని లేదా దేవతా ప్రసాద సూచకమైన నామ ముండవచ్చునని లౌగాక్షి సూ.

పేరు మొదటిలో క,ఖ,చ,ఛ,ట,ఠ,త,థ,ప,ఫ వర్ణ ముండవలెనని కృత్ప్రత్యయాంతముగా నుండవలెనేకాని తద్ధితాంతము పనికిరాదని, ఆ పేరు తల్లిదండ్రులకే తెలిసినను వారుచ్చరింపరాదని కౌషీతకి. పితృపితామహ, ప్రపితామహ నామము లుంచవలెనని కొంద రనుచున్నారని అందే కలదు.

10. దుష్టశక్తులను పారద్రోలుట: "తండ్రి ఒక జలపూర్ణమైన పాత్రను తల్లియొక్క శిరస్సు సమీపముననుంచి దేవతలను వెనుక నేవిధముగా పర్యవేక్షించుచున్నావో అట్లే ఈ గృహము నుండి తల్లి పిల్లను చూడుమని ప్రార్థించును. జలము భూతప్రేత నివారకము గనుక అట్లు ప్రార్థింపబడినది. ద్వార సమీపమున అగ్నికూడ నుండును. తండ్రి ప్రాతః సాయం సమయములందు ఆ అగ్నియందు ధాన్యమును, ఆవాలను భూతప్రేత నివారణార్థమై ఆహుతులనిచ్చును. ఆ సమయమున అలిఖిత, అనిమిష, కింవదంత, ఉపశ్రుతి, హర్యక్ష, కుంభినశత్రు, పాత్రపాణి, నృమణి, హంత్రుముఖ, సర్షపారుణ చ్యవనాదులు దూరముగా తొలగిపోదురుగాక

(స్వాహా)" (పార) అని అనును. పై చెప్పిన నామములు రోగములకు ప్రతినిధులు. అవి శిశువు నాక్రమించుటకు ప్రయత్నించును. 'కఠోర దృష్టులను ప్రసరింపకుడు' అని అంతిమ ప్రార్థనచేయును (పార).

ఆశ్వ. సాంఖ్యలు దీనిని పేర్కొనలేదు. చాల సూత్రములు పేర్కొన్నవి.

బౌధ, ఆప, హిర, వైఖా, పిల్లవానికి స్నానమును చెప్పినవి. పార, ఆప, హిర, భార, వైఖాలందు ఉదక పాత్రము మాతా శిశువుల దగ్గర నుంచుటను పేర్కొన్నవి. 'ఓ జలములారా! జనులు నిద్రించునపుడు మేల్కొని యుండుడు'

వైఖా. తప్ప ఇంకనేదియు ఖగోళ విషయములను గూర్చి చెప్పలేదు. శిశునాసాగ్రము కనుపడగా గ్రహస్థితిని పరిశీలించి, శిశువు యొక్క భావి స్థితి నూహించుట దానియందే కలదు. ఆప, బౌధలందు దధి ఘృత మధుప్రాశనమైన వెనుక మిగిలినది గోష్ఠమున పోయవలెనని కలదు.

స్మృతి చంద్రిక హారీతుని, శంఖుని, జైమినిని ఉదాహరించుచు నాభి చ్ఛేదమగువరకు ఆశౌచము లేదని అంతవరకు సంస్కారము చేయవచ్చు నని, దానాదులు నిర్వర్తింపవచ్చునని, గ్రహింపవచ్చునని వ్రాసినది. ఇదే సంవర్తాది స్మృతి కర్తల నుదాహరించుచు, జాతకర్మ ముందుగా తండ్రి స్నానము చేయవలెనన్నది. కాని గృ.సూ. లందు లేదు. మనువు మాత్రము చెప్పెను. అదే ప్రచేతసుని, వ్యాసుని పేర్కొనుచు జాతకర్మలో నాందీ శ్రాద్ధమును పేర్కొనెను. ఇందు వండిన అన్నమును బ్రాహ్మణులు తినరు. దానికి బదులు డబ్బునుగాని, ధాన్యమునుగాని తీసికొందురు. అర్వాచీనము లగు ధర్మసింధు మొ॥ గ్రంథములు స్వస్తివాచనము, పుణ్యాహవాచనము, మాతృకా పూజనమును చెప్పినవి.

నిబంధనకారులు, శాంతికర్మలను చాల పేర్కొనిరి. సంస్కార రత్నమాల, సంస్కార ప్రకాశలో చాల కలవు. కృష్ణచతుర్దశి, అమా వాస్య తిథులందు, ఆశ్లేష, జ్యేష్ఠ నక్షత్రములందు, వ్యతీపాత, వైధృతి, సంక్రాంతులందు శిశువు పుట్టిన రోజున శాంతులుండును.

సంస్కార సమాప్తియైన వెనుక వేదవేత్తలకు దక్షిణ లీయవలెను. బ్రహ్మ, ఆదిత్య పూరాణములందు 'పుత్రుడు జన్మించిన వెనుక సంస్కారమును చూచుటకు దేవతలు, పితరులు వత్తురు. కనుక ఆ దినము శుభావహమైనది. ఆ రోజున స్వర్ణము, భూమి, గోవు, అశ్వము, ఛత్రము, అజము, మాల, శయ్యాసనాదులు దాన మొసంగవలెను. (వీ.మి.) వ్యాసు ననుసరించి 'పుత్రుడు జన్మించిన రాత్రి ఇచ్చిన దానములు అక్షయ పుణ్యమును కల్గించును' "పుత్ర జన్మని యాత్రాయాం శర్వ ర్యాం దత్త మక్షయమ్."

పుట్టిన 5,6 రోజులలో కొన్ని సంస్కార సంబంధమైన క్రియాకలాపములు చేయుట కలదు. నిర్ణయసింధు మొ॥ గ్రంథములు వీనిని పేర్కొన్నవి. ఆ రోజులలో తండ్రి, లేక బంధువు రాత్రియందు స్నానము చేసి గణేశుని ఆవాహనముచేసి, అట్లే కొన్ని పిడికిళ్ల బియ్యము పై షష్ఠీదేవిని, భగవతిని (దుర్గను) ఆవాహనముచేసి షోడశోపచారములచే పూజింతురు. తాంబూల దక్షిణాదులను బ్రాహ్మణులకిచ్చి ఆ రాత్రి యంతయు దుష్టశక్తులు పోవుటకై పాటలను పాడుచు మేల్కొని యుందురు. ఆయుధపాణులై మేల్కొనవలెనని మార్కండేయము. కొన్ని అశుభ ముహూర్తములలో పుట్టిన శిశువును 8వ సంవత్సరము వరకు చూడరాదని కొన్ని గ్రంథములు చెప్పినవి. (నిత్యాచార పద్ధతి)

పుట్టిన ఆరవరోజున మిక్కిలి రక్షింపవలెనని, జన్మద మొ॥ దేవతలకు బలి నీయవలెనని, రాక, అనుమతి, సినీవాలి, కుహు, వాతఘ్నులు బాలుని రక్షించును కనుక వారిని పూజింపవలెనని, గోడయందు వ్రాయబడిన షష్ఠీదేవికి మినుప పులగము మొ॥ వానిచే బలి యీయవలెనని విపులముగా షష్ఠీ పూజ శూద్రకమలాకరమున వర్ణింపబడినది.

"వేదు బీర, చంద్ర, రేగు, కొండగోగు, చిట్టీత ఈ చెట్ల మండలను సూతికాగృహమునకు నలుప్రక్కల నుంచవలెను. ఆవాలు, అగసి విత్తులు, బియ్యము వీని కణములను పురిటింటికి చుట్టును చల్లవలెను. పది రోజులు బియ్యముచే బలిహోమము చేయవలెను. ద్వారదేశమున కొయ్యగడపకు

చేరువగ రోకలిని ద్వారమున కడ్డముగ నుంచవలెను. వస, చెంగల్వకోష్టు, కచోరములు, ఇంగువ, ఆవాలు, అగసివిత్తులు, ఉల్లిపాయలు, బియ్యపునూక, గోధుమనూక, వీనిని పొట్లముగ మూటకట్టి పురుటింటి ద్వారబంధము పై వైపునున్న లక్ష్మి పట్టెకు వ్రేలాడ కట్టవలయును. మరియు నీ పొట్లమును బాలింతరాలి కంఠమునందును శిశువు కంఠమునందును, భోజన పాత్రములు, జలపాత్రములు మంచమువీనికి కట్టవలెను. ద్వారమున కిరువంకల యందును కూడ కట్ట వలెను. అథర్వవేదము తెలిసిన బ్రాహ్మణుడు రెండు కాలములందును శాంతిహోమము చేయుచుండవలెను" అను రక్షవిధానము చరకమునందు కలదు.

ప్రతిదినము ఎన్నెమ్మ పాటపాడుట, గుమ్మమునకు రెండు మేకులు కొట్టి ఒకదానికి పాతచెప్పును, రెండవదానికి భూతులసి మొక్కను వ్రేళ్లాడ దీయుట, వెలివిడి కచిక మీద ఆముదముపోసి దీపము వెలిగించుట, మొ॥ స్థానికాచారములు పెక్కుగలవు. చాలవానిని నేడాచరించుట లేదు.

సూతికా స్నానము: రిక్త తిథియందు తప్ప శుభనక్షత్రములలో పగటి యందు స్నానమును జ్యోతిషగ్రంథములు విధించినవి.

ఉత్థానము: వైఖ.లో 10వ గాని 12వ రోజునగాని తండ్రి ఆయుష్కర్మ చేయించుకొని స్నానము చేసి ఇంటిని శుభ్రము చేయించి జాతకాగ్నియందు (లౌకికాగ్నియని కొందరు) ఒక హోమము భూమి శుద్ధినిమిత్తమై భిన్న గోత్రజునిచే చేయించును. దాతకు, వరుణునకు ఆహుతులర్పించును. బ్రాహ్మణ భోజనముతో సమాప్తి. ఇది సాంఖ్యా యందు విపులముగ వర్ణింపబడినది.

* * *

# నిష్క్రమణము

నిష్క్రమణము లేక విధివిధానపూర్వకముగ శిశువును ఇంటి నుండి బయటకు తీసికొనివచ్చుట అను ఆచారము చాలప్రాచీనమైనది. కాని వైదిక సాహిత్యమున దీనికి విపులమైన ప్రస్తావన లేదు. కారణ మేమనగ ఇది సాధారణమైన సంస్కారము.

**సమయము:**

ఈ సంస్కారము శిశువు పుట్టిన పండ్రెండవ రోజునుండి నాల్గవ మాసము వరకు చేయించవచ్చునను భిన్న సంప్రదాయములు కలవు. భవిష్య పురాణము, బృహస్పతి స్మృతిప్రకారము పండ్రెండవరోజుననే చేయవలెను. (వీ.మి.) అనగా నామకరణమైన వెంటనే సూతికా గృహమునుండి శిశువును తీసికొనివచ్చి సూర్యదర్శనము చేయించుట. కాని గృహ్య సూత్రములు, పెక్కు స్మృతుల ననుసరించి మూడవ మాసమునగాని నాల్గవ మాసమున గాని చేయవలెను. ఖాదిర, బౌధ, మానవ కాఠకములు నాల్గవమాసమును విధించినవి. కాని కాఠకముపై బ్రాహ్మణ బలుడను వ్యాఖ్యాత 3వ మాస మున సూర్యదర్శనమని, నాల్గవమాసమున చంద్ర దర్శనమని వ్రాసెను. "నిష్క్రమణాన్నప్రాశన విధిమాచార్యో ఆహ. శ్రోత్రియాస్తు పారం పర్యేణ పఠంతి. తృతీయేమాసి కర్తవ్యం శిశోః సూర్యస్య దర్శనమ్. చతుర్థేమాసి కర్తవ్యం తథా చంద్రదర్శనమ్". 12న గాని 4వ మాసమునగాని చేయవచ్చు నని పురాణ మనుచున్నదని అపరార్కుడు వ్రాసినాడు. బ్రాహ్మణబలుడు చెప్పినట్లుగానే యమస్మృతియందు కలదు. పై మాసములలో ఏకార ణముచే నైనను ఈ సంస్కారము చేయుట కుదరనపుడు అన్నప్రాశనము తరువాత చేయవలెనని ఆశ్వలాయనుడు (వీ.మి.)

**సంస్కర్త:**

గృ. సూత్రముల ననుసరించి తల్లిదండ్రులు దీనిని చేయుటకు అర్హులు. కాని పురాణములు, జ్యోతిష గ్రంథము లించుక భేదాభిప్రాయములను ప్రకటించుచున్నవి. ముహూర్తసంగ్రహము ననుసరించి మేనమామ దీని కర్హుడని తెలుచున్నది.

"ఉపనిష్క్రమణే శాస్త్ర మాతులోవాహయే చ్ఛిశుమ్." (వీ.మి.) సోదరి శిశువుపట్ల మేనమామ పూర్ణస్నేహభావము కలిగి యుండునని సూచించుటకై యుండును. విష్ణుధర్మోత్తరము ననుసరించి దాదిచే ఈ పని చేయించవలెనని తెలియుచున్నది. "తతస్త్వలంకృతా ధాత్రీ బాలమాదాయ పూజితమ్, బహిర్నిష్కాసయేత్ గేహాత్ శంఖపుణ్యాహ నిస్స్వనైః" కాని ఇది కేవలము ధనికుల ఇండ్లలోనే వీలగును గాని సర్వసాధారణముగ సామాన్యుల ఇండ్లలో వీలుపడదుగదా!

విధానము:

సూత్రములను బట్టి తండ్రి ద్వారా సూర్యదర్శనము చేయించుటలో ఈ సంస్కారము పూర్తియైనట్లే. అర్వాచీన గ్రంథములం దీ విధి విస్తృతము చేయబడినది. ఉదా: విష్ణుధర్మోత్తరము. సూర్యరశ్మి పడు ప్రాంగణమందు గోమయముచే అలికి స్వస్తికముద్ర వేసి దానిపై ధాన్యమును చల్లవలెను. కులదేవతల సమక్షమున వాద్య సంగీతము వెనుక దేవతా పూజనము చేయవలెను. అష్టదిక్పాలకులను, సూర్య చంద్ర వాసుదేవులను, ఆకాశ మును స్తుతించుట, బ్రాహ్మణ భోజనము, శుభ సూచకమైన శ్లోకముల ఉచ్చారణము, శంఖధ్వని, వైదికమంత్రోచ్చారణ జరుగుచుండగా శిశువును తండ్రి బయటకు తీసికొనివచ్చి శకుంత సూక్తము (స్వస్తినః శకునే అస్తు - ప్రతినస్సుమనాభవ. వివాహాది శుభకార్యములలో బయలుదేరుముందు కూడ దీనిని పఠింతురు.) లేక ఈ దిగువన నున్న శ్లోకమును పఠించును. దాని భావము: "ఈ శిశువు ప్రమత్తుడైనను అప్రమత్తుడైనను, దినమై నను రాత్రియైనను ఇంద్ర పురోగాములైన దేవతలు వీనిని రక్షింతురుగాక." "అప్రమత్తం ప్రమత్తంవా దివారాత్రావథాపివా రక్షంతు సతతం సర్వే దేవాః శక్రపురోగమాః" (వి.ధర్మ.) అనంతరము శిశువునిడికొని దేవాలయము నకు వెడలి స్వామిని షోడశోపచారములతో పూజించి ఇంటికి తీసికొని వచ్చి మేనమామ ఒడిలో కూర్చుండపెట్టవలెను. ఆపైన కానుకలిచ్చుట, ఆశీర్వచనము జరుగును.

బృహస్పతి ప్రకారము అలంకృత శిశువును వాహనముపై నుంచిగాని, మేనమామ ద్వారాగాని బయటకు తీసికొని రావలెను. వాద్యధ్వనితో బంధువులు, మిత్రులు వెంటనుందురు. గోమయముచే అలికిన పవిత్ర స్థానముపై ధాన్యము చల్లుదురు. రక్షావిధియైన వెనుక "త్ర్యంబకం యజామహే" ఆదిగాగల మృత సంజీవన మంత్రముల జపమును తండ్రి చేయును. అంతమున శివుని, గణేశుని పూజించవలెను. బాలకులకు తినుబండారములను పంచి పెట్టవలెను. ఈ సంస్కారము వలన శిశువు యొక్క లేతమనస్సు పై సృష్టి యొక్క గొప్పదనము ముద్రగా పడునని యూహింపవచ్చును.

బౌధ. దీనిని ఉపనిష్క్రమణమన్నది. మానవమునందు నాల్గవ నెలలో స్థాలీపాకము సిద్ధము చేసి సూర్యునకు ఆహుతి నొసంగవలెను. సూర్యుని మైత్రా. సంహిత. (1,3,37) మంత్రముచే ఆరాధించిన వెనుక మరియొక మంత్రముతో తండ్రి సూర్యుని చూపించును. బ్రాహ్మణ భోజనము, వృషభమును దక్షిణగా నిచ్చుటతో సమాప్తి. పై మంత్రములకు వివరణ: ప్రకాశించుచున్న స్వార్యుడు తూర్పున ఉదయించుచున్నాడను అర్థముగల మంత్రములతో సూర్యున కాహుతులిచ్చును. పిల్లవానిని చూపుచు అభివాదనమునీకు! ఓ సూర్యభగవానుడా! పెక్కు కిరణములు కలిగి చీకటిని పోగొట్టువాడా! నా దురదృష్టమును పోగొట్టి ఆశీస్సుల నొసంగుము." అను మంత్రములను గానము చేయును.

బౌధ, 8 ఆహుతులతో ఒక హోమమును పేర్కొన్నది. గోభిల, ఖాదిరములు చంద్రదర్శనమునే పేర్కొన్నవిగాని సూర్యదర్శనమును పేర్కొనలేదు. ఆశ్వలాయనము అభ్యుదయిక శ్రాద్ధమును పేర్కొన్నది. ఆ వెనుక 'స్వస్తి నో మి మీతామ్" అను సూక్త పఠనము చేయుచు మామగారి ఇంటి ఆవరణయందు సూర్యదర్శనము చేయవలెనని కలదు.

పై చెప్పిన విష్ణుధర్మోత్తర రీతిలోను, శూద్రకమలాకరము చెప్పిన రీతిగ శూద్రులుకూడ పాటింప తగును.

* * *

## చంద్రోపస్థానము -- చంద్రదర్శనము

### ఉపవేశనము

శిశువుకు సూర్యదర్శనము వలె చంద్రుని చూపించవలెనని, కొన్ని మంత్రములు భేదముగా నుండునని లౌగాక్షి చెప్పుచున్నది.

తండ్రి పశ్చిమముగా తిరిగి నమస్కరించుచుండగా, భార్య దక్షిణ భాగమునకు వచ్చి కుమారుని వెల్లకిల త్రిప్పి ఉత్తరపువైపు శిరస్సు కలవానిగా చేసి భర్తకు కుమారునీయువలెను. తరువాత ఆమె వెనుకగా వచ్చి ఉత్తరపు వైపున నిలబడియుండగా కొన్ని మంత్రములను చదివి పిల్లవానిని తల్లి కిచ్చి వామదేవ్య గానాంతముగా ఈ కర్మను పూర్తి చేయునని, ప్రతి శుక్లపక్షపు నెలపాడపు రోజున ఉదకాంజలితో చంద్రుని పూజింపవలెనని, ఇట్లు ఒక సంవత్సర పర్యంతము చేయవలెనని గోభిలము (అ.క.స.)

ప్రవాసాగమనము:

దీనిని పెక్కు గృహ్యకారులు పేర్కొనిరి. పరదేశము నుండి వచ్చి నపుడు తండ్రి కుమారుని శిరమును మూర్కొనును. కుడి చెవిలో 'అగ్నిరాయుష్మా' నిత్యాది మంత్రములు జపించును. కన్యనట్లే 'సర్వ స్మా దాత్మన' యను మంత్రముతో నభిమంత్రించును. ఆప. లో కలదు. కుమారుని శిరమును తన పాణిద్వయముచే గ్రహించి 'అంగాదాంగాత్' అను మంత్రమును జపించవలెను. లేక ఉపనీతుడైనపుడు కూడ నిట్లే జపించవలెనని కలదు. స్త్రీ కి అమంత్రకమని గోభిలము. పై మంత్రముల కర్థము: "నా ప్రతి అవయవము నుండి నీవు పుట్టుచున్నావు. నా హృదయమునుండి పుట్టుచున్నావు. నీవు నా ఆత్మవే. నూరు శరత్తులు జీవింతువుగాక." భా.ర. ఆప.లు కుమార్తె పట్ల కూడ ఈ మంత్రమును విధించినవి. 'నీవు నా ప్రాణములనుండి పుట్టితివి. నూరు వత్సరములు జీవింతువుగాక."

## ఉపవేశనము -- శిశువును భూమిపై కూర్చుండబెట్టుట:

శూద్రకమలాకరమున నిట్లు కలదు. ప్రయోగ పారిజాతమందు పాద్మ వచనమును బట్టి 5వ మాసమందు శిశువును భూమియందు కూర్చుండ పెట్టవలెను. గ్రహములు శుభస్థానమం దున్నపుడు, అందున అంగారకుడు మిక్కిలి శుభముగా నున్నపుడు చేయువలెనని కలదు. విష్ణుధర్మోత్తరము ననుసరించి అపుడు వరాహమూర్తిని, భూమిని, వేదవేత్తను పూజించవలెనట. తండ్రి సంకల్పించి ఆయురారోగ్యముల నిమిత్తమై గణేశ పూజ, పుణ్యాహ వాచనము చేసి పీఠమందుగాని, ప్రతిమయందుగాని వరాహమూర్తిని, భూమిని నామమంత్రముచే షోడశోపచారములచే పూజించి వారియెదుట 5, లేదా 7 ధాన్యపు ప్రోవులను బోసి వాని మధ్య ఆశీర్వచనము లచే కరోతు స్వస్తి తే బ్రహ్మ' అని శిశువును కూర్చుండపెట్టవలెను. మృత్యుం జయుని స్మరించి భస్మచే రక్షపెట్టి "రక్షైనం వసుధాదేవి" మొ॥ శ్లోకములను పఠించవలెను. అనగా ఓ భూదేవి! వీనిని సర్వదా రక్షించుము. కామధేనువు వలె పోషించు తల్లివి నీవు. జరాది వికారములు లేని నిత్యురాలవు. దుష్టభూతములను శీఘ్రముగ దహింపుము. బ్రహ్మ దాని నంగీకరించునుగాక!" యని ఒక సూత్రమును బాలకునికి కట్టవలెను. శిష్టులు అన్నప్రాశన దినమందే నిష్క్రమణ ఉపవేశనములు చేయుచున్నారని శూ. కమలాకరమున గలదు.

ఇట్లే చిన్న చిన్న సంస్కారముల వలన కూడ పిల్లవానికి సమస్త మంగళములు కలుగవలెనను తల్లిదండ్రుల ఆకాంక్ష వ్యక్తమగుచున్నది.

* * *

# నామకరణము

"నామాఖిలస్య వ్యవహారహేతుః శుభావహం కర్మ సుభాగ్యహేతుః
నామ్నైవ కీర్తిం లభతే మనుష్యస్తతః ప్రశస్తం ఖలు నామ కర్మ."
-- బృహస్పతి (వీ.మి.)

అనగా వ్యవహారహేతువు, శుభావహమైనది, కీర్తికారకము అగు నామకర్మ ప్రశస్తమైనది.

ప్రయోజనము:

"ఆయుర్వర్చోభివృద్ధిశ్చ సిద్ధిర్వ్యవహృతే స్తథా
నామకర్మ ఫలంత్వే తత్ సముద్దిష్టం మనీషిభిః"

అనుటచే ఆయుస్సు, వర్చస్సు, వ్యవహారసిద్ధి కలుగు నిమిత్తమై ఈ సంస్కారమును చేయుదురు.

వైదిక సాహిత్యమున దీని ప్రస్తావన:

"శ్రుతి యందు దీనికి గొప్ప మహత్త్వ మంగీకరింపబడినది. భూతపతి యగు సంవత్సర ప్రజాపతి యుషయందు రేతస్సేకము గావించెను. ఒక సంవత్సరము తరువాత కుమార (అగ్ని) రూపమున పరిణతి పొందెను. పుట్టగానే కుమారు డేడ్చెను. ఏలయని ప్రజాపతి యడుగగా 'నా కింతవరకు పేరు పెట్టక పోతివి. దోషయుక్తుడనై యున్నాను. కనుక నామకరణము గావింపుము' అనుటయు ప్రజాపతి తత్త ద్గుణకర్మానుసారముగ రుద్ర, శర్వ, పశుపతి, ఉగ్ర, అశని, భవ, మహాదేవ, ఈశాన అని ఎనిమిది పేర్లు పెట్టెను. స్వయముగ కుమార నామముండనే యున్నది కదా. "తాన్యేతాన్యష్టా వగ్ని రూపాణి....... .......సై షాగ్నేః త్రివృత్తా" అనునట్లు అగ్నికి ఎనిమిది రూపములు. పౌరాణిక శివాష్ట మూర్తులవే. పిమ్మట శ్రుతి ఇట్లనుచున్నది. "తస్మా త్పుత్రస్య జాతస్య నామ కుర్యాత్, పాప్మానమేవాస్య తదపహన్తి, అపి ద్వితీయం తృతీయం, అభిపూర్వమేవాస్య తత్పాప్మాన మప హన్తి" (శత.) కనుకనే నామకరణము చేయవలెనని శాసించినది. (వర్ణ సంస్కార విజ్ఞానమునుండి) అనగా కొడుకు పుట్టిన వెంటనే నామమిడుట

వలన శిశువు నావహించిన పాపము పోవుచున్నది. తండ్రి రెండవ పేరును గాని మూడవ పేరునుగాని పెట్టవచ్చును."

పతంజలి భాష్యమున, లోకమున తల్లిదండ్రులు తమ గృహమున యజ్ఞదత్త, దేవదత్త మొ॥ పేర్లు పెట్టుదురు. అట్లు పెట్టుటచే ఇతరులు కూడ ఇది ఇతని నామమని తెలిసికొందురని వ్రాసెను.

నామము వ్యవహారములోనే కాక వైదిక కర్మలందు కూడ పుత్రుని నామము యొక్క అవసరమున్నది. ఆధానము చేసిన వ్యక్తి ప్రతి ఇష్టుల యందును కుమారుల నామ ముచ్చరించవలసిన అవసరమున్నది. దీని వలన ఆ సంతానమునకు బ్రహ్మవర్చస్సు మొ॥నవి ప్రాప్తించునని ఇది జ్యోతిష్మతీ ఆశీస్సని పెద్దలందురు.

సమయము:

పుట్టిన పది రోజులు దాటిన తర్వాత నామ మిడుచున్నారని మహా భాష్యము. యాజ్ఞ. 11వ రోజున, హిర.గృ.న 12వ రోజున, ఖాదిరమున పుట్టిన పది రాత్రులు దాటిన తరువాతగాని, నూరురాత్రులు, సంవత్సర మునగాని ఏ రోజైనను చేయవచ్చును అని చెప్పబడినది. "జననాదూర్ధ్వం దశరాత్రాచ్ఛతరాత్రా త్సంవత్సరాద్వా నామ కుర్యాత్" అపరార్కుడు గృహ్య పరిశిష్టమును పేర్కొనెను. "జననా ద్దశరాత్రే వ్యుష్టే శతరాత్రే సంవత్సరే వా నామధేయ కరణమ్" లఘు. ఆశ్వ. న 11,12,16న గాని అని యున్నది. బాణుడు కాదంబరియందు తారాపీడుడు తనకొడుకగు చంద్రాపీడునికి పుట్టిన పదియవరోజున నామకరణము చేసెనని, మంత్రి యగు శుకనాసుడు తన కొడుకగు వైశంపాయనునకు ఆ మరునాడు చేసెనని కలదు. ఈ భేదమును వ్యాఖ్యానకర్తలు గుర్తించిరి. మనువు పై విశ్వరూపుడు, పదియవరాత్రి గడువగా అని వ్రాసెను. కుల్లూకభట్టు దాని నామోదించెను. మేధాతిథి ఒప్పుకొనలేదు. జాతాశౌచము సంభవించినపుడే జాతకర్మ జరుగుచున్నది గనుక నామకరణము కూడ 10వ రోజుననే జరుపవచ్చునని వ్రాసెను. నామకరణమునకు వైకల్పికము గలదని ఎవరి

సూత్రానుసారముగ వా రాచరింపవచ్చునని అపరార్కుడు. కనోజ్ రాజైన జయచంద్రుడు హరిశ్చంద్రుడు తన కొడుకు పుట్టిన మూడువారముల తర్వాత నామకరణము చేసినట్లు చరిత్ర.

## వైదిక సాహిత్యము:

ఋగ్వేదమునందు పురుషుడు నాల్గవ నామమును కూడ ధరింపవచ్చునని యు ఇది యజ్ఞమును చేసిన వానికేయని తెలియుచున్నది. "తురీయం నామ యజ్ఞియం" అగ్నిష్టోమయాజి యను నామము అగ్నిష్టోమము చేసిన తరువాత ధరించుచున్నటుల మహాభాష్యమునకలదు. ఋఙ్మంత్రముపై విద్యారణ్యులు వ్యాఖ్యానము చేయుచు నాలుగు నామములను పేర్కొనిరి. 1. నక్షత్రనామము, 2. గుహ్యానామము, 3. వ్యవహారనామము 4. సోమయాజి మొ॥ ఇక్కడ నామమను మాటకు శరీరమని లేక కృత్యమని వ్రాసిరి. మూడవ నామము తల్లిదండ్రులకు కూడ తెలియనిది స్వర్లోకమున ముందు నామము కుమారున కుండునని ఋగ్వేదమున కలదు. (IX 75-2). ఒకటి నక్షత్ర నామము, రెండు వ్యవహారనామము, 3. తల్లి దండ్రులకు కూడ తెలియనిది 4. యజ్ఞము చేసిన వెనుక వచ్చునది. కుమారుడు అభివృద్ధి చెందవలెనన్నచో రెండవ పేరు పెట్టవలెనని శత.బ్రా.న కలదు. యజమాని పేర్ల నుచ్చరించుటలో ధన్విభాష్యము, అభివాదనీయు, వ్యావహారిక, నక్షత్ర నామములను పేర్కొన్నది. రెండు పేర్లు పెట్టుకొనిన బ్రాహ్మణుడు వృద్ధి పొందునని తై.సం. నందు కలదు."తస్మాద్ ద్వినామా బ్రాహ్మణోర్ధుకః" ఈ మంత్రమునే హిర. భార. మొ॥ పేర్కొన్నవి.

ఒకటి మామూలు పేరు, రెండవది తండ్రినుండి, మూడవది గోత్రము నుండి ఏర్పడుచున్నటుల వైదిక సాహిత్యమును బట్టి తెలుస్తున్నది. ఉదా: ఐత.బ్రా.న శునశ్శేపుడు ఆజీగర్తిగా (అజీగర్తునికొడుకు) ఆంగిరసునిగా పేర్కొనబడినాడు.

కొన్ని సందర్భములందు తన పేరుతోను, దేశసంబంధమైన పేరుతోను పిలువబడినట్లున్నది. ఉదా: దుర్ముఖపాంచాల; బృహ.ఉప. నందు సుమారు

400 మంది ఋషులు తల్లిపేరుతోగాని, మాతామహ గోత్ర సంబంధముతో గాని పేర్కొనబడిరి. అట్లే కొన్ని చోట్ల పైతృక నామము గోచరించును. ఉదా: భరతదేష్యంతి. వంశపు మూలపురుషుని పేర్లనిడుట కలదు. కొన్ని నామములు ధర్మశాస్త్రములకు లొంగనివి, అతీతముగా కూడ కలవు.

## నామకరణము:

పార.గృ. ననుసరించి పేరు, రెండు లేక నాలుగక్షరములు కలిగి యుండవలెను. వ్యంజనారంభము కావలెను. నామాంతము దీర్ఘాంతము గాని, విసర్గాంతము కాని కావలెను. కృత్ప్రత్యయములనే ప్రయోగింపవలెను. తద్ధితము కూడదు. బైజవాపు ననుసరించి అక్షరనియమము లేదు. "పితా నామ కరోతి ఏకాక్షరం, ద్వ్యక్షరం త్ర్యక్షరమ్ అపరిమితాక్షరం వా" కాని వసిష్ఠుడు రెండు గాని, నాలుగుగాని ఉండవలెనని నియమించెను. లకారాంతము, రేఫాంతము కూడదని వ్రాసెను. "తద్ ద్వ్యక్షరం చతురక్షరం వా వివర్జయే దంత్యలకార రేఫమ్." ఆశ్వలాయనుడు భిన్న భిన్న విశేషములకై భిన్న భిన్న సంఖ్యలుండవచ్చునని చెప్పెను. కీర్తికాముకుడు రెండక్షరములను (స్వరద్వయము కల్గిన పదము) బ్రహ్మవర్చసకాముడు నాలుగక్షరములను పెట్టుకొనవలెను. "ద్వ్యక్షరం ప్రతిష్ఠాకామ శ్చతురక్షరం బ్రహ్మవర్చసకామః".

ఆదిని ఘోషవర్ణములు, మధ్య, అంతస్థ వర్ణములు తుదిని దీర్ఘము విసర్గాంతముగ నుండవలెనని వారాహము. గ,ఘ,జ,ఝ,ఞ,డ,ఢ,ణ,ద,ధ,న, బ,భ,మ,య,ర,ల,వ,హ -- ఇవి ఘోషవర్ణములు; య,ర,ల,వ,లు అంతస్థ. అట్లే ఆశ్వ. కూడ. ఏ పేరున 'సు' అను పదము మొదట ఉండునో ఆ పేరు మంచి ప్రతిష్ఠగలదగునని బ్రాహ్మణమున కలదని ఆప.సాంఖ్య. ప్రకారము 2,4,6 అక్షరములు. అర్థరహితము, అమంగళకరము, జుగుప్సాకరము, అపశబ్ద భూయిష్ఠము, ఎక్కువ గుర్వక్షరములతో కూడిన నామ ముంచరాదని ఉచ్చారణ యోగ్యమైన పదముంచవలెనని సాయనుడు.

బాలికానామము:

ఇది విషమాక్షరములుగా, ఆకారాంతముగా, తద్ధితాంతముగా నుండ వలెనని పార.గృ.న కలదు. "అయుజాక్షర మాకారాంతంఅస్త్రి యై తద్ధితమ్." త్ర్యక్షరము, ఈకారాంతమని బైజవాపుడు. మనువు సులభోచ్చారణ యోగ్యమైన, సరళమైన, అక్రూరమైన, విస్పష్టార్థయుక్తమైన, మనోహరమైన, మంగళకరమైన, దీర్ఘవర్ణాంతమైన ఆశీర్వాదయుక్తమైన పేరును పెట్టవలె వనెను. "స్త్రీణాంచ సుఖమక్రూరం విస్పష్టార్థం మనోహరమ్ మాంగల్యం దీర్ఘవర్ణాంత మాశీర్వాదాభిధానవత్." నక్షత్ర, వృక్ష, నదీ, పర్వత, పక్షి, సర్ప సేవకా నామములు భీషణ నామములు స్త్రీలకు పనికిరావని మనువు. దీనికి పక్షాంతరము కలదు. నక్షత్రములలో రోహిణి, రేవతి; నదులలో గంగ, వృక్షములలో తులసి, మాలతి మొ॥వానిని పెట్టవచ్చునని వికల్పము కలదు. సూర్య, చంద్ర పూష నామము లుండరాదనియు, రక్షిత, దత్త మొ॥వి అంతమున ఉండరాదని వారాహము. అట్లే ఈ నక్షత్ర నామములు కూడ పనికి రావనెను. ఈ నియమములను ప్రాచీనులు పూర్తిగా పాటించినట్లు లేదు. మహాభాష్యమున చిత్రా, దేవదత్తికా మొ॥ పేర్లు కలవు.

వర్ణసూచక నామములు:

బ్రాహ్మణునకు మంగళ సూచకమై, క్షత్రియునకు బల సూచకమై, వైశ్యునకు ధన సూచకమై, శూద్రునకు సేవాధర్మ సూచకమై యుండవలెనని మనువు. భిన్న భిన్న వర్ణములకు ఉపనామముండుట కలదు. బ్రాహ్మణునకు పేరు చివర శర్మ, క్షత్రియునకు వర్మ, వైశ్యునకు గుప్త, శూద్రునకు దాస పదములుండవలెనని వ్యాసుడు. దీనివలన ఆ బాలకునకు సమాజమున ఎట్టి స్థానము గలదో తెలియును. మనువు చెప్పిన నియమములు ఒక్క పారస్కరములోనే కనిపించును. బౌధ.గృ.శేష సూత్రములందును కలదు. అపరార్కుడు బ్రాహ్మణునకు శర్మ లేక దేవ, క్షత్రియునకు వర్మ లేక త్రాత, వైశ్యులకు భూతి లేక దత్త, శూద్రులకు దాసాంతముగా మండవలెనని యమ వాక్యములను పేర్కొనెను. ఈ నియమము సర్వదా పాటింపబడినట్లు లేదు.

## మాతృగోత్ర సంబంధి నామములు:

ఆశ్వ.గృ.న నవ వధూవరులను ఎన్నుకొనునపుడు వారి వారి వంశములను గమనించి స్వీకరింపవలెనని కలదు. తల్లి పేరుతో గాని, తల్లి యొక్క తండ్రి గోత్రముతో గాని నామము పెట్టబడినచో, తల్లి దండ్రులు పరిశుద్ధవంశమునకు చెందినవారుగా గుర్తింపబడుదు రనుట కే!

## చతుర్విధ నామములు:

శిశువు పుట్టిన నక్షత్రము ననుసరించి నామము, మాసదేవతను ఆధారముగా చేసికొనినది, కులదేవత ననుసరించి పెట్టునది, లౌకిక నామములని 4 రకములుగా సూత్రములకు అర్వాచీన గ్రంథములందు కలదు. జ్యోతిశ్శాస్త్రప్రకారము ఒక్కొక్క దినమున, ఒక్కొక్క మాసమున, ఒక్కొక్క అధిదేవత యుండును గాన దీని ప్రకారము పెట్టుట సంప్రదాయమై యుండును.

నక్షత్రనామము: ఇది శిశువు పుట్టిన నక్షత్రాధారముగా గాని, నక్షత్ర అధిష్ఠాతృదేవత పేరు మీదుగా గాని యుండును. శంఖలిఖిత స్మృతియందు తండ్రిగాని కులవృద్ధుడుగాని ఈ పేరు పెట్టవలెనని కలదు.

నక్షత్రములు వాని అధిదేవతలు: అశ్విని - అశ్విన్; భరణి - యముడు; కృత్తిక - అగ్ని; రోహిణి - ప్రజాపతి; మృగశిర - సోముడు ; ఆర్ద్రా - రుద్రుడు; పునర్వసు - అదితి; పుష్యమి - బృహస్పతి; ఆశ్లేష - సర్పము; మఘ - పితృ; పూర్వఫల్గుని - భగుడు; ఉత్తరఫల్గుని - అర్యముడు; హస్త - సవిత; చిత్ర - త్వష్ట్రుడు; స్వాతి - వాయువు; విశాఖ - ఇంద్రాగ్ని; అనూరాధ - మిత్రుడు; జ్యేష్ఠ - ఇంద్రుడు; మూల - నిరృతి; పూర్వాషాఢ - ఆపస్సు; ఉత్తరాషాఢ - విశ్వేదేవతలు; శ్రవణము - విష్ణువు; ధనిష్ఠ - వసువు; శతభిషము - వరుణుడు; పూర్వాభాద్ర - అజైకపాదుడు; ఉత్తరాభాద్ర - అహిర్బుధ్న్యుడు; రేవతి - పూషుడు; అభిజిత్తునకు - బ్రహ్మ.

బాలకుడు అశ్వినీ నక్షత్రకాలమున పుట్టిన ఆశ్విన, రోహిణినాడు పుట్టిన రౌహిణ అని అనవలె. ఇందొక చిత్రము కలదు. సంస్కృత వర్ణమాలలో భిన్నాక్షరములకు భిన్న భిన్న నక్షత్రములు అధిష్ఠాతలుగా నుండును. 52 అక్షరములకు 27 నక్షత్రములు. సుమారు రెండు అక్షరములకు ఒక నక్షత్రముండును. ఒక శిశువు అశ్వినీ నక్షత్రమున జన్మించెనన్నచో -- 'చూ,చే,లో,ల' అను నాలుగు అక్షరములు అశ్వినికి చెందినవి కనుక చూడామణి, చేదీశ, చోలేశ, లేక లక్ష్మణ అను నామములలో నేదియో యొకటి పెట్టవలెను. 28 నక్షత్రములకు 4 పాదములు చొప్పున 112 పేర్లు సంస్కార రత్నమాల పేర్కొన్నది. వీనికి వైదికాధారములేదని ధర్మసింధువు. నక్షత్రనామమునకు జీవితమునకు సంబంధము కలదు. కనుక ఇది గుప్తముగా నుంచెడివారు. కాని ఈ నక్షత్రనామమును వ్యవహారములో పెట్టుకొనరాదని శాసనము. నక్షత్ర నామమును రహస్యముగా నుంచుటలో ఆభిచారిక క్రియల నుండి రక్షించుటకేయని కాఠకముపై దేవపాలుని వ్యాఖ్య. బ్రాహ్మణములందు నక్షత్రనామములు కలవు. పాణిని నక్షత్రనామములను పేర్కొనెను. మహాభాష్యము పుష్యమిత్రుని పేర్కొన్నది.

నక్షత్రాధిదేవత నుండి పేర్లు పెట్టుట కలదు. కృత్తికా నక్షత్రమున పుట్టినవాడు ఆగ్నేయుడు. కృత్తికకు అగ్ని దేవత.

గుహ్యనామము: పార. మానవ. తప్పించి ఇంచు మించు అందరు గుహ్య నామమును పేర్కొనిరి. గోభి. ఖాదిలందు శోష్యంతి కర్మయందే. ఆశ్వ. కాఠకము పుట్టినపుడే. 10వ నాడు గాని, 12వ నాడుగాని జరుగు నామకరణోత్సవమునందే యని ఆప, బౌధ, భారలన్నవి. సాంఖ్య, కాఠకములు గుప్తనామమునకు చాల నియమములు సూచించినవి. ఆ నియమములే వ్యావహారికమునకు వర్తింపచేసినది. ఆశ్వ. మొ॥ సూత్రములు. గోభి, ఖాది. లందు గుప్త నామమునకు నియమములు లేవు. ఆప. హిర. వైఖలందు నక్షత్ర సంబంధమైనది గుప్త నామమని పేర్కొని నియమములు చెప్పలేదు. భార. రెండు నామములన్నది కాని, ఒకటి పెక్కు నియమబద్ధము, రెండవది నక్షత్రమునుండి వచ్చినది యని చెప్పినది. ఇందేది గుప్తమో

పేర్కొనలేదు. నక్షత్ర నామమే గుప్తమై యుండును. గుప్తనామమే అభివాదనీయమని ఆశ్వ.లో కలదు. నియమములు పేర్కొనలేదు. గోభి, ఖాది, వార మానవములు అభివాదనీయ నామమును పేర్కొన్నవి. ఈ నామము ఉపనయన కాలమున ఇవ్వబడుననియు, ఇది జన్మనక్షత్ర సంబంధము కాని, నక్షత్రాధిపతి నామ సంబంధము కాని కలిగియుండునని గోభి. యందు కలదు. కొందరి మతప్రకారము ఇది గోత్ర సంబంధమని వ్రాసెను. అభివాదనీయమే గోత్రనామమైనచో అందు రహస్యము లేదు. ఆచార్యుడు పిల్లవానికి అభివాదనీయ నామమును చెప్పనని గోభియందు కలదు కావి ఖాది యందిది పిల్లవానికే తండ్రి నుండి, తల్లినుండిగాని తెలియునని అది గురువునకు తెలియఫర్చునని వ్రాసెను. ఇట్లనేకాభిప్రాయములు కలవు.

మాస నామము: మాసముల యొక్క అధిదేవతల నాధారముగా పేరిడవలెను. గార్గ్య మతానుసారముగ మార్గశిర మాసమునుండి వరుసగా జన్మించిన శిశువులకు కృష్ణ, అనంత, అచ్యుత, చక్రి, వైకుంఠ, జనార్దన, ఉపేంద్ర, యజ్ఞపురుష, వాసుదేవ, హరి, యోగీశ, పుండరీకాక్ష అను నామములుంచవలెను.

కులదేవతానుసార నామము: కులదేవత ననుసరించి పేరు పెట్టవలెనని శంఖస్మృతి. "కులదేవతా సంబద్ధం పితా నామ కుర్యాత్." వారి వారి ఇష్టదేవతల ననుసరించి ఆయా నామములిడుటలో ఉద్దేశ్యమేమనగ వారీ శిశువును రక్షింతురనుటయే. దీనికి శిష్టాచారము మూలమని వీ.మి -- కామేశ్వరి, గురునాథుడు మొ॥నవి కులదేవతలు.

వ్యవహార నామము: ఇంతకు ముందే వివరించితిని. ఆయా కులముల సంస్కృతి, శిక్షానుసారముగ, మంగళ సూచకముగ, అర్థపూర్ణముగ నుండవలెనని బృహస్పతిస్మృతి. నామము లింగ భేదమును సూచించవలెను. స్త్రీ పురుష ప్రకృతుల కనుగుణముగా నుండవలెను. సామాజిక వ్యవస్థను పటిష్ఠము చేయుటలో నిది తోడ్పడును.

నిందా సూచక నామము: పై చెప్పిన పద్ధతులు ధర్మశాస్త్రానుగుణమైనవి. కొంతమంది చాల సంతానము కలిగి మృతి పొందినపుడు, మృత్యువు

బారి నుండి తప్పించు కొనుటకు నిందాసూచకమైన పేరు పెట్టినచో బ్రతుకునను విశ్వాసముతో పేరు పెట్టుదురు. ఉదా: పెంటయ్య, గుండన్న.

మూడు పురుషాంతరములుగ వృద్ధ సమ్మతమై వాడుకలో నున్నదియు, క్రొత్తగ కల్పింపని నామ మిడవలెనని చరకుడు, తండ్రి తాతల పేరు పెట్టుడని బోధాయనుడు పేర్కొన్నాడు. ఇదే నేడు ప్రచారములో నున్నది.

విధానము: (మన పద్ధతి: సంస్కారదీపిక)

గణపతి పూజ, పుణ్యాహవాచనమైన వెనుక, నూత్నవస్త్రములు ధరించి సంకల్పము చేయుటతో ఈ సంస్కార మారంభమగును. భర్త భార్య దక్షిణముగా నుండగా, విశాలమైన పళ్లెరమునందు బియ్యము పోసి కుడి తొడపై పెట్టుకొని, బంగారముతో దక్షిణము నుండి ఉత్తరమునకు రెండు గీతలు గీయవలెను. మొదటి గడిలో పుట్టిన మాసము పేరు, రెండవ గడిలో నక్షత్రము పేరు, మూడవగడిలో పిల్లవానికి తానుంచదలచిన పేరు వ్రాయవలెను. పేర్లకు ఆది అంతములందు శ్రీకారముంచవలెను. తూర్పు నుండి పడమరకు మూడింటిపైనను తమలపాకుల పై దేవతలను ఆవాహనము చేసి షోడశోపచారములు చేసి పాలు నివేదన చేయవలెను. మాస నామమును పూజించిన అక్షతలను తల్లిదండ్రులు తీసికొని పిల్లవానిని ఆశీర్వదించిన వెనుక, పురోహితుడు ఆశీర్వదించవలెను. అట్లే నక్షత్ర నామమునకు కూడ. ఆపైన దక్షిణమునకు వచ్చి కూర్చుండ వలెను. కుమారుని 'అంగాదంగాత్.......' అను మంత్రములచే అభిమంత్రణము చేయ వలెను. శిరస్సును వాసన చూడ వలెను. ఈ మంత్రముల కర్థము జాతకర్మలో వ్రాసితిని. పిల్లవాని కుడి చెవిలో 'అగ్నిరాయుష్మాన్............కరోమి' అను మంత్రములను జపించ వలెను. అనగా అగ్ని సమిత్తులచే, చంద్రుడు ఓషధుల రసరూపమైన అమృతముచే, యజ్ఞము దక్షిణలచే, బ్రహ్మము బ్రాహ్మణులచే, దేవతలు అమృతముచే ఆయుర్దాయము కలవారైరి. అట్టి ఆయుర్దాయముచే నిన్ను దీర్ఘాయుష్మంతునిగా చేసెదను. "ఘృతం నిష్పిబతి.........." మొ॥ మంత్రమును చెప్పుచు నివేదన చేసిన

పాలను సువర్ణముతో శిశువుకు త్రాగించుట ఆచారముగా నున్నది. ఆపైన అభ్యుదయిక మైన కర్మ. కర్మాణః పుణ్యాహవాచనము.

మగపిల్లవాని మాదిరిగానే ఆడపిల్లకు చేసి 'సర్వస్మాదాత్మన స్సమ్భూతాసి సాజీవ శరదశ్శతం' అను మంత్రముచే మూర్ధము నాఘ్రాణించుట, దక్షిణ కర్ణమును స్పృశించుట చేయవలెను. మగపిల్లవాడైనచో 'అగ్నిరాయుష్మాన్' మంత్రముతో కుడిచెవిని స్పృశించ వలెను.

పిల్లవానికి ఇంతకు ముందు మాసనామములు వ్రాసితిని. ఆడపిల్లకు మార్గశిరాదిగా ఈ దిగువ నామము లుంతురు. వాగ్దేవి, పద్మావతి, శ్రీదేవి, సావిత్రి, భూమి, కల్యాణి, సత్యభామ, పుణ్యవతి, రూపవతి, ఇందుమతి, చంద్రావతి, లక్ష్మి. ఈ సంస్కారమును సకాలములో చేయనిచో ప్రాజాపత్యద్వయమును చేసి ఉత్తరకర్మతో కలిపి చేయవలెనని హేమాద్రివచనము.

భిన్న సూత్ర విషయములను సూక్ష్మముగా వ్రాసెదను.

సాంఖ్య.న క్రియకలదు. సూతికాగ్నియందే హోమములని కలదు. ఆశ్వ.గృ.న క్రియ లేదు. చాలమంది గృహ్యకారులు హోమము సూతికాగ్నియందు గాక ఔపాసనాగ్నియందే యనిరి. జయ, రాష్ట్రభృత్ మొ॥ మంత్రములతో ఎనిమిది ఆజ్యాహుతులు వేల్చ వలెనని భార. లో కలదు.

గోభి. యందు బాలికానామమునకు చివర 'దా'యనునది చేర్చవలెను.

ఈ సంస్కారమైన వెనుక సంవత్సర పర్యంతము తల్లిదండ్రులు మాంసమును భుజించరాదని వారాహ, లౌగాక్షులందు కలదు.

సంవత్సరము వరకు ప్రతినెల జన్మదినమందు స్థాలీపాకము చేయవలెనని, సంవత్సరానంతరము మేకచే అగ్నిని, గొఱ్ఱెచే ధన్వంతరిని, లేక నేతిచే గాని స్థాలీపాకముచే గాని అగ్ని ధన్వంతరులను పూజించవలెనని, నేతితో తడిపిన అన్నముచే బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెనని లౌగాక్షి. ఇందే మూడవ మాసమున కృష్ణపక్షమున పిల్లవానికి ఆదిత్యుని చూపించవలెనని కలదు.

నామ కరణమునకు ముందుగా 10వ రోజునగాని 12వ గాని పిల్లవానిని బయటకు తీసికొని రావలెనని, మగపిల్లవానిని ప్రసవించిన స్త్రీ 40 రోజుల వరకు, ఆడపిల్లను ప్రసవించిన 50 రోజుల వరకు వంట చేయ రాదని, పుంనామ నక్షత్ర దినమునందు పేరు పెట్టవలెనని, ఈ పేరు దేవత తండ్రి, సోదరులకు సంబంధించి యుండునట్లు చూచుకొనుట మంచిదని వైఖ. యందు కలదు.

"ఓ అమృతుడా! సూర్యుడు నిన్ను ఒక రోజునుండి మరియొక రోజునకు ప్రవేశింప చేయుగాక. పగలు రాత్రియందు, దినము పక్ష మందు, పక్షము పూర్ణమైన నెలయందు, నెల ఋతువునందు, ఋతువు సంవత్సరమునందు, సంవత్సరము నూరు సంవత్సరము లందు ప్రవేశింప చేయుగాక" అను అర్థమిచ్చు మంత్రములు కొన్నింట కలవు.

శూద్రులకు: శూద్ర కమలాకరము నుండి.

పుట్టిన 10వ నాడు గాని, 12వ నాడుగాని యనియు, లేదా బ్రాహ్మణాది వర్ణక్రమముగా 13,16,20,32 దినములందుగాని చేయవలెనని మదన రత్నమున బృహస్పతి వచనము. కాబట్టి జాతాశౌచాంతమందుగాని, 32వ గాని చేయవలెను. సంకల్పము-గణేశపూజ-పుణ్యాహవాచనము-నాందీ శ్రాద్ధము-పళ్లెరములో నున్న బియ్యముపై మొదట గణేశనామము-ఆ వెనుక కులదేవతానామము-ఆపైన మాసనామము-ఆ పైన నక్షత్ర నామము-తు దయందు వ్యవహార నామముంచుట-దాసాంతముగా పేరిడుట-శిశువు కుడిచెవిలో ఫలానా వాని భక్తుడవని హెచ్చరించుట-బ్రాహ్మణులకు భోజన సామగ్రి నిచ్చుటతో పరిసమాప్తి.

ఇందు దాసపదము నీచమని కొంద రనుకొందురు. ఇది సేవా సూచకము. దాస్య భక్తి చాల ప్రశంసనీయ మగుటచే పరమేశ్వరుని భక్తులలో కొందరు శూద్రులు కాకపోయినను దాసాంతముగా వారి పేరులందు కలవు. ఉదా: పురందరదాస. పల్లకినెక్కువాని కన్న పల్లకిని మోయువాడే ఘనుడని నేటి సమాజనీతి. కాపు పదము కాయువాడు, రక్షకుడు అను నర్థములిచ్చును.

కొన్ని గ్రంథములు ఈ సంస్కారమైన వెనుక కొన్ని విశేషములను వ్రాసినవి. తండ్రి ప్రయాణము చేసి వచ్చిన వెనుక, పిల్లవానిని తీసికొని 'అంగాదంగాత్' అను మంత్రమును పఠించుచు, వాని శిరస్సును మూర్ధ్నానుట మొ॥వి. ఈ వివరణ నిష్క్రమణము నందు వ్రాసితిని.

## వర్షవర్ధన లేక అబ్దపూర్తి:

వర్ష వర్ధనము (పుట్టినరోజు పండుగ)ను గూర్చి వైఖ. యందు విపులముగా కలదు. ప్రతి సంవత్సరమున చేయవలెనని, పుట్టినరోజు నక్షత్రాధి దేవతను ముఖ్యముగా ఆజ్యాహుతులతోడను, నక్షత్రమునకు, నక్షత్రాధిదేవతలకు అర్చన, వ్యాహృతి హోమమును, ఆపైన ధాతకు అని విపులముగా కలదు. ఈ సందర్భమున వివాహమైన రోజును ప్రతి సంవత్సరము జరుపుకొను రోజున స్త్రీలు చెప్పు సంప్రదాయములను కూడ పాటింప వలెనని వ్రాయబడింది. వివాహము జరిగిన రోజును ప్రతి సంవత్సరము జరుపు కొనవలెనని ఆప. కూడ విధించినది.

మార్కండేయు నుదాహరించుచు అపరార్కుడిట్లు వ్రాయుచున్నాడు. అందరు పుట్టిన రోజును జరుపుకొనవలెనని, పెద్దలను పూజించుట, అగ్ని, ప్రజాపతి, పితృదేవత, నక్షత్రాదులను బ్రాహ్మణులను ఆరాధించవలెనని కలదు. కృత్యరత్నాకరాదులందు ఆనాడు మార్కండేయుని, సప్తచిరంజీవు లను కూడ పూజింపవలెనని సూచించబడింది. పట్టాభిషేక దినమును కూడ ప్రతి సంవత్సరము జరుపవలెనని నిత్యాచార పద్ధతి. వర్షవర్ధనమునే నిర్ణయసింధు మొ॥నవి అబ్దపూర్తియన్నవి. సంస్కారరత్నమాల ఆయుర్వర్ధన మన్నది.

శూద్రకమలాకరమున నిట్లు కలదు:

షష్ఠీదేవిని దధ్యన్నముచే ప్రతి సంవత్సరము పూజించవలెను. తిథి తత్త్వమందు శిశునామముచే తిలహోమము కూడ చెప్పబడినది. గుగ్గి లము, వేము, ఆవాలు, దూర్వలు, గోరోచనము మొ॥ముడివేసి హస్తము నందు కట్టవలెనని కృత్యచింతామణి యందు కలదు. జన్మ తిథి యుదయ

వ్యాప్తిని కావలెనని కృత్యతత్వార్ణవమందు స్కాందవచనము. గురు, దేవ, పితృ దేవతలను ప్రజాపతిని పూజించవలెనని ఆదిత్య పురాణము. నఖ, కేశఖండనము, స్త్రీ సంగమము, మాంస భక్షణము, కలహము, హింస పుట్టిన రోజున మానవలెనని స్కాందవచనము.

భవిష్య వచనమును తిలకింపుడు. బాలురకు ప్రతి మాసమందును వర్ధాపన కర్మ చేయవలెను. కుముదాదేవి జీవంతి మొ॥ 16 మంది దేవతలను వలయాకారమగు మండలము చేసి దానిలో రాజనపు పిండిచేగాని, కుంకుమచేగాని యా దేవతలను లిఖించి యా నామములతోనే గంధాదుల నిచ్చి వేర్వేరుగ పూజించి బాలకుని అలంకరించవలెను. ఆ పైన ప్రతి దేవతకు ఫలపుష్పాదులతో నిండిన చేటలు 16గాని, 8గాని, 4గాని, 2గాని, 1గాని యథాశక్తిగ నర్పించి యవి సువాసినుల కీయవలెను. పై ప్రకారము చేసిన బాలురకు భూతప్రేతాదులు సోకవని కలదు.

పుట్టిన నక్షత్రము మంచిది కాకున్న శాస్త్రప్రకారము ఆజ్యవీక్షణ, (నూనెలో ముఖము చూచికొనుట) రుద్రాభిషేకము, నవగ్రహశాంతి (గుండాల శాంతి) చేసికొందురు. శూద్రాది జాతులందు ఆడపిల్లకు వృద్ధురాలైన ముత్తైదువ చేతను, మగపిల్లవాడైన భార్య కలిగిన ముసలి వానిచేతను పసిబిడ్డను వారి ఒడిలో పెట్టి వారు పెట్టుకోదలచిన పేరుతో ముమ్మారు పిలిపించి, వారి నెత్తి మీద తల వెంట్రుక నొకదానిని వారిచేతనే తీయింపించి, బిడ్డనెత్తి మీద వేయించి దీవించి అక్షతలు వేయుదురు. పేరు పెట్టు వరకును ఆడు బిడ్డను బూరమ్మ అనియు, మగబిడ్డను బూరయ్య అనియు పిలుచుకొందురు. కొన్ని కొన్ని పద్ధతులిట్లు చిత్ర విచిత్రముగా నుండును.

## ఉయ్యాలలో పెట్టుట:

10వ రోజున గాని 12వ రోజునగాని శిశువును ఉయ్యాలలో పండుకొన పెట్ట వలెనని పారిజాతమందు బృహస్పతి వచనము. మగశిశువునకు 12వ రోజు మంచిదని, ఆడపిల్లకు 13వ రోజు మంచిదని నక్షత్ర విచారముతో

పనిలేదని జ్యోతిర్నిబంధమందు కలదు. హస్త, చిత్త, స్వాతి, శ్రవణము, రేవతి, పునర్వసు, పుష్యమి, అశ్విని, రోహిణి, మృగశిర వీనియందు శిశువులు, రాజులు ఉయ్యాల నెక్కుట శుభమని కలదు.

నామకరణము నాటి మధ్యాహ్నము (21 వ రోజున) పైవేడుక చేయుట ఆచారము.

## కుమారశయనాదులకు ధూపద్రవ్యములు:

యవలు, అగిసివిత్తులు, ఇంగువ, గుగ్గిలము, వస, కచోరములు, సరస్వతియాకు, గరిక, జటామాంసి, పల్లేరు, అశోకము, కటుక రోహిణి, పాము కుబుసము వీనిని గ్రహించి నేయి చేర్చి వస్త్రములకును, శయనాస్తరణ ప్రవరణములకు పొగపట్టుటకై యుపయోగింపవలెను అని చరకము.

## ఓషధి ధారణ విధి:

ఖడ్గమృగము, ఇఱ్ఱి, గవయము, వృషభము అను నీ మృగములు జీవముతో నున్నపుడు వాని కుడి ప్రక్క కొమ్ముల కొసను గ్రహించి ధరింప చేయునగును. ఐంద్రిబ్రాహ్మి మొ॥ఓషధులను ధరింప చేయవలెనని చరకము. ఇట్లెన్ని పద్ధతులున్నను, ఆచారములున్నను అవియన్నియు బాలుని యొక్క ఆయురారోగ్యముల కొఱకే.

* * *

# అన్నప్రాశనము (అన్నము తినిపించుట)

సంహితా భాగములందు, ఉపనిషత్తులందు, అన్న సంబంధమైన మంత్రములు పెక్కు గలవు. పార్శీ దేశస్థులలో కూడ 'అన్నప్రాశన' సంస్కారముండుట భారత, ఇరాన్ దేశముల సామాన్య సంబంధమును సూచించుచున్నది. ఈ రెండు దేశములు కలిసియున్న సందర్భమున దీని పుట్టుక ఏర్పడి యున్నదని భావింపవచ్చును.

**విహిత సమయము:**

సుశ్రుతుడు ఆరవమాసమునుండి బాలకుని తల్లి నుండి వేరుచేయు విధానమును, బాలునికి పథ్యభోజనమునకు వలయు ప్రకారములను వర్ణించెను.

"షణ్మాసశ్చైనమన్నం ప్రాశయే ల్లఘుహితశ్చ."

-- సుశ్రుత శరీరస్థానము 10.64

పెక్కు గృహ్యసూత్రములు ఈ సంస్కారమును పేర్కొనినవి. కాని గోభిల, ఖాదిరములందు లేదు. పిల్లవానికి సంవత్సరాంతమునందు గాని, లేక కొందఱి మత ప్రకారము ఆరు నెలలు తరువాత గాని చేయవలసినట్లు శంఖుని పేర్కొనుచు అపరార్కుడు వ్రాసియున్నాడు. "సంవత్సరేఽన్నప్రాశన మర్ధసంవత్సర ఇత్యేకే." పెక్కు సూత్రముల ననుసరించి ఈ సంస్కారము శిశువునకు ఆరవ మాసమందు చేయవలెనని తేలుచున్నది. మను (2-34) యాజ్ఞవల్క్యులీ యభిప్రాయమునే చెప్పిరి. లౌగాక్షి సూత్రము భేదాభిప్రాయమును ప్రకటించుచు వ్యక్తిగత పరీక్షను నిర్ధారణ చేయుచున్నది. పాచన శక్తి వికసించిన సమయమునందుగాని లేక దంతములు వచ్చినపుడుగాని దీనిని చేయవలెనని సూత్రాభిప్రాయమైనట్లు తోచుచున్నది. "షష్ఠేఽన్నప్రాశనం జాతేషు దంతేషు వా." మదనరత్నమును గమనింపుడు. "షష్ఠే వాప్యష్టమే మాసి పుంసాం, స్త్రీణాం తు పంచమే సప్తమే మాసి వా కార్యం నవాన్న ప్రాశనం శుభం." అనగా ఆరు, ఎనిమిది మాసములందు మగ శిశువులకును, ఐదు, ఏడు మాసములందు

ఆడుబిడ్డలకును అన్నప్రాశనము శుభము. శిశువు పుట్టిన నాలుగు మాసములలో ఇది పూర్తిగా నిషిద్ధము. 6వ మాసమున లేక ఎనిమిదవ లేక తొమ్మిదవ లేక పదియవ లేక పంద్రెండవ మాసమున చేయవచ్చునని నారద వచనము. "జన్మతో మాసి షష్ఠే వా సౌరేణోత్తమ అన్నదం, తదభావే అష్టమే మాసే నవమే దశమేఽపివా ద్వాదశేవాఽపి కుర్వీత ప్రథమాన్నాశనం పరమ్, సంవత్సరే వా సంపూర్ణే కేచి దిచ్ఛంతి పండితాః" కౌషీతకి, ఆపస్తంబీయ వైఖానసములు ఆరవ మాసమునే చెప్పినవి. మానవ. గృ.సూ. (1.20.1-2) ఐదవ నెలలోగాని ఆరవ నెలలోగాని చేయవచ్చునని యున్నది. వారాహము, శిశువునకు దంతములు వచ్చిన పిమ్మట యని నుడివినది. ఇంకను కుమార సంస్కారముల పట్ల శుక్లపక్షము, ఉత్తరాయణము, పుష్య నక్షత్రము మంచివనియు, నవమి తిథి కూడదని కూడ చెప్పియున్నది. సాంఖ్య, పార.గృ. లందు తప్ప మిగిలిన వానియందు విస్తృత విధానములేదు.

## అన్నప్రాశనమునందు వివిధ పద్ధతులు:

విభిన్న రుచులతో కూడిన పదార్థములను పిల్లవానికి ముట్టించవలెనని, ఇది సాధారణ నియమమని పార. గ్ర. 1.19.4. కొన్ని ధర్మ శాస్త్రములందు పెరుగు, మధువు, నేయి, వీని మిశ్రమణము కూడ విధింపబడినది. మాంసము కూడ కలుపవలెనని కొన్నింట కలదు. ఈ పదార్థములను ముట్టించుటలో విశిష్టమైన ఉద్దేశములు కలవు. "శిశువునకు వాక్ప్రివాహము కావలెననిన భారద్వాజ పక్షి మాంసము, పాలన, పోషణ శక్తి కావలెననిన కపింజల పక్షి మాంసము, కోమలతకై చేపలను, దీర్ఘజీవనము కొఱకు కృకశ పక్షి మాంసము లేక తేనెతో కలిపిన అన్నమును, తేజస్సు కొఱకు ఆటి పక్షి మరియు తిత్తిరి మాంసమును, ఓజస్సు, తీక్ష్ణబుద్ధి కావలెననిన నేతితో కూడిన అన్నమును, దృఢేంద్రియములకై దధ్యన్నమును, అన్ని గుణములు కావలెననిన అన్ని పదార్థములు సేవించవలెనని" పార.గృ.న కలదు. కౌషీతకి పెరుగు, తేనె, నేతితో కూడిన అన్నమును విధించినను, కొన్ని కోరికలను పెట్టుకొని అన్నప్రాశనము చేయించువానికిట్లు చెప్పినది.

అన్నాద్య కాముడైనచో మేకమాంసముతో కూడినది, బ్రహ్మవర్చస్సును కోరినచో తిత్తిరమాంసముతోకూడినది, జవన కాముడైనచో చేపలతో కూడినది, తేజస్సును కోరినవాడు నేతితో కూడిన అన్నమును మామూలుగానున్న అన్నముతో కలిపి ప్రాశనము చేయింపవలెనన్నది. ఆశ్వలాయనమున పై కోర్కెలేవియులేనిచో పెరుగు, నేయి, తేనెతో కూడిన అన్నమును తినిపించవలెనని కలదు. ఆపస్తంబీయమున దధి ఘృత మధుమిశ్రితమైన అన్నమును చెప్పుచు తిత్తిరి పిట్ట మాంసముతో కొందఱీ అన్నప్రాశనము చేయుచున్నారని కలదు. మానవ, వైఖానసములు పాయసాన్నమును అనగా పాలలో వండిన యన్నమును విధించినవి. మానవ, కాఠక, వైఖానసములందు మాంస ప్రస్తావన లేదు. మగ సంతానముగల మేకతో యాగము చేసి దేవతా నివేదనయైన వెనుక ఆ మాంస ఖండములను వ్యాహృతులను పఠించుచు నాల్గుసారులు బాలునిచే తినిపించవలెనని వారాహమున కలదు. భారద్వాజమున ఏ అన్నమో చెప్పలేదు. మార్కండేయమున శిశువునకు నేయి, తేనె, పాయసము తినిపించవలెనని కలదు. "మధ్వాజ్య కనకోపేతం ప్రాశయేత్ పాయసం తు తమ్." కాలక్రమమున, పాలు అన్నము పెట్టుట ప్రచలితమైనది.

**తంతు:**

ఇది ఆయుష్యాభివృద్ధ్యర్థమని సంకల్పముతో ఆరంభమగును. రక్షా బంధనమును షోడశోపచారములచే పూజించి కుమారుని కుడిచేతికి 'బృహత్సామ క్షత్ర .........' మంత్రముచే కుడిచేతికి కట్టుదురు. మరల సంకల్పము. తూష్ణీమాచమనాధికార సిద్ధ్యర్థము నవతంతు ధారణము చేయుదురు. షోడశోపచారములచే నవతంతువును పూజించి "నవో నవో భవతి" మంత్రముచే ధరింపచేయుదురు. తరువాత ఆభ్యుదయకర్మము - అక్షతలు, హిరణ్యమును ఉదకములతో విడిచి పెట్టుట - తరువాత కర్మాంగముగా పుణ్యాహవాచనము తరువాత దధి మధు ఘృత ఓదనములు కలిపి 'భూరపాం' మంత్రములచే నాల్గుమార్లు కుఱ్ఱవానికి దక్షిణ హస్తము నందుంచి ఒకేమారు ప్రాశన చేయింతురు. "ఓ శిశూ! భూలోక భువర్లోక

సువర్లోకములం దుండెడి జల ఓషధుల రసమును నీ చే ననుభవింప చేయుచున్నాను. అవి నీకు శుభమునిచ్చి ఆరోగ్యకారణము లగుగాక" అని ఆ మంత్రముల కర్థము. ఇందు గమనింపదగినది మఱియొక అంశము కలదు.

అపరార్కుడు మార్కండేయమును పేర్కొనుచు ఒక చిత్ర విషయమును వ్రాసెను. ఇంటియందు దేవతామందిర సమీపమున పెక్కు కళలం దుపయోగపడు చిత్ర విచిత్రపు పనిముట్లను, శస్త్రాదులను పిల్లవానికి నెదురుగా పెట్టి అతడు ముట్టుకొనునట్లు చేసి ఏది ముట్టుకొనునో అది అతని జీవికను సూచించునని తెలిసి కొనవలెనని వ్రాసెను. ఈ ఆచార మిప్పటికిని కలదు. ఇది మానవ గృహ్యము కూడ చెప్పినది. "అనుక్తమన్యతో గ్రాహ్యం" అను రీతిని ఒక సూత్రమున చెప్పకపోయినను మఱియొక చోట చెప్పిన దానిని స్వీకరించు చున్నాము.

శూద్ర కమలాకరమునందిట్లు కలదు:

"విష్ణుధర్మోత్తరమందు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను, సూర్యచంద్రులను, దిక్పాలురను, భూమిని పూజించి చరుహోమము చేసి దేవతా సన్నిధానమున పెంపుడు తల్లి తొడపై అలంకరించి కూర్చోపెట్టిన బాలునికి సువర్ణముతో కూడిన అన్నపాత్ర మీయవలెను. లేదా తేనె, నేయి, పెరుగు కలిపిన పాయసమును దినిపించ వలయును. కనుక తండ్రి దేశకాలములను కీర్తించి బలము, ఆయుస్సు, వర్చస్సు వృద్ధి పొందుటకు అన్నప్రాశనము చేయించుచున్నానని సంకల్పించి గణేశపూజ, పుణ్యాహవాచన, మాతృకాపూజ, నాందీ శ్రాద్ధములను చేసి బ్రహ్మాదులను ప్రతిమలందుగాని, అక్షతలందుగాని పూజించి వారి నామములచే చరు హోమము చేసి దధి ఘృత మధు మిశ్రితాన్నమును గాని, పాయసమును గాని తినిపించి రకరకములైన వస్తువుల నెదుట నుంచి ముట్టుకొనునట్లు చేయవలెను.

ఆశ్వ, కౌశిక, ఆప, భార, జైమిని సూత్రములు ఈ సంస్కార సమయమున హోమమును విధించలేదు. మిగిలినవి విధించినవి. ఉత్తర

దేశపుటాచారము కూడ తెలియుటకు పార.గృ. విధానమును పేర్కొందును. "అన్నప్రాశన దివసమున అన్నమును మంత్రపూతము చేయవలెను. గృహ్యాగ్నియందు స్థాలీపాకమైన వెనుక మొదట వాగ్దేవతకు ఆహుతి ఈయబడును. 'దేవతలు వాగ్దేవిని సృష్టించిరి. ఆమె వలన పశువులు కూడ మాట్లాడు చున్నవి. (అభిప్రాయమును వ్యక్తీకరించుచున్నవి) ఇట్టి మధురధ్వని కలిగినప్రశంసింప బడిన వాణి మా వద్దకు వచ్చుగాక" అను నర్థమిచ్చు "దేవీవాచమజనయంత దేవాః తాం విశ్వ రూపాః పశవో వదంతి....................." ఆదిగా గల మంత్రమును చదివిన వెనుక స్వాహాకారము చెప్పబడును. రెండవ ఆహుతి ఊర్జకు నీయబడును. నేడు ఊర్జ లభించుగాక! దాని తరువాత తండ్రి నాల్గాహుతుల నిచ్చును. 'ఊర్ధ్వ ప్రాణము ద్వారమున భోజనమును గ్రహింతును గాక - స్వాహా! అట్లే నిమ్నవాయువు ద్వారమున - స్వాహా! నా నేత్రముల ద్వారమున దృశ్య పదార్థముల ఆనందమును గ్రహింతును గాక - స్వాహా! శ్రవణేంద్రియ ద్వారమున కీర్తిని పొందునుగాక - స్వాహా! దీని తరువాత పదార్థములను వేరువేరుగా విభజించి మౌనముగా తినిపించుటగాని 'హంత' (బాగు) అను పదముతో తినిపించుటగాని చేయవలెను. బ్రాహ్మణ భోజనముతో ఇది సమాప్తి."

ఇంకను పెక్కు సూత్రములందుగల విశేషములను పేర్కొందును.

"పుత్రునకు దంతములు వచ్చిన పిమ్మట గోవుచేతగాని, పశువుచేతగాని, అన్నాదులచేతగాని అగ్ని నిమిత్త యజ్ఞము గావింపవలెను. తండ్రి యపుడు ప్రవాసము నుండి గృహమునకు వచ్చినచో 'పశూనాం త్వా' అని పఠించుచు పుత్రుని శిరమును ముమ్మారు మూర్కొన వలెను. జాతకర్మ వలె తనచేతి వ్రేలిని పిల్లవాని చెవియందుంచి 'అశ్మాభవ' అని జపింపవలెను. ఇంతకు ముందు పేర్కొన్నట్లు యాగము చేయవలెను అన్న వారాహ ప్రక్రియ గమనింపదగినది. (అ.క. సమీక్ష నుండి)

అన్నప్రాశన సంస్కారమునకు ముందు బ్రాహ్మణ భోజనమును ఆపస్తంబుడు చెప్పినట్లే జైమిని కూడ చెప్పెను.

"జలముల ఓషధుల సారభూతమగు అన్నమును నీ కిచ్చుచున్నాను. నీరు, ఓషధులు నిన్ను దయతో పాలించుగాక! నీరు, ఓషధులు నీకెట్టి అపకారమును కలిగింపకుండునుగాక!" అనునర్థమిచ్చు 'భూరపాం త్వౌషధీ నాగ్ం........." ఆదిగాగల మంత్రము ఈ సంస్కారమున పఠింపబడును." (హిర. గృ. సూత్రము)

"అన్నమే సమస్త జీవులను రక్షించుచున్నది. దీనికి పతి సూర్యుడు. అట్టి సూర్య భగవానుడు శుభమును, అన్నమును ఈ శిశువున కిచ్చుగాక!" అను నర్థమిచ్చు మంత్ర పఠనముండును. "ఓ అన్నపతి! రోగరహితమైన, బలకరమైన ఆహారమిమ్ము. మాకు, మా పశువులకు శక్తిని ప్రసాదింపుము" అను నర్థమిచ్చు మంత్రము ఆశ్వ.గృ. న కలదు.

నూత్న వస్త్రమును ధరించిన, అలంకరింపఁబడిన బాలున కీ సంస్కారము జరుపబడవలెనని మానవ.గృ.న కలదు. అందే సంస్కారాంతమున బ్రాహ్మణ భోజనమును, దక్షిణగా నూత్న వస్త్రము నిచ్చుట మొ॥ అంశములు కలవు. మన మాచరించు చున్నట్లుగానే స్వర్ణసంబంధమైన వస్తువుతో అన్నమును ముట్టించవలెనని కూడ చెప్పినది.

హవిష్యాన్నమును తినిపింపవలెనని జైమిని. హవిష్య ద్రవ్యమును కృత్యరత్నాకర మిట్లు పేర్కొన్నది. "హవిష్యేషు యవాముఖ్యా స్తదను వ్రీహయోమతాః మాషకోద్రవ గౌరాదీన్ సర్వాభావే వివర్జయేత్" సమయ ప్రదీపమును పేర్కొనుచు నిట్లన్నది. "ప్రథమం యవా స్తదలాభే వ్రీహ యస్త ద లాభే మాషకో ద్రవచణక సర్షప మూరచీన కపిత్థ వర్జ మన్యదపి అన్నమ్."

పుత్రికకు మంత్ర రహితమని ఆశ్వలాయనమున కలదు. పెక్కు సూత్రములందు భేదము లేదు. 'అన్నాశనాత్ మాతృగర్భ మలాశనాత్ అపి శుధ్యతి' అనుటచే శిశువు తల్లి గర్భమున ఉన్నపుడు, గర్భసంబంధమైన మలవస్తువులను తినుటచే కల్గు దోషము పోవలెనని ఈ సంస్కారము ఆవశ్యకమని తేలుచున్నది.

* * *

# కర్ణవేధ (చెవులు కుట్టించుట)

ఉద్భవము:

ఆటవిక జాతులందు ఆపాదమస్తకము భిన్న భిన్నాంగములపై అలంకరించుకొనుట ఇప్పటికి కాన నగును. అలంకారములపై మక్కువ సర్వ సాధారణ ధర్మము. భారతీయులు అలంకారములను ధరించుటలో ఒక విశిష్ట ప్రయోజనము లేక పోలేదు. ఆలంకారిక ప్రవృత్తిలోనే ఆరోగ్య దృష్టి కూడ ఇమిడి యున్నది. ఉదా: కర్ణవేధ. "రోగాదుల నుండి రక్షకై, భూషణ నిమిత్తమై బాలకుని కర్ణములను కుట్టవలెను" అని సుశ్రుతము. "రక్షా భూషణ నిమిత్తం బాలస్య కర్ణౌ విధ్యేత్" (శరీర స్థానము). అందే అండకోశముల వృద్ధిని, అంత్రవృద్ధి యొక్క నిరోధము నపేక్షించువాడు మరల కర్ణవేధ చేసికొనవలెనని కలదు.

"శంఖోపరి చ కర్ణాంతే త్యక్త్వా యత్నేన సేవనీమ్
వ్యత్యాసాద్వా శిరాం విధ్యే దంత్ర వృద్ధి నివృత్తయే."

-- చికిత్సా స్థానము 19/21

నిరుక్తములో పేర్కొనబడిన మంత్రము ప్రకారము (II.4) కర్ణవేధ ప్రాచీనమని తెలియుచున్నది. సత్యముతో శిష్యునకు కర్ణవేధ చేసినచో అతనిని తల్లిగా, తండ్రిగా భావింపవలెనని ఆ మంత్రమున కర్థము. "య ఆ తృణ త్త్య వి త థేన కర్ణావ దుఃఖం కృణ్వన్నమృతం సంప్రయచ్ఛన్. తం మన్యేత పితరం మాతరం చ తస్మైన ద్రుహ్యే త్కృతమచ్చనాహ" (విష్ణు.ధ.సూ.) ఇది కర్ణోపదేశ సమయమున వాడుదురు. నిజమైన కర్ణవేధ యనగా గురువు శిష్యుని చెవిలో మంత్రోపదేశము చేయుటయే. ఈ యర్థమే నిరుక్త మంత్రమున కర్థమని భావించవలెను. ఇక బాహ్యమైన కర్ణవేధ వేరు.

పెక్కు సూత్రములందు దీని ప్రస్తావన లేదు. పారస్కర గృహ్య సూత్ర పరిశిష్టకాత్యాయన సూత్రములందు దీని ప్రస్తావన కలదు. అథర్వ

వేదమున ఒక సూక్తము నందు కర్ణవేధ యొక్క ఉల్లేఖము కలదు. కాని కౌశికుడు పశు సంబంధమైన కర్ణవేధగా పేర్కొనెను.

## సంస్కార సమయము:

బృహస్పతి మతానుసారము శిశువు పుట్టినది మొదలు పదియవ రోజున గాని, పండ్రెండవ లేక పదునారవ రోజునగాని చేయవలెను. "జన్మతో దశమే వాహ్ని ద్వాదశేవాऽథషోడశే" (బృహస్పతి. వీ.మి.) గర్గమతాను సారము ఆరవ, ఏడవ, ఎనిమిదవ లేక పండ్రెండవ మాస ములందిది చేయవచ్చును. శిశువునకు దంతములు రాక పూర్వము, తల్లి ఒడిలో ఆటలాడుకొను సమయము సంపన్న కాలమని శ్రీపతి. "శిశో రజాత దంతస్య మాతురుత్సంగ సర్పిణః సౌచికోవేధ యేత్క ర్ణౌ సూచ్యా ద్విగుణ సూత్రయా" (వీ.మి.) మూడవ లేక ఐదవ సంవత్సరమున బాలకునకు కర్ణవేధ చేయవచ్చునని కాత్యాయన సూత్రము. సుశ్రుతము ప్రకారము ఆరవ మాసమున కాని ఏడవ మాసమునకాని చేయవలెను. బౌధా.గృ. శేష సూత్రములలో (1.12) ఏడవ నెలలో కాని ఎనిమిదవ నెలలో కాని అని కలదు. జ్యోతిర్నిబంధమందు గర్గవచనము. "మాసే షష్ఠే సప్తమే వాష్టమే మాసి వత్సరే కర్ణవేధం ప్రశంసంతి పుణ్యాయుశ్శ్రీ వివృద్ధయే" అనగా ఆరు, ఏడు, ఎనిమిది మాసములలో గాని వత్సరాంత మందుగాని పుణ్యాయు స్సంపత్తుల వృద్ధికై చేయవలెను. పండ్రెండు, పదియారు దినము లందుగాని ఆరు, ఏడు, ఎనిమిది మాసములందు గాని ఉచిత కాలమని మదన రత్నమందు వసిష్ఠుడు, కార్తిక పుష్య ఫల్గున చైత్ర, మాసములందు, మృగశిర, ఆర్ద్ర, హస్త, చిత్ర, పునర్వసు, పుష్యమి, శ్రవణ, ధనిష్ఠ రేవతి నక్షత్రములందు శ్రేష్ఠమని హేమాద్రిలో వ్యాసుని వాక్కు.

## సంస్కార కర్త:

తండ్రి ద్వారా యీ సంస్కారము చేయవలెనని కాత్యాయనుడు, ఎడమ చేతితో వైద్యుడు చేయవలెనని సుశ్రుతము "భిషగ్వామహస్తేన............ విధ్యేత్" సౌచికుని ద్వారా చేయించవలెనని శ్రీపతి పండితుడూ, "సౌచికో

వేధయే త్కర్ణౌ సూచ్యా ద్విగుణ సూత్రయా" వంశ పద్ధతులను బట్టి స్వర్ణకారునిచేత చేయించుటయే చాలచోట్ల కన్పడుచున్నది.

సూది: కర్ణచ్ఛేదనము చేయు సూది యొక్క వివరము:

స్వర్ణమయమైనది లేదా వెండిదిగాని లేదా ఇనుప తీగ గాని వాడ వచ్చునని బృహస్పతి, "శాతకుంభమయీ సూచీ వేధనే శోభనప్రదా, రాజతీవాఽయసే వాఽపి యథా విభవ తః శుభా (వీ.మి.) రాగి తీగను వాడవలెనని స్మృతి మహార్ణవమునందు కలదు. శిశువు యొక్క కులభేదము ననుసరించి కూడ ఈ భేదము కలదు. రాజకుమారుడైనచో బంగారము, బ్రాహ్మణ వైశ్యులకు వెండి, శూద్రుడైన లోహమయమైనదని వీరమిత్రోదయమున కలదు. "సౌవర్ణీ రాజ పుత్రస్య రాజతీ విప్ర వైశ్యయోః, శూద్రస్య చాయసీ సూచీ మధ్యమాష్టాంగులాత్మికా."

సంస్కార అనివార్యత:

ఈ సంస్కారము అనివార్యమని, దీనిని అవహేళన చేయుట పాపమని భావించిరి. "ఏ బ్రాహ్మణుని కర్ణ రంధ్రమునందు సూర్య చ్ఛాయకు ప్రవేశము లేదో అట్టి బ్రాహ్మణుని చూచిన వానికి పుణ్యము నశించును. అతనిని శ్రాద్ధభోక్తగా నిమంత్రితుని చేయరాదు. నిమంత్రితుని చేసినను ఆసురఫలమిచ్చును" అని దేవల స్మృతి. "కర్ణ రంధ్రే రవే శ్ఛాయా న విశేదగ్ర జన్మనః, తం దృష్ట్వావిలయం యాంతి పుణ్యౌఘాశ్చ పురాతనాః, తస్మై శ్రాద్ధం న దాతవ్యం, యది చేదాసురం భవేత్."

విధానము:

కాత్యాయన సూత్రమునందు చెప్పబడిన సంస్కారము అత్యంత సాధారణము. ఒక శుభదినమున మధ్యాహ్నమునకు పూర్వము, పూర్వార్ధమున పూర్వాభిముఖముగ శిశువును కూర్చుండ బెట్టుకొని, 'మేము మంగళ ప్రదమైన మాటలను విందుముగాక' అను నర్థమిచ్చు మంత్రములను గానము చేసిన తర్వాత కుడి చెవిని కుట్టవలెను. 'వక్ష్యంతి' ఆదిగా గల

మంత్రములను చదివిన వెనుక ఎడమ చెవిని కుట్టవలెను. బ్రాహ్మణ భోజనముతో సంస్కార సమాప్తి యగును (పా.గృ.సూ. పరిశిష్టము)

## సుశ్రుత పద్ధతి:

శిశువునకు ఈ సంస్కారము ఆరవ లేక ఏడవ మాసమున, శుక్ల పక్షమున శుభ దినమున చేయవలెను. శిశువు యొక్క తల్లి ఒడిలో కూర్చుండ బెట్టుకొని ఆడించు సమయమున వైద్యుడు ఎడమచేతితో శిశువు కర్ణమున సూక్ష్మాతి సూక్ష్మమున సహజముగ నుండు రంధ్రమున సూదితో గ్రుచ్చ వలెను. సూర్య ప్రకాశమున ఆ రంధ్రము గోచరించును. కుట్టిన తర్వాత, నూనెలో దూదిని తడిపి కుట్టినచోట నూనెతో అద్దవలెను. (సుశ్రుత. సూత్ర స్థానము)

క్రమక్రమముగా ఇది వివిధాంగములతో కూడినది. 'సంస్కారము చేయువాడు విష్ణు, శివ, బ్రహ్మ, సూర్య, చంద్ర, దిక్పాలక, నాసత్యులు, సరస్వతి, బ్రాహ్మణుడు, గోవులు -- వీరిని పూజింపవలెను. కుల గురువును అలంకరించి బ్రహ్మాసనముపై కూర్చుండ పెట్టవలెను. తల్లి కుంకుమను శిశువు చెవులకు అద్దును. వైద్యుడు మగశిశువైనచో కుడిచెవిని, ఆడశిశువు ఐనచో ఎడమ చెవిని ముందుగా కుట్టవలెను. అంతమున విద్వాంసులను, బంధువులను పూజింపవలెను' అని విష్ణుధర్మోత్తరమున కలదు. శర్కర, మధు, ఘృతములతో ఆహుతులీయవలెనని, బ్రాహ్మణులకు త్రిమధురముల నీయవలెనని మరియొక కల్పము. బ్రాహ్మణాశీర్వచనముచే కర్మ సమాప్తి యగును. పిల్లవాడు చెవి కుట్టునపుడు ఏడ్చినచో తేనెను నాకించవలెనని కొన్ని గ్రంథములందు కలదు.

* * *

## చూడాకరణము (పుట్టు వెంట్రుకలు తీయుట)

అర్థము:

ఈ సంస్కారమును అన్ని గృహ్యసూత్రములు పేర్కొనెను. చూడ యనగా శిఖ. ఇది యుంచి మిగిలిన కేశములను వపనము గావింతురు గాన ఇది చూడాకరణమనివాడుక.

"చూడాయాః కరణమ్, చూడార్థం కరణం, చూడాక్రియతే యస్మిన్ కర్మణేతి వా త్రిధైవ సంభవతి" (సంస్కార ప్రకాశ). "చూడాప్రయోజనమస్య చౌడమ్" అని మహాభాష్యమున కలదు. లడల కభేద మగుటచే దీనిని చౌలమని కూడ అందురు.

ప్రయోజనము:

పిల్లవానికి బలము, ఆయుస్సు, వర్చస్సు వృద్ధిపొందుటకై దీనిని చేయుదురు. "బలాయుర్వర్చో వృద్ధిశ్చ చూడాకర్మ ఫలం స్మృతం" ఆపైన దీని వలన పితృకర్మయం దధికారము కల్గును.

"శిశుర్దీర్ఘాయురత్రైవ జాయతే పృథివీపతే అన్యథా దోష మాప్నోతి ఆయుర్హీనో భవేత్తదా" అని పరాశరుని వచనము. అనగా దీనిని చేసినచో శిశువునకు ఆయుర్దాయము, చేయనిచో అయుః క్షీణము కలుగును. ఇది సకాలములో చేయనిచో రెండు ప్రాజాపత్యములు చేసి హోమము చేయవలయునని గౌతముని ఆదేశము.

ధర్మశాస్త్రముల ననుసరించి ఇది దీర్ఘాయుప్రదమేకాక సౌందర్య కారణము, కల్యాణప్రదము కూడ. "తేన తే ఆయుషే వపామి సుశ్లోకాయ స్వస్తయే" అని ఆశ్వ.గృ. న కలదు. ఆయుర్వేద గ్రంథములందు కూడ దీని ప్రస్తావన కలదు. సుశ్రుతము ననుసరించి "కేశములు నఖములు, రోమములు వీనిని ఛేదించుట ద్వారా హర్షము, లాఘవము, సౌభాగ్యము, ఉత్సాహవృద్ధి కలుగుటయేగాక పాపోపశమనము కూడ కలుగును." "పాపోపశమనం కేశ నఖ రోమాపవర్జనమ్, హర్ష లాఘవ సౌభాగ్యకర

ముత్సాహవర్ధనమ్" (చికిత్సా స్థానము) అట్లే చరకుడు కూడ పుష్టి కలుగునని, బలకర మని, శుచిత్వ మేర్పడునని చెప్పియున్నాడు.

"పౌష్టికం వృష్యమాయుష్యం శుచిరూపం విరాజనమ్ కేశ శ్మశ్రు నఖాదీనాం కర్తనం సంప్రసాధనమ్."

కొంతమంది చరిత్రకారులు ఈ సంస్కారమునకు మూలము బలి యని, అనగా దేవతా ప్రీతిగా దీనిని అర్పణ చేయుట దీని ఉద్దేశ్యమని భావించిరి. కాని ఈ ఊహ మన పట్ల సత్యముకాదు. పై విధముగా మన గ్రంథములందు చెప్పబడలేదు. కాని పుట్టువెంట్రుకలను కొన్ని దేవాలయము లందు తీయించుచున్నారు. దీనికి చూడాకరణముతో నిమిత్తము లేదు. దీర్ఘాయుర్దాయ నిమిత్తమై దేవసన్నిధిలో చేసిన బలకరమను భావనతో దీనిని చేయుట కలదు. అంతమాత్రమునకే ఇది దేవతా ప్రీతికై ఏర్పడినదని భావింపరాదు. దేవసన్నిధి కాకపోయినను ఎవరికి వారు తమ తమ గృహములందు శాస్త్రము విధించిన ప్రకారము పుట్టు వెంట్రుకలను తీయింపవలెను.

## వేద ప్రస్తావన:

గృహ్యా సూత్రములం దుదాహరింపబడిన మంత్రములు వేదముల యందు లభ్యమగును. ముండన నిమిత్తమై శిరస్సును తడుపుట గూర్చి అథర్వమున కలదు. కత్తిని గూర్చి హాని లేకుండునట్లు ప్రార్థన కూడ కలదు. "నామమును బట్టి నీవు శివము. ఇనుము నీకు తండ్రి. నేను శిశువునకు హాని చేయవద్దని నమస్కరించుచున్నాను." "ఓమ్ శివో నామాసి స్వధితిస్తేపితా నమస్తే మామా హిగ్ంసీః" (య.వే. 3-63)

'ఆయువు, అన్నాద్యము, ప్రజననము, ఐశ్వర్యము (రాయస్పోష) సుసంతతి, బలము, వీర్యము కావలెనని స్వయముగా తండ్రి ద్వారా కేశచ్ఛేదము జరుగవలెనని వేదమున కలదు.

"ఓమ్ నివర్త యా మ్యాయుషేఽన్నాద్యాయ ప్రజననాయ
రాయస్పోషాయ సుప్రజాస్త్వాయ సువీర్యాయ." (య.వే. 3.3

సవితృ దేవత లేదా సూర్య ప్రతినిధిగా మంగలిని గూర్చి స్వాగత వాక్యములు గలవు. (అ.వే. 6.68.2). అనేక సంకేతములు కలవు. (అ.వే. 6.68.3; 8.4.17) అట్లే పెక్కు అర్వాచీన గ్రంథములు అనేక వివిరణల నిచ్చినవి.

**సమయము:**

శిశువు పుట్టిన మొదటి సంవత్సరమందు గాని మూడవ యేట గాని చేయవలెనని బౌధ, పార, మను, వైఖలు, యాజ్ఞ, సంవత్సరమును గూర్చి చెప్పలేదు గాని కుటుంబాచారరీత్యా యనెను. యముని నుదాహరించుచు అపరార్కుడు, 1,2, లేక 3వ సంవత్సరమున, శంఖలిఖితుని ప్రకారము 3న గాని, 5న గాని యని వ్రాసెను. సంస్కార ప్రకాశ, ఆశ్వ. గృ. పై నారాయణ వ్యాఖ్య ననుసరించి ఉపనయనకాలములోనే ఇది చేయుచున్నారని కలదు. ఖాది, హిర, మానవ, జైమిని, గృ.సూ. లను బట్టి 3 వ సంవత్సరముననే. జైమినిపై ఒక వ్యాఖ్యానమును బట్టి గర్భ తృతీయ (2) యని కలదు. కొందరు, 5 వ సంవత్సరమున గాని 7వ సంవత్సరమున గాని చేయవలెననిరి. 3,5 మంచివని, 7న కాని, ఉపనయన కాలమునగాని చేయవచ్చునని మరి యొక అభిప్రాయము.

"తృతీయే పంచమే వాఽబ్దే చౌల కర్మ ప్రశస్యతే
ప్రాగ్వాఽసమే సప్తమే వా సహోప నయనేనవా. " -- వీ.మి.

వ్యవహారమునందు ఉపనయనముకంటె పూర్వము పుట్టు వెంట్రుకలను తీయుచున్నారు. ఉపనయనము జరుగుననగా కొంతమందిది చేయుచున్నారు. నేడిదే ఆచారముగా నున్నది. అత్రి మతానుసారము, "ప్రథమ వర్షమున దీర్ఘాయుర్దాయము, బ్రహ్మవర్చస్సు ప్రాప్తించును. తృతీయ వర్షమున సమస్తకామములకు సాధనమని, పశుకామన నిమిత్తమై పంచమ వర్షము యోగ్యమని, సరి వత్సరములలో నింద్యమని కలదు.

"తృతీయే వర్షే చౌలే తు సర్వకామార్థ సాధనమ్,
సంవత్సరేతు చౌలేన ఆయుష్యం బ్రహ్మవర్చసమ్
పంచమే పశుకామస్య యుగ్మే వర్షే తు గర్హితమ్" -- వీ.మి.

"మూడవ సంవత్సరము ప్రశస్తమని విద్వాంసులు తలంచుచున్నారు. ఆరు లేక ఏడు సంవత్సరములు సాధారణము. 10,11వ సంవత్సరములలో నిది నికృష్టతమమని భావించుచున్నారు. (నారదస్మృతి వీ.మి.)

సూర్యుడు ఉత్తరాయణ పుణ్యకాలములో ప్రవేశించునపుడు చేయవలె నని కొన్ని గ్రంథములందు కలదు. రాజమార్తాండమున చైత్రము, పౌషము, సారసంగ్రహమున జ్యేష్ఠము, మార్గశిరము కూడ పనికిరావని కలదు.

పగలే ఇది చేయవలెను. శిశువు యొక్క తల్లి గర్భిణి యైనచో క్షురకర్మ నిషిద్ధము. "గర్భిణ్యాం మాతరి శిశోః క్షౌర కర్మ న కారయేత్" (బృహస్పతి వీ.మి.) ఈ నియమములు 5వ నెల దాటిన తర్వాత మాత్రమే కూడదని కూడ కలదు. (వసిష్ఠుడు వీ.మి.)

5వ సంవత్సరము దాటిన వెనుక చేయునపు డింతకుమించి నియ మము లేదని నార. స్మృతి. తల్లి రజస్వల యగునపుడిది కూడదు. నీళ్లు పోసికొనిన తర్వాత చేయవలెను. "తల్లి రజస్వల యైనచో, వివాహము, ఉపనయనము, చూడాకరణము చేసినచో తల్లి విధవ యగును. బ్రహ్మచారి జడుడగును. శిశువునకు మృత్యువుకూడ సిద్ధించును" అని వృద్ధ గార్గ్యుడు.

"వివాహే విధవా నారీ జడత్వం వ్రతబంధనే
చౌలే చైవ శిశోర్మృత్యు స్తస్మా దేతత్త్రయం త్యజేత్".

ఎందుల కనగా తల్లి అనారోగ్యవంతురాలై యుండునని యోగ్యప్రద ముకాదని భావించిరి. అంతేకాక సంస్కారమువలన ప్రాప్తించు ఆనందము లేక పోవును.

మూడవ సంవత్సరమున తొమ్మిదవ మాసమున కుమారునకు విధిం చినది లౌగాక్షి. దీనికి శుక్ల పక్షము ప్రశస్తము.

స్థానము:

గృహ్యసూత్రము లిది ఎక్కడ చేయవలయునో పేర్కొనలేదు. సమస్త గృహ్య యజ్ఞములకు గృహమే కేంద్రము కనుక ప్రత్యేకముగా ప్రస్తావింప

నవసరము లేదు. దేవాలయములందిది జేయుచున్నారు. కాని దీనికి ప్రమాణ మాలోచింప తగినది. ఇది కేవల ఆచారమేమో!

విధానము: (మన పద్ధతి ఆప. సంస్కార దీపిక ననుసరించి)

సంకల్పము. చౌల. ఉపనయానంగముగా అంకురారోపణము - అనగా భూమిని శుద్ధిచేసి 5మూకుళ్లకు తెల్లని దారమును చుట్టి చూత పత్రములతో అలంకరించి కొన్ని మంత్రములచే వానియందు మట్టిని పోసి నవధాన్యములను కంచుపాత్రలో పోసి ఆవుపాలచే అభిమంత్రణచేసి పంచపాలికలందు చల్లి దేవతలను ఆవాహన చేసి షోడశోపచారములచే పూజించవలెను. నాందీ ముఖము, ఇడావాచనము (దేవతాహ్వానము) చేయును. ప్రజాకాము డైనవాడు 7 రోజులముందు, పశుకాముడైనవాడు 5 రోజులముందు, అన్నాదికాముడు 3 రోజులముందు, ఆయుష్కాముడు సద్యస్కాలమందు అంకురారోపణము చేయవలెనని బోధాయనుడు చెప్పెను. మరల సంకల్పము-రక్షాబంధనము-బ్రాహ్మణ భోజనము-ఆశీర్వచనము-కూమార భోజనము-(ఉపనయనములో) వలె అగ్ని ప్రతిష్ఠాపనము జరుప వలెను.

జయాది హోమములైన వెనుక అగ్నికి పడమట, బాలకుని తూర్పు ముఖముగా కూర్చుండబెట్టి 3 తెల్ల మచ్చలు గల ఏదుముల్లు, 3 బర్హిస్సుకట్టల కొసలు, మేడిపండ్ల కట్టతోను కలిపిన కట్టతో తూర్పునుండి ప్రదక్షిణముగా జుట్టును తడుపును. మేడికాయల గుత్తి, ఏదుబంది ముల్లు తీసికొని వచ్చుట ఆచారములో లేదు. తండ్రి "ఆప ఉందంతు.....' అను మంత్రములతో నాల్గువైపుల మూడేసి దర్భల నడ్డముంచుకొని కేశ సంస్కారమును చేయును. "ఆయువు, తేజస్సు కొఱకై దీర్ఘకాలము సూర్యుని చూచుటకై ఉదకములు ఈ పిల్లవాని శిరస్సును తడుపుగాక. "యేనావపత్' అను నాల్గు మంత్రములచే ప్రతి మంత్రముతో ప్రతి దిక్కునను కేశ వపనము చేయును. "ఏ కత్తిచే సూర్యుడు, సోమునికి, వరుణునికి కీర్తి శుభముల నిమిత్తమైచేసెనో, సూర్యుడు బృహస్పతికి, అగ్నికి, ఇంద్రునికి,

ఆయునిమిత్తమై చేసెనో, దేనివలన దీర్ఘకాలము సూర్యుని చూచునో అట్లే వపనము చేయింపుమా” అను అర్థమిచ్చు మంత్రములను పఠించుచు నాల్గు వైపుల చేయును. ఆ కత్తిరింపబడిన జుట్టును పేడగురిగియందుంచి నీటిని ముట్టుకొని, 'ఉప్త్వాయ కేశాన్' అను మంత్రముచే మేడి చెట్టు మొదటగాని, దర్భదుబ్బున గాని ఉంచును. తరువాత పురోహితునకు గోదానము చేయును.

ఇక మిగిలిన సూత్రములందు గల విశేషములు:

భార గృ. న ఈ వేదమంత్ర ముదాహృతము (ఋక్. IV. 75.17) 'చాల శిఖలు కలిగిన బాలురవలె బాణములు కలిసి పడుచున్నవి' అని అర్థము. దీని వలన పెక్కు శిఖలు ధరించుచున్నారని తెలియును.

గోభి, ఖాది, కుటుంబాచారమును బట్టి గాని, గోత్రమును బట్టి గాని శిఖలుంచ వలెను. బౌధ.న.లో ఒకటి గాని, 3గాని, లేక 5గాని కొందఱనుచున్నట్లు ఋషిప్రవరను బట్టిగాని అని కలదు.

వారాహమున వశిష్ఠ గోత్రజులు దక్షిణ భాగమున, అత్రి కాశ్యప గోత్రజులు దక్షిణోత్తర భాగములందు, అంగిరస గోత్రజులు శిఖా పంచక మును, వాజసనేయాది అన్య గోత్రజులు ఒక శిఖనుంచుచున్నారని కలదు. భృగువులకు ముండనము విహితము.

“పాపగ్రహాణాం వారాదౌ విప్రాణాం శుభదం రవేః
క్షత్రియాణాం క్షమాసూనో ర్విట్ శూద్రాణాంశనౌ శుభమ్”

-- బృహస్పతి

అనగా విప్రులకు పాపగ్రహముల యొక్క వారము మొదలగు దాని యందు, క్షత్రియులకు మంగళవారమున, వైశ్య శూద్రులకు శనివారము శుభము.

పార, భార, ఆప.లు ఈ కర్మకు ముందుగా బ్రాహ్మణ భోజనమును విధించినవి.

కాఠక, మానవగృ. లందు నువ్వులతో చేసిన అట్టు వంటి పదార్థము, వస్త్రము మంగలి కీయవలెనని కలదు. వైఖ యందు భోజనము మాత్రము చెప్పబడినది. కర్మాంతమున పిల్లవానికి స్నానము బౌధ మొ॥వాని యందు చెప్పబడినది.

తండ్రి కుశసహిత కేశములను ఛేదించి శమీ పత్రములతో కలిపి తల్లికీయగా తల్లి దానిని ఎద్దుపేడయం దుంచునని ఆశ్వ.గృ.లో

ఎద్దు చర్మముపై కుమారుని కూర్చుండబెట్టి చేయవలెనని కౌషీతకి. ఆపస్తంబుడు చెప్పినటుల ఏదుబంది ముల్లుతో కేశములను వేరుచేయుటను కౌషీతకి కూడ చెప్పినది.

చూడాకర్మచేసిన వానికి వరమును (4 సంవత్సరముల ప్రాయముగల ధేనువు) దక్షిణగా నీయవలెనని ఉన్ని దారముచే చుట్టిన తిలలతో నిండిన మూకుడును మంగలి కీయవలెనని లౌగాక్షి. నూలు, బెల్లము దంచిన నువ్వులు మంగలి కీయువలెనని వారాహము.

ఇదియైన ఒక సంవత్సరము తల్లి పులుపు పదార్థమును తినరాదని, ఉప్పులేకుండ భుజింపవలెనని, కోపముతో తినరాదని వారాహము.

కత్తిరింపబడిన జుట్టును వృషభ పురీషమునకద్ది గోష్ఠమునందుగాని, ఒక గుంటయందుగాని, నీటికి సమీపముననుండు ప్రాంతమునగాని వేయ వలెనని పార. భారలందు కలదు. ఉదుంబర మూలమని భార. యందు కలదు. లేదా దర్భగుచ్ఛమునందని (బౌధ, భార, గౌభి) లేదా అరణ్య మందని గోభి. యందు కలదు.

శిఖ:

బాలునికి శిఖనుంచుట ఇందు ప్రధానము. ఉత్తర భారతమున ఏక శిఖను ధరించుట కలదు. భార్గవ మార్గమును (ముండనము) వంగదేశము ననుసరించినను చాల దేశములందు ప్రాంతములందు, శిఖాధారణము కలదు. శిఖ లేకుండుట బౌద్ధ ధర్మమున, సన్న్యాస ధర్మమున మాత్రమే!

శిఖ, యజ్ఞోపవీతములు ద్విజులకు అనివార్యమైన చిహ్నములు. ఈ రెంటిని ధరించనివాడు ధార్మిక సంస్కారములకు, పూర్ణపుణ్యము ననుభవించుటకు యోగ్యుడు కాడని శాస్త్రములు చెప్పచున్నవి. "విశిఖో వ్యుపవీతశ్చ యత్ కరోతి న తత్ కృతమ్" (దేవల). శిఖను తీసివేసిన వ్యక్తికి ప్రాయశ్చిత్తముల నిట్లు విధించినది. 'ఏ ద్విజాతీయుడు మోహముచే గాని, ద్వేషముచే గాని, అజ్ఞానముచే గాని శిఖను తీసివేయుచున్నాడో అతడు తప్తకృచ్ఛ్రవ్రతము ద్వారా శుద్ధిని పొందును.

"శిఖాం ఛిందంతి యేమోహాద్ ద్వేషా దజ్ఞానతోఽపివా
తప్తకృచ్ఛ్రేణ శుధ్యంతి త్రయోవర్ణా ద్విజాతయః"— లఘు. హారీతుడు

శబరస్వామి, శిఖ గోత్రమును సూచించునని వ్రాసెను. వసిష్ఠుడు అన్ని వర్ణముల వారికి (శూద్రులకు కూడ) శిఖ ఉండవలెనని వ్రాసెను. శిఖలేని శిరస్సు అపవిత్రముగా వేదమునందు వర్ణితము. "అమేధ్యం వా ఏతచ్ఛిరో యద శిఖమ్."

బాలికలకు కులాచారము ననుసరించి పూర్తిగా వపనము చేయుటగాని, శిఖలనుంచుటగాని, లేక పూర్తిగా వపనమే లేకపోవుటగాని యుండవలెనని మిత్రమిశ్రుడు వ్రాయుచున్నాడు.

ఈ శిఖ మట్టియాకు అంత అని సంస్కార చంద్రిక చెప్పగా, లలాట కర్ణమూల స్పర్శినియై మాలగా నుండవలెనని సంస్కార ప్రకాశిక చెప్పినది. అందే దక్షిణ దేశమందు కొంతమంది వెనుక శిఖ కలిగినవారు, కొంతమంది ముందు శిఖ కలిగినవారు కలరని వ్రాసినది.

శిఖకు ఆయుర్దాయమునకు గల సంబంధమేమియను ప్రశ్న ఉదయించును. సుశ్రుతము దానికి సంబంధమిట్లు చెప్పినది. "మస్తకాభ్యంతర ఉపరిష్టాత్ శిరాసంబంధి సన్నిపాతో రోమావర్తోఽధిపతి స్తత్రాపి సద్యో మరణమ్." అనగా మస్తిష్కమున పై భాగము వైపు సిరసంధుల యొక్క సన్నిపాతము కలదు. ఆ ప్రదేశమే రోమావర్తము యొక్క అధిపతి. ఈ భాగమున ఏ విధమైన దెబ్బ తగిలినను అప్పటికప్పుడే మరణము

సంభవించును. అందుచే ఈ ముఖ్య భాగమును రక్షించుట కొఱకు శిఖను ధరించ వలెను.

బ్రహ్మరంధ్రమునకు సరిగా మీదనున్న సహస్ర దళకమలము పరమేశ్వరునకు మూలస్థానమై యున్నదనియు, దానిని కప్పుటచే ఆత్మశక్తి రక్షింపబడునని కొందరందురు. శిఖాధారణ, మార్జన, స్పర్శన, బంధనము మొ॥ పనులచే ప్రతి సమయమందును సహస్ర దళ కమలముపై దృష్టి పడునని, ఆత్మశక్తి వృద్ధియగునని స్వామి దయానందుల అభిభాషణము. చీనా దేశస్థులు, టిబెట్ దేశీయులు, అలస్కా ప్రాంతీయులు కూడ శిఖను ధరింతురు.

సేమ్సన్ అనువాడు తన శిఖను కత్తిరించు కొనునపుడు శక్తిలేనివాడైయ్యేవాడని ఇజ్రాయిల్ దుఃఖించు సమయమున శిఖను తీసి యుంచెడివాడని చెప్పుదురు. దీనివలన అనేక పూర్వ జాతులలో నిది యుండెడిదని చెప్పవచ్చును. తప్పుచేసినవారు ఎట్టి శిక్షనైన అనుభవించెడివారు కాని, తప్పు నొప్పుకొనకపోవుటచే తల గొరిగించిన వెనుక అంగీకరించు సందర్భములు గమనార్హములు.

* * *

# అక్షరాభ్యాసము

విభిన్న ధర్మశాస్త్రకారులు ఈ సంస్కారమును విద్యారంభమని (వీ.మి. విశ్వామిత్రుడు), అక్షరారంభమని (గోపీనాథభట్టు, సంస్కార రత్నమాల), అక్షర స్వీకరణమని (వసిష్ఠ వీ.మి.) అక్షర లేఖనమని (మార్కండేయు) వేర్వేరు నామములతో పేర్కొనిరి.

గృహ్య సూత్రములలో దీని ప్రస్తావన లేదని, అర్వాచీన గ్రంథములగు వీరమిత్రోదయ, స్మృతిచంద్రిక సంస్కార రత్నమాల, యాజ్ఞవల్క్య స్మృతి వ్యాఖ్యయైన అపరార్కవ్యాఖ్య మొ॥ గ్రంథములందే దీని ప్రస్తావన కలదని ఆధునికులు తలంచుచున్నారు. కొన్ని గ్రంథములందు విశ్వామిత్రుడని, బృహస్పతియని పేర్లు వినబడినంత మాత్రమున ప్రాచీనతను సంతరించు కొనలేదని శ్రీ పి.వి. కాణే అభిప్రాయ పడుచున్నారు. క్రీ.శ. ఏడవ లేక ఎనిమిదవ శతాబ్దముకన్న దీనికి ముందు తీసికొని పోలేమని డా. అ.స. అల్తేకర్ భావన (Education in Ancient India) డా. బూలర్ ఉద్దే శ్యంలో (Indian Antiquery) భారతీయులకు వర్ణమాల గూర్చి క్రీ.పూ. 800 తరువాత తెలియునట. ప్రాచీన లిపిమాల గ్రంథమునందు, పండిత గౌరీశంకర్ హీరాచంద్ర ఓఝూ సాహిత్య సాక్ష్యాధారముగ చూపినచో భారత దేశమున లేఖనకళ క్రీ.పూ. 1600-1200 ప్రాంతమున ఆవిర్భవించినట్లు వ్రాసిరి.

ఇక సంప్రదాయవాదుల అభిప్రాయమును గ్రహింపుడు. "షాణ్మాసికే తు సంప్రాప్తే భ్రాంతిస్సంజాయతే యతః, ధాత్రాక్షరాణి సృష్టాని పత్రా రూఢాన్యతః పురా" అను బృహస్పతి స్మృతి ప్రకారము ఏ విషయము తెలిసి కొనినను, ఎంతవానికైనను ఆరునెలలు గడచిన వెనుక భ్రాంతి కలుగును. కనుకనే బ్రహ్మచేత అక్షరములు సృష్టింపబడినవి. కృష్ణయజుర్వేద సంహిత ద్వితీయ కాండయందు "యాప్ర లిఖతే తస్యైఖలతిః" అను మంత్రము కలదు. అనగా రజస్వలయై వ్రాసినచో బట్టతల కలవాడు పుట్టునని అర్థము. కనుక లేఖన ప్రస్తావన ఎంత పూర్వమో గ్రహింపుడు.

గణపతి భారత లేఖకు డనుట ప్రసిద్ధ కథ. వ్యాసుని కాలము 5000 సంవత్సరములకు పూర్వమనుట చాలమంది శాస్త్రజ్ఞు లంగీకరించినదే. అథమము 5వేల సంవత్సరములకు పూర్వము లేఖనకళ ఉన్నదనుటలో ఆశ్చర్యమేమి? కాలమును ఎంత కుదించిన అంత గొప్ప అనుకొనువారికి ఒక నమస్కారము.

పూర్వ గ్రంథములందు చౌల మయిన వెనుక దీనిని చేయునట్లు కలదు. (డా. అ.స. అల్లేకర్), కౌటిల్యుడు, అర్థశాస్త్రమున వ్రాసిన వాక్యములే ఈ అభిప్రాయమునకు ఆధారము. "వృత్త చౌలకర్మా లిపిం సంఖ్యానం చోపయుంజీత, వృత్తోపనయనస్త్రయీ మాన్వీక్షికీంచ శిష్టేభ్యో వార్తా మధ్యక్షేభ్యో దండనీతిం వక్తృ ప్రవక్తృభ్యః, బ్రహ్మచర్యం చా షోడశాద్వర్షాత్, అతో గోదానం దారకర్మ చ" అనగా రాకుమారునికి చౌలమైన వెనుక అక్షరములను నేర్చుకొనుట, గణితము; ఉపనయనమైన వెనుక వేదాధ్యయనము; అన్వీక్షకి, వార్త, దండనీతులను 16వ సంవత్సరము వరకు అనగా గోదానవ్రత మగువరకు, ఆపైన వివాహమని అర్థము. వాల్మీకి లవకుశులకు చౌల సంస్కారమైన వెనుక వేదములను మినహాయించి సమస్త విద్యలను నేర్పెనని భవభూతి వచనము. "నివృత్త చౌలకర్మణోశ్చ తయోస్త్రయీవర్జ మితరాస్తి స్రోవిద్యాః సావధానేన మనసా పరినిష్ఠా పితాః" కాళిదాసు రఘువంశమున అజుడు లిపి పరిజ్ఞాతయైన వెనుక సంస్కృత సాహిత్యసముద్రమున ప్రవేశించెనని వ్రాసెను. బాణుడు చంద్రాపీడ మహారాజు విద్యామందిరమున ఆరవయేట ప్రవేశించి పదునారవ సంవత్సరమువరకు ఎట్లు గడిపినది, ఏయే కళల నభ్యసించినది వ్రాసెను.

సమయము:

విశ్వామిత్ర మతానుసారము బాలకునకు ఐదవ సంవత్సరముననే ఈ సంస్కారము చేయవలెను (వీ.మి.) పండిత భీమసేన్‌వర్మకృత షోడశ సంస్కార విధి గ్రంథమున అజ్ఞాతుడైన స్మృతికర్త మతమును బట్టి 5,7 సంవత్సరములలో చేయవలయును. "పంచమే సప్తమేవాబ్దే". ద్వితీయ జన్మకు (ఉపనయనము) ముందే చేయవలెనని బృహస్పతి అభిభాషణము.

మార్గశిరమునుండి జ్యేష్ఠమువరకు సరియైనకాలమని, ఆషాఢము నుండి కార్తీకమువరకు నిషిద్ధమని వీ.మి. నందు కలదు. "అప్రసుప్తే జనార్దనే విశ్వామిత్రః" "ఆషాఢ శుక్ల ద్వాదశ్యాం శయనం కురుతేహరిః, నిద్రాం త్యజతి కార్తిక్యాం తయోః సంపూజ్యతే హరిః" (విష్ణుధర్మోత్తరము) సూర్యుడు ఉత్తరాయణ పుణ్యకాలమున నున్నపుడు దీనిని చేయువలెనని వశిష్ఠుని వాక్కు. "ఉద్గతే భాస్వతి". అపరార్కుడు, స్మృతిచంద్రిక కర్త మార్కండేయ పురాణోక్తులను పేర్కొనిరి. అందు 5వ సంవత్సరమున కార్తీక శుద్ధ ద్వాదశి నుండి ఆషాఢ శుద్ధ ఏకాదశి లోపున పాడ్యమి, షష్టి, అష్టమి, పూర్ణిమ, అమావాస్య, రిక్త తిథులగు చవితి, నవమి, చతుర్దశులను, శనిమంగళ వారములను విడిచి పెట్టి చేయువలెనని కలదు. రవి కుంభరాశిలో నుండగా పనికి రాదని, లగ్నాత్తు అష్టమమున గ్రహములు లేకుండ నుండునట్లు నిర్ణయించుకొనవలెనను జ్యోతిష నియమములు పెక్కు కలవు.

విధానము:

ముందుగా బాలకునకు స్నానము చేయించి వస్త్ర భూషణాదులతో నలంకరింతురు. విఘ్నేశ్వరపూజ, సరస్వతీ పూజయైన వెనుక పళ్లెములో బియ్యముపోసి దానిని మూడు భాగములుగ రెండు గీట్లు గీయించి పై భాగమున ఓం అనియు రెండవ గడిలో నమఃశివాయ అనియు మూడవ భాగములో 'సిద్ధంనమః' అనియు మూడు పర్యాయములు పురోహితుడు బాలకుని చేత వ్రాయించుచు నమస్కరింప చేయును. విఘ్నేశ్వర సరస్వతి శ్లోకములను పఠింపచేయును. 'ఓం నమః సిద్ధాయ' అని వ్రాయించుట జైన సంప్రదాయమని కొందరందురు. కాని పరమేశ్వరునకు 'సిద్ధ' అను పదము కలదు. కనుక ఈ యూహ అనవసరమేమో. ఓం నమశ్శివాయ సిద్ధం నమః అను మంత్రమును 'ఓం నమః శివాయః సిద్ధం నమః' అనునట్లు మార్చి వ్రాయించుట కూడ కలదు. ఇది వ్యవహారములో దొర్లిన దోషము. నృసింహ శ్లోకమును బట్టి గణపతి, సరస్వతులను పూజించిన వెనుక గురువును పూజింపవలెను. గర్గ వచనమును బట్టి ఆజ్యాహుతులతో

సరస్వతికి, హరి, లక్ష్మి, విఘ్నేశ, సూత్రకారులకు స్వవిద్య నుద్దేశించి హోమము చేయవలెను. కాని నేడిది ఆచారమున లేదు.

మహమ్మదీయులలో ఈ సంస్కారము కలదు. వారు దీనిని 'బిస్మిల్లాఖాని' అని అందురు. ఐదవ సంవత్సరమున, నాల్గవ మాసమున, నాల్గవరోజున చేయుదురు. ముగల్ చక్రవర్తి హుమయూన్‌న కిది జరిగినట్లు, వెనుక ఉత్సవము జరిగినట్లు శాహజహాం నామ(Asiatic Society of Bengal) నందు కలదు.

శూద్రకమలాకర మందు ధనుర్విద్య, ఛురికాబంధనముల ప్రస్తావన కలదు. కార్తీక పూష్యమాసములలో శని-సోమ-బుధ వారములందు, పునర్వసు, పుష్యమి, భరణి, హస్త, స్వాతి, చిత్ర, కృత్తిక, మఘ, రోహిణి, ఉత్తరాత్రయము, శ్రవణ, ధనిష్ఠ, మూల, మృగశిర, పుబ్బ, రేవతి -- ఈ నక్షత్రములందు ధనుర్విద్య చెప్పట శుభమని ధనుర్విద్యాదీపిక యందు కలదు. "సర్వాయుధమహామాత్ర........................" ఆదిగా గల శ్లోక మంత్రముచే లక్ష్మినారాయణ సరస్వతులను పూజించి ఒక బాణమును తూర్పుగ వేయవలెను. అట్లే చురకత్తిని ధరించుట కూడ కలదు.

* * *

# ఉపనయనము

## దీక్షా ప్రకారము:

విభిన్న ధర్మములందు, జాతులందు సాంస్కృతిక సామాజిక దీక్ష రకరకములుగా నుండును. వనవాసులందును ఒకరకమైన దీక్ష కలదు. కొన్ని జాతులందు సామాజిక జీవన ప్రవేశము కొన్ని అనివార్యమైన నియమములను పాటించిననే జరుగును. వనవాసులందు కొందరు ఒక విశేష అంగభంగము ద్వారా దీక్ష నిత్తురట. కొన్ని తెగలందు బాలికలను కొన్ని రోజు లేకాంతవాసములో నుంతురట. మహమ్మదీయులు బాలుని శిశ్నాగ్ర భాగమున గల చర్మమును (సున్తీ) కత్తిరించుట ద్వారా దీక్షితుని చేయుదురు.

## హైందవ దీక్ష:

హైందవ సమాజమున సాంస్కృతికమైన, ఉపనయన దీక్ష ద్వారమున సమాజమున సభ్యుడుగా పరిగణింపబడును. ఉపనయనము లేనిచో ద్విజుని గా పరిగణింపరు. అతడు సంఘమునుండి బహిష్కృతుడు. ఉపనయనము విశాల సాహిత్య భాండాగారములో నున్న జ్ఞానమును తెలిసి కొనుటకై ప్రవేశ పత్రము వంటిది. భౌతిక జీవనమునకేకాక ఆధ్యాత్మిక జీవనమునకు కూడ ఇది అత్యంతావశ్యకము. నౌజాత్ (క్రొత్త జన్మ) యనునొక సంస్కారము పార్శీ దేశస్థులందు కలదు. అది మన ఉపనయనము వంటిదే. బాల బాలికలకు ఆరవ సంవత్సరమున, మూడవ మాసమున నిది చేయుదురు. దీని వలన ఆర్య-ఇరానీ సంబంధము తెలియును.

## శబ్దార్థము:

మానవ, కాఠక. గృ.లు ఉపనయనమునకు బదులు ఉపాయనమన్నవి. కాఠకముపై ఆదిత్య దర్శనుడు వ్యాఖ్యానము వ్రాయుచు ఉపాయన, ఉపనయన, మౌంజీ బంధన, వటుకరణ, వ్రతబంధ పదములు పర్యాయములని వ్రాసెను. దీనిని సావిత్రీవచనమని కూడ అందురు.

దీనికి రెండు విధములుగా అర్థము చెప్పవచ్చును. 1) ఆచార్యుని దగ్గరకు తీసికొని వెళ్ళుట. 2) ఏ సంస్కారముచే బ్రహ్మచారి ఆచార్యుని దగ్గరకు తీసికొని పోబడునో అట్టిది.

అథర్వ వేదమున బ్రహ్మచారిని గ్రహించుట అను అర్థమున ఈ శబ్దము వాడబడినది. ఇక్కడ ఆచార్యుని ద్వారా వేద విద్యయందు బ్రహ్మచారికి దీక్ష అను నర్థము వచ్చును. అట్లే శత. (చా.ను బట్టి కూడ (11.54).

రెండవ అర్థమును బట్టి గాయత్రీమంత్రము ద్వారా ద్వితీయ జన్మప్రాప్తికై ఈ సంస్కారముద్దిష్టము. "ద్వితీయ జన్మ (వైదిక లేక బ్రహ్మజన్మ) మౌంజీబంధనము వలన, మేఖల ధారణ వలన సూచితము. బ్రహ్మచారికి సావిత్రి తల్లి, ఆచార్యుడు తండ్రి యగుచున్నాడని మనువు.

"తత్ర యద్ బ్రహ్మ జన్మాస్య మౌంజీ బంధన చిహ్నితమ్
తత్రాస్య మాతా సావిత్రీ పితాత్వాచార్య ఉచ్యతే"

యాజ్ఞ. స్మృతి పై అపరార్కుడు వ్రాసిన వ్యాఖ్యలో ఇట్లు కలదు. ఉపనయనమువలన అంతేవాసి గాయత్రీ సమీపమునకు తీసికొని రాబడును. ఆచార్యుడు దీనిని స్థాపించును. అట్లే ఆప.ధ.సూ.న ఈ యర్థమే గ్రహింపబడినది. వానికి విద్యాధ్యయనము గాయత్రీ మంత్రోపదేశము ద్వారా చేయబడును. దీనికి వేద మంత్రాధారము కూడ కలదు. పరమేశ్వరుడు గాయత్రితో బ్రాహ్మణుని, త్రిష్టుభ్‌తో రాజన్యుని, జగతీఛందస్సుతో వైశ్యుని సృజించెను. దానినే వశిష్ఠుడు. "గాయత్రాబ్రాహ్మణ మసృజత, త్రిష్టుభారాజన్యం, జగత్యావైశ్యం న కేనచిచ్ఛందసా శూద్రమిత్య సంస్కార్యో విజ్ఞాయతే." కాత్యాయన శ్రౌ.సూ.న బ్రాహ్మణుని గాయత్రితో దీక్షితుని చేయవలెనని కలదు.

మొదటి అర్థమునుబట్టి "ఉపసమీపే ఆచార్యాదీనాం వటోర్నీ తిర్నయనం ప్రాపణముపనయనమ్" (వీ.మి).

వీర మిత్రోదయమున ఒక ఆచార్యుని మాటను బట్టి దీనికి విపులార్థము కలదు. అందు కేవలము విద్యకొఱకే అనునర్థమందు గాక. ఈ కృత్యము వలన గురు, వేద, యమ నియమాదులు, మరియు దేవతా సామీప్యమునకై దీక్ష గ్రహింపబడుట అను అర్థము కలదు.

"గురోర్వ్రతానాం వేదస్య యమస్య నియమస్య చ
దేవతానాం సమీపం వా యేనా సౌ నీయతేఽసౌ."

ఆధునిక కాలమున పై యర్థము లన్నియు లోపించినవి. ఇది చాలా మంది విషయములో వివాహమునకు కొద్దిముందు జరుపబడు క్రియగా యజ్ఞోపవీతమను బాహ్య చిహ్నమును ధరించుటయే ఫలముగా మిగిలినది.

సంస్కార ప్రయోజనము:

ఈ సంస్కారము మూలతః విద్యయే పరమ ప్రయోజనముగా గలది. శిష్యుడు ఆచార్యుని సమీపమునకు తీసికొని వెళ్ళబడుట గౌణము. ఉప నయనము కేవలము ఛాత్రునకు గురుని సమీపించునపుడే గాక, వివిధ వేద శాఖలను అధ్యయనము చేయునపుడు కూడ జరుగుట కలదు.

"యచ్ఛాఖీ యైస్తు సంస్కారైః సంస్కృతో బ్రాహ్మణీ భవేత్
తచ్ఛా ఖాధ్యయనం కార్యమేవం నపతితో భవేత్."

పై వాక్యమునకు ప్రమాణము ఛాందోగ్యమున లభించును. (5.2.7) వేదములను అధ్యయనము చేయుటయే మహోత్తమ ప్రయోజనమని యాజ్ఞ వల్క్యుడు. మహావ్యాహృతుల పూర్వకముగా శిష్యునకు ఉపనయనము చేసి వేదమును, ఆచారమును, శీలమును (శౌచము) అభ్యసింప చేయవలెను.

"ఉపనీయ గురుః శిష్యం మహావ్యాహృతి పూర్వకమ్
వేద మధ్యాపయేదేనం శౌచ మాచారాంశ్చ శిక్షయేత్."

దీనినే విద్యాధ్యయనము కోరు వ్యక్తికి శ్రుతి విహితమైన సంస్కారమని ఆప. భార.లు తలచిరి. "ఉపనయనం విద్యార్థస్య శ్రుతితః సంస్కార ఇతి."

48 సంస్కారముల వలన సంస్కృతుడైన వ్యక్తి బ్రహ్మ, ఋషి సాన్నిధ్యమును పొందునని గౌతముని వాక్కు. మనువు ననుసరించి

ఇది ఐహిక, పారలౌకిక జీవనమును పవిత్రము చేయును. అంగిరసుని అభిప్రాయం ప్రకారము దీనివలన బ్రాహ్మణత్వము ప్రాప్తించును. (వీ.మి. 1.137).

కాలము గడచిన కొలది ఈ సంస్కారము మూలతః వర్జ్యమైనను తుదకు అంధులకు, షండులకు, వామనులకు, కుంటివారికి, జడులకు, మూగవారికి ఆవశ్యకముగ పరిగణితమైనది. పైన పేర్కొనబడినవారు యజ్ఞయాగాదులందు మాత్రమే నిషేధింపబడిరి కాని ఉపనయనమున కాదని పెద్దలందురు.

ఉచిత కాలము: (వయస్సు)

వార.గృ.న పుట్టుకనుండిగాని, గర్భధారణ నుండికాని, బ్రాహ్మణునకు 8వ వర్షమున చేయవలెననియు, క్షత్రియులకు 11న, వైశ్యులకు 12న, లేక కుటుంబాచారమును కూడ పాటింప వచ్చునని కలదు. యాజ్ఞ. కుటుంబా చారము, శాం.గృ. గర్భమునుండి 8గాని పదిగాని, మానవ గృ. 7-9, కాఠక గృ. త్రైవర్ణికులకు 7,9,11, వైఖ. గర్భమునుండి 5-8-9 సంవత్సరములలో బ్రాహ్మణునకు ఆధ్యాత్మిక సంపత్తి, దీర్ఘ జీవనము, భాగ్యముల నిమిత్తమై; ఆప.ధ.సూ. బౌధ.గృ. ఆ.గృ.శాం.గృ.లు బ్రాహ్మణునకు. గర్భాష్టమమున బ్రాహ్మణునకు, క్షత్రియునకు పదునొకండవ సంవత్సరమున, వైశ్యునకు పండ్రెండవ సంవత్సరమున విధించినవి. భార.గృ.గర్భ ప్రభృతి తొమ్మిదవ సంవత్సరమున బ్రాహ్మణ బాలకునకు, హిర.గృ.బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు 7-11-12 పుట్టిన తరువాత విధించినవి.

5వ ఏడునకు తక్కువగా నిది చేయరాదని తెలుచున్నది. ఉపనయన మునకు అంతిమ సీమ ఇట్లు కలదు. బ్రాహ్మణునకు 16వ సంవత్సరము వరకు, క్షత్రియునకు 22 వరకు, వైశ్యునకు 24వ సంవత్సరము వరకు చేయవచ్చును. (పా.గ్ర.) 17వ శతాబ్దికి చెందిన మిత్రమిశ్రుడు పై ముగ్గురికి 24,33,36 సంవత్సరములలోపు వరకు చేయవచ్చునని ఉదార భావమును ప్రకటించెను.

మిగిలిన సూత్రముల వలె వర్ణములను చెప్పక ఏడవ లేక తొమ్మిదవ వత్సరమును చెప్పినది మానవ.గృ. కౌశిక సూత్రము వయస్సును పేర్కొన లేదు.

జైమిని యందు 16 సం.లపైబడిన వానికి, యౌవన దశ ప్రాప్తించిన వానికి ఉపనయనము చేయరాదని శాపించినది.

ఇట్లు వర్ణ భేదమును బట్టి నిర్ణయించుటను కొందరు విమర్శించిరి. ఇది బ్రాహ్మణుల కపోలకల్పనమని, దంభమును సూచించునని, Ancient Indian Educationలో Keye వ్రాసెను. కాని బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు క్రమముగా సావిత్రీ మంత్రము 8,11,12 అక్షరములతో కూడి యుండును. "బ్రాహ్మణాది వర్ణ సంబంధినాం ఛందసాం పాదాద్యక్షర సంఖ్యై రుపనయన విధిః" అని మనువు. ఆయా వర్ణముల ప్రతిభా విశేషమును బట్టి ఈ వయో నిర్ణయ మేర్పడి యుండవచ్చునని 'The Educational systems of the Hindus' అను గ్రంథమున S.K. Das వ్రాసెను.

కొన్ని విశిష్ట గుణముల ప్రాప్తికై ఈ కాలము విధింపబడినది. బ్రహ్మవర్చస్సునకై ఏడవ వర్షమున, దీర్ఘాయుష్యమునకై 8, వీర్యమునకై 9, భోజనమునకై 10, బలమునకై 11, పశు సంపదకై 12, బుద్ధి వైభవమునకై 13, భాగ్యమునకై 14, సోదర సమృద్ధికై 15, అన్ని గుణముల ప్రాప్తికై 16న చేసికొనవలెనని బౌధాయనాదులందు కలదు.

బ్రహ్మ వర్చసమునకై బ్రాహ్మణునకు 5న, బలమునకై క్షత్రియునకు 6న, ఐశ్వర్యమును కోరు వైశ్యునకు 8న చేయవలెనని మనువు.

జైమిని గృ.న. బ్రహ్మ వర్చస కాముడైన బ్రాహ్మణునకు 5వ ఏటను, దీర్ఘ జీవనమునకై 9న చేయవలెనని చెప్పబడినది.

**సమయము:**

దీనిని ఒక శుభ సమయమును చూచి చేయుదురు. సాధారణముగ సూర్యుడుత్తరాయణ పుణ్యకాలమున నున్నపుడు చేయుదురు. వైశ్య బాలకునకు దక్షిణాయనము కూడ విహితమే. (బృహస్పతి వీ.మి.)

భిన్న భిన్న వర్ణములకు భిన్న భిన్న ఋతువులు నిర్దేశింపబడినవి. బ్రాహ్మణునకు వసంతమున, క్షత్రియునకు గ్రీష్మమున, వైశ్యునకు శరదృతువున, రథకారునకు వర్షఋతువున అని బౌధ గృ.సూ. లేదా అందరకు వసంతమున చేయువచ్చునని అందేకలదు. భార.గృ.న బ్రాహ్మణునకు వసంతమున, క్షత్రియునకు గ్రీష్మమున కాని హేమంతమున కాని, వైశ్యునకు శరత్తున, వర్ష ఋతువున రథకారునకు అని కలదు.

ఆయా ఋతువులు, ఆయా వర్ణ స్వభావ ధర్మములకు ప్రతీకలు. సమశీతలోష్ణతకల వసంతము బ్రాహ్మణునకు, వీరత్వము, ఉత్సాహమును ఉష్ణత్వము గల గ్రీష్మము క్షత్రియునకు, సమృద్ధి, ఐశ్వర్య కారణమగు శరత్తు వైశ్యునకు విహితములు.

కొన్ని విశిష్ట గుణముల ప్రాప్తికై ఆయా మాసములు పేర్కొనబడినవి.

మాఘ మాసమున సమృద్ధి, ఫాల్గునమున బుద్ధిమత్త్వము, చైత్రమున వేద నిష్ణాతృత్వము, వైశాఖమున సంపదలు, జ్యేష్ఠమున ప్రాజ్ఞత్వ శ్రేష్ఠత్వములు ఆషాఢమున శత్రుంజయత్వ, పాండిత్యములు సిద్ధించునని రాజమార్తాండము.

దీనిని శుక్ల పక్షమున చేయువలయును. ఈ పక్షము ప్రకాశమునకు, జ్ఞానమునకు, విద్యకు ప్రతీకము. పుంనామ నక్షత్రము మంచిదని భార.హిత.లు.

వృద్ధగార్గ్యుడు మాఘమునుండి ఆరు నెలలవరకు ఉచితమని చెప్పగా మరికొందరు 5 నెలల వరకే యనిరి. పాడ్యమి, చవితి, సప్తమి, అష్టమి, నవమి, త్రయోదశి, చతుర్దశి, పదునైదవది సాధారణముగ విడువదగినవి. కొందభిప్రాయ భేదములు కలవు. ఈ విషయమున జ్యోతిష సంబంధమైన వివరణలు పెక్కుగలవు. బృహస్పతి, శుక్రుడు, అంగారకుడు, బుధుడు నాలుగు వేదములకు అధిష్ఠాన గ్రహములు. కనుక పై వేదములు చదువు వారికి ఆయా గ్రహము అధిపతిగా గల వారమున ఉపనయనము కావలెను. (స్మృ.చ) వారములలో బుధ, లక్ష్మి, శుక్ర వారములు ప్రశస్తములు. ఆదివారము సామాన్యము. తప్పనిసరి యగుచో సోమవారము. మంగళ,

శని వారములు పనికి రావు. క్షత్రియులకు, సామ వేదులకు మంగళ వారము పనికి వచ్చును. నక్షత్రములలో హస్త, చిత్ర, స్వాతి, పుష్యమి, ధనిష్ఠ, అశ్విని, మృగశిర, పునర్వసు, శ్రవణము, రేవతి ప్రశస్తములు. భరణీ, కృత్తిక, మఘ, విశాఖ, జ్యేష్ఠ, శతభిషము మినహాయించి ఏ నక్షత్రమైనను మంచిదేయని ఒక సిద్ధాంతము. చంద్ర, బృహస్పతుల బలము బాలకుని జాతకమున నుండవలెను. సూర్యోదయమైన 4 గంటల వరకు ప్రశస్తము. ఆపైన మధ్యాహ్నము వరకు మధ్యమ కాలము. ఆపైన విహితము కాదు. కొందరు బ్రహ్మచారి పుట్టిన మాసములో పనికి రాదనియనగా, పుట్టిన పక్షము పనికి రాదని కొందరు చెప్పిరి. లగ్నకాలము గూర్చి కూడ చాల నియమములు కలవు. వ్యతీపాత, వైధృతి యోగములు పనికి రావు. (నియమ వివరములకై నిర్ణయసింధు మొదలగు గ్రంథములను చూదుడు.)

## వ్రాత్యుడు:

పై నుదహరింపబడిన కాలముల లోపుననైనను ఈ సంస్కారము చేసికొనని వానిని వ్రాత్యునిగా పరిగణించెడివారు "ఎవనికి నిర్ణయించిన కాలమునకు వెనుక కూడ ఉపనయనము కాదో అతడు వ్రాత్యుడు, సావిత్రీ పతితుడు. ఆర్య సమాజమునుండి వెలివేయబడును" అని మనువు. ఇతనిని అనార్యుల పంక్తిలో లెక్కించెడివారు. (అందే) వీరిని ఆర్యేతర జాతిగా కొంతమంది ఆధునికులు పరిగణించిరి. వీరు ఆర్యజాతికి చెందిన వారైనను ధార్మిక దృష్టితో చూచిన, వీరు ధర్మ భ్రష్టులు. గో.భి. సూత్రము ననుసరించి వ్రాత్యస్తోమము ద్వారా వైదిక క్రియాకలాపము జరిపిన వెనుక వారికి వేదాధ్యయనార్హత సిద్ధించుటచే మనమట్లు భావింపవలెను. యజ్ఞము చేయనివానిని, సోమ పానము చేయని వానిని వ్రాత్యులందురని పరాశర మాధవీయము. ఇట్టి మహోత్తమ సంస్కారము వేదవాఙ్మయమున ఎట్లు స్తుతింప బడినదో పరిశీలింతము.

## వేదములందు ప్రస్తావన:

ఋగ్వేదమునందు యూపస్తంభము బ్రహ్మచారిగా స్తుతింపబడినది. యూపస్తంభము రశనతో చుట్టబడినటుల విద్యార్థి మేఖలతో చుట్టబడి

వచ్చినాడని అథర్వవేదమున బ్రహ్మచారి ప్రస్తావన కలదు. బ్రహ్మచారి తన తేజస్సుతో నింపుచు రెండు భువనములందు తిరుగుచున్నాడు. ఆచార్యుడు, బ్రహ్మచారిని గర్భస్థ శిశువుగా చేయుచున్నాడు. ఈ ద్యావాపృథ్వులు బ్రహ్మచారికి సమిధల వంటివి. తన మేఖలచే, సమిధలచే, కఠోర పరిశ్రమలతో కూడిన జీవితముచే భువనముల నింపుచున్నాడు. కృష్ణ మృగచర్మమును ధరించుచు దీర్ఘ శ్మశ్రులతో కూడియున్నాడు అను నర్థమిచ్చు మంత్రములు కలవు.

తై.బ్రా.న జీవితమున మూడు భాగములు బ్రహ్మచర్యముతో గడపిన భరద్వాజునకు ఇంద్రుడు వేదరాశి నుండి మూడు పిడికిళ్ళు (వేద పర్వతముల నుండి) తీసి అతడు ఇన్నాళ్ళు చదివినది దీనితో సమానమని చెప్పినట్లు కలదు. అంతేవాసి యను పదము శత.బ్రా.తై.ఉప. న వచ్చును. వరుసగా వారము రోజులు సమిధలను ప్రోగుచేసి అగ్ని పరిచర్య చేయక పోయినచో భిక్షాటన చేయనిచో మరల ఉపనయనము చేసికొనవలెనని గోపథమున కలదు. గృహిణి భిక్ష పెట్టవలెనని అందేకలదు. శయ్యపై పరుండరాదని, నృత్య గీతములు చేయరాదని, తిరుగరాదని, ఉమ్మి వేయరాదని, శ్మశానమునకు వెళ్ళరాదని అందే కలదు. ఉపనిషత్తులందు బ్రహ్మవిద్యాప్రాప్తికి ఆచార్యుడే అంతిమ గతియని, ఆచార్యస్థానము ప్రశంసింపబడినది. ఆచార్యస్తుతే గతిర్వక్తా. (ఛా.ఉ.ప.)

గురుకులమున ప్రవేశించిన మాత్రముననే బ్రహ్మచారికాదు. ఆచార్యుడు నిర్దేశించిన నియమములను పాటించిన వెనుక బ్రహ్మచర్యాశ్రమమున ప్రవేశించుటకు అర్హుడగును. ఈ గుహ్యవిద్యను సందేహశీలునకు, అశిష్టునకు గాక, అనన్యభక్తునకు, సర్వగుణ సంపన్నునకు ప్రసాదించవలెను. అని తై. ఉప. "ఏతద్ గుహ్యతమం నా పుత్రాయ నా శిష్యాయ కీర్తయే దనన్య భక్తాయ సర్వగుణ సంపన్నాయ దద్యాత్."

గురువునకు సేవ చేయుట, గోవులను మేపుట, యజ్ఞాగ్నిని నిరంతరము ప్రదీప్తమగునట్లు చేయుట, మొ. బ్రహ్మచారి చేయుపనులు. సత్యకామ జాబాలి వృత్తాంతమున బ్రహ్మచారి గోవులను తోలుకొని వెళ్లుట, తిరిగి

ఇంటికేగునపుడు లెక్కపెట్టిన వేయి యుగువరకు రావద్దని ఆదేశ మిదుట ఛా.ఉ.న కలవు. బ్రహ్మచర్య జీవనము 12 నుండి 24 సంవత్సరముల వరకు నుండెడిది. ఏ విద్యార్థియైనను క్రొత్త గురువు దగ్గర అధ్యయనము చేయుటకు వెళ్లినచో మరల ఉపనయనము చేసికొనునట్లు ఉపనిషత్తుల వలన తెలియుచున్నది. వృద్ధుడు కూడ ఛాత్రుడగునని ఆరుణి కథ వలన తెలియును. (బృహ.ఉప.) చదువైన వెనుక వ్యవహార జీవనమునకు ఉపయోగించు ఆదేశములు తైత్తిరీయ ఉ.ప.నందు కలవు.

బ్రాహ్మణములందు ఉపనయన కర్మకాండ పూర్ణముగా కలదు (ఉదా. శత. బ్రా. 1.2 1-8).

ఆచార్యోపదేశమును పొందుటకు కొంత కర్మకాండ అవసరమైనను, ఉపనయనము చేయబడకయే అశ్వపతి కేకయుడు నలుగురికి అధ్యాపనము చేసినట్లు, వారు కేవలము సమిత్పాణులై వెళ్లినట్లు కలదు. దీనిని బట్టి పూర్వ కాలపు విద్యార్థులు బ్రహ్మచర్యమునకై కర్మకాండ లేక వాచా గురువు దగ్గరకు వెళ్ళినట్లు తోచునని శ్రీ పి.వి. కాణే అభిప్రాయ పడుచున్నారు. సర్వాంగములతో కూడి వెళ్లినట్లుగా భావించుకొనవలెనని పెద్దలందురు. ఉపనయనము ఎప్పుడు జరుపబడునో ఉపనిషత్తులందు స్పష్టముగా లేకపో యినను శ్వేతకేతువు ద్వాదశ వర్ష ప్రాయమున వెళ్లినట్లు కలదు. నైష్ఠిక బ్రహ్మచర్యమును ఛాందోగ్యము చెప్పినది. తండ్రి సమర్థుడైనను గురువు నొద్దకు పిల్లవానిని పంపుట కలదు.

శీలమును కాపాడుకొనుచు బ్రహ్మచర్యమును పాటించువానికే గురువు విద్యను ఉపదేశించి నటుల తోచును. అట్టి బ్రహ్మచారిని అథర్వవేదమిట్లు స్తుతించినది.

"బ్రహ్మచారిణం చరతి రోదసీ ఉభే తస్మిన్ దేవాః సంమనసో భవంతి.
స దాధార పృథివీం దివం చ స ఆచార్యం తపసా పిపర్తి."

అనగా తపశ్చర్యతో కూడిన బ్రహ్మచారి స్వర్గమర్త్య లోకములను ఒకేసారి స్పృశించు చున్నాడు. ఇంద్రాది దేవతలు ఆశీర్వదించుటకు సిద్ధ

ముగా నున్నారు. స్వర్గమర్త్యలోకములను ధరించుటచే గురువునకు కీర్తిని సంపాదించి పెట్టుచున్నాడు.

పితృదేవతలు, ఇంద్రాది దేవతలు, గంధర్వులు మొ॥ వారు బ్రహ్మచారిని రక్షించు చున్నారు. విశ్వపోషణకు, విశ్వరక్షణకు బ్రహ్మచర్యమే మూలమని అందే కలదు.

"బ్రహ్మచారిణం పితరో దేవజనాః
పృథక్ దేవా అనుసంయంతి సర్వే
గంధర్వో ఏనమన్వాయన్ త్రయస్త్రింశత్
త్రిశతా షట్సహస్రాః సర్వాన్త్సదేవాం స్తపసా పిపర్తి."

అథర్వ వేదము ఇంకను బ్రహ్మచారిని ఇట్లు నుతించుచున్నది.

"అగ్ని కార్యము వలన బ్రహ్మచారి అగ్నివలె ప్రకాశించు చున్నాడు. తుదకు బ్రహ్మచారి గంగాది నదులకు బ్రహ్మకు కూడ ఆధార భూతుడగు చున్నాడు. ఈ బ్రహ్మచర్య బలము వలననే బ్రహ్మ సమస్తమును సృష్టించెను. ఇంద్రుడు, రాక్షసులను జయింపగలిగెను." ఇంద్రుడు దేవతలలో ఉన్నత స్థానమును పొందుటకు బ్రహ్మచర్యమే కారణమని "ఇంద్రో హ్యై బ్రహ్మచర్యేణ దేవేభ్యః స్వరాభవత్" అని అథర్వణ వేదము.

"వరుణుడు భూమికి నీటినిచ్చుటచే ఆచార్యుడగుచున్నాడు. ప్రజాపతికి సర్వమర్పణ చేయుచున్నాడు. అతడు బ్రహ్మచర్యమును పాటించునపుడు తన శరీర సుఖమును గూర్చి ఆలోచించుట లేదు." అను మంత్రార్థము ద్వారా బ్రహ్మచారి యొక్క సర్వార్పణ భావము గోచరించుచున్నది.

"రాజు ప్రజలను పాలించుటలో, స్త్రీ తగిన వరుని పొందుటలో బ్రహ్మచర్యమే మూలము."

"వేద రహస్యములను బ్రహ్మచారి ధరించుటచే సమస్త విశ్వమునకు ఆధారభూతుడగుచున్నాడు."

"ఓషధుల జీవనమునకు, గ్రహతారకాదుల గమనమునకు, ఋతు పరి భ్రమణమునకు బ్రహ్మచారి తపస్సే మూలము" మొదలగు అసంఖ్యాకమైన అథర్వణ మంత్రముల వలన బ్రహ్మచర్య ప్రభావ మవగతమగును.

బ్రహ్మచారి అగ్ని కార్యము విధిగా చేయవలెనని విధించు గోపథ బ్రాహ్మణ వాక్యమును గమనింపుడు. "ప్రజలందరు మృత్యువునకు వశమగు వారే. బ్రహ్మచారిని తాను రక్షించుచున్నట్లు ప్రజాపతి చెప్పెను. ఏ రాత్రి బ్రహ్మచారి అగ్నికి ఆహుతినీయడో అప్పడే మృత్యువునకు వశమగువని ప్రజాపతి అనెను."

"బ్రహ్మ హ వై ప్రజా మృత్యవే సంప్రాయచ్ఛత్, బ్రహ్మ
చారిణమేవ న సంప్రదదౌ, సహో వా వాస్యా
మస్మిన్నితి, కిమితి, యాం రాత్రిం సమిధ మానా
హృత్య వసేత్, తాం ఆయుషః అవరుంధీయేతి,
తస్మాత్ బ్రహ్మచారీ అహారహః సమిధా మాహృత్య సాయం
ప్రాతః అగ్నిం పరిచరేత్."

సంతానము కనినంత మాత్రముననే పితౄణమునుండి విముక్తిని పొందలేడని, అతని పుత్రుడు క్రమశిక్షణతో కూడిన వాడై, శాస్త్ర కర్మలందు అనుష్ఠానపరుడైనపుడు మాత్రమే తండ్రి ఋణ విముక్తుడ గుచున్నాడని బృహదారణ్యకశ్రుతి. అందుగల మంత్రమును మాధవులిట్లు వ్యాఖ్యానించిరి.

"న హి పుత్ర జనన మాత్రేణ పితుః ఆనృణ్యం కిం తర్హి?
సమ్యగనుశిష్టేనపుత్రేణ శాస్త్రీయేషు
కర్మసు సమ్యగనుష్ఠితేషు పశ్చాత్ ఆనృణ్యం సంపద్యతే."

ఆ పైన వేద జ్ఞానము వలననే బ్రాహ్మణుడు ఋషిత్వమును పొందుచున్నాడని తైత్తిరీయము.

"ఏష వై బ్రాహ్మణ ఋషిః ఆర్షేయః య శ్శ్రువాన్"

వృద్ధుడైనంత మాత్రమున, వెంట్రుకలు నెరసినంత మాత్రమున, డబ్బు ఉన్నంత మాత్రమున పూజ్యుడు కాలేడని, వేదమును అభ్యసించుట, దాని

అర్థమును గ్రహించుట, అనుష్ఠానము వలననే వృద్ధుడగునని మనువు నై అభిప్రాయములనే సమర్థించినాడు.

"న హాయనై: న పలితై: న విత్తేన న బంధు భి:
ఋషయః చక్రిరే ధర్మం యోఽనూచానః స నో మహాన్
న తేన వృద్ధో భవతి యేనాస్య పలితం శిర:
యో వై యు వాప్యధీయానః తం దేవాస్థ విరం విదుః"

చదువు కంటె శీలమున కెట్టి ప్రాధాన్యమిచ్చిరో తిలకింపుడు శీలము కలిగిన విప్రుడు గాయత్రీ మంత్రము మాత్రమే ఎరిగినను శీలము లేక వేదములన్నిటిని అభ్యసించిన బ్రాహ్మణుని కన్నమిన్న యని మనువు.

"సావిత్రీ మంత్ర సారోఽపి వరం విప్రః సుయంత్రి తః
నాయంత్రిత స్త్రివేదోఽపి సర్వాశీ సర్వ విక్రయీ"

ఇదే భారతీయ విద్యకు మూలస్తంభము.

భారత దేశము కన్న మిగిలిన దేశములలో ఎట్లు జీవించవలెనో చెప్పునది విద్యకాగా, ఈ దేశమున ఆ అభిప్రాయముతో బాటు ఎట్లు జనన మరణముల నుండి విముక్తిని పొందవలెనో కూడ చెప్పను.

ఆనాటి విద్య నైతిక సూత్రములతో, ఆధ్యాత్మిక సంపత్తితో కూడినది. వ్యక్తి వికాసమునకు తోడ్పడునట్టిది ఆ విద్య. ఇది నాగరిక వాతావరణమునకు భిన్నమై, మానసిక చాంచల్యము, వ్యసనములకు దూరమై యుండును.

దీనికి ధనికుడు, పేద అను తరతమ భేదమునకు తావు లేదు. ధనికుడైనను, బీదవాడైనను భిక్షమెత్తవలసినదే. (మాధుకరము) ఈ భిక్షాచర్య వలన వినయ సంపద, భక్తి విశ్వాసములు వృద్ధి పొందుననుటలో సందేహము లేదు.

బీదతనము చదువునకు ఆటంకముగా నుండెడిది కాదు. విద్యార్థి తెలివితేటలకు, గుణసంపదకే ఇందు ప్రాధాన్యము. ఒక్కొక్క ఆశ్రమము నందు తక్కువ మంది విద్యార్థులుండుటచే, ఒక్కొక్కరిపై ప్రత్యేక శ్రద్ధ

తీసికొనుటకు వీలుండెడిది. ఆ కాలమున ధన సంపాదనయే విద్యకు లక్ష్యముగా పరిగణించెడివారు కాదు. అందరికి ఉచిత విద్యా ప్రదానముండెడిది. ప్రభుత్వము కలుగచేసికొనుట కానరాదు. మహారాజులైనను ఆచార్యులకు పాదాక్రాంతులయ్యెడి వారు.

దుష్యంతాది మహారాజులనే శాసించగల శక్తి ఆనాటి విద్యార్థుల కుండెడిది. (అభిజ్ఞాన శాకుంతలము)

సహజమైన ప్రకృతిలో శుద్ధమైన వాతావరణములో విద్యయే పరమ ప్రయోజనముగా, విద్యకొరకే విద్య అనుధోరణిలో ఆనాటి విద్య కొనసాగెడిది. మానసిక ప్రకృతికి అనుగుణముగా విద్యా ప్రదాన ముండెడిది. అందరికి ఒకే విద్య కాక, వారి వారి మానసిక స్థితిని బట్టి ఆయా విద్యలను అభ్యసింపచేసెడి వారు. పై చెప్పిన విద్యా విధానమునకు నేటి విద్యావిధానమునకు గల భేదమును విజ్ఞులు గ్రహింతురుగాక!

పై విధానములతో పెరిగిన విద్యార్థికి ఆచార్యుడు ద్వితీయ జన్మను ప్రసాదించు చున్నాడనుటలో ఆశ్చర్యమేమి? తల్లిదండ్రులు జన్మ కారణమైనను ఆచార్యోపదేశము వలన బాలుడు ద్వితీయ జన్మను పొందుచున్నాడని ఆపస్తంబుడు.

"సహి విధావతః, తం జనయతి తాచ్ఛ్రేష్ఠం
జన్మ శరీర మేవ మాతా పితరౌ జనయతః"

### ఆచార్యుని సమక్షమునకు బాలకుని తీసికొని వెళ్లుట:

ప్రాచీన కాలమున తండ్రియే కొడుకునకు విద్యాప్రదానము చేయునట్లు తోచును. ఉదా. శ్వేతకేతువు తన తండ్రియైన ఆరుణినుండి విద్యను గ్రహించుట. పితామహుని మత ప్రకారము తండ్రి, పితామహుడు, తండ్రి సోదరుడు లేదా పెద్దన్నగారు, వటువు యొక్క సంరక్షకులు అందు పూర్వపూర్వము అభావమైనచో ఉత్తరోత్తరులు ఆచార్యుని దగ్గరకు తీసికొని వెళ్ళుటకు అర్హులు. ఇట్టి సహజ సంరక్షకులు కూడ లేనిచో సమాన వర్ణులలో నున్న పెద్ద, ఆచార్యుని దగ్గరకు తీసికొని వెళ్ళుటకు అర్హుడని

వృద్ధ గర్గవచనము. ఎవరు లేనపుడు స్వయముగా విద్యార్థియే ఉపనయార్థమై గురువును సమీపించును. ఇందులకు ఉపనిషత్తులందు అనేకోదాహరణలు కలవు.

ఆచార్యునెన్నుకొనుట:

యథాసంభవముగా శ్రేష్ఠతముడైన ఆచార్యునకై యత్నము చేయవలయును. కారణమేమనగా ఉపనయనముయొక్క ఉద్దేశ్యములు జ్ఞానప్రాప్తి, శీల నిర్మాణము "అవిద్వాంసుడైన ఆచార్యుని సమీపించిన అంధకారము నుండి అంధకారములోనికి ప్రవేశించినట్లే." "తమసో వా ఏష తమః ప్రవిశతి యమవిద్వానుపనయతే." (వీ.మి.)

"కుమార స్యోపనయనం శ్రుతాభిజన వృత్తవాన్,
తపసాధూత నిశ్శేషపాప్మా కుర్యాత్ ద్విజోత్తమః.

"శ్రుతవంతుడు అభిజాతుడు, చరిత్రవంతుడు, తపఃపూతుడైన బ్రాహ్మణుని కడకు బాలకుని పంపవలెను" అని శౌనకవచనము.

న యూజయేత్ వృత్తహీనం వృణుయాచ్చ న తం గురుమ్,
నహి మజ్జాకరా దిగ్ధా రుధిరేణ విశుధ్యతః."

చరిత్రహీనుని దగ్గర అధ్యయనము చేయరాదు, మజ్జ పూయబడిన చేతులు రక్తముచే శుభ్రము కావు". అని హారీతుని వాక్కు.

వేదైకనిష్ఠం ధర్మజ్ఞం కులీనంశ్రోత్రియం శుచిమ్,
స్వశాఖాయామనాలస్యం విప్రం కర్తార మీప్సితమ్."

"బ్రాహ్మణుని, వైదికనిష్ఠుని, కులీనుని, శ్రోత్రియుని, శుచిమంతుని, స్వశాఖాధ్యాపనము చేయువానిని ఆశ్రయించవలె"నని వ్యాసుడు.

ఆచార్యు డెట్లుండవలెనో యమస్మృతి యిట్లు పేర్కొన్నది. "సత్య వాక్కు, ధృతిమంతుడు, దక్షుడు, ప్రాణులపట్ల దయాళువు, ఆస్తికుడు, వేదస్వాధ్యాయ నిరతుడు, శుచిమంతుడు, చరిత్రవంతుడు, జితేంద్రియుడు, ఉత్సాహి కావలెను."

ఉపనయనము విద్యాసంస్కారమైనపుడు ఈ లక్షణముల ఆవశ్యకత యేర్పడినది. కాలక్రమమున ఆ భావము లోపించుటచే కేవలము వైదిక మంత్రోచ్చారణచే ఆ సంస్కారము సంపన్నమగుచున్నది. ఆ తంతును వివరింతును.

**విధానము:**

(మన పద్ధతి: ఆప.సూత్రవిధానము, సంస్కారదీపిక, పంచికలననుసరించి)

చౌలము మొదలు ఉపనయనమువరకు సంభవించిన దోషములు (నిలబడి మలమూత్రవిసర్జన చేయుట మొ॥) పోవుటకు, ద్విజత్వ అధికారము కొరకు పరిషత్ దక్షిణ నిచ్చిన వెనుక ఇది ఆరంభమగును. చౌలమైన వెనుక స్నానము చేయింతురు. వటునికి ఉపనయనాంగముగ రక్షాబంధనము గావింతురు.

వాసంతికాగ్ని ప్రతిష్ఠాపన అయిన వెనుక ద్విజత్వసిద్ధికి పెద్దలు స్పృశించిన యజ్ఞోపవీతమును ధరింపచేతురు. ఈ సందర్భమున నూలు జందెముతో బాటు బంగారు, వెండితో చేసిన యజ్ఞోపవీతమును ధరింపచేయుట కొన్ని ప్రాంతములలో కలదు.

"యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతే ర్యత్సహజం పురస్తాత్
ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః"

అను మంత్రమును దీని ధారణ సమయమున పఠింతురు. "ఇది పవిత్రమైనది, పూర్వము ప్రజాపతికి సహజముగా నున్నది. సంపూర్ణ ఆయుర్దాయము నిచ్చునది. శ్రేష్ఠమైన శుభ్రమైన దీనిని ధరింపుము" అని దాని యర్థము. యజ్ఞార్థమైన ఉపవీతము కనుక దీనికి యజ్ఞోపవీతమని పేరు. యజ్ అను ధాతువునకు 'దేవపూజ' అని అర్థము. లోకకల్యాణము కొరకు, పరమేశ్వర ప్రీతికొరకు సమస్త కార్యములు చేయవలెనని దీని పరమార్థము.

పెద్దలు ఆశీర్వదించిన వెనుక నాందీదేవతా, బ్రాహ్మణ సమారాధనము చేయుదురు. బ్రాహ్మణులను గంధాక్షతలతో పూజించి దక్షిణ తాంబూలములు, వస్త్రముల నిత్తురు. బ్రహ్మచారులకు భోజనము పెట్టుట, పసుపు రంగుకల అంగ వస్త్రముల నిచ్చుట ఆచారములో కలదు.

బ్రాహ్మణ భోజనమైన వెనుక బ్రహ్మచారిచే తల్లితో ఏకపాత్రయందు భుజింపచేతురు. కుమారుని భోజన సమయమందు గాయత్రిని జపించుచు ఆచార్యుడే స్వయముగ అన్నమును వడ్డించవలెనని శౌనక వచనము. దీనినే మాత్రా సహభోజనమందురు. ఇందు పరిషేచనము చేసినపుడు 'అమృతోపస్తరణమసి' యని బ్రహ్మచారికి నీటికి బదులు నేతినిత్తురు. ఇది కారము, ఉప్పులేని భోజనముగా నుండవలెను. ఇది పిల్లవానికి సాత్త్వికాహారము తినుటకు నాందిగా భావింపవచ్చును.

భోజనమైన వెనుక స్నానము, చౌలము నందువలె సంస్కార మాత్రముగా కేశఖండనము చేయుదురు. (చూ:- చౌల సంస్కారము) తదుపరిస్నానము.

వటునికి ఆచార్యుడు వస్త్ర దండ, అజిన మేఖలలను సమకూర్చి వటునిచే మోదుగ సమిధను అగ్నినందుంచునట్లు చేయును. ఇందు 'అయుర్దేవ జర సం.....' అను మంత్రము వచ్చును. "ఓ అగ్ని! వీనికి ముసలి తనము వరకు దీర్ఘాయువును కలిగించుము."

అగ్నికి ఉత్తరమున ఉంచబడిన సన్నెకల్లును ఈ క్రింది మంత్రము చెప్పి వటుని చేత కుడి కాలిచే త్రొక్కింతురు.

"ఆతిష్ఠేమ మ్మశాన మశ్మేవ తగ్ం స్థిరో భవ,
అభితిష్ఠ పృతన్యత స్సహస్వ పృతనా యతః."

"నీవు ఈ రాతిని త్రొక్కుము. దీని వలెనే చాలకాలము జీవింపుము. నీతో యుద్ధము చేయు శత్రుసేనలను జయింపుము అని అర్థము."

అప్పటికప్పుడుత్తరించిన వస్త్రమును 'రేవతీస్త్వా' మొ॥ మంత్రములచే ఆచార్యుడు అభిమంత్రించి కొన్ని మంత్రములను చెప్పి వటుని మొలకు ఆ వస్త్రమును కట్టును.

అర్థమిది:- "నీ నిమిత్తమైన వస్త్రమును గూర్చి ఏ దేవతలు ప్రత్తిని విడదీసి వస్త్రమును నేసి అంచులు కల్పించి తయారు చేసిరో ఆయా దేవతల ఆశీస్సులచే దీర్ఘాయుర్దాయమును పొంది దీనిని ధరించవలసినది. దీర్ఘా యువునిచ్చు వస్త్రమును బృహస్పతి సోముని కిచ్చెను. ఓ దేవతలారా! అట్టి దానిని ధరింపచేసి ఈ కుమారుని శత సంవత్సరములు జీవించునట్లు అనుగ్రహించవలసినది. ముసలి తనము వచ్చువరకు దీనిని ధరించి బంధు వుల మేలుకోరువాడవై వర్చస్సు కలవాడవై ధనవృద్ధిని గూర్చి ప్రయత్నము చేతువుగాక."

ముంజగడ్డితో మూడు పేటలుగానల్లిన మేఖలను ఆచార్యుడు వటుని మొలకు కట్టును. ఇయందురుక్తాత్ అను మంత్రముచ్చరించుచు కట్టును.

ఈ మేఖల దుష్ట ప్రసంగములను నిర్మూలించుగాక. ప్రాణాపానము లకు బలము కలిగించి దేవతలకు ప్రీతిపాత్రమైన ఓ మేఖలా! నీవు సత్యమును, తపస్సును రక్షించు దానివి. రాక్షసులను, శత్రువులను నశింపునట్లు చేయుము.

ఆ పైన అజిన ధారణము. అర అంగుళము వెడల్పు గలిగి, యజ్ఞోపవీతమంత పొడవు గల్గిన జింక తోలును జందెమువలె వటునిచే ధరింపచేయుదురు. కొన్ని ప్రాంతములలో యజ్ఞోపవీతమునకు చిన్న అజిన ఖండమును కట్టుదురు. ఈ సమయమున 'మిత్రస్యచక్షుః' అను మంత్రమును పఠింతురు. దాని భావమిది: ఇది సూర్యుని ప్రకాశింప చేయును, తేజస్సుకలది, పురాతనమైనది, కాంతివంతమైనది, స్తుతించుటకు అర్హమైనది, అన్న సమృద్ధినిచ్చును. ధూర్తులు ధరించుటకు వీలులేనిది, ఉత్తరీయస్థానమున వేసికొనదగినది. అట్టి దానిని ధరించుచున్నాను. రాయలసీమ ప్రాంతములలో ఈ సందర్భమున వటునికి నుదుటియందు బాసికము కట్టుదురు. ఇది మిగిలిన ప్రాంతములలో లేదు.

ఆచార్యుడు అగ్నికి ఉత్తరమున దర్భలు పరచి వటుని తనకు అభిముఖముగా కూర్చుండబెట్టు కొనును. మంత్ర జలమును చల్లి అతని హస్తమును బట్టుకొని అగ్ని-సోమ-సవితృ-సరస్వతీ-పూష-బృహస్పతి-అర్యమ-అంశు-భగ-మిత్రులను దేవతలకు కుమారునప్పగించి, వీరందరు నిన్ను తమ వద్దకు తీసికొని రక్షింతురు, అను అర్థమిచ్చు మంత్రములను పఠించును. "దేవస్య త్వా....." మంత్రమును చెప్పి సూర్యభగవానుని అనుజ్ఞను పొంది నేను నిన్ను నా సమీపమునకు తీసికొనుచున్నానని చెప్పి వటుని దగ్గరకు తీసికొనును.

అపుడు జీలకఱ్ఱ, బెల్లము కలిపిన మంగళ ద్రవ్యమును గ్రహించి మూర్ధికను పఠింతురు. మంగళ ద్రవ్యమును వటుని శిరస్సు పైనుంచి "ధ్రువం తే రాజా......" అను మంత్రమును చెప్పి మంగళాష్టకములు పఠింతురు. ఇదే సుమూహూర్తము.

ఇందే ముఖ్యమైనది బ్రహ్మోపదేశము. ఆచార్యుడు వటుని తన దగ్గరకు తీసికొని, నూత్నవస్త్రముతో తమ్మిరువురిని పైకి కప్పుకొని అతని కుడి చెవిలో 'సుప్రజాః. . . ' అను మంత్రమును పఠించును. అనగా సంతానవంతుడవై కాంతి కలవాడవై వృద్ధిని పొందుము.

'నేను వేదాభ్యాసము కొరకు బ్రహ్మచర్య వ్రతమును ధరించితిని. నీవు సవిత్ర దేవుని అనుజ్ఞను పొంది నన్ను నీ సమీపమునకు చేర్చుకొనవలసినది' యని వటువనును. పిమ్మట ఆచార్యునికి వటునికి ఇట్లు సంభాషణ జరుగును. 'నీ పేరేమి?' వటువు 'ఫలానా....' అనును. 'ఎవని బ్రహ్మచారివి?' 'ప్రాణమునకు', 'ఎందు నిమిత్తము బ్రహ్మచర్యము చేయుచున్నావు?' 'ఆత్మను గురించి' 'ఓ సూర్యదేవా! ఈ బ్రహ్మచారి నీవాడు. ఇతనిని రక్షించుము. ఇతడు నీపుత్రుడే. దీర్ఘాయుష్మంతుని చేయుము' అని ఆచార్యుడనును.

తరువాత "యోగే యోగే....." మంత్రములతో 11 హోమము లుండును. అర్థమిది:- దీర్ఘాయువు, సంతానము, పోషణల నిమిత్తమై

అగ్ని, చంద్ర, అదితి విశ్వేదేవ, ఇంద్ర, ద్వాదశాదిత్య, అష్ట వసువులను ప్రార్థించుచు వటు విట్లనును.

"అంగిరసులు, సప్తర్షులు, బ్రహ్మ, అగ్ని నాకు బుద్ధినిత్తురుగాక. అప్సరసలందున్న మేధాశక్తి, గంధర్వులందు కంకీర్తి, దివ్యమానుష శక్తులు నన్ను చేరుగాక! ఓ వరుణదేవా! నాకు అకాల మృత్యువు నీయకుము. సమస్త వైరులను అగ్ని తొలగించుగాక."

## సావిత్రి ఉపదేశము:

ఉపనయనము నాడు ఈ మంత్రము మధ్యాహ్నమున ఉపదేశింప బడుచున్నది. గాయత్రినే మధ్యాహ్నమున సావిత్రి యందురు. అగ్నికి పడమట ఉత్తరాగ్రముగ దర్భాసనము వేసి ఆచార్యుడు కూర్చుండగా అతనికి పడమట ముఖముగా వటువు కూర్చుండి తన కుడి చేతితో ఆచార్యుని కుడి పాదమును పట్టుకొని 'నాకు సావిత్రిని ఉపదేశింపుడని' వటువు కోరును. ఆ వెనుక గాయత్రిని ఇట్లుపదేశించును. "ఓం భూః తత్సవితుర్వరేణ్యమ్, ఓం భువః భర్గోదేవస్య ధీమహి, ఓగ్ంసువః ధియో యోనఃప్రచోదయాత్; ఓం భూః తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి; ఓం భువః ధియో యోనః ప్రచోదయాత్;. ఓగ్ంసువః తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్." అనగా 'సూర్యమండలాంతర్గత చిచ్ఛక్తికి కూడ ధ్యేయమైన శక్తి నా బుద్ధి వృత్తులను సత్కర్మలను చేయుటకు ప్రేరేపించుగాక' అని అర్థము.

ఆ పైన వటువు తూర్పునకు తిరిగి 'అవృథవమసౌ....' అనును. 'ఓ ప్రాణమా! ఈ ఉపదేశముచే శ్రీమంతుడనైతిని. ఈ గాయత్రీ ధనమును కాపాడుచుండుము' అని పలికి మీది పెదవిని తుడుచుకొని ఆచమించును. 'ఓ శ్రోతములారా! గాయత్రిని అవధానముతో వినుడు' అనును. వటువు తన రెండు చెవులనొకసారి ముట్టుకొనును.

## దండ ధారణము:

వటుడే మంత్రమును చెప్పి దండమును పట్టుకొనును. "సుశ్రవ స్సుశ్రవసం...... .." అనగా వేదమును వినిన పాలాశ దండమా! నీవలె

విందునుగాక. నీ వెట్లు దేవతల యజ్ఞ సంబంధ నిధులను కాపాడుచుంటివో అట్లే నేనును బ్రాహ్మణుల నిధియైన వేదమును కాపాడుదునుగాక అని అర్థము.

బ్రహ్మచారి వ్రతములు:

వటువిట్లు పేర్కొనును. "సత్కార్యములను ఆలోచించుట, అసత్కార్యములను ఆలోచింపకుండుట, యోగ్యముకాని పనులను నిందించుట, దేవతలను దూషింపకుండుట, మంచి పనులపై శ్రద్ధ, కూడని విషయము లపై శ్రద్ధ లేకుండుట, బ్రహ్మ విద్యను తెలిసికొనుట, అవిద్యను తెలిసికొనకుండుట అనునవి నా వ్రతములు."

ఆ పైన వటువు ఆచార్యునికి ఒక ఆవు నిచ్చును. ప్రతి గ్రహ దోషమును పోగొట్టుటకై ఆచార్యుడు పదునేడు సార్లు ప్రణవమును జపించి 'దేవస్యత్వా' అను మంత్రముతో దానిని గైకొనును. అనగా సూర్యుని ఆజ్ఞచే నిన్ను గ్రహించుచున్నాను. అశ్వినుల యాజ్ఞచే, పూషుని యనుజ్ఞచే చేతులతో నిన్ను గ్రహించు చున్నాను. 'తచ్చక్షుర్దేవహితం' అను మంత్రమును చెప్పుచు వటువు సూర్యునకు నమస్కరించును. అనగా సూర్యజ్యోతిని నూరేండ్లు చూచెదము గాక, నూరేండ్లు జీవింతుముగాక, ఆనందింతుము గాక, ఉందుముగాక, విందుముగాక, పల్కుదుముగాక.

అగ్నికార్యము:

అది మొదలు వటువు ప్రతిరోజు ప్రాత స్సాయం సమయము లందు అగ్నిని ఆరాధించవలెను. అగ్నిని అక్షతలచే అలంకరించుచు 'పరిత్వాగ్నే' మొ॥ మంత్రములను పఠింతును. 'అగ్నయే సమిధమాహార్షం' అను 12 మంత్రములు, 12 హోమములుండును. అర్థమిది:- "ఓ అగ్నీ! నీవు సమిధచే ఎట్లు ప్రజ్వరిల్లుచున్నావో అట్లే నాకు ఆయుస్సు, వర్చస్సు, లాభము, మేధాశక్తి, సంతానము, పశువులు ఇచ్చి నన్ను అన్న భక్షణము చేత వృద్ధి పొందునట్లు చేయుము."

వటువు ఇందలి లోపాలోపములను సవరించుటకుగాను సర్వప్రాయశ్చిత్త హోమమని 'ఓం భూర్భువస్సువ స్స్వాహా' అను మంత్రములో నొక సమిధను హోమము చేయును. తరువాత పరిసమూహము. పిమ్మట ఉపస్థానము. అనగా లేచి నిలబడి అగ్నిప్రార్థన చేయును. 'యత్తే అగ్నే' ఆదిగాగల మంత్రములను పఠించును. సమస్త సంపదలకై ప్రార్థన యుండును. రుద్రుని గూర్చి పుత్ర పౌత్ర పశు సంపదలను కాపాడవలసినదిగా ప్రార్థన ఉండును. ఆపైన కూర్చుండి భస్మధారణ చేసికొనును.

హోమములు చేసిన అగ్నియందలి భస్మమును నేతితో అద్దిన ఆకు గాని, ఉద్ధరణి మొ॥ వానితో అంటించుకొని ఆ భస్మమును అనామికాంగుళితో కలియునట్లుగా రాచి ఆ వ్రేలితోనే శిరోలలాట వక్షోభుజస్కంధములందు 'త్ర్యాయుషమ్ జమదగ్నేః' అను మంత్రములో తిలకమును పెట్టుకొనవలెను. త్ర్యాయుషమనగా బాల్య-యౌవన-జరావస్థలను దాటిన యాయుర్దాయము. అది జమదగ్నికి, కశ్యప ప్రజాపతికి కలిగినది. అది నాకు కలుగుగాక.

ఆపైన 'మేధావీ భూయాసమ్....' అని మేధ, తేజస్సు, వర్చస్సు కలవాడ నగుదునుగాక. అని ప్రార్థించును. పిదప స్వస్తివాచనము. ఈ ప్రకారము స్నాతకము వరకు ప్రతిదినమున అరణ్యము నుండి సమిధలను తెచ్చి సాయం ప్రాతః కాలములందు అగ్నియందు వ్రేల్వవలెనని విధి.

తరువాత కుడిచేయి మడచి కుడి చెవి దగ్గర మూసి పట్టుకొని ఆ కుడి మోచేతి క్రింద ఎడమ చేతి నానించి పట్టుకొని 'చతుస్సాగర పర్యంతం' అని తన ప్రవర చెప్పి నమస్కరించును.

### ఆచార్యుని ఆదేశములు:

బ్రహ్మచర్య వ్రతమును పాటింపవలెనని, విధ్యుక్త ధర్మమును పాటింపుమని, పగలు నిద్రించవద్దని, నీకు భోజన మమరినను మాకై మాధుకర మెత్తుమని మొ॥ ఆదేశముల నిచ్చును. అట్లే అని వటువనును. ఆపైన ఆచార్యుడు భిక్షాపాత్ర యొసగగా వటువు దానిని పుచ్చుకొని ముందు

తల్లి, ఆచార్యుడు, పిదప ఇతర బంధువులు దగ్గరకు వెళ్లి ప్రవరగోత్రముల నుచ్చరించుచు భిక్ష మెత్తును. వారు కానుకలిత్తురు. ఆపైన త్రిరాత్ర వ్రతము. ఇంతవరకే ఆపస్తంబుడు చెప్పెను.

మేధా జననము:

నాల్గవ దినమున గ్రామమునకు తూర్పుగా గాని, యుత్తరముగా గాని వెళ్లి మోదుగ చెట్టు మొదట పాలాశపూజ చేయును. దానికి బదులుగా మోదుగ కొమ్మను తెచ్చి అగ్నికి ఉత్తరమున పాతి దాని దగ్గర చేయు చున్నారు. అందు మూడు మంటపముల నేర్పరచి ప్రణవ-శ్రద్ధా-మేధా-దేవతలను ఆహ్వానించి వానికి షోడశోపచార పూజలు చేసి అపూపముతో కూడిన కృసరాన్నము (పులగము)ను నివేదన చేయుదురు.

'యశ్ఛందసా........' మె॥ మంత్రము లిందు పఠింపబడును. అనగా వేదములలో సార భూతమైనది, పరమేశ్వర స్వరూపమైన ఓంకారము నన్ను ప్రజ్ఞ చేత సంతోషింప చేయుగాక. బ్రహ్మ జ్ఞానమును ధరించు వాడనగుదును గాక. నానాలుక మధురవాక్కులతో నిండినదై ఉండుగాక. నా చెవులు ఆత్మజ్ఞాన విషయమును వినుగాక.

"మేధా దేవీ............... సూర్యో భ్రాజో దధాతు" 'ఓమేధా! నీ అనుగ్రహము వలన మానవుడు ఋషి, హిరణ్యగర్భుడు కాగలుగు చున్నాడు. ధనపతియైన కుబేరుని మాదిరిగా మాయందు అనుగ్రహమును చూపిం పుము. ఇంద్ర, సరస్వతి, అశ్వినీ కుమారులు నాకు మేధ నిత్తురుగాక. మేధాశక్తి శోభన, సకలాభీష్ట ప్రదాయిని, విశ్వరూప, బలవతియైనది. అగ్ని నాకు మేధ, వర్చస్సు, సంతతినిచ్చుగాక. ఇంద్రుడు వీర్యపుష్టినిచ్చుగాక, భ్రాజస్సును సూర్యుడిచ్చుగాక.' (చూచుట తోడనే శత్రువులు భయపడునట్టి ముఖకాంతి).

తరువాత కొన్ని హోమములుండును. 'యచ్ఛందసా....... ధాతరా యన్తు'."ఓ ప్రణవమా! నాకు మేధను, శరీర పుష్టినిచ్చి పిదప సమస్త సంపదలనీయుము. బ్రాహ్మణులు నా దగ్గరకు వత్తురుగాక. ఓ ప్రణవమా!

నేనే నీలో ప్రవేశించుచున్నాను. నీవు నాలో ప్రవేశింతువు గాక. నీరు పల్లపు ప్రాంతమునకు పోవునట్లు మాసములు సంవత్సరమును గూర్చి పోవునట్లు బ్రహ్మచారులు చదువుకై నా వద్దకు వత్తురు గాక."

11 పాలాశ హోమమునైన వెనుక వటువు ఉపనయనము నాటి దండమును, ముంజిని, అజినము, వస్త్రములను మోదుగచెట్టు కొమ్మ దగ్గర విడిచిపెట్టి కొత్తవి ధరించును. ఈ సందర్భమున మేనమామలు వటునికి, తల్లిదండ్రులకు క్రొత్త బట్టలనిత్తురు.

ఈ ఆశ్రమమున అనుసరింపదగు గురుభక్తి, సూర్యోపాసన, అగ్ని ఆరాధన, ప్రాణాయామము, ఇంద్రియ నిగ్రహము, గాయత్రీ మంత్రానుష్ఠానము మొ॥ ధర్మములు ఈ సంస్కారము వలన సిద్ధించుచున్నవి.

ఇందుగల మేఖల అజిన దండాదులను గూర్చి భిన్నభిన్న సూత్రకారులెట్లు వచించిరో వివరించెదను.

ఉపనయనమునకు పూర్వపురాత్రి బాలకునకు పసుపు పూయుట, అతని శిఖకు వెండి చుట్టును చుట్టుట మొ॥ కొన్ని ఆచారములు కొన్ని ప్రాంతములలో కలవు. ఆ రాత్రియంతయు మౌనముతో నుండును. ఇది రహస్య పూర్ణమైన విధి. ఇది ద్వితీయ జన్మను సూచించును. పచ్చని పూత గర్భావాలావరణమును, పూర్ణమౌనము మాటలాడలేని భ్రూణమును సూచించును.

**మాత్రా సహభోజనము:** డా॥ అల్తేకర్ ననుసరించి ఇది బాలకుని అనియమిత జీవనము యొక్క అంతమును సూచించును.

**స్నానము:** స్నానము దైహికమానసిక మలములను పోగొట్టును.

**కౌపీనము లేదా వస్త్రము:** (అజినము) ఈ వస్త్రము ధార్మిక జీవనారంభమును సూచించును. రెండు బట్టలను బ్రహ్మచారి ధరింపవలెను. క్రింది భాగమున నొకటి (వాసస్) పైభాగమున కప్పునదియొకటి (ఉత్తరీయము) వసి.ధ.సూ. లందు బ్రాహ్మణ బ్రహ్మచారి క్రింది బట్ట క్రొత్తది, తెల్లగా

నుండవలెనని, క్షత్రియ వైశ్యులకు ఆప.ధ.సూ.లందు చెప్పినట్లేయనియు, వైశ్యునకు కుశలతో తయారు చేసినది, లేదా అన్ని వర్ణములకు క్రొత్తది యగు నూలు బట్టను వాడవచ్చునని కలదు.

ఈ సందర్భమున మృగచర్మమిచ్చెడి వారని ప్రాచీన సాహిత్యము వలన తెలియును. మృగ చర్మము, ఆధ్యాత్మిక బౌద్ధిక సర్వోచ్ఛతకు ప్రతీకమని గోపథ. బ్రా. వలన స్పష్టము. ఆశ్వ; పార; వసి.ధ.సూ; బౌధ.గృ.లు. బ్రాహ్మణునకు కృష్ణమృగ చర్మమనియు, క్షత్రియునకు రురు మృగ చర్మ మనియు, వైశ్యునకు గోచర్మము లేక మేక చర్మమని చెప్పినవి. బౌధ, అశ్వ.లు మేకచర్మమునే చెప్పినవి. అందరికి కృష్ణమృగ చర్మమును వాడవచ్చునని బౌధ.గృ., ఆప.ధ.సూ. అన్ని వర్ణముల కుత్తరీయముగా గొఱ్ఱె చర్మమునుగాని, కంబలమును గాని వాడవచ్చునని చెప్పినది. ఆశ్వ.గృ. క్రింద, పైన ధరించినవి ఒకే చర్మసంబంధమైనవిగాని, లేక క్రింద తెల్లనిది, రంజితమైనదిగాని (ఆప.ధ.సూ.) కావచ్చునని చెప్పినది. కాఠకమున ఉత్తరీయము కృష్ణమృగము వ్యాఘ్రము, రురుమృగ చర్మములను మూడు వర్ణములవారికి వరుసగా విధించినట్లు తోచును.

ఆప.ధ.సూ. కృష్ణమృగ చర్మమును ఊర్ధ్వ అధోవస్త్రముగా వైదిక విజ్ఞానము కోరువాడు వాడవలెనని, నూలు వస్త్రములను క్షాత్రశక్తిని కోరు వాడు వాడవలెనని, రెండు శక్తులు కావలెననిన రెండును వాడవలెనని కలదు.

ఆప. భౌధ.సూ.లను బట్టి సంస్కారమునకు పూర్వము బ్రహ్మచారి ఇంటి దగ్గర ఈ వస్త్ర ఖండమును నూలు వడికి నేయవలెను. బ్రాహ్మణునకు జనపనారతో చేసిన వస్త్రమును, క్షత్రియునకు క్షౌమము, (అగిసె సంబంధించిన బట్ట, పట్టు వస్త్రము, నారచీర) వైశ్యునకు కంబళి లేక కుశ నిర్మితమైన దానిని విధించినది గౌ.ధ.సూ. దీనికి వికల్పముగా సర్వవర్ణములకు నూలు బట్ట వాడవచ్చునని అందేకలదు.

బ్రాహ్మణునకు కాషాయ వస్త్రము, క్షత్రియునకు మాంజిష్ఠము (కొంచెము పచ్చగా నుండు ఎఱ్ఱచీర), వైశ్యునకు పచ్చని బట్ట విహితమని

ఆ.గ్ర.సూ. కాని నేడు సమస్త ద్విజాతులకు పసుపులో ముంచిన బట్ట నిచ్చుచున్నారు.

అజినమనగా మృగచర్మము లేక మేకచర్మమని అ.వే.శ.బ్రా.న కలదు. మరుద్గణములు మృగచర్మ దారణమున ప్రసిద్ధులు (ఋ.వే.1.1 .10) పూర్వకాలమున ఉత్తరీయముగా వాడబడిన మృగచర్మ స్థానమున నూలు బట్టవచ్చినది. చివరకు ఆసనముగా ఇది వాడ బడుచున్నది. విష్ణుమతాను సారము వైదిక బ్రహ్మచారి వ్యాఘ్రచర్మమును వాడవలెను. ఈనాడు పూర్తిగా వాడకపోయినను మృగచర్మమును సూత్రముగా ధరించుచున్నారు.

మేఖల:

ఆచార్యుడు బాలకుని కటిప్రదేశమున కట్టును. "పాపము నుండి దూరము చేయుచు శోధకుని వలె మనుష్యుని శుద్ధపరచుచు, శక్తితో కూడి సోదరియైన మేఖల నా దగ్గరకు వచ్చినది." అను నర్థమిచ్చు మంత్రపఠన ముండును. ఇది మూడు సూత్రములతో పేనబడి యుండును. అనగా బ్రహ్మచారి యెల్లప్పుడు మూడు వేదములచే ఆవృతుడై యుండునని సూచించును. "వేదత్రయేణా వృతోఽహమితి మన్యతే సద్విజః" -(అశ్వ. వీ. మి.) ఇంకను ఇది శ్రద్ధాదేవి, తపస్సువలన పుట్టినది, ఋషులకు చెల్లెలు, జీవులకు కల్యాణము చేయునది అని స్తుతింపబడినది. "శ్రద్ధయా దుహితా తపసోఽధి జాతాస్వసాఋషీణాం భూతకృతా బ భూవ." - (అ.వే. .133.6).

ఇది వానియొక్క ఋతమును (సత్యమును లేదా వ్రతమును) గోప్యముగా నుంచుటలో సమర్థమైనది. దుష్ప్రభావములనుండి రక్షించును.

"ఋతస్య గోప్త్రీ తపసశ్చరిత్రీ ఘ్నతీ రక్షః
సహమానా అరాతీః సా, మా,
సమంతమభి పర్యేహి, భద్రే,
ధ తరిస్తే సుభగే మారిషామ." (వా.గ్ర.)

బ్రాహ్మణునకు ముంజి త్రాడు, క్షత్రియునకు మూర్వ గడ్డితో పేనినది వైశ్యునకు జనపనారతో చేసినది వాడవలెనని గౌత, బౌధ, భార,మనువులు చెప్పిరి. వారస్కరుడు క్షత్రియునకు వింటిత్రాడు, వైశ్యునకు మూర్వగడ్డితో పేనినది, ఇవి లేనిచో కుశ, అశ్మంతక, బల్వ జమనెడి గడ్డితో తయారు చేసినది వరుసగా మూడు వర్ణములకు వాడవలెననెను. ఆప.ధ.సూ.న వైకల్పికముగా నిట్లు కలదు. ఇనుప ముక్కతో నున్న ముంజగడ్డితో సిద్ధము చేసినది క్షత్రియునకు, గొఱ్ఱె బొచ్చుతో చేసినది గాని తమాల వృక్షపు త్వక్కుతో చేసినదిగాని వైశ్యునకు వాడవచ్చునని కలదు. బౌధ.గృ. అందరికి ముంజత్రాటిని వాడవచ్చునని అనుజ్ఞ ఇచ్చినది.

దండము:

వటువు దండమును గ్రహించును. దానిని స్వీకరించు సమయమున దీర్ఘ జీవనమునందు, దుర్గమ యాత్రయందు సురక్షితునిగా చేయుమని ప్రార్థించును. "దండము కావలి వానికి ప్రతీకము" అని వారాహ. గ్రను బట్టి తెలియును. దీని విచ్చుట ద్వారా వేదములను రక్షించుట యను కర్తవ్య పాలనమును ఇతనిపై నుంచినట్లని ఒక అభిప్రాయము. 'ఇది కేవలము శత్రువుల బారినుండి రక్షించుటకే కాదు. భూతప్రేతాదులనుండి కూడ రక్షించును' అని పార.గృ. యాజ్ఞ.పై అపరార్క వ్యాఖ్యలో సమిధలనేకత్రము చేయుటకు, గురువుగారి గోవులను త్రోలుటకు, చీకటిలో తిరుగునపుడు, నీళ్లలో దిగునపుడు ఆత్మవిశ్వాసము కలిగించుటకై సహాయపడునని కలదు.

ఆప.ను బట్టి బ్రాహ్మణునకు పలాశము, క్షత్రియునకున్యగ్రోధము, వైశ్యునకు బదర లేక ఉదుంబరము లేక యజ్ఞ సంబంధమైన దండమును వాడవలెనని తోచును. గౌతమ, బౌధ.లు బ్రాహ్మణునకు పలాశము లేక బిల్వము; గౌతముడు అశ్వత్థ, పేలులను క్షత్రియ వైశ్యులకు, లేక యజ్ఞ సంబంధమైనది ఏవర్ణమునకైనను; బౌధ.గృ. క్షత్రియునకున్యగ్రోధము లేక రౌహితకము, వైశ్యునకు బదర లేక ఉదుంబరము; పార.గృ. పలాశబిల్వ ఉదుంబరములు, లేక ఇందేదైన అన్ని వర్ణముల వారికని, కాఠక.గృ.పలాశ అశ్వత్థ, న్యగ్రోధములు మూడు వర్ణముల వారికి వరుసగా; మనువు

బిల్వ పలాశములు బ్రాహ్మణునకు, వటు ఖాదిరములు క్షత్రియునకు, పీలు ఉదుంబరములు వైశ్యునకు విధించినవి. పీలువనగా గొలుగులేక గొలిజవెట్టు, కొండగోగు అని మత భేదము కలదు. యజ్ఞవృక్షమనగా మోదుగ లేక మేడి లేక గంగ రావియని మతభేదము. కాని ఆచరణలో మోదుగకలదు.

దండ గ్రహణము ద్రష్ట ఫలకముగావున అన్ని వేళల ధరింపనవసరము లేదని అపరార్కుడు వ్రాయగా అదృష్ట ఫలకము కూడనగుటచే ఎల్లవేళల ధరించవలెనని మరియొక అభిప్రాయము.

దండము యొక్క పొడుగునందు కూడ వర్ణానుసారము భేదము కలదు.

బ్రాహ్మణునకు కేశ పర్యంతము, క్షత్రియునకు లలాటము వరకు, వైశ్యునకు నాసిక పర్యంతమని ఆ.గృ. వసిష్ఠుడిందులకు విపరీతముగా వాక్రుచ్చెను. బ్రాహ్మణునకు పొట్టిది, వైశ్యునకు పొడుగైనదని సాంఖ్యా.గృ. బ్రహ్మచారి దండమునకు తనకు మధ్య ఎవ్వరిని మధ్య వెళ్లుట కనుమ తించరాదని, బ్రహ్మచర్యానంతరము యజ్ఞోపవీత దండమేఖలలను వరుణ దేవతా సంబంధమైన మంత్రములతో విడువవలెనని అందేకలదు. ఓంకార పూర్వకముగా విడువవలెనని మను, విష్ణు, ధ.సూ. లందు కలదు.

ఇంకను దండము, అపీడితమై, అవిచ్ఛిన్నమై పై తోలుతో కూడినదై యుండవలెనని పైఠీనసి, గౌతముల ఆదేశము. ఋజువు, అవ్రణము, అనుద్వేగ కరముగా నుండవలెనని మనువు.

**యజ్ఞోపవీతము:**

పూర్వకాలము వస్త్రమునే యజ్ఞోపవీతముగా వాడెడివారని, నూలుతో చేసినది తరువాత వచ్చినదని కొందరనగా ఈ అభిప్రాయము తప్పని కొందరందురు. రెండు వాదములను వివరింతును.

తై.సం. యందు నివీతము మనుష్య కార్యములందు, ప్రాచీనావీతము పితృకార్యములందు, ఉపవీతము దేవకార్యములందని, ఉపవీతిగా నుండుట దేవలక్షణమని కలదు.

శత.బ్రా.న దేవతలు యజ్ఞోపవీత ధారులై దక్షిణపు మోకాలును వంచిన వారై ప్రజాపతి దగ్గరకు వెళ్లగా ఆతడు యజ్ఞమే మీకు ఆహారము, అమృతత్వమే మీకు బలము, సూర్యుడే మీకు వెలుగు అని చెప్పెను. ప్రాచీనావీతులై పితృదేవతలేగిరి. మనుష్యులు శరీరమును కప్పుకొనిన వారై సమీపించిరి. "మనుష్యాః ప్రావృతా ఉపస్థం". ఇందు మనుష్యులు నివీత, ఉపవీత లేక ప్రాచీనావీతులై యున్నట్లులేదు.

తై.ఆ. (II.1)ను బట్టి యజ్ఞోపవీతము ధరించినవాని యజ్ఞము భాగ్యవంతమై ప్రసిద్ధికెక్కును, లేనిచో ప్రసిద్ధికెక్కదు. కృష్ణమృగచర్మమునుగాని, వస్త్రమునుగాని ధరించియుండవలెను. "అజినంవాసోవా". ఈ మంత్రమును గ్రహించి కృష్ణమృగచర్మమునుగాని, వస్త్రమునుగాని ధరించినచో మనుష్యుడుపవీతియగునని పరాశర మాధవీయమన్నది. ఇన్ని పోగులతో నున్న అను విషయమిక్కడ లేదు. ఆప.ధ.సూ.లందు యజ్ఞోపవీత ముత్తరీయస్థానమును వహించునని కలదు. దీని ప్రకారము ఉపవీతము ఉత్తరీయముగా నుండెడిదనియు, కేవలము కొన్ని పోగులతో కూడినది కాదని తెలుచున్నది. ఆప.ధ.సూ. (I:5.15.1.) యజ్ఞోపవీతియై యుండవలెనను మాటకు హరదత్తుడు యజ్ఞోపవీతమనగా ఉత్తరీయమును వల్లెవాటుగా వేసి కొనుట యని వ్రాసెను. "యజ్ఞోపవీతం పరమం పవిత్రం" అనునది బౌధ.గృ.వైఖ.లందే కలదు కాని పూర్వసాహిత్యమున లేదని ఆధునికుల వాదన సారాంశము.

ఇక సంప్రదాయవేత్తల మాటను పరికింపుడు. పూర్వమున యజ్ఞోపవీతమే లేదను వారికి సమాధానము:- స్వాధ్యాయ బ్రాహ్మణమునందు యజ్ఞోపవీతము వలె వేసికొనవలెనని చెప్పుటచే యజ్ఞోపవీతము సిద్ధవస్తువే కదా! వస్త్రమును మాత్రము యజ్ఞోపవీత తకారముగా వేసికొనవలెననుటచే యజ్ఞోపవీతము లేదనుట ధర్మముకాదు. "యజ్ఞోపవీతం కృత్వాఽధోనిపపాత" అని శ్రుతికలదు. ఇచ్చట కూడ యజ్ఞోపవీతము మాదిరిగా వస్త్రధారణ చేసి మోకరిల్లవలెనని కలదు. ఇక నూలు పోగులతో తయారు చేసిన సూత్రమునకు ఆధారమైన శ్రుతి మనము చూడనంత మాత్రమున ఆధారము లేదని చెప్పుట పాడిగాదు. స్మృతులందు నూలుతో చేసినది ధరించవలెననుటచే వేద ప్రామాణ్యములేక వ్రాయరని భావింపవలెను.

గోభిలమున యజ్ఞోపవీతము కొన్ని సూత్రములతో గాని, వస్త్రముతోగాని, కుశలతో కూడినది గాని బ్రహ్మచారి గ్రహించునని కలదు. స్మృతిచంద్రిక ఋష్యశృంగుని వచనమునుదాహరించుచు ఉత్తరీయమును గాని దాని అభావమున మూడు సూత్రములతో కూడిన దానిని గాని వేసికొని వాడవలెనని కలదు. బౌధ.గృ. గోభిల గృ.లు యజ్ఞోపవీతము నూలుతో కాని కుశలతో కాని తయారు చేయబడవలెననగా దేవలుని ప్రకారము ద్విజులందరు నూలు, క్షుమ, గోవుతోక వెంట్రుకలు, జనుపనార, లేక కుశలతో తయారైనది ఏదైనను పనికి వచ్చునని వ్రాసెను.

బ్రహ్మచారి ఒక యజ్ఞోపవీతమునే ధరింపవలెను. స్నాతక గృహస్థులు రెండు ధరింపవలెను. దీర్ఘజీవనము కోరువాడు రెంటికన్న అధికము అని వసిష్ఠుడు. కాశ్యపుడు గృహస్థుడు పదింటివరకు వేసికొనవచ్చునని చెప్పెను. ఉపవీతమును ధరింపక భుజించినచో ప్రాయశ్చిత్తమును విధించినది లఘుహారీతము. అట్లే మలమూత్ర విసర్జనయందు కుడిచెవికి పెట్టుకొననిచో యాజ్ఞ ప్రాయశ్చిత్తమును చెప్పినది. ఇతరులు ధరింపకూడని వానిలో యజ్ఞోపవీతమును పేర్కొనినాడు మనువు. యాజ్ఞ ప్రభృతులు దీనిని బ్రహ్మసూత్రమనిరి. యజ్ఞోపవీతము బొడ్డువరకు నుండవలెను. దానికి మించి యుండరాదు. అట్లని హృదయమునకు పైనుండరాదని దేవలుడు, ఋషి తర్పణమందు సంగమ సందర్భమున మలమూత్ర విసర్జనమున, శవ వాహకత్వమున నివీతిగా (దండమాదిరిగా) నుండవలెనని బౌ.ధ.గృ. పరిభాషా సూత్రము. పైమీద వస్త్రము లేకుండనుండునేమోయని మూడవది, ఉపవస్త్ర నిమిత్తము నాల్గవది ధరించుట సంప్రదాయము.

"సహ వై దేవానాం................" అను మంత్రమును బట్టి దేవతలు, రాక్షసులు యజ్ఞమును నిర్వహించినను, యజ్ఞోపవీతము లేనివారగుటచే వారు చేసినది గుణరహిత మైనదని, తత్సహితులై దేవతలు చేయుటచే గుణసహిత మైనదని స్పష్టమగును. ఇట్లే మంత్రము దీని మహత్త్వమును కొనియాడినది.

ఉపవీతము వర్ణములను బట్టి మారును. బ్రాహ్మణునకు తెల్లనిది, క్షత్రియునకు ఎర్రనిది, వైశ్యునకు పచ్చనిది యనుటచే వారివారి అంతరంగిక తత్త్వములనుబట్టి ఆయా భేదములని గ్రహింపవలెను. కొన్నిచోట్ల ఇది వైశ్యులు మాత్రము పాటించుచున్నారు.

నూలుతో చేసినది అందరు వాడవచ్చునను వికల్పము ననుసరించి నేడు నూలుదే వాడుచున్నారు. 'కార్పాసం జీవభర్తృకయా' యను మాటను బట్టి సుమంగళియైన స్త్రీ వడకవచ్చును. ఇందుగల గంభీరార్థము:-

మొదట నాలుగువ్రేళ్లకు 9 సార్లు చుట్టుదురు. ఈ పోడుగు మానవుని ఉన్నతిని సూచించును. నాలుగు వ్రేళ్లకు చుట్టుట జాగృత, స్వప్న, సుషుప్తి, తురీయావస్థలను సూచించును.

వేద మంత్ర సంఖ్య ఒక లక్ష -- "ఆద్యో వేదః చతుష్పాదః శతసాహస్ర సమ్మితః" అని వాయుపురాణము. "లక్షంతు వేదాశ్చత్వారో లక్షం భారతమేవ చ." అని చరణ వ్యూహము. వీనిలో కర్మకాండకు చెందినవి 80 వేలని, ఉపాసనాకాండకు చెందినవి 1 వేలని మిగిలినవి జ్ఞానకాండకు చెందినవని యందురు. 9 సార్లు చుట్టినది 9 వేల మంత్రములను సూచించును. దానిని 3 రెట్లు చేసి చుట్టుటలో బ్రహ్మ క్షత్రియ వైశ్యులకే అధికారమని ప్రకటితమైనది. తిరిగి మూడురెట్లుగా చుట్టుట బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ ఆశ్రమవాసులకే ఈ అధికార మని చెప్పను. తిరిగి దానిని మూడుపేటలుగా చుట్టి ఒకే ముడితో బంధింతురు. ఈసారి మూడుచుట్లు 'ఋషి, దేవ, పితృ ఋణములను సూచించును. ఈ సూత్రమున సనాతన ధర్మము యొక్క పారమార్థికత గోచరించును. ఇందొక పోగుతో ఈ రచన ప్రారంభమై, ఒకటి మూడుగా మారి, అంతమందు ఒకే ముడితో బంధింపబడి సమాప్తిని పొందును. మధ్యలోనే సత్త్వరజస్తమస్సుల సంబంధము. మూడు సూత్రములు ఒక ముడిద్వారమున బంధింపబడును. దానిని బ్రహ్మగ్రంథి యందురు. ఇవి బ్రహ్మ విష్ణు శివులకు ప్రతీకలు. సన్న్యాసమున తొంబదియారు మంత్రములను విడిచిపెట్టి మిగిలిన మంత్రములను మననము చేయవలెనను

దృష్టిలో వారికి యజ్ఞోపవీతము విధింపబడలేదు అనునది పండిత శ్రీదీన నాథజీశర్మాశాస్త్రిగారి వ్యాస సారాంశము (అనువాదకులు శ్రీ మాజెళ్ల లక్ష్మీనరసింహంగారు).

శ్రీస్వామి దయానందులిట్లు చెప్పచున్నారు. ఇందు తొమ్మిది పోగులుండును. మూడుముడులుండును. "ఓంకారః ప్రథమేతంతౌ, ద్వితీ యేగ్నిస్తథైవచ..." ఆదిగాగల దేవతల వాక్యమునుబట్టి తొమ్మిది పోగులలో తొమ్మండుగురు దేవతల అధిష్ఠానము కలదు. మొదటి దేవత ఓంకారము - దాని గుణము బ్రహ్మజ్ఞానము; రెండవ దేవత అగ్ని - తేజస్సు; మూడవది అనంతుడు - ధైర్యము; నాలుగు చంద్రుడు - సర్వప్రియత్వము; ఐదవది పితృగణము - స్నేహశీలత్వము; ఆరవది ప్రజాపతి - ప్రజారక్షణము; ఏడవది వాయువు బలము; ఎనిమిదవది సూర్యుడు - ప్రకాశము; తొమ్మిదవది సర్వదేవతలు - సాత్వికతయని గ్రహింపవలెను. దీనిని ధరించుటచే ఆయా దేవతలను నిత్యము స్మరించుట, వారి గుణములను తనయందారోపణ జరుగును.

"బ్రహ్మణోత్పాదితం సూత్రం, విష్ణునా త్రిగుణీకృతం
రుద్రేణ దత్తోగ్రంథి ర్వై సావిత్ర్యాచాభి మంత్రితః" -- దేవలుడు

అనుటచే బ్రహ్మ యజ్ఞ సూత్రమును సృష్టించెను, విష్ణువు దానిని మూడురెట్లు గావించెను, రుద్రుడు ముడివేసెను, సావిత్రి యభిమంత్రిం చెను. ఇట్టి దానిని ధరించి భావించి కర్మలాచరించినచో జీవునకు బ్రహ్మత్వము రాకుండునా! కాయదండ, వాగ్దండ, మనో దండములనెడి దండత్రయమును. మూడు ముడులుగా భావించి భోగాది విషయముల నుండి మనస్సు మరలించుట కలుగును. ఈ సంస్కారము వలన ద్విజులకు గొప్ప లాభము గల్గునని గ్రహింపనగును.

ఈ ఉపవీతమే కాలమును సూచించునని వర్ణ సంస్కార విజ్ఞానమున కలదు.

"తిథి వారంచ నక్షత్రం తత్త్వం వేదా గుణత్రయం
కాలత్రయంచ మా పశ్చ బ్రహ్మసూత్రం హి షణ్ణవ."

"క్రాంతివృత్తాత్మక సంవత్సర ప్రజాపతి యొక్క యజ్ఞ సూత్రము అయనాది వీర్యాంతమునగు 96 భావములతో, ఛందస్సు మొదలగు సంవత్సరాంతముగ నగు 96 భావములతో, తిథ్యాది మాసాంతముగల 96 భావములతో యుక్తమై యుండును."

ఇట్టి యజ్ఞోపవీతము నేడు కేవల వర్ణ సూచియై మృచ్ఛకటికమున శర్విలకుని వాక్యముల వంటి వాక్యములతో అపహాస్య భాజనమగుచున్నది. (ఇతడు దొంగతనము చేయు సందర్భమున కన్నమును కొలుచుటకుపయోగించును). ఇది కాల మాహాత్మ్యము.

## సావిత్రి ఉపదేశము

శత.బ్రా.న గాయత్రిని పూర్వకాలమున ఆచార్యుడు శిష్యునకుపనయనమైన వెనుక సంవత్సరము, లేక 6 నెలల తర్వాత, లేక 24, లేక 12 లేక మూడు రోజుల తరువాత ఉపదేశించినట్లు కలదు. కాని యందే బ్రాహ్మణ బాలురకైనచో వెంటనే అని కలదు. కొన్నినాళ్ల తరువాత అనుటను సాంఖ్య, మానవ, భార.లు చెప్పినవి. "తాం ఖల్వి మాం సావిత్రీం సంవత్సరాదేక ఆహుర్ద్వా దశ రాత్రాదేకే త్రిరాత్రా దేకే సద్య ఏకే". -- భా.ర.గృ.

కాని నేడు ఆనాడే ఉపదేశము.

గాయత్రిని ఎట్లు మొదట ఉపదేశింపవలెనను విషయములో అభిప్రాయ భేదము కలదు. ఇందు మొదట తడవలో ప్రణవ వ్యాహృతి సహితముగా (ముందుపెట్టి) నొక్కొక్క పాదముపదేశించును. రెండవ తడవపైన చెప్పినట్లు మొదటి ఋక్కు యొక్క అర్ధభాగమునకు ప్రణవ వ్యాహృతులను జోడించి చెప్పించును. అట్లే మూడవ పాదము కూడ. ఇక మూడవ తడవలో ప్రణవ వ్యాహృతులతో కూడిన పూర్తి మంత్రమును చెప్పించును. ఈ పద్ధతిని విధి విధానమందు వివరించితిని. ఇక రెండవ అభిప్రాయము ననుసరించి పై పద్ధతినే పాటించుచు 'ఓం తత్సవితుర్వరేణ్యం భూః...............' అని వ్యాహృతులను చివరచేర్చి ఉపదేశింతురు.

వర్ణమును బట్టి ఛందో భేదము కలదు. క్షత్రియ వైశ్యులకు త్రిష్టుభ్, జగతి ఉద్దేశింపబడినవి. కాని సాంఖ్య, గ్ర.పై వ్యాఖ్యానకారుడు త్రిష్టుభ్ సావిత్రిగా క్షత్రియునకు 'ఆకృష్ణేన రజసా' జగతీ సావిత్రిగా వైశ్యునకు 'హిరణ్యః పాణిః సవితా, లేక హంసః శుచిషద్ విహితములని వ్రాసెను. వారాహము ప్రకారము' 'దేవోయాతి సవితా' 'యుంజతేమనః' అనునవి త్రిష్టుభ్, జగతులు క్షత్రియ వైశ్యులకు సావిత్రిగా పేర్కొనబడినవి.

లేదా అందరికి గాయత్రి ఛందమును వాడవచ్చునని యుండుటచే నేడిదే అవలింబించుచున్నారు. 'స్వః' అనునది సువఃగా ఉచ్చరింతురు.

ఓంకార ప్రాశస్త్యము: ఓంకార పూర్వకముగా గాయత్రిని ఉపదేశింతురు. తై.బ్రా.న. "ఋచో అక్షరే పరమే వ్యోమన్" అను మంత్రము కలదు. అక్షరమనగా నిచట ఓంకారమే. తై.ఉప.న. ఓంకారమే బ్రహ్మము. ఓంకారమే సర్వమని కలదు. "ఓమితి బ్రహ్మ, ఓమితిదగ్ంసర్వం". "తస్యవాచకః ప్రణవః" అని యోగ సూత్రము. అనగా పరమేశ్వరుని శబ్దము ప్రణవమే. వేదాధ్యాపనము చేయునపుడు ఓంకారముతో ఆరంభింపబడును. అది బ్రహ్మ సాన్నిధ్యమును పొందుటకే. ఇది స్వర్గద్వారమని ఆప.ధ.సూ. "ఓంకారః స్వర్గద్వారం" వేదాధ్యయనారంభమున అంతమున ఓంకారము నుంచవలెననియు, అ, ఉ, మ అను మూడక్షరములు, మూడు వ్యాహృతులు, ప్రజాపతిచే మూడు వేదముల సారాంశముగా గ్రహింపబడినవని మనువు. మార్కండేయ, వాయు పురాణములందు ఇందుగల మూడక్షరములకు విష్ణు, లక్ష్మి, జీవులతోను, మూడు వేదములతోను, మూడు భువనములతోను, మూడగ్నులతోడను పోలికచూపబడినది. వేదముల అంతమే ఓంకారమని, బ్రహ్మజ్ఞానమునకు మూలకందమనియు, బ్రహ్మకే అది గుర్తుగా నున్నదని బహుధా స్తుతించినది కఠోపనిషత్తు. ఇది బ్రహ్మస్వరూపము, బ్రహ్మ ప్రతిపాదకము కూడ.

గాయత్రి మహత్త్వము:

తై.ఆర.న., భూః, భువః, స్వః, అను వ్యాహృతులు వాక్కునకు సారభూతమనియు, గాయత్రి యందుగల పవిత్ర శ్రేయస్సు నొడగూర్చునని

కలదు. "సవితా శ్రియః ప్రసవితా." ఈమెనే వేదమాతయని కీర్తించినది అథర్వవేదము. అందే 'దీర్ఘాయుర్దాయము, పశు సమృద్ధిని కలుగచేయుము' అని ప్రార్థన కూడ కలదు. బ్ర.ఉప.నందు గాయత్రీ స్తుతి కలదు. గయ మనగా ప్రాణమనియు, త్రై అనగా రక్షించుట యనియు, ఆచార్యుడు దీనినుచ్చరించుటచే బ్రహ్మచారి ప్రాణములను రక్షించుచున్నాడనియు (అనగా అజ్ఞానము నుండి, పాపములనుండి) అని అర్థము (ఆప.ధ.సూ. 1.1.1.10). ఒక బ్రాహ్మణము నుదాహరించుచు గాయత్రిని ఉచ్చరించిన అన్ని వేదములుచ్చరింపబడినట్లేయని పేర్కొన్నది. మనువు, గాయత్రి యందొక్కొక్క పాదము ఒక్కొక్క వేదమునుండి సారభూతముగా గ్రహింపబడినదని, సమస్త విజ్ఞానరాశికి ముఖస్థానముగా పేర్కొనెను. విష్ణు. ధ. సూ. శంఖస్మృతి మొ॥ గ్రంథములందు 24 అక్షరములకు గల ప్రత్యేకత వివరింపబడినది. ద్విజుడు, సంధ్యాకాలము లందును, తక్కిన సమయములందును ఓంకారముతో కూడిన వ్యాహృతి త్రయాత్మకమైన గాయత్రిని వేయి పర్యాయములు ప్రతిదినము జపించిన యెడల, ఒక్క మాసమునకు పాము కుబుసమునుండి విడివడునట్లు సర్వపాపములనుండి విముక్తుడగునని మనువు.

"మహతోఽప్యేనసో మాసాత్త్వచే వాహిర్వి ముచ్యతే" అట్లు మూడు సంవత్సరముల కాలము జపించినవాడు పరబ్రహ్మ నెదుర్కొనుచున్నాడని, వాయువువలె కామచారియై, బ్రహ్మరూపియగుచున్నాడని మనువు. ఇంకను "ఏకాక్షరం పరంబ్రహ్మ ప్రాణాయామాః పరంతపః సావిత్ర్యాస్తు పరం నాస్తి మౌనాత్సత్యం విశిష్యతే" అని మనువు. అనగా ఓం అను అక్షరమే బ్రహ్మము, ప్రాణాయామములే గొప్ప తపస్సు. గాయత్రి కంటె మించిన మంత్రము లేదు. ఇట్టి జపము జ్యోతిష్టోమాది యాగములు చేయుటకంటె పదిరెట్లు మేలనియు, ఆ జపమే ఉపాంశువుగా (ప్రక్కనున్న వారికి విన బడకుండ చేయుట) చేసినచో నూరింతలు హెచ్చనియు, మానసికమైనచో వేయిరెట్లు హెచ్చనియు మనువు. జపయజ్ఞముకన్న మించిన యజ్ఞము లేదని జపప్రశంసా సూచకమైన వాక్యములు మనుస్మృతి యందు కలవు.

అష్టాదశ విద్యలలో మీమాంస, దానికంటె తర్కము, దానికంటె వేదములు, అందున ఉపనిషత్తులు, అందున గాయత్రి గొప్పదని, ఓంకారమను వత్సముతో బ్రాహ్మణులకు పాడి పిదుకు గోవు గాయత్రియని, మంత్రములలో గాయత్రి, నగరములలో కాశి, దేవతలలో విశ్వనాథుదు గొప్పయని కాశీఖండమున కలదు. ఈ మంత్రమున చెప్పబడిన వేదమూర్తికి హంస, భాను ఇత్యాదిగా డెబ్బది పేర్లు కలవు. అ నుండి క్ష వరకు 50 అక్షరములు. ప్రణవమున నున్న అ, ఉ, మ, బిందువు, నాదములనుండి పదేసి పదేసి అక్షరములు పుట్టగా ప్రణవమను బంగారు గద్దియపై సూర్యుడను మాణిక్య పదకమును అలంకారముగా మెడను ధరించి వేదమాతయైన గాయత్రి ప్రకాశించుచున్నదని అందేకలదు.

అందే శరీర వర్ణన కలదు. మూడు వేదములు మూడు పాదములు, పురాణములు నాభి, నాల్గు దిక్కులు, నాల్గు కన్నులు, లోకము శరీరము, ఆకాశము ఉదరము, ధర్మశాస్త్రము హృదయ పద్మము, ఛందస్సులు స్తనములు, సాంఖ్య శాస్త్రములు చెవులు, అగ్నిముఖము, శిక్ష మొ॥ వేదాంగములు 5 తలలు, అథర్వణము చేష్ట, శివుడు శిఖ, బ్రహ్మ శిరస్సు, విష్ణువు, ఆత్మ, మీమాంస ఖావ లక్షణము ఛందస్సులందు గాయత్రిని నేనే అని గీత. "గాయత్రీ ఛందసామహమ్."

**పంచముఖములు:**

ముక్తా-విద్రుమ-హేమ-నీల-ధవళములైన పంచముఖములవలన పంచభూతములవలన పుట్టిన సృష్టియు-కర్మయోగ-ధ్యానయోగ-భక్తియోగ-వైరాగ్య, జ్ఞానయోగములను 5 మోక్ష సాధనలు, సృష్టి-స్థితి-లయ-తిరోధాన- అనుగ్రహములను పంచకర్మలు సూచింపబడుచున్నవని మరియొక వివరణ.

ఋగ్వేద మందుదాహరింపబడిన ప్రాతర్గాయత్రీ రూపమిట్లుండును. రవి మండల మధ్యస్థమై రక్తవర్ణముతో కూడినదై ద్విభుజ, అక్షసూత్ర కమండులు ధరయై, హంస వాహనము నెక్కినదైయుండును.

యజుర్వేదప్రోక్తమైన మధ్యాహ్న గాయత్రి ఇట్లుండును. రవి మండల మధ్యస్థయై కృష్ణవర్ణము కలదై చతుర్భుజ త్రినేత్ర శంఖచక్ర గదా పద్మ హస్తయై గరుడ వాహనము నెక్కినదై వైష్ణవియై విరాజిల్లును.

సామవేద ప్రతిపాదితయైన సాయంకాలపు గాయత్రీ రూప మిట్లుండును. రవి మండల మధ్యస్థయై శుక్లవర్ణముతో నాల్గుభుజములతో, త్రిశూల డమరుపాశ పాత్రములతో వృషభ వాహనమునెక్కినదై రుద్రాణియై ప్రకాశించు చుండును.

మూడు పాదములతో కూడిన గాయత్రిని మనము ధ్యానించు చున్నాము. దీనికి 4వ పాదము కలదు. అది సన్న్యాసాశ్రమదీక్షితులకే. మూడు పాదములలో ఆరుభాగములు. ఇవి ఆరు దిక్కులను సూచించును. దీనినే 'షట్ కుక్షు'లందురు. ఆపః జ్యోతిః, రసః, అమృతం, బ్రహ్మ' అనుగాయత్రీ శిరస్సు వేదాంగములైనది. మంత్రమందున్న 24 అక్షరములు 24 తత్త్వములకు గుర్తుగా ప్రణవము పరబ్రహ్మకు గుర్తుగా భావింపవలెనని విష్ణుధర్మోత్తరవచనము. మంత్రములో వరేణియం అనవలెనా వరేణ్యాం అన వలెనా అని మీమాంస. జపము చేయునపుడు 'ణియం'గానుచ్చరింపవలెనని, పారాయణాదులందు 'ణ్యం'గా పలుకవలెనని పెద్దలందురు.

తత్సవితుః అన్నచోట 'తత్త్సవితుః' అని నొక్కి ఉచ్ఛరింపవలెనని వేదవిద్వాంసుల తీర్పు.

**జపనియమములు:**

ఉదయకాలమున సూర్యోదయమగు వరకు (బ్రాహ్మీముహూర్తము నుండి) నిలబడి ఉచ్చరింపవలెనని, సాయంకాలమున నక్షత్రములు కనపడు నంతవరకు కూర్చుండి ఉపాసించవలెనని విధి. ఇట్లు చేయుటచే క్రమముగా తొలి రాత్రి చేసిన పాపములనుండి, పగటి పూట చేసిన పాపములనుండి ముక్తుడగునని శాస్త్రము. మోక్షమును కోరువాడు మానసికముగా, సమస్త కోరికలు కోరువారు ఉపాంశువుగ జపించవలెనని మరియొక వచనము. వ్రేళ్ల కణుపులతోనేగాని జపమాలతో కాదని అందురు. పైబట్ట కప్పుకొని

జపము చేయరాదు. నీటిలో నిలబడి చేయరాదని, గోభిలుడు దీనిని అగ్నిముఖి అని చెప్పుటచే కూడదని పెద్దల వాక్కు. ఇంకను ఎన్నియో నియమములు కలవు.

సాయం సంధ్యా సమయమున గాయత్రిని వేయి లేక వందసార్లు ప్రాణాయామ సహితముగా గాని లేక పదిసార్లు సప్తవ్యాహృతులతో ఓంకార పూర్వకముగా గాని జపించవలెనని బౌధ. ద.సూ. నందు కలదు. పాపము నుండి ముక్తుడగుటకు వేయిసార్లు జపించుట ఉత్తమమనియు, వంద మధ్యమమనియు, పదిసారు అధమ పక్షమనియు వసి.ధ. సూ. నందు కలదు.

ఎన్నియో ఈశ్వర, విష్ణు, దేవీ సహస్ర నామములు కలవు. అందు సమానమగు నామములు లెక్కకు మిక్కిలియుండును. కాని గాయత్రీ నామావళియందున్న బ్రాహ్మణ్య ఫలదాయినీ మరి యెక్కడలేదు. ఈ నామము బ్రాహ్మణ్య ఫలమును సూచించినది. గాయత్రి అను పేరులోనే 'గానము చేయువానిని రక్షించునని' కలదు. ఇట్టి జపమును చేయుట ఇహపర సాధన హేతువు.

క్షత్రియ వైశ్యులకు సావిత్రీ మంత్రభేదము - అర్థము.

"ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం
మర్త్యం చ, హిరణ్య యేన సవితా రథేనాఽదేవో
యాతి భువనా విపశ్యన్"

అనగా ప్రాతస్సాయం సమయములందు పరిభ్రమించు సూర్యుడు, దేవ మనుష్య శరీరములందు ప్రాణ రూపముగానుండి, సర్వ ప్రవృత్తికి ప్రేర కుడై వర్షమును కురిపించుచు సకల విధములైన కోరికల నిచ్చుచున్నాడు. సమస్తమును చూచుచు ప్రతిదినము తూర్పున ఉదయించుచున్నాడని అర్థము.

"హిరణ్యపాణిః సవితా విచర్షణిః ఉభే ద్యావా పృథివీ అంతరీయతే
అపామీవాం బాధతే వేతి సూర్యం అభికృష్ణేన రజసా ద్యాం కృణోతి."

అనగా సవితృ దేవుడు తన బంగారు కిరణములచే ద్యులోక, భూలోకముల గుండా ప్రయాణము చేయుచున్నాడని, సమస్త రోగ నాశకుడని, సూర్యరూపమును ధరించుచున్నాడని అట్టి దేవుని ప్రార్థన ఇందుండును. పై మంత్రములు క్షత్రియునకని కొందరు చెప్పగా దిగువ మంత్రము వైశ్యునకని మరియొకరు చెప్పిరి.

**"విశ్వరూపాణి ప్రతిముంచతే కవిః ప్ర అసావీత్ భద్రం ద్విపదే చతుష్పదే**
**వినా కం అఖ్యత్ సవితా వరేణ్యః అను ప్రథానం ఉషసః విరాజతి."**

ఇందు మనుష్యులకు, పశుపక్ష్యాదులకు ఏది మంగళమైనదో అట్టిదానిని సృజించిన సూర్యుని ప్రార్థన ఉండును.

"యుంజతే మనః ఉత యుంజతే ధియః విప్రాఃవిప్రస్య బృహతః విపశ్చితః
విహోత్రాః దధేవయున విత్ ఏకః ఇత్‌మహీ దేవస్యసవితుః పరిస్తుతిః"

వివేకవంతులైన భక్తులు, ప్రాణదాతయైన సూర్యుని పట్ల మనస్సును లగ్నము చేయుచున్నారని, సుచరిత మెరిగినవాడు, యజ్ఞ నియమములు తెలిసినవాడగుటచే అతనిని స్తుతించుటయే పరమార్థమని ఆ మంత్రమునకర్థము.

"హగ్ంసశ్శుచిష ద్వసురన్తరిక్ష సద్ధోతా వేదిష
దతిథి ర్దురోణసత్, నృషద్వరస దృతసద్వ్యోమ
సదబ్జాగోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్."

జ్యోతిర్మండలమున, అంతరిక్షమున, ఆహవనీయ అగ్నిరూపమున, వేదియందు, అతిథి రూపమున, జీవరూపమున, పుణ్యక్షేత్రములందు, వైదిక కర్మల ఫలరూపమున, నక్షత్రాది రూపమున, ఉదకములందు, క్షీరాది రూపమున, వృక్షాది రూపమున అంతట నున్న ఆ ఆదిత్య రూపుడగు పరబ్రహ్మను స్తుతించు మంత్రమిది.

## ప్రతీకాత్మక కృత్యములు: (Symbolism)

కొన్ని ప్రతీకాత్మక కృత్యముల ద్వారా గురువు బ్రహ్మచారిని గ్రహించును. ఆచార్యుడు తనదోసిలి నిండ జలమును గ్రహించి బ్రహ్మచారి

యొక్క అంజలి యందు ఒక మంత్రమునుచ్చరించిన వెనుక విడిచిపెట్టును. అది శుచిత్వమునకు ప్రతీక (గుర్తు)

"శుచిత్వ పిద్ధయే తస్య సావిత్రీగ్రహణో గురుః
అభి మంత్రస్య యథావారి పించత్యేవ తదంజలీ." -- ఆశ్వ. వీ-పీ

గాయత్రీ మంత్ర గ్రహణమునకు పూర్వము విద్యార్థి శుచిమంతుడై యుండవలెను. దీని తరువాత ఒక మంత్రము నుచ్చరించుచు ఆచార్యుడు బ్రహ్మచారికి సూర్యుని చూపించును. సూర్యుడు ఈశ్వరునికి ప్రతినిధి వంటివాడు. విద్యార్థి నియమ జీవనమున, పాలమున, సూర్యుడు ఆదర్శము వంటి వాడు. ఆశ్వ. ఇట్లనుచున్నాడు.

"కర్మసాక్షిణ మాదిత్యం తర్పయేత్తం యథోక్తవత్
పర్వవ్రతానాం భగవాన్, సూర్యోఽధిపతి రీశ్వరః"

సూర్యుడు సర్వకర్మలకు సాక్షి. సమస్త వ్రత, కాల, క్రియ, గుణములకు ఈశ్వరుడు. కనుక అతనికి విధి పూర్వకముగా తర్పణము నీయవలెను.

### హృదయస్పర్శ:

ఆచార్యుడు శిష్యుని యొక్క కుడి భుజము మీదుగా చేయి తీసికొని పోవుచు "ఈ వ్రతము నందు నీ హృదయమును ధరించుచున్నాను. నీ చిత్తము నా చిత్తము ననుసరించుగాక." మొ॥ అర్థమిచ్చు మంత్రముల ద్వారా అతనిహృదయమును స్పృశించును. "మమవ్రతే తే హృదయం దధామి" (పా.గృ.) ఈ హృదయ స్పర్శ వారి ఐకమత్యమును సూచించును. ఇది లేనిచో పరస్పర సంబంధము లేదు.

### అశ్మారోహణము:

"ఈ రాతి నెక్కుము. దీనివలె స్థిరముగా నుండుము. శత్రువులను పరాజితులను చేయుము." (మానవ.గృ.) ఇవి ఉచ్చరించిన వెనుక ఆచార్యుడు రాతిపై పాదమును పెట్టించుటలోని తాత్పర్యమేమనగా వేదాధ్యయనమున మిక్కిలి దృఢత్వము కలుగుటను సూచించునని మానవ.గృ.న కలదు. కాని భార.గృ.ను బట్టి విద్యార్థి బలమునకిది ప్రతీకవంటిది.

## విద్యార్థిని స్వీకరించుట:

మన పద్ధతిని విపులముగా చెప్పితిని. 'ఎవరి బ్రహ్మచారివి నీవు' అని అడిగినప్పుడు 'మీయొక్క' యని విద్యార్థి చెప్పును. అపుడాచార్యుడు గర్వింపక శిష్యునకు ఇంద్రుడే గురువనియు అట్లే అగ్నియే గురువనియు, మరియు నతనికి ప్రియమిత్రుడు మాత్రమే తాననియు తలంచి స్పష్టీకరించును. ఈ ప్రకారముగా అధ్యాపన నిమిత్తమై రక్షించుటకై (ఉభయులను రక్షించువాడు పైవాడైనను) స్వీకరించును.

'ఓం ప్రజాపతయే త్వా పరిదదామి, ఓం దేవాయత్వా
పవిత్రే పరిదదామి' - మొ॥

## ఆదేశములు - త్రిరాత్ర వ్రతము:

కొన్ని నియమములను లోగడ పేర్కొంటిని. ఈ నియమములు రెండు రకములు, కొన్ని కొంతకాలము వరకు ఆచరించవలసినవి. కొన్ని బ్రహ్మచర్యాంతము, విద్యార్థి అగ్నికి ప్రదక్షిణము చేసిన వెనుక ఆచార్యుడు స్వీకరించి "నీవు బ్రహ్మచారి వయితివి. స్నాన సంధ్యాదులననుష్ఠింపుము" మొ॥ ఆదేశముల నిచ్చును. ఆ నియమములే విస్తృతముగా నిట్లుండును. ఉపనయన విధులు పూర్తియైన వెనుక విద్యార్థి మూడు దినముల వరకు కఠోర నియమములను పాటించవలెను. దీనినే త్రిరాత్ర వ్రతమందురు. ఈ వ్రతము 12 రోజుల వరకు సంవత్సరము వరకు పాలించుట కలదు. క్షార లవణ వర్జితుడై, నేలమీద పండుకొన్న వాడై యుండవలెనని ఆశ్వ. గృ. బౌధాయనుడు అగ్నిపరిచర్యను కూడచేర్చెను. ఖాదిరమున పాలుకూడ నిషేధింపబడినవి. హిర.గృ. నందు మట్టి పాత్రనుండి త్రాగకుండనుండుట మొ॥ నియమములు కలవు. ఈ నియమములే మనుస్మృతి యందు కలవు. అగ్నియందు సమిధలనుంచుట, భిక్షా చర్య, గురుశుశ్రూష, స్నానము, దేవ ఋషి తర్పణములు ఇత్యాదులు, క్షార లవణములపై అభిప్రాయభేదము కలదు. హిర. గృ.పై మాతృదత్తుడు "గుడాదిరిక్షు వికారః క్షారః" అనెను. మనువుపై మేధాతిథి క్షార మన యవ క్షారమని, లవణమన సైంధవ లవణమని వ్రాసెను.

మద్యమాంస నిషేధము, ఆచమనము, వాక్సంయమనము, పగలు నిద్రింపకుండుట, అగ్నిపరిచర్య, అధ్యయనము కొన్ని ఆహారాదులను తిన కుండుట, నృత్యగీతాదుల నిషేధము, గురుశుశ్రూష మొ॥ పెక్కు విధులు స్మృతులందు కలవు.

అగ్నికార్యము:

ఉపనయనము నాడు అగ్నియందు సమిథలను బ్రహ్మచారి వేయ వలెనని తెలిపికొన్నాము గదా! ఆ అగ్ని మూడు రోజుల వరకు నుండ వలెను. ఆ వెనుక మామూలు అగ్ని యందే జరుగును. ప్రాతస్సాయం సమయములలో నిట్లు చేయవలెను. ఆప.ధ.సూ.నందు అగ్నిపూజ సాయం సమయమమునే కొందరందురని కలదు. ఆప.ధ.సూ. సమిథ సంగ్రహణము నిట్లు చెప్పినది. అడవినుండి గ్రహింపవలెను. సూర్యాస్తమయమైన వెనుక గ్రహింపరాదు. కుశలతో కాక చేతితో అగ్నిచుట్టు తుడువవలెను. నీళ్లు చల్లనిదే కుశలను అగ్నిలో వేయరాదు. తాను వేయుటయేగాక, ఆచా ర్యుడు రోగగ్రస్తుడైనను, ప్రయాణములోనున్నను అగ్నిపరిచర్య చేయవలెను. మొ॥నవి.

సమిథలు:

సమిథ, పలాశము గాని లేక యజ్ఞసంబంధమైనది కావలెను. పలాశ, అశ్వత్థ, న్యగ్రోధ, ప్లక్ష, వైకాంతక, ఉదుంబర, బిల్వ, చందన, సరల, శాల, దేవదారు, ఖదిరములు సమిథలకు యోగ్యములు, అని బ్రహ్మపురాణము, అపరార్కుడు ముందు పలాశము, తరువాత ఖదిరము, ఆపైన శమి, రోహితక, అశ్వత్థములు శ్రేష్ఠములనెను. ఏమిలేనిచో అర్క, వేతసములని కూడ అనెను. కోవిదార విభీతక, కపిత్థ, కరభ, తిలక శ్లేష్మాతక, శాల్మలి సమిథలు నిషిద్ధములని త్రికాండమండనము. బొటన వ్రేలికన్న లావు పనికి రాదని, పైత్వక్కుతో కూడినదిగా నుండవలెనని, ప్రాదేశ మాత్రముకన్న పొడుగు, పొట్టికారాదని, క్రిమికీట దుష్టము కారాదని, ఆకులతో నుండి రెండు కొమ్మలు కలిగినది పనికి రాదని కలదు.

బ్రహ్మచారిని మృత్యువు కబళింపనున్న సమయములో అగ్ని రక్షించుటచే అగ్ని పరిచర్య బ్రహ్మచారి చేయవలెనని హారీతుని వచనము.

భిక్ష:

ఆశ్వ. గృ.న ఎవరు భిక్షను నిరాకరించరో అట్టి పురుషునిగాని, స్త్రీనిగాని బ్రహ్మచారి 'భిక్షాం దేహి' అని యడుగవలెనని కలదు. బ్రాహ్మణ విద్యార్థి 'భవతి భిక్షాం దేహి' యనియు, క్షత్రియుడు 'భిక్షాం భవతి దేహి' యనియు, వైశ్యుడు 'దేహి భిక్షాం భవతి' యని యడుగవలెనని బౌధ.గృ. చాలమంది ఇట్లేచెప్పిరి. మనువు ముందు తల్లిని, సోదరిని లేదా తల్లి సోదరిని గాని అడుగవలెననెను. ఆప.ధ.సూ.న స్త్రీలు, బ్రహ్మచారికి భిక్ష నిడకపోయినచో వారి సర్వసంపదలు నాశనమగునని కలదు. బ్రహ్మచారికి ఇతర స్థలములనుండి భిక్ష లభించనిచో తన కుటుంబము నుండి గాని, జ్ఞాతులనుండి గాని, దగ్గర బంధువులనుండిగాని లేదా తుదకు ఆచార్య గృహమునుండి గాని గ్రహింపవచ్చునని గౌతముడు, ఆప.ధ.సూ.న అపాత్రుల నుండి గాని, మహాపాతకములు చేసిన వారి నొద్దగాని స్వీకరింపరాదని కలదు. ఈ అపాత్రులు బహువిధములు. వేదవేత్తలు, శీలవంతులు, ధార్మికులైనవారి నుండి గ్రహింపవలెనని మనువు. నిందితులు గాని బ్రాహ్మణుల నుండి యని యాజ్ఞ. చెప్పగా, విశ్వరూపుడు బ్రాహ్మణులు లభించనిచో క్షత్రియుల వైశ్యుల, ఆపద్ధర్మముగా శూద్రుల గృహమునుండి కూడా గ్రహింపవచ్చునని విశ్వరూపుని వ్యాఖ్యానము. శూద్రులనుండి అపక్వాన్నమును గ్రహింపవచ్చునని పరాశర మాధవీయము.

భిక్షా ద్రవ్యము పవిత్రమైనదని, ఉపవాసముతో తుల్యమైనదని మనువు. చాల గృహముల నుండి తీసికొని వచ్చినది తినవలెను గాని, ఒకే ఇంటి నుండి కూడదని యాజ్ఞవల్క్యుడు.

భిక్ష నెత్తుకొనవలెనని ఏ గ్రంథములు విధించినవో అవియే భిక్ష నిడుటను విధించినవి. వైశ్వ దేవాంతమున భూతములకు బలియిచ్చిన వెనుక స్వస్తి పూర్వకముగా భిక్ష నిడవలెనని గౌతముడు. యతులకు,

బ్రహ్మచారులకు స్వాగతపూర్వకముగా నీయవలెనని మనువు. ఇది నెమలి గ్రుడ్డు అంత పరిమాణమును చెప్పినది మితాక్షరి. భిక్షయనగా ఒక కబళము, 4 కబళములైనచో ఒక పుష్కలము, 4 పుష్కలములు 1 హంత, 3 హంతలు ఒక అగ్రమని శాతాతపుడు మానమును చెప్పెను. భిక్ష సమిదా ధానమును వారము రోజులు చేయనిచో ప్రాయశ్చిత్తమును విధించినది బౌధ.ధ.సూ.

భిక్షా ద్రవ్యము నంతను బ్రహ్మచారి భుజింపరాదు. గురువుననుమతి వడసి అతడు తీసికొనుమన్నచో గ్రహింపవలెను. ఇది హవిష్యాన్నముతో సమానమని ఆపస్తంబుడు.

## మేధా జననము:

ఉపనయనమైన వెనుక నాల్గవ రోజు జరుగు ఈ కర్మకాండను ముందే వివరించితిని. "జగత్తును ధరించునది సావిత్రీ దేవి స్వయముగా మేధా స్వరూపిణి. విద్యావృద్ధి కొరకు మేధ కావలెను." ఆ మేధకై సావిత్రిని పూజింపవలెనని శౌనకుడు.

"యా సావిత్రీ జగద్ధాత్రీ సైవ మేధా స్వరూపిణీ
మేధా ప్రసిద్ధయే పూజ్యా విద్యా సిద్ధి మభీప్సితా."

దీనివలన విద్యార్థికి వేద విజ్ఞానమును గ్రహించుటకు వలయు మేధ జనించును అని సంస్కార ప్రకాశ. ఇందు మోదుగ చెట్టును గాని, మోదుగ కొమ్మ పెట్టిగాని పూజింతురు. సుశ్రవాః అను మంత్రమును పఠింతురు. ఈ పదమునకు దివ్యమైనదని ఒక అర్థము, చక్కగా వినువాడని మరియొక అర్థము. దండాదులను మోదుగచెట్టు దగ్గర విసర్జించి వచ్చిన బ్రహ్మచారి ముందు భాగమున నీళ్లు పోయవలెనని సంస్కార ప్రకాశ. బ్రహ్మచారిచే పరిత్యక్తమైన వస్త్రములను ఆచార్యుడు స్వీకరించును.

## భిన్న పద్ధతులు:

ఈ సంస్కారమునందనేక భేదములు గలవు. కొన్నింటిని మాత్రమే పేర్కొందును.

ఆశ్వ.గృ.న ఇంచుమించు కర్మాంతమున మేఖలను కట్టుట, దండ మిచ్చుటను చెప్పగా ఆప.గృ. హోమాంతమున, అంజలి పూరణమునకు ముందుగా చెప్పినది.

ఆశ్వ. యందు వటువు యొక్క చేతిని ఆచార్యుడు గ్రహించుటకు ముందు, పరిదానమునకు ముందు (వటువును దేవతల కర్పించుట) ఆదిత్య దర్శనముండగా భార.న. ఉపదేశానంతరమున కలదు.

బ్రహ్మచారి విధులు భార. లో కర్మాంతమున నుండగా హోమాంత మున అని ఆశ్వ.లో కలదు.

భిన్న మంత్రములు భిన్నభిన్న సందర్భము లందు సూత్రకారులచే వాడబడగా, ఒకే మంత్రము ఒకరు ఒక సందర్భమున మరియొకరు మరొక సందర్భమున వాడిరి. ఉదా:- 'సుశ్రవః' అను మంత్రమును దండము పరిగ్రహించునపుడు చెప్పవలెనని ఆప. చెప్పగా, ఆశ్వ.భార, మానవములు మేధా జననమున అని చెప్పినవి. పార.గృ. అగ్నిలో సమిధలు వేయునపుడు చెప్పవలెనన్నది.

మానవ.గృ. కాఠకగృ.లు హోమాంతమున మూడుసార్లు 'దధి ప్రాశ మును' "ధధి క్రావణ్ణో అకారిషమ్" అను మంత్రముచే చేయించుట కలదు.

ఆప. మానవ, బౌధ, ఖాదిర భారలు బ్రహ్మచారికి అశ్మారోహణమును విధించగా కొన్ని చెప్పలేదు.

హిర, భార, మానవములందు హోమము ఆరంభము కాకముందే యజ్ఞోపవీతము బ్రహ్మచారి ధరించునని చెప్పినవి.

ఆప.బౌధ.పార.లు ఉపనయనమునకు ముందే బ్రాహ్మణ భోజనమును చెప్పినవి. ఆప, భార, బౌధ. లు వటువునకు కూడ భోజనమును విధించినవి.

చౌలము మాదిరిగా వటువునకు క్షురకర్మ ఇంచుమించు అన్ని సూత్రములు విధించినవి. ప్రాచీన కాలమున ఆచార్యుడే ఈ వపనమును నిర్వహించెడి వాడని ఆప.గృ.పై సుదర్శనుడు వ్రాసినాడు. ఆప.లో నున్న పెక్కు విషయములపై ఆశ్వ మొ॥ వారు ఉపేక్ష వహించిరి.

ఉపనయనమునకు ముందు రోజున నాందీ శ్రాద్ధము చేయవలెనని ఆప. పై హరదత్తుడు వ్రాసెను. అట్లే గ్రహ మఖము (గ్రహముల నుద్దేశించినది) కూడ ముందు రోజునగాని లేక వారము పది రోజులలో గాని చేయవలెనని కలదు. ఈ సంస్కారమునకు ముందు గణపతి పూజ, కులదేవతలకు పూజ, పుణ్యాహవాచనము, మాతృకా పూజనము, మండప దేవతారాధనలు అర్వాచీన గ్రంథములందు కలవు. కొన్ని సూత్రములు హోమము, అశ్మారోహణమైన వెనుక ఆచార్యుడు బ్రహ్మచారిని క్రొత్త వస్త్రమును కట్టునట్లు చేయునని, కృష్ణాజినమిచ్చునని చెప్పగా కాఠక, భార.లు అశ్మారోహణమునకు ముందే నూత్న వస్త్రమును కట్టబెట్టవలెనన్నవి. కొన్ని సూత్రముల ప్రకారము హోమమునకు ముందే క్రొత్త బట్ట కట్టుటను విధించినవి.

గురువు ఈ దిగువ మంత్రముతో విద్యార్థి నాభిని స్పృశించును. 'సమస్త ప్రాణ వాయువులకు నీవు గ్రంథియై యున్నావు. వదులు కాకుము.' అని నాభిపై మేఖలను ముడివేయు సందర్భమున పలుకునని బౌధ.సూ. కొన్ని సూత్రముల ప్రకారము ముందు నాభిని స్పృశించుట, ఆ వెనుక హృదయ స్పర్శ కలదు. శాంఖ్య, ఆశ్వ, పార.లు హృదయ స్పర్శనే పేర్కొన్నవి. కౌశిక, ఖాదిర, భారలు విద్యార్థి నాభినే పేర్కొన్నవి.

మేఖలను కట్టిన తర్వాత దండము నిచ్చుట గోభిలము చెప్పలేదు కాని కొన్ని సూత్రముల ప్రకారమట్లు జరుగును. శాంఖ్య, గోభి, హిర. ఆపలు సావిత్రి ఉపదేశమైన వెనుక దండము నీయవలెనని విధించినవి.

కౌశిక, సాంఖ్య, భార, ఆశ్వ, జైమినిల ప్రకారము సావిత్రి ఉపదేశమునకు ముందు విద్యార్థి అగ్నిలో సమిధనుంచును. బౌధ. ఆపలు

ఉపనయనారంభముననే విధించినవి. కొన్ని సావిత్రి ఉపదేశమైన వెనుక విధించినవి.

బౌధ. ఉపదేశమునకు (సావిత్రి) ముందు విద్యార్థి ఏమియు తినరాదని చెప్పగా శాట్యాయన మొ॥ తినవచ్చునని చెప్పిరి.

కాషీతకి మొ॥ వ్యాహృతులకు ముందు ఓంకార ముంచవలెనని చెప్పగా గోభిలమున ఓంకార మంత్రముగా నుచ్చరించవలెనని కలదు. అనగా భూరోం, భువరోం.... కొందరు ఓం భూరోం అని ఆది, అంతములందుంతురు.

జైమిని. అన్ని వర్ణముల వారు (ద్విజులు) భవతి ముందుగా నుంచి అడుగవలెనని వ్రాసెను.

ఇట్లెన్నియో మత భేదములు కలవు. ఇంకను మంత్ర భేదములు, పద్ధతి భేదములు వ్రాసిన పాఠకునకు విసుగు కల్గునను భీతిచే విరమించుచున్నాను.

## స్త్రీకి ఉపనయనము కలదా? యజ్ఞోపవీత ధారణ కలదా?

హారీతుని ప్రకారము స్త్రీలు ఇరు తెగలు. 1) బ్రహ్మవాదినులు 2) సద్యోవధువులు. వీరిలో బ్రహ్మవాదినులకు ఉపనయనము, అగ్నినుంచు కొనుట, వేదాధ్యయనము, స్వగృహమున భిక్షలు విహితము. సద్యోవధువు లకు, వివాహము సమీపించినపుడే ఏదో విధముగా ఉపనయన సూత్రము వేసి వివాహము జరుపవలెను. (స్మృతిచంద్రిక).

గోభిల గృ. నందు 'స్త్రీ యజ్ఞోపవీతము ధరించి యుండగా అగ్నిని సమీపించునపుడు' అనియున్న మాటలకు పైవస్త్రము యజ్ఞోప వీతాకారముగా ధరించియున్న దానిని అని వ్రాసెను. రఘు నందనుని సంస్కార తత్త్వమున, గోభిలుని మత ప్రకారము స్త్రీ యజ్ఞోపవీతము ధరించవలెనని హరిశర్మ చెప్పగా, రఘునందనుడు కాదని వ్రాసెను.

హారీతుడు, స్త్రీలకు రజస్వలాత్పూర్వమే సమావర్తనమును విధించెను. కనుక బ్రహ్మవాదినియైన స్త్రీకి గర్భాష్టముననే ఇది జరిపెడివారని,

తరువాతనే వేదాధ్యయనమని తేలుచున్నది. "పూర్వ యుగములందు ముంజగడ్డితో చేసిన మేఖలను కట్టుట, వేదములను చదివించుట, సావిత్రీ మంత్రమును పఠింపచేయుట, మొ॥ తండ్రి గాని, పినతండ్రి గాని, సోదరుడు గాని చేయవలెనని వీరికన్న భిన్నులకు అర్హత లేదనియు, ఇంటియందే భిక్ష యుండెడిదనియు, కృష్ణమృగ చర్మమునుగాని, వృక్షపు త్వక్కుతో చేసిన వస్త్రములు గాని, జటాధారణము గాని నిషిద్ధములుగా నుండెడివని యముని వాక్యములను సంస్కార ప్రకాశము పేర్కొన్నది."

"పురాకల్పే తు నారీణాం మౌంజీ బంధన మిష్యతే
అధ్యాపనం చ వేదానాం సావిత్రీ వచనం తథా
పితా పితృవ్యో భ్రాతా వా నైనామధ్యాపయేత్ పరః
స్వగృహేచైవ కన్యాయా భైక్ష చర్య విధీయతే
వర్జయేద జినం చీరం జటాధారణమేవచ."

కాని మనువు జాతకర్మనుండి ఉపనయనము వరకు స్త్రీలకు మంత్ర రహితముగా జరుగవలెననియు వివాహమే సమంత్రకముగా జరుగవలెనని వ్రాసెను. భర్త సమీపమున నుండుట గురువు సమీపమున నుండుట వంటిది. గృహస్థ కర్మలను చేయుట అగ్నిని పరిచర్య చేయుటవంటిది. యముని వాక్యములను నిర్ణయసింధు మొ॥ నిబంధన గ్రంథములు ఈ ఉపనయన పద్ధతి పూర్వ యుగములకు చెందినవని వ్రాసినవి. బాణ భట్టుని కాదంబరియందు తపస్సు చేయుచున్న మహాశ్వేత బ్రహ్మ సూత్రధారిణియై యున్నటుల కలదు. "బ్రహ్మ సూత్రేణ పవిత్రీ కృతకాయామ్" అలౌకిక గుణములనిచ్చునను విశ్వాసముచే స్త్రీలు కూడ తపస్సు చేయు సందర్భమున దీనిని ధరించెడివారని తెలియుచున్నది. పరమేశ్వరుడే యజ్ఞమనియు, అతనికి సంబంధించిన దగుటచే దీనికి యజ్ఞోపవీతమని పిలువ బడినదని కలదు కదా!

"యజ్ఞాఖ్యః పరమాత్మా చ ఉచ్యతే చైవ హోతృభిః
ఉపవీతం తతోఽస్యేదం తస్మాద్యజ్ఞోపవీతకమ్."

-- సంస్కార ప్రకాశ

## మొ॥ అవిటివారికి ఉపనయనము కలదా?

జైమిని. అవయవ హీనునకు అగ్ని హోత్ర అధికారము లేదని వ్రాసెను. అవయవ లోపము సవరింపబడుటకు సాధ్యముకాని సందర్భములందే యని గుర్తు పెట్టుకోవలెను. ఆప, వసిష్ఠ, గౌతమ మొ॥ వారు పతితులకు పుట్టు గ్రుడ్డి, బధిరత్వము కలవారికి, అసాధ్య రోగములతో బాధపడు వారికి, ఆస్తియందు హక్కులేదనియు, వారు పోషింపబడువారేనని కలదు. కాని పైవారలకు వివాహము ననుమతించిరి. అయినచో ఉపనయనము కానిదే వివాహమెట్లు ప్రాప్తించునని శంక, బౌధ. గృ. శేష సూత్రము చెవిటి, మూగవారలకు ఒక ప్రత్యేకమైన పద్ధతిని విధించినది. అగ్నియందు సమిధ వేయుట, రాతిపై నెక్కుట, వస్త్రధారణము, మేఖలాధారణము, కృష్ణమృగచర్మమునిచ్చుట, దండమిచ్చుట - ఈ ప్రక్రియలు మౌనముగా జరుపబడును. ఇందు బ్రహ్మచారి పేరు చెప్పనక్కరలేదు. ఆచార్యుడే అన్నాదుల నర్పించుట, ఆజ్యహోమము, మంత్రములు చదువుట మొ॥ వి చేయును. ఇంకను ఆ సూత్రమునందు కొందరి మత ప్రకారము గ్రుడ్డి, పిచ్చి, నపుంసకులకు, మూర్ఛ, శ్వేతకుష్ఠ, కుష్ఠ రోగులకు కూడ పై ప్రకారము జరుపవలెననిరి. గోఘృతమున సావిత్రీ మంత్రము వ్రాసి దానిని మూకాదులకు ప్రాశన చేయించవలెనని ఒక స్మృతి. గాయత్రిని ఉచ్చరించ లేని వారైనచో (మూగ, చెవిటివారు) వారిని ఆచార్యుని దగ్గరకుగాని, అగ్ని దగ్గరకు గాని తీసికొనివచ్చి వారిని ఆచార్యుడు స్పృశించుచు గాయత్రిని తానే వారి ప్రతినిధిగా నుచ్చరింపవలెను. బ్రహ్మపురాణము కుండగోళకులకు (భర్త ఉండగా మరియొకరికి పుట్టినవాడు, భర్త చనిపోయిన తరువాత పుట్టినవాడు) మూగ చెవిటి వారలకు వలె చేయవలెనన్నది. అయినను వీరి తల్లిదండ్రులొకే వర్ణమునకు చెందినవారైనచో అట్టివారికే అట్లు చేయవలెనని శాసించినది.

### సంకీర్ణులకు ఉపనయనము:

అనులోములకు ద్విజులకు మాదిరిగా సంకీర్ణులు ఈ సంస్కారమునకు అర్హులని మనువు యాజ్ఞ పై మితాక్షరి అనులోములకు తల్లి వర్ణమును

బట్టి విధింపబడు పద్ధతులే స్వీకార్యములనియు, ఈ అనులోములలో ఇంకను సంకీర్ణులైనచో వారికి ఉపనయనార్హత కలదని వ్రాసెను. బౌధ. గృ. శేష సూత్రము రథకార, అంబష్ఠులకు ఉపనయన పద్ధతులను పేర్కొన్నది. గౌతముడు మాత్రము బ్రాహ్మణునకు శూద్రస్త్రీ నుండి పుట్టిన వానికి విధించలేదు. ప్రతిలోములందరును శూద్ర తుల్యులేయని మనువు. బ్రాహ్మణునకు శూద్రస్త్రీకి పుట్టినవాడు, అనలోముడైనను ప్రతిలోముడేయని మనువు.

**అశ్వత్థమునకు ఉపనయనము:**

(చూ:- బౌధ, గృ. శేష సూత్రము). ఆధునిక కాలమున ఇట్లు చేయుట ఇంచుమించులేదని చెప్పవచ్చును. అశ్వత్థమునకు పడమరవైపున హోమము చేయుదురు. పుంసవనము నుండి ఉపనయనము వరకు వ్యాహృతులతోనే చేయుదురు. 'వనస్పతే' అను మంత్రముతో దీనిని ముట్టుకొందురు. చేయువానికి, చెట్టునకు మధ్య ఒక వస్త్రము అంతరముగా నుండును. మంగళాష్టకములను పఠింతురు. ఆ వెనుక వస్త్రమును తీసి వేయుదురు. ధ్రువసూక్తమును పఠింతురు. వస్త్ర, యజ్ఞోపవీత, మేఖల, దండ అజినాదులు ఉచితమైన మంత్రములతో అర్పింపబడును. చివరకు దానిని ముట్టుకొనిన తరువాత గాయత్రి పఠింపబడును. బాచప్ప క్రీ.శ. 1358లో అశ్వత్థమునకు ఉపనయనము చేసినట్లు శాసనాధారము కలదు.

ఇది బ్రహ్మ వృక్షము కనుక ఒక బ్రాహ్మణునకు ఉపనయనము చేసిన ఫలము వచ్చునను విశ్వాసముతో చేయుదురు.

**పునరుపనయనము:**

కొన్ని సందర్భములలో ఉపనయనము మరల చేయుట కలదు. ఆశ్వ.గృ.న పునరుపనయన సందర్భమున జుట్టును కత్తిరించుట, మేధా జననము వైకల్పికము. అనగా చేసిన చేయవచ్చును మానిన మానవచ్చునన్న మాట. కాల నియమము లేదు. మామూలు గాయత్రికి బదులు 'తత్సవితుర్వృణీమహే' అని పఠించవలెను.

'ఒక వేదమును చదివిన తరువాత (స్వశాఖాధ్యయనము) మరియొక వేదము చదువవలెనన్నచో ఇది చేసికొనవలెను', అని ఆశ్వా పై వ్యాఖ్య. ఆప.ధ.సూ. పై హరదత్తుడు వ్యాఖ్యానము చేయుచు ఋగ్యజుస్సామ వేదముల నధ్యయనము ఒక ఉపనయనమైనచో చాలునని, అథర్వణ వేదము కన్న భిన్న వేదమును చదివిన వాడు, అథర్వణ వేదము చదువుకొనవలెనన్నచో మాత్రము మరల చేసికొనవలెనని వ్రాసెను.

మరియొక పద్ధతి. ప్రథమ ఉపనయనమునందే ముఖ్యమైన విధులగు ఆచార్యుని దగ్గరకు తీసికొని వచ్చుట మొ॥ నవి ప్రమాదము వలన జరుగనిచో, లేక వసంతము కన్న భిన్న ఋతువులందు జరిగినను, లేక కృష్ణపక్షమునగాని, లేక అనధ్యయన దివసమునగాని అపరాహ్ణమునగాని జరుపబడినను మరల చేయుటను భరద్వాజుడు చెప్పెను. (సంస్కార మయూఖము).

ఇది కొన్ని పాపములను పోగొట్టుకొనుటకై, సదాచార భ్రష్టునకు కూడ విధింపబడినది. (సంస్కార కౌస్తుభము). గౌతముడు, అజ్ఞానముచే సురాపానము చేసిన వానికి, మానవ మలమూత్ర శుక్రములను, వన్య మృగముల, ఒంటెల, గాడిదల, గ్రామ కుక్కుటముల, గ్రామ సూకరముల మాంసము తినిన వానికి విధించెను. జున్ను పాలు త్రాగినను, సంధినీ గోవు యొక్క పాలను స్వీకరించినను, సామూహికాన్నమును తినుట, వ్యభిచారిణుల అన్నము తిన్నను, కొందరి మతప్రకారము సౌరాష్ట్ర (కథియవార్) సింధు, సౌవీర, అవంతి (ఉజ్జయిని) దక్షిణా పథము మున్నగు నిషిద్ధ ప్రదేశములకు యాత్రకై కాక వేరే పనిమీద వెళ్లినను బ్రాహ్మణుడు పునరుపనయనము చేసికొనవలెనని బౌధ.గృ. పరిభాషా సూత్రమున కలదు. అందు విధానము కూడ కలదు. పలాశ సమిధలచే హోమము, అన్న ఆజ్యాహుతులు మొ॥ ఇందు వపనాదులుండవని కలదు. గొఱ్ఱె పాలను గాని, గాడిద, ఒంటె, స్త్రీలపాలను త్రాగినచో పునరుపనయనమును విధించిన పైలీనసిమాటలను అపరార్కుడు పేర్కొనినాడు.

## అనధ్యాయ దివసములు:

కొన్ని సందర్భములందు వేద విద్య అభ్యసింప వీలుపడదని చాలకాలమునుండి వచ్చుచున్న ఆచారము. 'ఈ బ్రహ్మ యజ్ఞమును చేయువాడు, అపవిత్రుడైనను, స్థలము అపవిత్రమైనను పనికిరాదని' తై.ఆర.న కలదు. జాతా శౌచ మృతా శౌచముల వలనగాని, శారీరక మలాదులచేగాని అపవిత్రుడైనపుడు, ఉచ్ఛిష్టముచే ప్రదేశమపవిత్రమైనపుడు వేద అనధ్యయనమును మనువు పేర్కొనెను. వర్షాకాలము కానపుడు వర్షము పడినచో 3 రాత్రులు వేదమును చదువరాదని ఐత. ఆర.న కలదు.

సూత్రగ్రంథములలో, స్మృతులలో, నిబంధన గ్రంథములలో ఇది విస్తృతముగా చర్చించబడినది. పతంజలి మహాభాష్యమున చతుర్దశి, అమావాస్యలను అనధ్యయన దినములుగా పేర్కొనెను. పాడ్యమి కూడ అట్టిదే. పాడ్యమి నాడు చదివిన పాఠము క్షీణత్వము పొందినటుల లంకలో సీత అట్లుండెనని రామాయణము. ఆషాఢ కార్తీక ఫాల్గున మాసముల పూర్ణిమలే కూడవని గౌతముడు శిష్టాచారమున అన్ని పూర్ణిమలు కూడవు. అష్టమి తిథి అధ్యాపకుని, చతుర్దశి శిష్యుని, పదునైదవ తిథి విద్యను చంపునని బౌధ.ధ.సూ లందు కలధు. మహానవమి, భరణి (భాద్రపద మాసమున కృష్ణపక్ష సంబంధి), అక్షతృతీయ (వైశాఖ శుక్ల తృతీయ), రథసప్తమి కూడవని నృసింహపురాణము అట్లే యుగాదులందు, మన్వంతరాది తిథులందు కూడ. విష్ణు, బ్రహ్మపురాణముల ప్రకారము. కార్తీక శుక్లనవమి, భాద్రపద కృష్ణ త్రయోదశి, మాఘపూర్ణిమ కూడవు. ఉత్తరాయణ, దక్షిణాయన ప్రవేశ దినములు, విషువత్తు (సంవత్సరమున రాత్రి, పగలు సమముగనుండు రోజు) ఆషాఢ, కార్తీక శుక్ల ఏకాదశులు కూడవని నారదీయ పురాణము.

యాజ్ఞ, స్మృతి, ముప్పది యేడు తాత్కాలిక అనధ్యాయములను పేర్కొనెను. కుక్క, నక్క, గాడిద, గుడ్లగూబ అరచునపుడు, వేణు-సామ గానములు వినునపుడు, ఆపదనొందిన వారు ఏడ్చునపుడు, శవ సమీపము లందు, అశుచిగా నున్నపుడు, చాలసేపు ఉరుములు, మెరుపులున్నపుడు, జలమధ్యమున, అర్ధరాత్రమున, సంధ్యా సమయమున, ప్రచండ వాయువు వీచునపుడు, అతిథి ఇంటికి వచ్చినపుడు, మొ॥ సందర్భములందు కూడదు.

సూర్యచంద్రుల చుట్టు పరివేషమున్నపుడు, ఇంద్ర ధనుస్సు అగుపించినను కూడదని ఆప.ధ.సూ.

భూకంపము, పిడుగుపడుట, గ్రహణములందు, శ్రాద్ధభోజనము చేసినపుడు, కప్ప, కుక్క, పిల్లి, పాము, మృగము, చుంచెలుక మొ॥ గురుశిష్యుల మధ్య వచ్చినపుడు, ఇంద్రధ్వజోత్సవ సందర్భమున ఒక రోజంతయు కూడదని యాజ్ఞ. స్మృతి.

కొన్ని కొన్ని శాస్త్రములకు కొన్ని కొన్ని తిథులు త్యాజ్యములు. వ్యాకరణమునకు త్రయోదశి, వైద్యమునకు అష్టమి మొ॥ అట్లే కొన్ని స్థలములు కూడ నిషిద్ధము. నక్కేరు, బూరుగు, ఇప్ప, ఎఱ్ఱదేవ కాంచనము, వెలగ వీని క్రింద చదువరాదని శాస్త్రజ్ఞులందురు.

అనధ్యాయము వాచికమని, మానసికమని రెండు రకములు. దుశ్శకునములు, ఉత్పాతములు సంభవించునపుడు ఒక రోజు కూడదని చెప్పినచో వాచికమే పనికి రాదనియు, మానసికము చేసికొనవచ్చునని బౌధ.ధ.సూ. లందు కలదు. ఈ మానసికము కూడ జాతా శౌచ మృతా శౌచములందు పనికిరాదు.

వేదమంత్రములను అధ్యయనము చేయునపుడే పై నియమములు గాని వివిధ వైదిక కర్మలు చేయునపుడు గాదని ఆప.శ్రౌ.సూ.న ఉన్నది. అట్లే నిత్యము చేయు బ్రహ్మయజ్ఞము పట్ల కాదని తై.ఆర.న కలదు. కొన్ని తిథులు నిత్యానధ్యాయనములనియు, కొన్ని నైమిత్తికానధ్యయనములని చెప్పవచ్చును.

వేదమును అభ్యసించుపట్ల ఏకాగ్రత ముఖ్యము కనుక అట్టి దానికి భంగము కలిగించు పరిస్థితులు వచ్చినచో అధ్యయనము కూడదని మూలాభిప్రాయము. నిషిద్ధ దివసములందు చదివినను, చదివింపించినను, జీవితమునకు, సంతానమునకు, మేధకు, పశువులకు పుణ్యమునకు హానియని స్మృతి చంద్రిక.

## సంధ్యోపాసన:

ద్విజులందరు ఉపాసింపదగినది సంధ్యా దేవత. ఇది సంధ్యాకాలమున ఆరాధింప తగిన దేవత. ఆ దేవత సూర్యమండలమందున్న చిచ్ఛక్తియే. రాత్రికిని, పగటికిని సంధి ప్రాతః కాలము. పగటికిని రాత్రికిని సంధి సాయంకాలము.

ఏడు దినములు సంధ్య వార్చకపోయినచో మరల ఉపనయనము చేసికొనవలెనని శౌనకుని ఆజ్ఞ.

"సంధ్యాతిక్రమణం యస్య సప్తరాత్రమ విచ్యుతమ్
ఉన్మత్త దోషయుక్తో వాపునస్సంస్కార మర్హతి."

ప్రాతస్సాయం సమయములందు సంధ్యావందనము చేయని వారిని సేవక కర్మలందు నియోగించవలెనని పాలకుని యొక్క పరిపాలనా బాధ్యతను చూపించు వాక్యములను గ్రహింపుడు.

"సాయం ప్రాతస్తథా సంధ్యాంయే విప్రా న హ్యుపాసతే
తానేవ ధార్మికో రాజా శూద్రకర్మ సుయోజయేత్."

దీనివలన ప్రయోజనమేమనగా ఉదయ కాలమున చేసిన పాపములు సాయం సంధ్యోపాసన వలన పోవుననియు, రాత్రి కాలకృత పాపములు ఉదయ సంధ్యావందనము వలన నశించునని కలదు. సాయం సంధ్యను కూర్చొని, ప్రాతః కాలమున నిలబడి చేయవలెనని కలదు.

బ్రాహ్మణుడను వృక్షమునకు సంధ్యో పాసన వ్రేళ్లవంటిదనియు వ్రేళ్లు నశించిన చెట్టు కూలిపోవునటుల బ్రాహ్మణుడు పతనము నొందునని మరియొక వచనము. ఇందు బ్రాహ్మణ పదము మిగిలిన క్షత్రియ వైశ్యులకు కూడ వర్తించును.

ఇందు అర్ఘ్యప్రదానము, గాయత్రీజపము, సూర్యోపస్థానము ముఖ్యము. ఉదయాస్తమయములందు సూర్యుని మందేహులను రాక్షసులు బాధింతురని మనమొసంగు అర్ఘ్యజలము, వజ్రముగామారి వారిని బాధించునని వేదము నందు కలదు. ఈ ఉపాసన గూర్చి ప్రత్యేక గ్రంథములు కలవు.

చివరికొకమాట. వేదము చదువుటకు బ్రహ్మ క్షత్రియ, వైశ్యులకు అధికారమున్నను నేడు బ్రాహ్మణులు మాత్రమే అధ్యయన అధ్యపనము చేయుచున్నారు. కాని ధనుర్వేదము, ఆయుర్వేదము ఇంకను పెక్కు కళలు, విద్యలు నాల్గు వర్ణముల వారు కూడ అభ్యసించినటుల తోచును. ధనుర్వేద, ఆయుర్వేదములు నేర్చుకొను వారికి ఒక రకమైన అనగా ఉపనయన సంస్కారము కంటె భిన్నమైన ఉపనయన సమావర్తనములున్నట్లు తోచుచున్నదని "Glimpses of the Vedic Nation" అను గ్రంథమున బాలశాస్త్రి హరదాస్‌గారు వ్రాసియున్నారు. ధనుర్వేదము, శస్త్రాదులను ప్రయోగించుటను నేర్పును. బ్రాహ్మణ బాలునకు ఒక బాణము, క్షత్రియునకు కత్తి, వైశ్యునకు బల్లెములేక ఈటె, శూద్రునకు దుడ్డుకఱ్ఱ ఇచ్చెడివారట. అస్త్రములు మినహాయించి మిగిలిన శస్త్రాదులను శూద్రుడు కూడ నేర్చుకొనెడివాడు. అతడు గురువు దగ్గరకు వెళ్లుటయే ఒక రకమైన ఉపనయనముగా భావింపవచ్చును. ఈ విద్యలైన వెనుక సమావర్తనముండెడిది. ధనుర్వేదము చదివి వచ్చిన వానికి ఛురికాబంధనము జరిపెడివారు. దీనిని గూర్చి అక్షరాభ్యాస ప్రకరణమున కొంత వివరించితిని. 19వ శతాబ్దము వరకు రాజ స్థానము నందు రాజపుత్ర వంశము లందిది జరుపబడుచుండెడిదని పై గ్రంథకర్త వ్రాసియున్నారు. వారి భాషలో దీనిని ఖడ్గబంధన మనెడివారు. ఒక శుభ దినమున గురువు ఖడ్గమును శిష్యుని మొలకు కట్టెడివాడు. చదువైన వెనుక, వివాహమునకు ముందిది జరిపెడివారు. ఆశ్రమములందిది బోధించెడి వారా లేదాయని స్పష్టముగా చెప్పలేముగాని, కవచము వేసికొనుట, శిరస్త్రాణము ధరించుట మొదలుగాగల గణవేషము వేదములందు కన్పించుచున్నది. మరుద్దేవతలు, భుజములపై ఈటెలు ధరించి క్రమపద్ధతిలో నడచుట మొ॥వి వేదములందు కలదు.

* * *

# కేశాంతము లేక గోదానవ్రతము

కేశాంతము నాలుగు వేదవ్రతములలో నొకటి (ఆశ్వ.సూ.) గృహ్య సూత్రములు చూడాకరణము తరువాత దీనిని పేర్కొన్నవి. వ్యాసుడు షోడశ సంస్కార సూచిలో పేర్కొనెను. (వా.స్మృ. 1.14) శత. బ్రా.న. యజ్ఞదీక్షా సమయమున 'గోదాన' పదము వాడబడినది. "సదక్షిణ మేవాగ్రే గోదాన మభ్యునత్తి." (3 1.2.4.) ఈ సంస్కారమున బ్రహ్మచారికి గడ్డము, మీసములేకాక కక్ష ప్రదేశము, శిరోభాగమున కూడ క్షురకర్మ చేయుదురు. పార.సాంఖ్య, యాజ్ఞ. మనువులు కేశాంతమని పేర్కొన్నను చాల మంది గోదానమనియు కేశాంతమనియు పేర్కొనిరి. హిర.భార.పార.లు గోదానమన్నవి. పార.పై జయ రాముడను వ్యాఖ్యాత. కేశలములను అల్లుట, జడవేయుట అనెను. హరిహరుడను వ్యాఖ్యాత కేశ సమూహమని వ్రాసెను. మానవ. వారాహ. కాఠకములు కేశాంతమన్నవి.

ఉపనయనము తరువాత ఇది పేర్కొనబడవలసియున్నను చాలమంది గృహ్యకారులు చూడాకరణము తరువాతనే పేర్కొనుచు చూడాకరణము వలెనే కేశాంతమనియు అక్కడక్కడ లేడాగా నుండునని వ్రాసిరి. బౌధ. కాఠ.గోభి. ఖాదిరములు దీనిని బ్రహ్మచారి వ్రతములలో పేర్కొన్నవి. [illegible] ఆదిత్య దర్శనుడు సంస్కారమనెను. దేవపాలుడు వ్రతమనెను.

చాలమంది పదునారవ యేటనే జేయవలెననిరి. సాంఖ్యాయనము 16న గాని 18న గాని చేయవచ్చునన్నది. మనువు ప్రకారము ఇది గర్భప్రభృతి 16, 22, 24 సంవత్సరముల ప్రాయమున బ్రహ్మ, క్షత్రియ వైశ్యులకు విహితము.

"కేశాంతః షోడశే వర్షే బ్రాహ్మణస్య విధీయతే
రాజన్య బంధోర్ద్వావింశే వైశ్యస్య ద్వ్యధికేతతః"

లఘు, ఆశ్వ, స్మృతి ప్రకారము 16నగాని, లేదా వివాహ సమయమున గాని చేయవచ్చును. ఈ అభిప్రాయమునే మనస్సులో నుంచుకొని కాబోలు భవభూతి ఉత్తర రామచరిత నాటకమున రామలక్ష్మణ భరత

శత్రుఘ్నులకు గోదాన వ్రతమైన వెంటనే వివాహము జరిగినటుల సీతచే అనిపించును. "ఏతే ఖలు తత్కాలకృత గోదానమంగలా శ్చత్వారో భ్రాతరో వివాహ దీక్షితా యూయమ్."

కౌశిక సూత్రమునందు చూడాకరణమునకు ముందే గోదానము వ్యాఖ్యానబడినది. దీనిపై కేశవుడను వ్యాఖ్యాత సంవత్సరాంతమున గాని, రెండవ సంవత్సరమునగాని గోదానము జరుగునని వ్రాసెను. ఈ పద్ధతి విచిత్రముగా నున్నది. "చూడాకరణం గోదానేన వ్యాఖ్యాతమ్"(కౌ.సూ.54.15)

16వ సంవత్సరమున దీనిని చేయవలెననుట, జన్మప్రభృతియా? గర్భ ప్రభృతియా యనునది సందేహము. "గర్భాది సంఖ్యావర్షోణాంత దష్టమేషు బ్రాహ్మణముపన యాత." దీని నాధారముగ చేసికొని యాజ్ఞ. పై మితాక్షరి, మనువుపై కుల్లూకుడు బ్రాహ్మణులకు గర్భ ప్రభృతి పదునారవయేటయని వ్రాసిరి. ఆశ్వ.పై నారాయణుడు కొందరు ఉపనయనమునుండి 16వ యేటను, మరికొందరు పుట్టుకనుండి పదునారవ యేటను చేయుచున్నారని వ్రాసెను.

యాజ్ఞ.పై విశ్వరూపుడు, 12, 24, 36 లేక 48 సంవత్సరముల పర్యంతము ఏ బ్రహ్మచారి బ్రహ్మచర్యమును పాటించినను కేశాంతము 16వ యేటనే యనియు, ఎవరికైనను 16వ యేట తరువాత ఉపనయనము జరిగినచో అట్టివారికి కేశాంత సంస్కార ప్రసక్తియే లేదని వ్రాసెను.

ఇందు పైన పేర్కొనినట్లు బ్రహ్మచారి యొక్క గడ్డము, మీసము క్షౌరము చేయబడును. ఇందు ఆచార్యునకు గోదానమిత్తురు. మంగలికి కానుకలిత్తురు. ఇకనుండి యౌవనారంభమగుటచే బ్రహ్మచారి బాలకుడని పిలువతగదు. (ఆ.గృ.సూ. 1.1.8) ఈ యౌవనదశ యందు నియమముల అవశ్యత కలదు. ఆయుష్కర్మయైన వెనుక ఒక సంవత్సర పర్యంతము కఠోర నియమములను పాటించవలెను.

కేశాంతము బ్రహ్మచర్య సమాప్తి సూచకమని కొందరు తలంచిరి. బ్రహ్మచర్యమునకు అల్పతమమైన అవధి 12 సంవత్సరములు. ఈ లెక్కను

బట్టి విద్యార్థి జీవనము 18 సంవత్సరములతో పూర్తియగును. "కొందరి మతానుసారము గోదాన సంస్కారమైన వెనుక బ్రహ్మచర్యము సమాప్తి యగును." "ఆ గోదాన కర్మణః బ్రహ్మచర్య మిత్యేకే!" (భా.గృ.సూ. 1.9. వ.గృ.9) ఉపనయనము ఐదవ సంవత్సరమున జరిగినపుడు స్వాధ్యాయ నిమిత్తము 12 సంవత్సరములు కలిపిన వారు చెప్పిన వయస్సు సరిపోవును. (జై.గృ.సూ.1.18) యథార్థముగా నాలోచించినచో బ్రహ్మచర్య సమాప్తికి గోదానమునకు సంబంధము లేదనిపించును. సమావర్తనము బ్రహ్మచర్య జీవన సమాప్తిని సూచించును. విద్యా సమాప్తియైనగాని వివాహమునకు అనుమతి లభింపదని తెలిసి కూడ ఈ రెంటిని కలిపివేసిరి.

విధానము:

ఇందనుసరించవలసిన విధి విధానములు, మంత్రములు చేల సంస్కారములో ననుసరించినట్లే. భేదమేమనగా శిరస్థానము బదులు గడ్డమును, మీసమును తీయుదురు. బ్రహ్మచారి సంస్కారాంతమున మౌనము పాటించును. సంస్కార దీపికయందు "శిఖా మాత్రమవ శిష్య సర్వాన్కేశాన్ వాపయతి" యని కలదు. అందే గోదానమునకు బదులు అగ్ని గోదానము చేసినను సరియేయని కాని సర్వ కేశ వపనముండునని వ్రాసినది. ఆప.హిర.భార. బౌధలందు శిఖతో సహితము అంతటికి వపనము, చౌలమునందట్లుకాదు. ఆప. చెప్పినదానికి హిర. ఒప్పుకొనుచు శిఖను మాత్రము కత్తిరింపరాదని చెప్పెను. "సశిఖం వాపయతే, శిఖా మాత్రావశినష్టి త్యే కేషామ్" (హి.2.6, 16-17) ఆప. హిర. భార. మానవములు అగ్ని దేవతాకమైన గోదానమును కూడ చెప్పినవి. (వికల్పము) చౌలమునందు ప్రవర్తనుబట్టి శిఖలుండును కాని గోదానమందట్లుకాదని ఆపస్తంబుడు.

ఒక గోవు లేక గోవృషభము, దక్షిణా నీయవలెనని ఆశ్వ, పార, హిర, జైమినులందు కలదు. గోభి. ఖాదిరములందు గోవు, వృషభములను బ్రాహ్మణునకీయవలెనని అన్నవి. క్షత్రియుడైనచో రెండు గుఱ్ఱములను, వైశ్యుడైనచో రెండు గొఱ్ఱెలను దక్షిణగా నీయవలెను. లేదా అన్ని వర్ణముల

వారు గోవును దక్షిణగా నీయవచ్చుననియు, మంగలికి మేకను దక్షిణగా నీయవలెనని కలదు. పారస్కరుడు ఈ కర్మయైన వెనుక బ్రహ్మచారి చాల పవిత్రముగా నుండవలెనని, ఒక సంవత్సరము క్షురకర్మ చేసికొన రాదని, లేనిచో 12 రాత్రులు గాని లేక ఆరు రాత్రులుగాని, అధమము 3 రాత్రులుగాని నియమబద్ధుడుగా నుండవలెనని అనెను.

గోభిల, ఖాదిరములందు బ్రహ్మచారి నియమములు పెక్కు గలవు. మైధునము, క్షురకర్మ, మధుమాంసములు, విలాసముగ స్నానము చేయుట మొ॥ పనికి రావని, గురువు పట్ల వినయము, క్రోధ అసత్యములను విడనాడుట, భిక్షావృత్తి, దండమును గ్రహించుట, సమిదా ధానము, స్నానము, మేఖలను ధరించుట మొ॥ పెక్కు కలవు. గోదానమునకు ముందు గోదానిక వ్రతమును ఒక సంవత్సరము ఆచరింపవలెనని ఆ వ్రతాదేశములను విపులముగా గోభి.ఖాది, వర్ణించినవి.

బాలికలకు కూడ ఈ సంస్కారమున్నదనియు మౌనముగా జరుప వలెనని సాంఖ్యా, గృ.న కలదు. (1.28.22)

ఇంకను కొన్ని సూత్ర పద్ధతులను పేర్కొందును. వారాహము నందు జననేంద్రియ, బాహుమూలములందలి కేశవపన విషయమున మంత్ర ప్రయోగ మధికము. 'యత్ క్షురేణ' అను మంత్రమును పఠించి కేశ వపనము గావించి ఆ కేశములను భూమియందు పూడ్చవలెననియున్నది. ఉపనయనమైన వెనుక అగ్ని గ్రంథ అధ్యయనమైన పిమ్మట దీనిని చేయ వలెనని లేగాక్షి చెప్పుచున్నది. చౌలము మాదిరిగా కుమారుడు తల్లియొడి యందు కూర్చుండ నవసరములేదని, నాపితుడు, శీతోష్ణ జలముచే కేశశ్మ శ్రులోమనఖములను ఉదగంతముగా వపనము గావించునని ఆశ్వ.న కలదు. ఇందను దినము త్రిషవణస్నానము చేయవలెనని సామశాఖీయులందురు. కాని నేడు ఈ సంస్కారము లుప్తమైనది.

* * *

# వేదవ్రతములు

గౌతముని ప్రకారము సంస్కారములలో నాలుగు వేద వ్రతములు కూడ కలవు. వీనిని పెక్కు స్మృతికారులు షోడశ సంస్కారములలోను లెక్కించిరి. వాని పేళ్లు, విధానములు గృహ్యసూత్రములందు భిన్నముగా నున్నవి. ఆశ్వ. స్మృతి ప్రకారము వాటికి మహానామ్నీ వ్రతము, మహా వ్రతము, ఉపనిషద్వ్రితము, గోదానము అని పేళ్లు.

ఎవరి శాఖను వారు అధ్యయనము చేయుట - శాఖాను గుణముగా సంస్కారములను పొందుట ఈ వ్రతముల యుద్దేశ్యము.

"యచ్ఛాఖీయై స్తు సంస్కారైః సంస్కృతో బ్రాహ్మణోభవేత్
తచ్ఛా ఖాధ్యయనం కార్యమేవం న పతితో భవేత్."-- వసిష్ఠ. వీ.మి.

పై వేదవ్రతములు సమస్త ద్విజాతులకు ఉద్దేశింపబడినను కాలక్రమ మున బ్రాహ్మణులలోనే నిలిచిపోయినవి. చాల గృహ్య సూత్రములందుగాని, ధర్మ సూత్రములందుగాని వాని ప్రస్తావనయే లేదు. పెక్కు స్మృతులందు వాని సంకేతము కూడలేదు. అయినను ప్రాచీన చరిత్ర తెలిపికొనుటకు వ్రాయుచున్నాను.

పై చెప్పిన వ్రతములు ఒక్కొక్క సంవత్సరము వరకు పరిమితమై యుండును.

సాంఖ్యా. గృ. సందు, గాయత్రీ మంత్రోపదేశమైన వెనుక శుక్రియ, శాక్వర, వ్రాతిక ఔపనిషద వ్రతముల ప్రస్తావన కలదు. ఇవి ఐతరేయ ఆరణ్యక భాగములను అధ్యయనము చేయుటకు ముందుగ జరుపబడవ లెను. శుక్రియ మాత్రము మూడు రోజులుకాని, 12 రోజులు కాని లేక సంవత్సరము మాత్రము గాని లేక గురువు యొక్క అభీష్టానుసారమును బట్టి యుండును. మిగిలిన మూడును ఒక్కొక్క సంవత్సర పర్యంతముండును. ఆరణ్యక భాగము గ్రామమునకు దూరముగా నున్న అరణ్యములందు అధ్యయనము చేయబడును. ఈ వ్రతములకు ముందుగా క్రొత్త లేడి చర్మము, క్రొత్త యజ్ఞోపవీతము క్రొత్తమేఖల ధరింపవలెనని మనుస్మృతి.

గోభిలము (సామవేద సంబంధి) నందు గోదానిక, వ్రాతిక, ఆదిత్య, ఔపనిషద, జ్యేష్ఠసామిక అను వ్రతములను పేర్కొనెను. ఇవి ఒక్కొక్క సంవత్సర పరిమితి కలవే. ఆదిత్య వ్రతమును కొందరు పాటించుట లేదని అందే కలదు. గోదానవ్రతము గోదాన వ్రతముతో ముడిపెట్టబడినది. గడ్డము, మీసము, శిరస్సు పైనున్న వెంట్రుకలను కత్తిరించుట, అసత్య, క్రోధ, మైథున నృత్య గీతాదులను విసర్జించుట, కాటుక పెట్టుకొనుట, మాంస మధు భక్షణము, గ్రామమునందు చెప్పులు ధరించుట, మొ॥నవి. విడువ తగినవి. మేఖలను ధరించుట, భిక్షా చరణము, దండధారణము, నిత్యస్నానము, సమిదాధానము, గురూప సంగ్రహణము మొ॥వి అన్ని వ్రతములకు సాధారణ ధర్మములు.

సామవేదము యొక్క పూర్వార్చికను (అగ్ని, ఇంద్ర, సోమ, పవమాన దేవతలకు సంబంధించిన మంత్రములు) అధ్యయనము చేయుటకు, 'గోదానికము' బ్రహ్మచారిని అర్హునిగా చేయును. ఆరణ్యకమునకు వ్రాతికము ప్రవేశకము వంటిది. అట్లే ఆదిత్య వ్రతము శుక్రియ భాగములకు; ఔషనిషద వ్రతము, ఉపనిషత్ బ్రాహ్మణమునకు, జ్యేష్ఠ సామికము ఆజ్యదోహాలను చదువుటకు ఉపయుక్తములు. గోభిలము చెప్పినట్లే ఖాదిరము చెప్పినది.

ఆదిత్య వ్రతానుష్ఠానము చేయువారు, ఒక వస్త్రమునే ధరింతురు. సూర్యునకు తనకు మధ్యగా (వృక్షములు, ఇంటి కప్పు మినహా) ఏవి వచ్చుటకు అంగీకరింపరు. మోకాలి బంటి నీళ్లుకన్న ఎక్కువగా నీళ్లలోనికి దిగరు.

శాక్వర వ్రతము ఒక సంవత్సరము కాని, 3 లేక, ఆరు లేక తొమ్మిది మాసముల పర్యంతముండును. దీనిని చేయువారు శాక్వరి లేక మహానామ్ని మంత్ర భాగములను చదువుదురు.

మహానామ్ని వ్రతము ననుసరించువారు రెండు మార్లు రోజు స్నానము చేయుట, గాఢమైన రంగు బట్టలను ధరించుట, పగలు నిలబడి యుండుట, రాత్రులందు కూర్చుని యుండుట, వర్షము పడునపుడు తలదాచుకొన కుండుట, నదిలో స్నానము చేయుక, దాటకుండ నుండుట మొ॥ నియమ

ములను పాటింతురు. వ్రతము చాలభాగము గడువగా అపుడు గురువు శిష్యునకు కొన్ని మంత్రములను వినిపించును. ఉపవాసముండి, కన్నులు మూసికొని, ఓషధులు నీళ్లతో కూడిన పాత్రలో చేయిపెట్టిన వానిని, క్రొత్త వస్త్రపు పీలికతో కన్నులు కప్పుకొన్న వానికి, ఒక రోజు రాత్రి, పగలు, లేక మూడు రోజులుపవాసమున్న వానికి, మౌనముతో నున్నవానికి, సాయం సంధ్యాకాలము వరకు అరణ్యములో నిలబడి రాత్రి యందు గ్రామమునకు వచ్చినవానికి గురువు 'విదామఘవన్' మొ॥ మంత్రముల నుపదేశించును. ఆపై మహావ్యాహృతులతో హోమము, అగ్నిని-ఆజ్యమును-సూర్యుని-బ్రాహ్మణుని చూచుట-వృషభమును-ఆహారమును-నీటిని-దధిని చూచుట, మౌనము విడిచిపెట్టుట, గురుదక్షిణనిచ్చుట, ఇంద్రునకు హవిస్సునొసంగుట, గురువునకు సహ విద్యార్థులకు భోజనమిడుట మొ॥ పెక్కు నియమములు శిష్యుడు పాటించును.

ఈ నియమములు జ్యేష్ఠ సామిక వ్రతమునకు కూడ వర్తించును. అనగా 'మూర్ధానం దివః' మొ॥ మంత్రములు చదువుటకు చేయు వ్రతము. ఈ వ్రతానుష్ఠాత జీవితాంతము కొన్ని నియమములను పాటించును. శూద్ర స్త్రీతో వివాహము, సంగమము, పక్షి మాంసమును తినుట, ఒకే ధాన్యమును వాడుట, ఒకే దేశమునకు బద్ధుడై యుండుట కూడదు. మట్టి పాత్రలో తినుట, అందు నీళ్లు త్రాగుట కూడదు. రెండు వస్త్రములను ధరింపవలెను.

బౌధా.గృ.నందు కృష్ణయజుర్వేద బ్రాహ్మణ గ్రంథమును అధ్యయనము చేయుటకు ముందు సుక్రియ, ఉపనిషత్, గోదానమ్, సమ్మితమ్ లేక అష్టాచత్వారింశత్ సమ్మిత వ్రతములు పేర్కొనబడినవి. సంస్కార కౌస్తుభమునందు మహానామ్ని, మహావ్రత, ఉపనిషత్, గోదాన వ్రతములు పేర్కొనబడినవి. మహానామ్ని 13వ యేట, గోదానము 16వ యేట చేయవలెనని అందేకలదు.

త్రైవిద్యక, చాతుర్హోత్రిక, గోదాన, అష్టాచత్వారింశత్ సమ్మితములను కారకము పేర్కొన్నది.

చాతుర్హోత్రికి, ఆగ్నికి, ఆశ్వమేధికి త్రైవిద్యక వ్రతములను మానవ.గృ.సూ. పేర్కొనెను. రహస్య భాగమును (ఉపనిషత్) చదువుటకు ప్రవర్గ్యము నాచరింపవలెనని అందేకలదు.

జైమిని, గృ.సూ. గోభిలము చెప్పినట్లే చెప్పుచు గౌదానిక, వ్రాతిక, ఔపనిషదవ్రతములను పేర్కొన్నది.

బౌధ.గృ.సూ. వ్రతారంభమున, వ్రతాంతమున కాండఋషులకు, సదసస్పతి, సావిత్రి, వేదములకు కొన్ని ఆహుతులనర్పించవలెనని, ఆ వ్రతమునుచ్చరించుచు మంత్రముల చదువుచు సమిధలను వేయవలెనని చెప్పినది.

పార.ఆప.హిర. మొ॥ నవి ఈ వ్రతములను పేర్కొనలేదు.

సావిత్రీ మంత్రాధ్యాయమునకు ఉపనయనమే వ్రతముగా గుర్తింపబడినదని గోభిలముపై భట్టనారాయణుని వ్యాఖ్య గమనింపతగినది.

కాని యీ వ్రతములను గూర్చి అర్వాచీన గ్రంథకర్త లేమియు పట్టించు కొనలేదు. వారు బ్రహ్మచర్యము, భిక్షాచరణాది సామాన్య బ్రహ్మచారి నియమములను పేర్కొనిరి. స్మృత్యర్థసారము, సావిత్రీవ్రతము, వేద వ్రతము, ఆరణ్యకవ్రతములను పేర్కొనెను. యాజ్ఞ యందుకల 'వేదమ్ వ్రతాని వా పారమ్ నీత్వా' అను దానిపై మితాక్షరి, 'వ్రతమ్' అను దానికి యాజ్ఞవల్క్యుడు చెప్పిన బ్రహ్మచారి నియమములను పాటించుటగా లెక్కించినది.

పై వ్రతములను పాటించనిచో ప్రాజాపత్య ప్రాయశ్చిత్తమును మూడు సార్లుగాని, 6 సార్లుగాని, 12 సార్లుగాని చేసికొనవలెను. దైనందిన ధర్మములకు శౌచ, ఆచమనాదులు, సంధ్యోపాసన, దర్భలను వాడుట, భిక్ష, సమిదాధానము మొ॥ నవి పాటించనిచో 3 కృచ్ఛ్రములు ప్రాయశ్చిత్తముగా బోధాయనము విధించినది. స్త్రీతో సంగమము చేసిన బ్రహ్మచారికి విశేష ప్రాయశ్చిత్తము కలదు. తై.ఆర. ఆ బ్రహ్మచారిని అవకీర్ణిగా పేర్కొని ప్రాయశ్చిత్తమును పేర్కొన్నది. పూర్వమెట్లు నియమ పాలన చేసెడివారో

తెలుపుటకు మనువు పేర్కొన్న అవకీర్ణి ప్రాయశ్చిత్తమును పేర్కొందును. గాడిద చర్మమును ఒక ఏడాది వరకు ధరించవలెనని, తన దోషమును పేర్కొనుచు ఏడు ఇండ్లకు వెళ్లి భిక్ష నర్థించవలెననియు, రోజునకు ఒక్కమారే భుజించవలెననియు, మూడు పర్యాయములు స్నానమాచరింపవలెననియు వ్రాసినది. అట్లే అనేక ప్రాయశ్చిత్తములు స్మృతులందు కలవు.

సంస్కార దీపికననుసరించి నాల్గువేదవ్రతములకు ముఖ్యకాలము లేదని, లేదా శ్రావణ పౌర్ణమాపి రోజున ఒక్కమారు సంకల్పించి చేయవలెనని, లేదా శ్రావణము, పుష్యము, వైశాఖమునందుగాని ఏకముగా గాని సంకల్పించి చేయవలెనని, లేదా వివాహమునకు పూర్వపు రోజునైనను చేయవలెనని కలదు.

అందు చెప్పిన గోదానమును ప్రత్యేకముగా వివరించితిని. ప్రజాపతి ప్రధానదేవతగా గల ప్రాజాపత్య వ్రతము:- ఆచార్యుడు శిష్యునితో కూడ వపనము చేయించుకొని నదియందు స్నానము చేసి గణపతి పూజ, పుణ్యాహమును చేసి బియ్యపు మండపము మీద షడృషి పూజ చేయించును. హోమములుండును.

సోముడు అధిదేవతగా కలిగినది సౌమ్యవ్రతము. ఈ వ్రతమైన సంవత్సరము వరకు అధ్యయనము, రాత్రియందే భోజనము, అధశ్శయనము పాటింపవలెను. గొడుగు, చెప్పులు ధరించుట, శవమును చూచుట, బండినెక్కుట పనికిరావు. అట్లే ఉష్ణోదకస్నానము కూడ. అగ్ని ప్రధాన దేవతగా కలిగినది ఆగ్నేయవ్రతము. విశ్వేదేవతలు ప్రధానముగా కలది వైశ్వదేవ వ్రతము.

వేదారంభము:

ప్రాచీన వైదిక వ్రతముయొక్క అవశేషముగా వేదారంభము మిగిలినదని చెప్పవచ్చును. సంస్కారసూచియందు వేదారంభమును గణించిరి. సర్వప్రథమముగా వ్యాసుడు దీనిని పేర్కొనెను. --వ్యా.స్మృ. 1.14

ఉపనయనమయిన వెనువెంటనే వేద అధ్యయనముండదు. కొంత వ్యవధి యుండును. వ్యాసస్మృతి యందు వ్రతాదేశమునకు (ఉపనయన మునకే మరియొక పేరు) వేదారంభమునకు భేదము కన్పించుచున్నది. ఉత్తర కాలీన లేఖకులు ఉపనయనమునకు, స్నాతకమునకు మధ్య నిది చేయవలెనని పేర్కొనిరి.

విధానము:

ఆరంభమందు మాతృకాపూజ, ఆభ్యుదయిక శ్రాద్ధము మొ॥ కొన్ని ఆవశ్య కృత్యములతో ఆరంభమగును. కొన్ని ఆహుతులనిత్తురు. ఋగ్వే దమునకు చదువుటకు ఇచ్ఛ కల విద్యార్థి ఘృతముతో అగ్నికి, పృథ్వికి రెండాహుతులనిచ్చును. యజుర్వేదమైనచో అంతరిక్షమునకు, వాయువునకు, సామవేదమైనచో ఆకాశమునకు, సూర్యునకు, అథర్వ వేదమైనచో దిశలకు, చంద్రునకు ఆహుతులనిచ్చును. ఇదిగాక బ్రహ్మకు, ఛందస్సునకు, ప్రజాపతికి హోమములుండును. అంతమున ఆచార్యుడైన బ్రాహ్మణ పురోహితునకు పూర్ణ పాత్రను, దక్షిణనిచ్చి వేదారంభము చేయవలెను.

-- గర్గపద్ధతి

కేవలము వేదమును చదువుటయేగాక దాని యర్థమును గ్రహింప వలెను. లేనిచో నిరర్థకమని ఊకదంపువలె నిష్ఫలమని పరాశరుడు.

"వేదస్యాధ్యయనం సర్వం ధర్మశాస్త్రస్య చైవ హి
అజానతోఽర్థం తద్వ్యర్థం తుషాణాం ఖండనం యథా"

అర్థము తెలియనంత మాత్రమున, వట్టి వేదపాఠకుల నిందింపరాదు. అర్థము తెలిసికొన్న వీర్యవత్తరమగునని ఛాందోగ్య శ్రుతి, కేవల పఠనము చేసిన అదృష్ట ఫలముండునని సంప్రదాయజ్ఞులందురు. వేదమును చదివినవాడు వేదాత్మయని, ఎన్ని యక్షరములందు పఠించునో అన్ని హరి నామములను కీర్తించిన వాడగుచున్నాడని, ఎవని వంశమందు మూడు పురుషాంతరముల వరకు వేద పాఠముండదో అతడు కర్మహీనుడగు బ్రాహ్మణుడని, అతని నిత్యనైమిత్తిక కామ్యకర్మలు నిష్ఫలములగునని, అథోగతి నొందునని స్మృతిసార సముచ్చయ గ్రంథమునందు కలదు.

"వేదో యస్య శరీరస్థోన స పాపేన లిప్యతే
వేదాత్మా స తు విజ్ఞేయః శరీరైః కిం ప్రయోజనం
వేదాక్షరాణి యావంతి పఠితాని ద్విజాతిభిః
తావంతి హరినామాని, కీర్తితాని న సంశయః"

ఆదిగా గల శ్లోకములలో దీని ప్రశంస కలదు. ఈ వేదారంభమునే ఉపాకర్మయందురు.

ఉపాకర్మ:

ఉపాకర్మకు ఆరంభమని అర్థము. ఉపనయనమునాడు గాయత్రీ మంత్రోపదేశముండును గాని వేదవిద్యను అప్పుడే ఆరంభింపరు.

సమయము:

"ఆపస్తంబుని ప్రకారము యజుశ్శాఖవారు శ్రావణ పూర్ణిమనాడు ఉపాకర్మ చేసికొని, పుష్యపూర్ణిమనాడు గాని, రోహిణీ నక్షత్రముతో కూడిన పుష్యమాసమునగాని ఉత్సర్జన చేయవలెను. బోధాయనుని ప్రకారము శ్రావణ పూర్ణిమనాడుగాని, ఆషాఢ పూర్ణిమనాడు గాని చేసికొని పుష్య లేక మాఘ పూర్ణిమలందు ఉత్సర్జనము చేసికొనవలెను.

తైత్తిరీయ శాఖీయులు శ్రావణ పూర్ణిమనాడే చేయవలెనని, ఋగ్వేదీయులు శ్రావణ మాసములో శ్రవణ నక్షత్రమేనాడుండునో ఆనాడు చేయవలెనని మరియొక కారిక. సామశాఖవారు భాద్రపద హస్తా నక్షత్రము నాడు చేయుదురు. గ్రహణములను, అధిక మాసములను గమనించి చేయుదురు.

వేదకర్మలు ఫలవంతమగుటకు, వేదపాఠము ఫలించుటకు చేయుదురు.

గురువు శిష్యునితో నదికి వెళ్లి ఆయుష్కర్మ నిర్వర్తింప చేయును. మృత్తికాస్నానములు, వారుణస్నానములు, సంధ్యావందనాదులు అయిన వెనుక తూర్పుదిక్కున ఆవుపేడతో అలికి, ముగ్గులు తీర్చి, వస్త్రము

పరచి, బియ్యముపోసి, దీపారాధనలు చేసి ఈ కర్మను ఆరంభింతురు. బ్రహ్మచర్య వ్రత లోపమును పోగొట్టుకొనుటకై పాహిత్రయోదశ హోమము, ప్రాజాపత్యాది ఋషులను పూజించుట, విరజ హోమాదులుండును."

-- భా.సంస్కృతి నుండి

ఈనాడు అంతవరకు తానుచేసిన పాపములకు కామక్రోధములే కర్తలనియు, అవియే చేయించు చున్నవనియు తాను చేయుట లేదను, ఆత్మజ్ఞాన పూర్వకమైన దేవతా నమస్కార మంత్రములుండును.

"కామోఽకార్షీన్నమో నమః కామోకార్ షీత్కామః కరోతి
నాహం కరోమి కామః కర్తా నాహం కర్తా కామః కారయితా
నాహం కారయితా ఏష తే కామకామాయస్వాహా."

అట్లే మన్యువును గూర్చి మంత్రము. ఇది 1000 సార్లు చేయవలెను. కనీసము 108 సార్లు. ఈ సమయమున నూత్న యజ్ఞోపవీతమును ధరింతురు. ఇందు దేవఋషి తర్పణముండును.

హోమాదులైన వెనుక గురువు శిష్యునకు వేదమును ఆరంభించి కొంత భాగము చెప్పును. నిజముగా పూర్ణిమ అనధ్యయన దివసమైనను వైదిక విద్యలకిది తొలిరోజు. ఈనాడు ఆయుష్కర్మ విహితము కాకపోయినను ఈ పూర్ణిమ యందు చేయుదురు.

పై చెప్పిన మంత్రమును జంధ్యాల పూర్ణిమ యందు (శ్రావణ పూర్ణిమనాడు) తప్పక పఠింపవలెను. మరుసటి దినము గాయత్రిని చేయుట బలకరము. తరువాత పాత జందెమును తీసివేయుదురు.

* * *

# సమావర్తనము లేక స్నాతకము

ప్రస్తావన:

బ్రహ్మచర్య సమాప్తియైన వెనుక నిది చేయుదురు. విద్యార్థి జీవనము యొక్క అంతము నిది సూచించును. సమావర్తనమున కర్థమిది: వేదాధ్యయనాంతరము గురుకులము నుండి ఇంటికి ప్రత్యావర్తనము (తిరిగి వచ్చుట). "తత్ర సమావర్తనం నామవేదాధ్యయనాంతరం గురుకులాత్ స్వగృహాగమనమ్" (వీ.మి.). ఈ సంస్కారమునకు ముఖ్యాంగము స్నానము. కొంతమంది చరిత్రకారుల అభిప్రాయం ప్రకారము స్నాన ప్రయోజనమేమనగా విద్యార్థి నుండి దివ్యశక్తిని దూరము చేయుటయే. బ్రహ్మచర్యావధి వరకు ఒక దివ్యశక్తి బ్రహ్మచారిని ఆవహించి యుండును. అది సాధారణ జీవనమున ప్రవేశింపకుండ దూరము చేయవలెను. లేనిచో దివ్యగుణముల నుండి భ్రష్టుడగుటయే గాక ఈశ్వరాగ్రహమునకు అపాత్రుడగును. ప్రాచీన లేఖకులు బ్రహ్మచర్యమును ఒక దీర్ఘ సత్రముగా భావించిరి. "దీర్ఘ సత్రం వా ఏష ఉపైతి యో బ్రహ్మచర్య ముపైతి" (పా.గృ.సూ. 2.2.15) యజ్ఞాంతమున యజ్ఞము చేయువాడు అవభృథస్నానమును చేయును. ఆ ప్రకారముననే బ్రహ్మచర్య రూపమైన దీర్ఘ సత్రాంతమందు బ్రహ్మచారి కూడ స్నానము చేయవలెను. సమావర్తన స్నానానంతరము అధ్యయన ప్రతిబింబముగా ఒక సముద్రము వెంబడిని వెళ్లుట అను ఆచారము (కొన్ని ప్రాంతములలో) అతడు గడించిన విద్యలలో అపార పాండిత్యమును గడించినట్లు సూచించును. విద్యా సముద్ర పారమును ముట్టినట్లు సూచించును. అతడు విద్యా వ్రతస్నాతకుడనిపించుకొనును.

"ఆచార్యాయ ప్రియం ధన మాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః" అనగా ఆచార్యుని కోరిక ననుసరించి దక్షిణ రూపముగా ధనమును సమర్పించి ప్రజాతంతువును రక్షించుటకు స్నాతకుడగు ద్విజుడు గృహస్థాశ్రమమును ప్రవేశింపవలెనని విధి.

కూర్మ పురాణమునందిట్లున్నది:-

"వేదాన్ వేదాంస్తథా వేదౌ వేదం వాపి సమాహితః
అధీత్య చాధిగమ్యార్థం, తతస్స్నాయాద్ద్విజోత్తమః"

నాలుగు వేదములు గాని, మూడు వేదములు గాని రెండు వేదములు గాని తుదకొక వేదమైన చదివి అర్థమెరింగి పిమ్మట సమావర్తనము చేసికొనవలెను.

గౌత, ఆప, హిర, యాజ్ఞ.లు స్నానమని పేర్కొనగా ఆశ్వ, బౌధ, ఆప.ధ.సూ., భార.లు, సమావర్తనమన్నవి. ఖాదిర, గోభిలములు దీనిని 'ఆప్లవన' మన్నవి. (స్నానము) మనువు స్నాన, సమావర్తన శబ్దములను వాడెను. మనువుపై అపరార్కుడు స్నాన, సమావర్తన శబ్ద భేదములను పేర్కొనెను. స్నానము విద్యార్థి దశ పూర్తియగుటను సూచించుననియు, నైష్ఠిక బ్రహ్మచారికి ఇది యక్కరలేదని వ్రాసెను. సమావర్తన మనగా గురుగృహమునుండి ఇంటికి తిరిగి వచ్చుటయను అర్థముండుటచే విద్యార్థి తండ్రి దగ్గరే చదివిన ఈ శబ్దార్థ మెట్లు పొసగును? కనుకనే మేధాతిథి, సమావర్తనము వివాహాంగము కానక్కర లేదనియు, తండ్రిదగ్గర చదివిన విద్యార్థి ఇది కాకుండగనే వివాహము చేసికొనుటకు అర్హుడని వ్రాసెను. కొందరు వివాహాంగస్నానమని భావించుచున్నారు. స్నాత్వాలో (మను.3.4.) నున్న 'త్వా'ను బట్టి స్నానమునకు సమావర్తనమునకు భేదమున్నదని తలంచుచున్నారు. 'అథవా యమని యమత్యాగాభిప్రాయం సమావృత్తి వచనమ్' (మేధాతిథి) అనుటచే సమావర్తమన బ్రహ్మచర్యములో నున్న యమనియమత్యాగ రూపముగా భావింపవచ్చును. కనుక సమావర్తన సారాంశమేమనగా స్నానమనియు, ఇంటికివచ్చుట దానికి సహకారియనియు తేలుచున్నది. వేదమును చదివిన తర్వాత, స్నానమైన వెనుక గురువు నను మతిని తీసికొని మంచముపై విద్యార్థి పండుకొనవచ్చునని మహాభాష్యమున కలదు.

ఛాందోగ్యమున సత్యకామ జాబాలుని శిష్యుడైన ఉపకోసల కామలా యనుడు గురువు యొక్క అగ్నులను 12 సంవత్సరములు పరిచర్య చేసినను ఇతర విద్యార్థులకు ఇంటికి వెళ్లవచ్చునని అనుజ్ఞ ఇచ్చినను, ఉపకోసలున కట్టి యనుజ్ఞనీయనట్లు తేలుచున్నది. అందే గురు పరిచర్య చేసిన వెనుక

నియమములతో వేదాధ్యయనము చేసి గురువు ఇంటినుండి 'తన ఇంటికి వెళ్లుట' అను నర్థమిచ్చు మంత్రము కూడ కలదు. శత.బ్రా.న. స్నానమైన వెనుక భిక్షకై అర్థించరాదని కలదు. శత. గోపథములు బ్రహ్మచారి, స్నాతకులను పృథక్కరించినవి. ఆప.ధ.సూ. ఒక బ్రాహ్మణమును పేర్కొనుచు 'స్నాతకుని ముఖము అగ్నివలె దేదీప్యమానముగా నున్నదని' పేర్కొనెను. ఈ మహావ్రతమును చదువక మిగిలినవి చదివినను వాడు నిజమైన స్నాతకుడు కాదని ఐత. ఆర.న కలదు.

## స్నాతక త్రయము:

ఎవరు సంపూర్ణాధ్యయనము చేసి వ్రత పాలనము చేసిరో వారికే సమావర్తన సంస్కారముద్దేశింపబడినది. అర్థము తెలియక పోయినను, బ్రహ్మచర్య నియమములను పాటింపకపోయినను, కేవల మంత్రములను కంఠస్థము చేయువానికి సమావర్తనాధికారము లేదు. "అన్యో వేదపాఠీ న తస్య స్నానమ్" (మానవ.గృ.) కాని కాలక్రమమున ఈ నియమపాలన శిథిలమైనట్లు తోచును. చాలమంది సూత్రకారులు వీరిని మూడు రకములుగా పేర్కొనిరి. "త్రయః స్నాతకా భవంతి విద్యాస్నాతకోవ్రత స్నాతకో విద్యా వ్రత స్నాతక ఇతి" (పార.గృ). వ్రత స్నాతకుడనగా బ్రహ్మచర్య వ్రతమును పూర్తిచేసికొని విద్యా పరిపూర్ణత్వమును పొందినవాడు. విద్యా స్నాతకుడనగా సంపూర్ణముగా విద్యను బడసి, బ్రహ్మచర్య వ్రత సమాప్తిని పొందినవాడు. మూడవ ప్రకారము ఎవనికి బ్రహ్మచర్య వ్రతము, సంపూర్ణ విద్యాప్రాప్తి సిద్ధించునో అతనిని విద్యా వ్రత స్నాతకుడు, లేక ఉభయస్నాతకు డందురు.

ఆశ్వ.గృ.ని బట్టి వేదాధ్యయనమైన వెనుక గుర్వనుజ్ఞను పొంది స్నానము చేయవచ్చుననియు, చదువు పూర్తికాకపోయినను గుర్వనుజ్ఞను పొంది స్నానము చేసికొనవచ్చునని తేలుచున్నది. కాని పార.గృ.నందు స్పష్టముగానిట్లు కలదు. వేదాధ్యయనమైన వెనుకగాని, లేక విద్యార్థి దశయగు 48 సంవత్సరముల తరువాతగాని, 12 సంవత్సరముల తర్వాత గాని గుర్వనుజ్ఞను పొంది నిది చేసికొనవలెను. కొందరి మత ప్రకారము వేదమును పూర్తి చేయక ఉపనయనమైన వెనుక 3 సంవత్సరముల వెనుక స్నానము చేసినవానిని వ్రత స్నాతకుడని యనుచున్నారని మేధాతిథి

మను (IV.31)పై వ్రాసెను. ఇందు విద్యావ్రతస్నాతకుడు ముఖ్యముగ పరిగణింపదగిన వాడని మిగిలిన ఇద్దరు ఒకరికొకరు సమానులని గోభిలుని అభిప్రాయము. అట్లే ముందు వానిని ఎక్కువగా పూజింపవలెనని ఆప.ధ.సూ. లందు కలదు.

వివాహమగు వరకు (ఎంత కాలమైనను) స్నాతకుడనియు, ఆపై గృహస్థుడుగా పరిగణింపబడునని బౌ.గృ. కనుకనే స్నానమైన వెనుక వివాహము కానంతవరకు స్నాతకవిధులను చాలభాగము గృహస్థవిధులను పాటింపవలెను. గౌతముడు భార్యాసంగమము వినా మిగిలిన గృహస్థ విధులను స్నాతకునకు విధించెను. కేవల బ్రహ్మచారి విధులకితడు బద్ధుడు కాడన్నమాట. (మధుమాంస వర్జనము, భిక్ష, మొ॥ బ్రహ్మచారి ధర్మములు)

హిర. చౌధ.గృ. పరిభాష, పార, గోభిలము లందు విపులముగా నిది వర్ణింపబడినది.

విష్ణు మతానుసారము శారీరక లోపములు గల కుబ్జ, వామన, జన్మాంధ, క్లీబ, పంగు, రోగగ్రస్తులకు సమావర్తనము లేదు. అందువలన వివాహము చేయుట పొసగదని అతని అభిప్రాయము.

కలియుగమున నైష్ఠిక బ్రహ్మచర్యము నిషేధింపబడుటచే స్నాతక ప్రస్తావన అవశ్యము. ధర్మ శాస్త్రకారులు నాలుగాశ్రమములను యథావిధిగా పాటించి ఇహపరలోకములను పొందుడని ఏకకంఠముతో ఘోషించిరి.

**వివాహానుమతి:**

కాలము గడిచిన కొలది ఉపనయన సంస్కారము యొక్క ప్రయోజనము లుప్తమైపోయి, ఉపనయనమైన వెంటనే వివాహమునకు అనుమతి పత్రము దొరికినట్లే అను భావన ప్రబలినది. అట్లే సమావర్తన సంస్కార ప్రయోజనము లోపించి వివాహమునకు ముందుగా జరుపబడవలెను. కనుక ముందుగా మాత్రము జరిపించుచున్నారు. ఇది ఎవరి కొరకో, ఎందులకో అనునట్లు యాంత్రికముగా పాటించుచున్నారు. వట్టి విడంబనము, విద్యార్థి దశకు గృహస్థ దశకు మధ్యనిది కదా! కాలము గడచిన కొలది

మార్పు వచ్చినట్లు తోచును. క్షణకాలము కూడ ఆశ్రమ రాహిత్యము కూడదను భావన ప్రబలినది. "అనాశ్రమీన తిష్ఠేత్తు క్షణమేకమపి ద్విజః, ఆశ్రమేణ వినా తిష్ఠన్ ప్రాయశ్చిత్తీయతే హి సః" (ద.స్మృ). స్నాతకుడైన వెనువెంటనే వివాహము చేసికొననిచో ఏ ఆశ్రమమునకు చెందని వాడైనచో పరిణామ స్వరూపమున పాపిగా తలంచినట్లు తోచును. కనుకనే వివాహము నిశ్చయమైన తరువాత సమావర్తన సంస్కారము చేయుచున్నారని అనిపించుచున్నది.

## సంస్కార సమయము:

పూర్వకాలమున బ్రహ్మచర్యము యొక్క దీర్ఘతమమైన అవధి 48 సంవత్సరముల వరకు నున్నది. ఒక్కొక్క వేదశాఖాధ్యయనమునకు 12 సంవత్సరములు పట్టును. అల్పతరమైన అవధిననుసరించి, తల్లిదండ్రుల పరిస్థితిని బట్టి 36, 24 లేక 18 సంవత్సరములలో ఇది సమాప్తి కావలెను. కాని అనంతర లేఖకులు 18 సంవత్సరముల అవధిని సమర్థించిరి. కాని నేడు నియమ పాలనము లేదు. చదువు పూర్తియగు వరకు గురువున కేమియు నీయనక్కరలేదు. (మను 2.245) ఒక ప్రత్యేకమైన దశయందు, యథాశక్తి ననుసరించి సమర్పణ భావనతో పృథ్వి, అశ్వము, ఛత్రము, ఉపానహము, వస్త్రము, ఫలము వనస్పతులనుగాని సమర్పించవలెను. (మను). వ్యాసు ననుసరించి కేవలము గోవునీయవలయును. "స్నాయాత గుర్వనుజ్ఞాతో దత్వాస్మై దక్షిణాం హి గామ్" (వీ.మి.) గురుదక్షిణ సమర్పించుట మహోత్తమమైనది. ఆ ఋణమును తీర్చుట అసాధ్యమని శాస్త్రములు. "సప్తద్వీప పర్యంతము భూమిని గురు దక్షిణగానిచ్చినను చాలదు."

"సమస్త ద్వీపవతీ భూమిర్దక్షిణార్థం న కల్పతే" తాపనీయ (శ్రుతి. వీ.మి.) ఏ గురువు శిష్యునకు ఒక్క అక్షరము చెప్పినను అతని ఋణమును శిష్యుడు తీర్పలేడని లఘుహారీత స్మృతి వచనము. "ఏక మప్యక్షరం యస్తుగురుః శిష్యే నివేదయేత్, పృథివ్యాం నాస్తి తద్ద్రవ్యం యద్దత్వా త్వనృణీభవేత్." విద్యార్థి ధనమును గాని, భూమిగాని కొంచమైనను ఈయలేని స్థితిలోనున్నానని చెప్పి అనుమతి పొంది చదివినచో సాధారణముగ నట్టి స్థితియందు గురువీవిధముగ చెప్పుట ప్రాచీన సంప్రదాయము. 'అబ్బాయి

ధనాపేక్ష నాకు లేదు. నేను గుణములచే సంతుష్టుడనైతిని', "అలమర్థేన మే వత్సత్వ ద్గుణైరస్మి తోషితః." (వీ.మి.).

అట్టి గురువనుమతి పడసి ఒక్క శుభ దినమున దీనిని చేసికొన వలెను. ఉత్తరాయణమున, శుక్లపక్షములో చంద్రుడు రోహిణి, మృగశిర, తిష్య (పుష్య) ఉత్తరాఫల్గుని, హస్త, చిత్ర, లేక విశాక నక్షత్రములలో కూడినపుడు ప్రశస్తకాలమని హిర. గృ.న కలదు. బౌధా.గృ. పరిభాష ఇందుగల మృగశిరను విడిచిపెట్టినది. భార.గృ. రోహిణి, మృగశిరలను విడిచిపెట్టి మిగిలిన వానితో స్వాతిని పేర్కొన్నది. సంస్కార ప్రకాశలో ఖగోళ విషయమై విస్తృత వర్ణన కలదు.

నక్షత్ర ఫలములను జై.గృ. ఇట్లు చెప్పినది. ప్రజాపతి దేవతాకమైన రోహిణి యందు స్నాతకము జరిగిన సంతానము, సోమ సంబంధమైన మృగశిర యందు సోమయజ్ఞముల ఫలము, బృహస్పతి సంబంధమైన తిష్యయందు బ్రహ్మవర్చస్సు, సవితృ దేవతాకమైన హస్తయందు సవితృ ప్రేరణ, మిత్ర సంబంధమైన అనూరాధ యందు మిత్రత్వము, విష్ణువునకు చెందిన శ్రవణము నందు యజ్ఞఫలము లభించును.

ఖాదిరము, గోభిలము చెప్పినట్లే చెప్పుచు మరికొంత చేర్చినది. కావలెననిన ఆవృతస్థలమున బ్రహ్మవర్చస్సు గోసంపద కావలెననిన గోష్ఠము నందు, సభాగౌరవము కావలెననిన సభాస్థలియందు జరుగవలెనని చెప్పినది. భార. ఆప. హిరణ్యకేశులు ఇంచుమించు ఒకే పద్ధతిలో చెప్పినవి.

విధానము:

సంస్కార దీపికననుసరించి మన ప్రాంతపు పద్ధతి (ఆప.గృ.ని బట్టి) ఈ స్నాతకము సకాలములో చేయనందులకు ప్రాయశ్చిత్తము ఉపవాసముండుటయే.

స్నాతక వ్రతమును చేయబోవుచున్నానని సంకల్పించి దాని కంగ ముగా గణపతిని పూజించిన వెనుక పుణ్యాహ వాచనము చేసి సభకు నమస్కరించును. ఆపైన ఉపనయనము నుండి స్నాతకము వరకు

బ్రహ్మచర్య వ్రత లోపమును పోగొట్టుకొనుటకై ప్రాయశ్చిత్తమును చేసి కొనును. స్నానము చేయక సంధ్యోపాసన, జపాదులను చేయుట, భిక్షాగ్ని కార్యములను మానుట, ముట్టుకొనని వారిని ముట్టుకొనుట, తినకూడని అన్నమును తినుట, మంచముపై శయనించుట, మంచమెక్కి నీటిని త్రాగుట, అన్నమును తినుట, క్షురకర్మ చేసికొనుట, కౌపీన-మేఖల-యజ్ఞో పవీత-అజిన దండాదులను ధరింపకపోవుట, అద్దము చూసికొనుట, జ్ఞాన వయోవృద్ధులను తిరస్కరించుట ధర్మ వ్యతిరేకులతో సహవాసము మొ॥ ముప్పది మూడు దోషములు పోవుటకై ప్రాయశ్చిత్తమును చేసికొనును. దాని నిమిత్తమై పురోహితునకు దక్షిణ నొసంగును. ఈ ప్రాయశ్చిత్తమునకై పాహిత్రయోదశ హోమమును చేయుదురు. ఆయుస్సు, వర్చస్సు, యశో బలాభివృద్ధికై ప్రాతరగ్ని కార్యము, సమిదా ధానము చేయును.

దీనికంగముగా రక్షా బంధనమును (రక్షను) షోడశోపచారములతో పూజించి ధరించును. ఆపైన షట్పాత్ర ప్రయోగము. తదుపరి చౌలములో జరిగిన తంతు అంతయు జరుగును. ఆ తంతును చౌలములో పూర్తిగా వివరించితిని. ఆపైన మేఖలను విప్పి బ్రహ్మచారికిచ్చును. 'ఆపోహిష్ఠ' మంత్రముచే ఒకమారు స్నానముందును. ఉదుంబర కాష్ఠముతో దంతము లను తోమును. 'నీవు సోమునికి శరీరమవు. ఇట్టి నీవు నా శరీరమును రక్షించుము' అను 'సోమస్య తనూరసి' అను మంత్రమును జపించి వస్త్రమును కట్టింతురు. అప్సరసలు, గంధర్వులు, దేవతలు మనుష్యులందెట్టి గంధము కలదో అట్టిది నన్ను పొందుగాక' అను 'అప్సరస్సు' మంత్రముచే గంధము పూయబడును. 'ఇయమోషధి.................' అను మంత్రముచే బంగారు పూసను రెండు వైపుల రత్నములుండునట్లు దారమున గ్రుచ్చి నీటియందు త్రిప్పి 'అపాశోపి.................' మంత్రముచే పై పూసను మెడను కట్టుకొనవలెను. దారమునకు గ్రుచ్చిన రేగు గింజను ఎడమ చేతికి కట్టుకొ నును. క్రొత్తదగు పై బట్టను కట్టుకొనును. ఇక్కడ రేవతీస్త్వా...........అను మంత్రములను చదువుదురు. 'రేవతులు ప్రతినుండి గింజలు తీయగా కృత్తికలు నూలు తీయగా, ధియములను దేవతలు నేసినవని, ఆ దేవతలు నిన్ను ఆయుష్మంతుని చేయుదురు గాక' అని ఆ మంత్రముల స్థూలార్థము.

ఆపైన 'ఆయుష్యం...............' మొ॥ 8 హోమములు చేయును. అన్ని వర్ణములలోను నన్ను ప్రియమైన వానినిగా చేయుమని ప్రార్థన యుండును. తరువాత జయాది హోమములుండును. చెవులకు పోగులు, పూలదండ, కాటుక పెట్టుకొనుట, పాదుకలు, ఛత్రము, దండమును మంత్రములను చెప్పి ధరించును. అద్దమును, 'యన్మే వర్చ...........' మంత్రముతో చూచును. పర్వతమందున్న ధారణాశక్తి, వర్చస్సు, భేషజము, ఆయువులు నాకు కలుగుగాక' అని అర్థము. 'దేవస్యత్వా...............' అని దండమును గ్రహించునపుడు ఈ చెప్పెడి మంత్రము యొక్క యర్థమును గమనింపుడు. 'అశ్వినీ కుమారులు, సూర్యుడు అధిష్ఠాన దేవతలుగా గల నాచేతులచే ఇంద్ర వజ్రాయుధము మాదిరిగా నున్న నిన్ను స్వీకరించుచున్నానని శత్రుబాధ లేకుండు గాక' అని నక్షత్ర దర్శనమగు వరకూ మౌనముగా నుండి దిక్కులను, సోముని వీరపుత్ర వంతునిగా చేయుడని ప్రార్థించును. తరువాత కాశీ యాత్ర జరుపుదురు. ఇది ఆపస్తంబుడు చెప్పకపోయినను చేయుచున్నారు. స్నాతకుడు, సూర్యోదయమునకు ముందు ఆవరణగల గోశాలలో ప్రవేశించి లోపలికి రోమములున్న కృష్ణాజినముచే గుమ్మమును కప్పుకొని సూర్యాస్తమయమగు వరకు బయటికి రాకూడదు.

ఇంకను మిగిలిన సూత్రవిశేషములను సూక్ష్మముగా వ్రాయుదును.

పా.గృ. బ్రహ్మచారిని, ప్రాతః కాలమున ఒక గదిలో నుంతురు. భార. సూ. ననుసరించి ఇందులకు కారణ మీ విధముగా నున్నది. సూర్యుడు స్నాతకుని యొక్క ఉచ్చతర తేజస్సుచే అవమానితుడు కాకుండ నుండుటకు, ఆపైన స్నాతకుని తేజస్సుచే ప్రకాశితుడగుటకును అట్లు చేయుదురు.

"ఏత దహః స్నాతానాం హ వా ఏష ఏతత్తేజసా తపతి
తస్మాదేవమేత దహర్నా భితపేత్." -- పా.గృ.

అందే అగ్నికి సమీపమున 8 పూర్ణ జలకలశలుండును. ఇవి ఎనిమిది దిక్కులను సూచించును. సమస్త దిశల నుండి సమ్మానము, కీర్తి, బ్రహ్మచారి పట్ల ప్రసరించుగాక యను భావన. అపుడు బ్రహ్మచారి ఈ శబ్దములనుచ్చరించిన వెనుక ఒక పాత్రనుండి జలమును గ్రహించును.

"మనో నాశకమైన కష్టదాయకమైన అగ్నిని త్యాగము చేయుచున్నాను. దీప్తిమంతుడైన అగ్నిని గ్రహించుచున్నాను." అట్లే తదితర కలశముల నుండి మంత్రములనుచ్చరించిన వెనుక జలమును గ్రహించి స్నానము చేయును. బ్రహ్మచారి యొక్క శరీరము, తపో వ్రతాదుల తాపముచే బాగుగా తప్తమైయుండును. గృహస్థ జీవనము సుఖముగా సాగిపోవుటకు శీతలత్వము కావలెను. దీనికే ప్రతీకగా స్నానము చేయుట.

ఇంతవరకు ఇంద్రియ సంయమనముతో గడిపినాడు. ఈ పైన కొద్దిగా సడలింపు. "నాశ్వాస నిశ్వాసలకు తృప్తి కలుగుగాక, నా నేత్రములకు కర్ణములకు తృప్తి కలుగుగాక" అను అర్థమిచ్చు మంత్ర పఠన ముండును. బ్రహ్మచారి ఇప్పటినుండి 'ఉతికిన రంగు వస్త్రములను ధరించును. భూషణము, అంజనము, ఉష్ణీషము, ఛత్రము, ఉపానహము, దర్పణాదులు బ్రహ్మచర్యాశ్రమమున నిషిద్ధములు ఇప్పటినుండి కావు.

కొంతమంది మతప్రకారము బ్రాహ్మణ విద్యార్థి కొరకు ఒక హోమము ద్దేశింపబడినది. స్నాతకుని కడకు బహువిద్యార్థులు చదువు కొనుటకై వచ్చుట నిమిత్తమై చేయవలయునట (బౌ.గృ.) అపుడు ఆచార్యునకు, శిష్యునకు గౌరవ సూచకముగా మధుపర్కము నిత్తురు. రాజునకు, ఆచార్యునకు, అల్లునికి, ఋత్విజులకు ప్రియజనులకు విహితమైనదీ మధుపర్కము.

'షడర్ఘ్యా భవంతి, ఆచార్య ఋత్విగ్వై వాహ్యోరాజా ప్రియః స్నాతక ఇతి' (పా.గృ). నవీనమైన వేషభాషలను ధరించి స్నాతకుడు విద్వాంసులుండు సమీపమున రథముపైగాని, ఏనుగుపైగాని ఊరేగును (ఆప.గృ.ఆ.గృ).

**గోభిల విశేషములు:** అనాశ్రమిగా నుండుట తగదు కనుక సమావర్తన మునకు పూర్వమే కన్యను వెదికి యుండవలెను.

"ఆశ్వ.గృ ననుసరించి మణి కుండలాదులు పదునొకండు వస్తువులు తనకు, గురువునకు సంపాదించి యుంచవలెను. అవి ఇద్దరికి దొరకనపుడు తనకు మాని, గురువునకైనను సంపాదింపవలెను. యజ్ఞార్హమైన చెట్టునందలి ఈశాన్యశాఖ నుండి సమిధలను తేవలెను. ఈ సమిధను అన్నాదికమును, పుష్టిని, తేజస్సును గోరువాడు పచ్చిదానిని, వర్చస్సును కోరువాడు నులి

పచ్చి దానిని తేవలెను. పులిగోరు చెట్టు కాయలలో ఏక బీజముగల దానిని తెచ్చి నూరి నలుగు పెట్టించుకొనవలెను. ముందు ఎడమకంటికి తరువాత కుడికంటికి కాటుకను పెట్టించుకొనదగును. బ్రాహ్మణుడు ముఖమునకు, రాజన్యుడు బాహువులకు, వైశ్యు డుదరమునకు, స్త్రీ గుహ్యమునకు, శ్రమజీవి తొడలకు ముందుగా మైపూతను పూసికొనవలెను." అ.క. సమీక్ష

సాంఖ్యాయనము (కౌషీతకి) ప్రకారము ఎఱ్ఱని ఎద్దు చర్మముపై కూర్చుండి ఈ సంస్కారము చేయవలెను. వ్రీహి, యవ, తిల సర్షపములను మెత్తగా నూరి నలుగుపెట్టుటను, ఉత్తరేణి గింజలు, శంఖపుష్పిని నూరి నలుగుపెట్టుటను పేర్కొన్నది. -- అ.క. సమీక్ష

మానవ కాఠకములందు వేదార్థము నెరిగిన పిమ్మట ఇది చేసికొనవలెనని కలదు.

హిర.న.బ్రహ్మచారి ఇంతవరకు కట్టుకొన్న మేఖలాజినదండములను నీటిలో పారవేయవలెనని కలదు. గోదానము, సమావర్తనము ఒకే రోజున చేయవలెనని, సమావర్తనాంతమున (హోమాంతమున) మేఖలకు గల ముంజగడ్డిని విప్పవలెనని కలదు.

ఆశ్వా.న చెప్పిన దీనికి కావలసిన వస్తువులనే మిగిలిన సూత్రకారు లించుమించుగా నవే చెప్పిరి. ఈ పరికరములను భార.గృ. ఒకచో పేర్కొన్నది.

గౌతమ ధర్మసూత్రములందు, మనుస్మృతి యందు స్నాతక ధర్మములు విపులముగా చెప్పబడినవి. ఇవి స్నాతకునకే పరిమితము కావు. పెక్కు ధర్మములెల్లరు తప్పక పాటింప తగినవిగా నుండును. శారీరక, మానసిక ఆరోగ్యమున కెంతేని తోడ్పడును. ఎందులకు, ఏమిటని ఆధునికులు ప్రశ్నింతురు. చాల వానికి హేతువులు మన బుద్ధి కందనివి. యుద్ధమునందు సేనాధిపతి యాజ్ఞను తక్కిన సైనికులు, తు.చ. తప్పక ఎట్లు పాటింతురో ప్రశ్న వేయరో అట్లే యివి యని భావింపవచ్చును. వేదములు ప్రభు సమ్మితములని గదా యార్యోక్తి.

గౌ.ధ.సూ. లందలి ధర్మములు:

హరదత్తుడు, వసిష్ఠుని మాటలను పేర్కొనెను. సర్వదా అంతర్వ స్త్రమును, ఉత్తర వస్త్రమును రెండు యజ్ఞోపవీతములను, ఒక యష్టి సోదకమగు కమండులువును ధరించి యుండవలెను. వెండి కుండలము లను ధరించవలెనని మనువు మాటలను పేర్కొనెను. సుగంధస్నానము చేయవలెనని గౌ.సూ. మాటలకు ఉసిరిక, నూనె మున్నగువానిచే అని మస్కర భాష్యము. మురికి, చినిగినబట్టలు కట్టరాదు. ఇతరులు ధరించిన పుష్ప మాలికలను, పాదుకలను ధరింపరాదు. ఏక కాలమున నీటిని, అగ్నిని గాని, అన్నమును, నీటిని గాని ధరింపరాదు. అకస్మాత్తుగా గడ్డమును, మీసములను పెంచుకొనరాదు. పాలు, నీళ్లు మొ॥ దోసిలితో త్రాగరాదు. వాయు, అగ్ని, విప్ర, సూర్య, ఉదక, దేవత, గోవులకు అభిముఖముగా గాని వానిని చూచుచుగాని మూత్ర పురీషములను, ఉమ్మి, ఎంగిలి మున్నగు వానిని విడువరాదు. భస్మ-కేశ-నఖ-తుష-కపాల అమేధ్యాదులను అధిష్ఠింపరాదు. అధార్మిక సంభాషణము పనికి రాదు. అమంగళకరమైన మాటలను మాటాడరాదు. గొడ్డుటావును గూర్చి చెప్పవలసినపుడు కూడ ధేనుభవ్య (చక్కగా మునుముందు పాలిచ్చునట్టిది) యనియు, అభద్రమును భద్రముగా, కపాలమును భగాలముగా, ఇంద్ర ధనుస్సును మణి ధనువుగా చెప్పవలెను. దూడ పాలును గుడుచునపుడు అట్టి యావును గూర్చి యజ మానునికి చెప్పరాదు. ఇక హవిస్సులు మొ॥ పితృకార్యములకని దూడను తొలగించి కట్టిన సందర్భములలో ఆవు దూడను కుడుపు కొనుచున్నచో తప్పక చెప్పవలెను. అగ్నిని నోటితో ఊదుట, వాక్కలహము, వాసనలేని పుష్పమాలికలను ధరించుట, పుల్లలతో గోకికొనుట, కాటుక పెట్టుకొను చున్న, తలంటుకొనుచున్న, నగ్నమైన స్త్రీలను చూచుట, గృహాదులను కుద్వారముల గుండ ప్రవేశించుట, ఒక కాలితో మరియొక కాలిని తోము కొనుట. బల్లలు పీటలపై అన్నమునిడి భుజించుట, Table Meal చేతులతో నదిని ఈదుట, ఎత్తైన స్థలములనెక్కుట, దిగుట, గోడలు, ప్రాకారములు దాటుట, మొ॥ కూడని పనులు. మల మూత్రములను విసర్జించునపుడు తలనిండ కప్పుకొని యుండవలెను. భూమిపై గడ్డి

మొ॥ వానిని కప్పి దానిపై మూత్ర పురీషములను విసర్జింపవలెను. నిలుచుండి మలమూత్రముల విసర్జింపరాదు. బూడిద, ఆవుపేడ, దున్నిన పొలము, బాటసారులు విశ్రమించు స్థలము మొ॥ స్థలములందు కూడ విసర్జింపరాదు. పగటిపూట యందు, సాయం ప్రాతః కాలములలో సంధ్యా సమయములందు ఉత్తర దిక్కునకే తిరిగి విసర్జింపవలెను. రాత్రియందు దక్షిణపు వైపునకు తిరిగి విసర్జింపవలెను. శిశ్న, ఉదర, పాణి, పాద, వాక్ చక్షుశ్చాపలములను విసర్జింపవలెను. మీగడతఱకలను తీసివేసినట్టి పాలు పెరుగులను, తెలక పిండిని తినుట కూడదు. దిగంబరిగా నిద్రింప రాదు. ఇంకను పెక్కు ఆత్మగుణములు కలవాడైయుండవలెను. (ఇది గౌ.ధ.సూ.లపై పంచాగ్నులవారి ఆంధ్రీకరణమునుండి).

## మనుస్మృతి ప్రతిపాదిత ధర్మములు:

ఉదయాస్తమయ సూర్యుని, గ్రహణ సమయములందు, నీటియందు ప్రతిబింబించిన మధ్యాహ్న సూర్యుని చూడరాదు. నీటిలో తన ప్రతిబింబమును చూడరాదు. గోవు, దేవతాప్రతిమలు, వేదవేత్తలు, నేతికుండ, తేనెకుండ, నాల్గుదారులు కలియుచోటు, రావి మఱ్ఱి మొ॥ వృక్షములు తటస్థించినచో ప్రదక్షిణముగా చుట్టుకొని పోవలెను. అగ్నిని దాటరాదు. నిద్రించునపుడు కాళ్లక్రిందుగ నిప్పునుంచుకొనరాదు. సంధ్యాకాలమున భోజనము, నిద్ర పనికి రాదు. నేలమీద గీతలు గీయరాదు. బహిష్ఠ స్త్రీతో సంభాషణ పనికిరాదు. ఆకంఠపూర్తిగా భుజింపరాదు. కంచు పాత్ర యందు పాదప్రక్షాళనము కూడదు. ,లేతయెండ, శవధూమము విడువ తగినవి. గోళ్లను దంతములతో కొరుకుట, నిష్కారణముగ మంటి పెళ్లలను పిసుకుట, గోళ్లతో గడ్డిని త్రుంచుట, రాత్రియందు చెట్టు మొదట నివసించుట, సూర్యాస్తమయమైన నువ్వులు చేర్చిన పదార్థములు తినుట, తడి కాళ్లతో పరుండుట, తన మూత్ర పురీషములను చూచుట, రెండు చేతులతో తలగోకికొనుట, తలంటుకొనిన తరువాత నూనె రాసికొనుట మొ॥ కూడని పనులు. ఇని అన్ని వర్ణముల వారికి వర్తించు సామాన్య ధర్మములని మరువరాదు.

వారహ.గృ. ననుసరించి నృత్యగీతములను చూచుట, వినుట, ఆచరించుట స్నాతకునకు పనికిరావు. యజ్ఞము చేయించుట, ఉంఛ శిలవృత్తి, అయాచితముగా లభించిన దానిని గ్రహించుట తగును. వైశ్యవృత్తితో నైనను జీవించవచ్చును కాని స్వాధ్యాయమున కాటంకము కలుగరాదు.

ఆశ్వలాయనముననుసరించి రాత్రి యందు స్నానము చేయరాదు.

అనుజ్ఞ తీపికొనకుండ ఇద్దరు బ్రాహ్మణుల మధ్య పోరాదు. (ఆప.ధ.సూ. వసిష్ఠధ.సూ.) పలాశ సంబంధమైన ఆసనమును గాని, పాదుకలుగాని, పల్లుతోముకొను పుల్లనుగాని వాడరాదు. (వసి.) తూర్పునుండిగాని ఉత్తరము నుండి గాని గ్రామప్రవేశము లేక గ్రామ నిష్క్రమణము చేయవలెనని ఆప.ధ.సూ. రెండు సంధ్యలందును గ్రామమునకు వెలుపల మౌనముతో నుండవలెనని అందే కలదు. గో, దక్షిణ, కన్యా సంబంధ మైన తప్పులనెన్నరాదని, క్షుద్రులను జూదగృహములను విడిచిపెట్టవలెనని యందే కలదు. భోజనము, మలమూత్ర విసర్జనము, యోగాభ్యాసము, సంగమము, ఎవరికి కనపడకుండ చేయుట, తపస్సు ఆయుస్సు, ధనములను గుప్తముగా నుంచుట, అప్పు తీర్చుట, కన్యాదానము వృషోత్సర్గము రహస్య పాపములను బహిర్గతము చేయవలెనని వసిష్ఠ దక్ష స్మృతులందు కలదు. ఈ శ్లోకములన్నియు గృహస్థ రత్నాకరములో నున్నవి.

తల్లిదండ్రులు దప్ప మిగిలిన ఏ దగ్గరబంధువులు చనిపోయినను బ్రహ్మచారికి మృతాశౌచము లేదనియు, సమావర్తనమైన వెనుక మూడు రోజులే మృతాశౌచమనియు, జాతాశౌచము లేదనియు మను, విష్ణు, ధ.సూ. లందు కలదు. ఇట్టి సంస్కారమును పొందిన స్నాతకుని మహద్భుతమైన శక్తిశాలియని ఆ.గృ. కీర్తించినది. "మహ ద్వై ఏత ద్భూతం యత్ స్నాతకః" నేడిది వివాహమునకు ముందు రోజుననో, లేదా ఆనాడే జరుగుచున్నది.

కాశీయాత్ర:

ఇదియొక తంతు. చదువు పూర్తిచేసికొని ఇంటికి వచ్చిన పిమ్మట స్నాతకుడు కాశీయాత్రకు బయలుదేరి వెళ్లిపోవుచున్నట్లు ఇంతలో పెండ్లి కుమార్తె సోదరుడు వచ్చి కాశికి వెళ్లవద్దని గడ్డము క్రింద బెల్లము కొట్టి బావగారిని విడిదికి తీసికొనివచ్చు తంతు వినోదకరముగా నుండును. తైత్తిరీయమున స్నాతకునకు పెక్కు ఆదేశములను ఆచార్యుడొసంగును. ఆ ఆదేశములు సర్వకాలములకు సంబంధించినవి. ఆంగ్లవిద్య నభ్యసించినవారికి కూడ ప్రతి సంవత్సరము డిగ్రీలనిచ్చు సందర్భమున స్నాతకోత్సవము జరుగుచున్నది. Convocation Address నాటి నియమములను పరికింపుడు.

"వేదమనూచ్యాఽచార్యోఽంతేవాసిన మనుశాస్తి
సత్యం వద ధర్మం చర స్వాధ్యా యాన్మా ప్రమదః
ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం
మా వ్యవచ్ఛేత్సీః, సత్యాన్న ప్రమదితవ్యమ్, ధర్మాన్న
ప్రమదిత వ్యమ్, కుశలాన్న ప్రమదితవ్యమ్, భూత్యై
న ప్రమదితవ్యమ్, స్వాధ్యాయ ప్రవచనా భ్యాం న
ప్రమదితవ్యమ్, దేవపితృ కార్యాభ్యాం న ప్రమదితవ్యమ్
మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ,
అతిథి దేవో భవ, యాన్యనవద్యాని కర్మాణి, తాని సేవి
తవ్యాని నో, ఇతరాణి, యాన్యస్మాకగ్ం సుచరితాని
తాని త్వ యోపాస్యాని, నో ఇతరాణి, యే కేచాస్మ
చ్ఛ్రేయాగ్ంసోబ్రాహ్మణాః తేషాం త్వయాఽఽసనే
న ప్రశ్వసితవ్యమ్, శ్రద్ధయాఽదేయమ్, అశ్రద్ధయాఽ
దేయమ్, శ్రియాదేయమ్, హ్రియాదేయమ్, భియా
దేయమ్, సంవిదా దేయమ్, అథ యది తే కర్మ
విచికి త్సా వా వృత్తవిచికి త్సావాస్యాత్
యే తత్రబ్రాహ్మణాస్సమ్మర్శినః, యుక్తా ఆయుక్తాః,
అలూక్షా ధర్మ కామాస్స్యుః, యథా తే తత్ర వర్తేరన్,

తథా తత్ర వర్తేథాః, అథాభ్యాఖ్యాతేషు, యే తత్ర
బ్రాహ్మణా స్సంమర్ శినః యుక్తా ఆయుక్తాః, అలూక్షా
ధర్మకామాస్స్యుః, యథా తే తేషు వర్తేరన్, తథా
తేషు వర్తేథాః, ఏష ఆదేశః, ఏష ఉపదేశః
ఏషా వేదోపనిషత్, ఏతదనుశాసనమ్, ఏవముపాసి
తవ్యమ్, ఏవముచైతదుపాస్యమ్."

అనగా "సత్యమును పలుకుము, ధర్మము నాచరింపుము, పఠించిన దానిని మరువకుము ఆచార్యునకు తగిన ధనమిచ్చి వివాహితుడవై మంచి సంతానమును కనుము. అసత్యము పలుకకుము, ధర్మము నుండి ప్రమాదమును పొందకుము ఆరోగ్యమును కాపాడుకొనుము. మంచి సాధనముల వలన ధనమును సంపాదింపుము, చదువుట, బోధించుట యందు ఏమరుపాటు వద్దు, యాగాదులను, పితృకర్మలను ఆచరింపుము. తల్లిని, తండ్రిని, ఆచార్యుని, అతిథిని దేవతలుగా భావించి పూజింపుము. నింద్యమైన పనులు చేయకుము. మేము చేయు పనులలో వేద శాస్త్రములకు విరుద్ధములు కాని వానినే గ్రహింపుము. విరుద్ధములైన వానిని స్వీకరింప వలదు. పెద్దలను సత్కరింపుము. వారితో పిడివాదనవద్దు. శ్రద్ధతో దానమీయవలెను. అశ్రద్ధతో దానమీయరాదు. యథాశక్తిని దానమొసంగ వలెను. సిగ్గుతో నిమ్ము. పరలోక భయము కలిగి. ఇమ్ము. నీవాచరించు ధర్మములందు సంశయము కలిగిన ధర్మాసక్తులైన వారి ఆచారమును బట్టి నడువుము. శిష్టాచారమును బాటింపుము. ఇదియే ఉపదేశము. ఇది ఈశ్వరాదేశము.

పై ధర్మములు నేడు కూడ పాటింప తగినవేకదా! యథాశక్తిని పాటించినచో నేడున్న ఆందోళనలు, చీటికి మాటికి నిరాహారదీక్షలు, సమ్మెలు, ఆవేశములు, ఒకరిపై నొకరు కక్ష సాధింపవలెనను ప్రవృత్తి, లంచగొండి తనము, అవినీతి మొ॥ భయానక బీభత్సకర ప్రవృత్తి మటుమాయము కాదా! ప్రాచీన విద్యాలయములలో నేడున్న అరాచక స్థితి కలదనుటకు ఒక్క ఉదాహరణమైన చూపించగలరా?

* * *

# వివాహము

**శబ్దార్థము - ప్రయోజనము:**

వివాహము "వహనం వాహః, విశిష్టో వాహః = వివాహః వివాహ శబ్దస్య విశిష్ట వహనార్థత్వం. వైశిష్ట్యం చ ప్రతి గ్రహోద్యష్ట విధోపాయా న్యతమోపాయేన స్వీకృతాయాం హోమాది సప్తపదీన యనాంత కర్మభిః సంస్కృతత్వం" అనగా ప్రతి గ్రహోది యెనిమిది యుపాయములలో నొకదాని చేత గ్రహించిన కన్యను హోమాది సప్తపద్యంతకర్మలతో సంస్కరించుట వివాహమన బడునని సంస్కార ప్రదీపము. ఉద్వాహము: ఉద్ధృత్యవహనం = ఉద్వాహః = కన్యను పితృగృహమునుండి తన వద్దకు తెచ్చుకొనుట.

పరిణయము: లేక పరిణయనము = చుట్టు తిరుగుట అనగా అగ్నిచుట్టు ప్రదక్షిణము చేయుట.

ఉపయమము: దగ్గరగా తీసికొని స్వీయముగా చేసికొనుట.

పాణిగ్రహణము: బాలికయొక్క (వధువు) చేతిని గ్రహించుట.

పై పదములొక్కొక్క అర్థమునే ప్రతిపాదించినట్లు కన్పట్టినను వివాహసంస్కారము అన్ని అర్థములను ప్రతిపాదించుచు అన్ని అర్థముల నిముడ్చుకొన్నది. "ఏవముపయమన పాణిగ్రహణ శబ్దవత్పరిణయన శబ్దో పి దండిన్యాయేనైవ కర్మ సముదాయే శాస్త్రేష ప్రయుజ్యతే." అని అపరార్క వ్యాఖ్య.

హిందూ సంస్కారములందు వివాహమునకు మహోన్నతస్థానము కలదు. ఈ సంస్కారము సమస్త సంస్కారములకు కేంద్రస్థానము వహించుచున్నది. ఇది వేదవాఙ్మయమునందు బహుధా స్తుతింపబడినది. వివాహ శబ్దము తై.సం.ఐ.బ్రా. మొ॥ వానియందు కన్పట్టును. తాండ్య మహో బ్రాహ్మణమునందు (7.10.1.) స్వర్భూలోకము నొకానొక సమయమున కలిసి యుండెడివని కాని ఇపుడు విడిగా నున్నవని యను సందర్భమున వివాహమగుగాక మన మధ్య సహకారముండు గాక అను నర్థమిచ్చు మంత్రము కలదు.

ప్రాచీనులు వివాహమునొక యజ్ఞముగా, పరమ పవిత్ర కృత్యముగా భావించిరి. దీనిని చేసికొని గృహస్థ జీవనమున ప్రవేశించని వానిని అయజ్ఞియ లేక యజ్ఞహీనుడని పేర్కొనినట్లు వైదికసాహిత్యమున కలదు. "అయజ్ఞియో వా ఏషయోఽపత్నీకః" తై.బ్రా. ఇదియొక నిందా సూచక శబ్దముగా గోచరించును. ఏకాకిగా నున్న పురుషుదు అపూర్ణుడు. మానవుడు ఒంటరిగా చేసిన యజ్ఞమువలన దేవతలు తృప్తిని ప్రీతిని పొందరనియు, భార్యాసహితుడై పూజించినపుడే తృప్తిని పొందెదరని వేదములందు చెప్ప బడినది. అట్లే పుణ్యనదీస్నానములు, క్షేత్ర సందర్శనము సమగ్ర ఫలము నీయవలెననిన భార్యాసహితుడై యుండవలెను. అతని పత్ని అర్ధభాగమును గ్రహించుచున్నది. "అథో అర్ధో వా ఏష ఆత్మనః యత్ పత్నీ" (తై. బ్రా.) అట్లే ఐతరేయమున కూడ కలదు. ఆప.ధ.సూ. ఈ సహత్వమును గట్టిగా నొక్కి చెప్పినది. "జాయాపత్యోర్న విభాగో విద్యతే. పాణి గ్రహణాద్ధి సహత్వం కర్మసు."

భార్యయే ఇల్లుగా ఒక జాయోద్ - అస్తమ్ అను ఒక ఋక్ (3.53.4.) నందు ఉద్ఘాటింప బడినది. భార్య జాయగా ఐ.బ్రా. (33-1)న వర్ణింపబడినది. అట్లనుటకు కారణము భార్యయందు తాను పుత్రునిగా పుట్టుచున్నాడు. గనుక భార్యను గ్రహించి సంతానము కననంతవరకు పూర్ణ పురుషుడు కాదని శత.బ్రా.న కలదు. "అథ యద్దైవ జాయాంవిందతేఽథ ప్రజాయతే తర్హిపి సర్వోభవతి" అట్లే ఐత.ఆర. కూడ కలదు. "తస్మాత్ పురుషో జాయాం విత్వా కృత్స్నతర మివాత్మానం మన్యతే."

అట్లే భారతాది గ్రంధములందు కలదు. "న గృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే" (శాంతిపర్వము).

"అర్ధం భార్యా మనుష్యస్య భార్యా శ్రేష్ఠతమః సఖా
భార్యామూలం త్రివర్గస్య భార్యామూలం తరిణ్యతః" (ఆది)
"ఆమ్నాయే స్మృతితంత్రే చ లోకాచారే చ సూరిభిః
శరీరార్థం స్మృతా భార్యా పుణ్యాపుణ్యఫలే సమా."

అని బృహస్పతి మాటలను అపరార్కుడు ఉదాహరించినాడు. భార్య కనుక సంతానవతియై ధర్మకార్యములందు సహాయపడినచో రెండవ భార్యకై యత్నింపరాదని ఆప.ధ.సూ.నందు కలదు. దీనిని బట్టి ధర్మకార్యాచరణలో తోడ్పడుట, సంతాన వతియై నరకాదులనుండి తప్పించుట, భార్యామూలకములని స్పష్టము. "ధర్మ ప్రజా సంపన్నే దారే నాన్యాం కుర్వీత" యాజ్ఞపై మితాక్షరి ఈ మాటలనే గ్రహించుచు ఇట్లన్నది. "తథా చ ఆపస్తంబేన ధర్మప్రజా సంపత్తిః ప్రయోజనం దారా సంగ్రహస్యోక్తం ధర్మ.................కుర్వీతేతి వదతా, రతిఫలం తు లౌకిక మేవ." కనుక, ధర్మసంపత్తి, ప్రజ, రతి సౌఖ్యము, ఈ మూడును భార్యవలన సమకూరునని సర్వ స్మృతి కర్తల యభిప్రాయము.

మనుజుడు మూడు ఋణములతో పుట్టుచున్నాడను సిద్ధాంతము ప్రకారము పితృఋణమును తీర్చుకొనుటకై వివాహము ముఖ్యమైనది. "జాయమానో హ వై బ్రహ్మణస్త్రి భిర్ఋణవాన్ జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః." (తై.సం.).

ధర్మశాస్త్ర గ్రంథములు నాలుగు ఆశ్రమములను గట్టిగా సమర్థించినవి. "ఆయుర్దాయమున మొదటి నాల్గవ భాగము గురుకులమునందు, రెండవ నాల్గవ భాగము గృహస్థ జీవనము నందు, మూడవ నాల్గవ భాగము వానప్రస్థము నందు, నాల్గవ నాల్గవ భాగము సన్న్యాస స్వీకారమునందు వినియోగించవలెనని" మనువు.

ఎవడు విధ్యుక్తముగ నాలుగు ఆశ్రమ ధర్మములను పాటించునో అతడు సమస్త లోకములను జయించుటయేగాక బ్రహ్మలోకమును కూడ పొందునని హారీతుడు పై అభిప్రాయమునే నొక్కి వక్కాణించెను.

"అనేన విధినాయోహి ఆశ్రమానుప సేవతే
స సర్వ లోకాన్నిర్జిత్య బ్రహ్మలోకాయ కల్పతే."

ఇందులకు విరుద్ధముగా నడచిన వ్యక్తికన్న ప్రపంచమున పాపి మరియొకడుండడని దక్షుడనుచున్నాడు.

గృహస్థాశ్రమమును గూర్చి స్మృతులందు చాల ప్రశంస కలదు. దీనిని ష్ఠతమ ఆశ్రమమనిరి. ఇది సమస్త సమాజమును సంఘటింపచేయును. "సమస్త జంతువులు వాయువు నాశ్రయించినటుల, అన్ని ఆశ్రమములు గృహస్థాశ్రమము నాశ్రయించికొన్నవి." మిగిలిన వారికి జ్ఞానాన్నముల నిచ్చుచున్నాడు. కనుక ఇది జ్యేష్ఠాశ్రమమని పిలువ బడుచున్నది. ఇహ పర సుఖములను కోరువాడు గృహస్థ ధర్మములను పాటించవలెను. దుర్బలేంద్రియునకిందు స్థానము లేదు.

"యథా వాయుం సమాశ్రిత్య వర్తంతే సర్వజంతవః
తథా గృహస్థమాశ్రిత్య వర్తంతే సర్వ ఆశ్రమాః
యస్మాత్ త్రయోఽప్యాశ్రమిణో జ్ఞానేనాన్నేన చాన్వహన్
గృహస్థేనైవ ధార్యంతే తస్మా జ్జ్యేష్ఠాశ్రమో గృహీ
స సంధార్యః ప్రయత్నేన స్వర్గ మక్షయమిచ్ఛతా
సుఖం చేహేచ్ఛతా నిత్యం యోఽధార్యో దుర్బలేంద్రియైః"

తల్లి నాశ్రయించి ప్రాణులన్నియు జీవించునట్లు గృహస్థు నాశ్రయించి మానవులెల్లరు జీవింతురని మనువు.

"యథామాతరమాశ్రిత్య సర్వేజీవంతి జంతవః
తథా గృహస్థమాశ్రిత్య సర్వే జీవంతి మానవాః"

ఎట్లు నదీనదములన్నియు సముద్రమున చేరి శాంతిని పొందునో అట్లే మిగిలినవారు ఇతని సమాశ్రయమున సమ్యక్ స్థితిని పొందుచున్నారని మనువు.

"యథా నదీనదా స్సర్వే సముద్రే యాంతి సంస్థితిమ్
తథైవా శ్రమిణ స్సర్వే గృహస్థే యాంతి సంస్థితిమ్."

ఈ గృహస్థునే పెద్దనగారు మనుచరిత్రలో కెలకుల నున్న తంగెటి జున్ను, పెరటి కల్పకము అని మనోహరముగ వర్ణించిరి. త్రాసులో ఒక సిబ్బిలో ఈ ఆశ్రమమును, మరియొక సిబ్బిలో మిగిలిన ఆశ్రమములను పెట్టి తూచిన గృహస్థాశ్రమము వైపుననే మొగ్గు చూపుచుండునను ప్రశంసా వాచక శబ్దములు భారతమున కలవు:

కామమొక బలీయమైన శక్తి. “శరీరము నిలబడుటకు ఆహారమెంత ముఖ్యమైనదో అట్లే కామము కూడ” అని కామ సూత్రకారుడు. ఈ భోగమును తీర్చునది వివాహమేయయినను విశృంఖలముగా మనుజుని పోనీయక ధర్మబద్ధమైన కామమును సేవించుటకు హేతుభూతమగుచున్నదీ సంస్కారము.

అట్లే సంతానము కావలెనను కోరిక, వారిపట్ల ప్రేమ, వారి అభ్యున్నతిని కోరుట కూడ అనాది సిద్ధములు. సంతానము కనుటనే పరమ ప్రయోజనముగా చెప్పు శ్రుతివాక్యములు లేకపోలేదు. “ప్రజననం వై ప్రతిష్ఠా, లోకే సాధు ప్రజయాస్తం తు తన్వానః పితౄణామనృణో భవతి, తదేవ తస్యాఽనృణం, తస్మాత్ప్రజననం పరమం వదంతి” (తై.ఆర.). సంతాన ప్రాప్తికై ఈ ఆశ్రమమును రఘువంశపు రాజులు గ్రహించుచున్నారని కాళిదాసు. “ప్రజాయై గృహమేధినామ్” అట్టి సంతానము ఇహ పరలోక సాధకము. సంతానము కనుటతోనే తృప్తిపడక శ్రౌత స్మార్త యజ్ఞ యాగాదులను చేసి దానాదుల ద్వారమున మనుష్యులను, పశు పక్ష్యాదులను తుదకు దేవతలను తృప్తిపరచి తాను పరిపక్వమైన మనస్సు కలవాడై బ్రహ్మైక్యము పొందుటకే సంస్కారము అత్యావశ్యకమగుచున్నది.

మనమే కాక సమస్త నాగరిక జాతులు వివాహ సంస్కార ప్రాముఖ్యమును గుర్తించినవి. ఏథెన్సు నగరమున ఏ వంశము విచ్ఛిత్తి లేకుండనుండుగాక అను ఆదేశమును పాలకులిచ్చెడివారట. స్పార్టాయందు వివాహము చేసికొనని వారిని కొన్ని అధికారముల నుండి తొలగించెడి వారట. వారు వృద్ధుల ప్రేమకు నోచుకొనలేకపోవుచున్నారని ప్లూటార్కు వ్రాసియున్నాడు. (లైఫ్ ఆఫ్ లికర్గస్) అవివాహితుని అవాంఛనీయ వ్యక్తిగా రోమనులు పరిగణించెడివారు.

## స్వేచ్ఛా గమనము పూర్వమున కలదా?

వైదిక సాహిత్యమునందు స్త్రీపురుషులు స్వేచ్ఛగా సంచరించుట, స్త్రీ పురుషుల కలయిక కేవలము భౌతికమని భావించుట కానరాదు. కాని

ఇందులకు భిన్నమైనది భారతమున కలదు. "అతి ప్రాచీన కాలమందు స్త్రీలు స్వతంత్రులై, అనావృతలై, ఇష్టమైన పురుషునితో సంచరించెడివారు."

"అనావృతాః కిలపురాస్త్రియ ఆసన్ వరాననే
కామచార విహారిణ్యః స్వతంత్రాశ్చారుహాసిని"

శ్వేతకేతు - ఉద్దాలక చరిత్రముననిది ప్రస్తావించబడినది. దీని నాధారముగా గ్రహించి పూర్వమిట్లుండెడి వారని చాల మంది వ్రాసిరి. ఈ మాటలను అర్థవాదముగ స్వీకరించవలెనని కుంతి సంతానమును కనవలెనుటలో ప్రరోచన నిమిత్తమై చెప్పబడినదని నీలకంఠుడు వ్యాఖ్యానించెను. ఇట్టి సంఘటనలు వేదములందు గాని, గృహ్య సూత్రములందు కాని లేవు. నియమబద్ధమైన వివాహములే కలవు. స్వేచ్ఛా వివాహమును గూర్చి ఒకే ఒక ప్రస్తావన ఋగ్వేదమున (10.59) కలదు. అదియే ఊర్వశీ పురూరవుల కథ అయినను అది దేవతా సంబంధమైనది.

అనాది నుండి కొన్ని జాతులందు ఒక పురుషుడు అనేక స్త్రీలను వివాహమాడుట, ఒక స్త్రీ పెక్కు పురుషులతో సంసారము చేయుట కలదు. సభ్యత సంపూర్ణముగా నున్న కొన్ని జాతులందు ఏకపత్నీవ్రతమే అగుపించును. ఇది ఊహాజనితము కాదు. వెస్టర్ మార్కు వంటి మానవ చరిత్రకారులందరు అంగీకరించినదే. అఖిల ప్రపంచమునకు విజ్ఞాన భిక్షనిడిన భారతదేశము అనాది నుండి సంస్కృతీ సంపన్నమై యుండుటచే స్వేచ్ఛా వివాహములకగ్రతాంబుల మీయక ఏకపత్నీ వ్రతమునే ఆరాధించినది.

ఎనిమిది రకములైన వివాహములను స్మృతులు పేర్కొన్నవి. అవి బ్రహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య, ఆసుర, గాంధర్వ, రాక్షస, పైశాచములు. ఇట్టి వివాహ పద్ధతులనాది నుండి భారతదేశమున నున్నట్లు తోచును.

## వేదములందు ప్రస్తావన:

గృహ్య సూత్రములందున్న పాణి గ్రహణము, లాజహోమము, సప్తపది, వధూవరయాత్ర మొ॥ పెక్కు పద్ధతులే వేదములందున్నవి. అట్లనుటకన్న వేదము లందున్నవి సూత్రములలో నున్నవని చెప్పుట మేలు. పై వానిని

గూర్చి విపులముగా ఆయా సందర్భములందు వివరించితిని గాన మరల మంత్రములను పేర్కొనుట, అర్థము వ్రాయుట చర్విత చర్వణమగునని మానివేయుచున్నాను.

మహోదాత్త భావములతో కూడిన మంత్రభాగములకు కొందరు ఆధునికులు విపరీతార్థములను తీయుచున్నారు. ఆనాడు స్వేచ్ఛా సంచారముండెడిదని ఒకరనగా తుదకు వావివరసలు విడిచిపెట్టి సోదర సోదరీ వివాహమే యుండెడిదని మరికొందరు వ్రాయుచున్నారు. రాజ బలిపాండే, శ్రీపాద అమృతడాంగే (కమ్యూనిస్టు నాయకుడు) మొ॥ వారు యమయమీ సంవాదమును చూపించి ఆనాడు సోదరిని వివాహ మాడినను తప్పుకాదని నిర్భయముగా వ్రాయుచున్నారు.

బృహద్దేవత అధ్యాయమున, ఋగ్వేదమున ఒక కథ కలదు. త్వష్టపుత్రి శిరస్కుడని ఒక కొడుకు శరణియని ఒక కూతురు కలదు. వివస్వంతునికి ఈ శరణియనిచ్చి వివాహము చేయును. వీరినుండి యమయములు పుట్టిరి. యుక్తవయస్కులైరి. యమి, యముని కామించును. "సోదర సోదరీ వివాహము ఇంతకు ముందు వినలేదు, కనలేదు, ఈ అసభ్య ప్రలాపమేల?" యని యముడు ప్రశ్నించును.

"న యత్ పురాచక్రుమకత్ హనూనమ్ ఋతాః
వదంతా అన్నతం రపేయ".

ఒక చెట్టు లతను భరించునట్లు మరియొక పురుషుని కోరుకొనుము, పొమ్మని యముడనును.

"అన్యం ఉం (ఇతి) షత్వం యమి అన్యః ఉం (ఇతి)
త్వాం పరిష్వజాతే లిబుజాఇవవృక్షమ్
తస్యవా త్వం మనః ఇచ్ఛపః వాతవ అధకృషుష్వ
సంవిదమ్ సుభద్రామ్."

దానికి యమి 'ఓ క్రూరదైవమా! నీవు నిజముగా మృత్యువే. నీ హృదయము రాయివలె నుండునని నేను ఊహించలేదు. ఇపుడు బాధపడి

ప్రయోజనము లేదు. ఓయమ! ఒక లత వృక్షమును ఆలింగనము చేసికొను రీతిగా, కంఠమును మాలిక చుట్టుకొనునటుల మరియొక స్త్రీ నిన్ను పొందుగాక' యని సమాధానమిచ్చును.

"బతః బత అపి యమన ఏవ తే మనః హృదయం చ అవిదామ
అన్యాకిల త్వాం కక్ష్యా ఇవ యుక్త పరిష్వజావే లిబుజా ఇవ వృక్షమ్."

అని స్పష్టముగా చెప్పగా ఈ సంవాదమును శ్రీ డాంగే మొదలగు వారు విపరీతముగా అర్థము చేసికొనిరి. తెలిసి చేసిరా? లేక తెలియక చేసిరా? తెలిసినను వక్రభాష్యము చేయవలెనను సంకల్పముతో చేసిరా? యని సందేహము.

సభ్యతా పూర్వకమైన వివాహసంస్కారము సంపూర్ణముగా వేదము లందే ప్రతిపాదితమైనది. "పరమేశ్వరుడు, ఏకాకిగా నున్నపుడు సుఖించుట లేదు. స్త్రీ కావలెనని కోరెను. అట్లే మనుష్యుడు కూడ. స్త్రీ పురుషుల కలయిక వలననే జీవితము సర్వసంపూర్ణమగుచున్నది. స్త్రీ అసమ గ్రతను పూరించి సంతానమును కనుచున్నది" అను నర్థమిచ్చు మంత్రము బృహదారణ్యకమున కలదు.

"సవై నైవరేమే తస్మాత్ ఏకాకీ న రమతే స ద్వితీ
యమైచ్ఛత్ స హైతావానాస యథా స్త్రీ పుమాంసౌ
సంపరి ష్వక్తౌ స ఇమమే వాత్మానం
ద్వేధా పాతయత్ తతః పతిశ్చ పత్నీ చాభవతామ్
తస్మాదిదం అర్ధవృగల మివస్వ ఇతి హస్మాహ
యాజ్ఞవల్క్యః తస్మాదయమాకాశః స్త్రియాపూర్యతే
ఏవతాం సమభవత్ తతో మనుష్యా అజాయంత."

స్త్రీతో కలిసినపుడు పురుషుడు సంపూర్ణుడగుచున్నాడని, పుత్రరూప ముగా తానే పుట్టుచున్నాడని వాజసనేయబ్రాహ్మణము.

"అర్ధో హ వా ఏష ఆత్మనః తస్మాత్ యత్ జాయాం
న విందతే నైతావత్ ప్రజాయతే అసర్వోహి

ర్వావల్ భవతి అథ యద్దైవం జాయాం విందతేఽథ
ప్రజాయతే తర్హి పర్వోభవతి."

ఇట్లెన్నియో మంత్రములు కలవు. ఇవి ఆటవిక ధోరణిలో నున్న సమాజమున వర్తించునా? "నా తనయులు ధైర్యవంతులుగా నుందురుగాక. శత్రువులను జయింతురుగాక. నా పుత్రికలు తేజోవంతులుగా నుందురుగాక. నా భర్త కీర్తి నల్దిక్కుల ప్రసరించుగాక" అను భావములు నాగరిక సమాజములో నుండునా? అనాగరిక సమాజములో నుండునా?

"మమ పుత్రాః శత్రుహణోఽథో మే దుహితా
విరాట్ ఉతాహమస్మి సంజయా పత్యామే శ్లోక ఉత్తమః"

అని అథర్వవేదము. ఆదర్శవంతమైన కుటుంబమును ఆ వేదమే ఇట్లు పేర్కొన్నది. 'ఆవు తన దూడను ప్రేమించునట్లు పరస్పరము ప్రేమతో నుందురుగాక. ఈర్ష్యాద్వేషములు, విరోధములు లేక ప్రేమ పూర్ణ హృదయముతో నుందురుగాక. తల్లిదండ్రుల భావానుగుణముగా కొడుకులుందురుగాక! భార్య మధుమయ వాక్కులతో భర్తతో సంభాషించుగాక! సోదరుడు, సోదరి ద్వేషముతో నుండక సమాన హృదయముతో ఐకమత్యముతో నుందురుగాక!"

"సహృదయం సాంమనస్యం అవిద్వేషం కృణోమి వః
అన్యోఅన్యం అభిహర్యత వత్సం జాతని వాఘ్న్య
అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః
జాయాపత్యే మధుమతీం వాచం వదతు శంతివామ్
మా భ్రాతా భ్రాతరం ద్విక్షన్ మా స్వసారముతస్వ సా
సంమ్యచ్చా సవ్రతా భూత్వా వాచం వదత భద్రయా."

ఇట్లెన్నేని మంత్రములనుదాహరించవచ్చును. అవసరమైనచో స్త్రీలు వీరనారీమణులయ్యెడి వారు. ఉదా:- ముద్గలని, విశ్పల. వీరు శస్త్రములను ధరించి యుద్ధము చేసినట్లు ఋగ్వేదమున కలదు. ముద్గలుని భార్య ముద్గలని పశువుల దొంగలు వీరి ఆవులు దొంగిలించుకొని పోవుచుండగా, రథమునెక్కి వారిని ముద్గలుడు వెంబడించును. ఆ రథమును తోలినది

ముద్గలని. ముసలిఎద్దును పూన్చిన రథమునుతోలి అందరి ప్రశంసలనందు కొన్నది ఆమె. శత్రుసంహారము చేసినది. వారి విజయము శుభ్రమై, పవిత్రవంతమై చంద్రికవలె భాసించుచున్నదని వేదమునందు స్తుతింపబడినది.

అట్లే విశ్పల ఖేలమహారాజు భార్య. ఖేలుడు ఒక యుద్ధములో తగుల్కొనగా ఈమెకూడ ఆ యుద్ధములో పాల్కొని ఒక కాలిని పోగొట్టుకొన్నది. ఈమె అశ్వినీ కుమారులను ప్రార్థించగా ఒక కృత్రిమమైన ఒక ఇనుప కాలిని వారు అమర్చిరి. మరునాడు యుద్ధముచేసి వారిని జయించినది. అట్లే బ్రహ్మవాదినులైన మైత్రేయి, గార్గి మొ॥ వారు వేదములందు ప్రస్తుతింపబడిరి. పైచూపిన పెక్కు ఉదాహరణలను బట్టి ఆనాటి సమాజము అనాగరికతా పూర్ణమైనదని పై ఆధునికుల వ్రాతలు అసందర్భములని సారాంశము.

అష్టవిధ వివాహములు:

అన్నింటిని అన్ని గృహ్య సూత్రములు పేర్కొనలేదు. మానవ, వారాహములు కేవలము బ్రహ్మమును, శుల్క (ఆసుర) వివాహములను పేర్కొనినవి. ఆప.ధ.సూ. ప్రాజాపత్య, పైశాచములను వదలివేసి మిగిలిన ఆరింటిని పేర్కొన్నది. వసిష్ఠధర్మసూత్రము బ్రాహ్మ, దైవ, ఆర్ష, గాంధర్వ, క్షాత్ర, మానుషములనే గుర్తించినది. చివరి రెండు రాక్షస, ఆసురములకు సమానము. ఆశ్వలాయనము అష్టవిధవివాహములను పేర్కొన్నది. సూత్ర ములందు వరుస కూడ భిన్నముగా నున్నది. ముందీ వివాహములను పేర్కొని అందెవరికి ఏది కూడునో, ఏది ప్రశస్తమో ఏది అప్రశస్తమో మొ॥నవి తరువాత విచారింతము. ముందుగా అధమాధమ పద్ధతులను పేర్కొని ఉత్తమోత్తమ పద్ధతులను వెనువెంబడి పేర్కొందును.

1. పైశాచము:

అప్రశస్తతమమైనది పైశాచ వివాహము. "పైశాచ శ్చాష్టమోఽధమః" (మను) కన్యను మోసగించి వరుడు వివాహమాడుటచే ఇది నీచతమమైనది. ఆశ్వ.గృ. ననుసరించి నిద్రించిన, మత్తురాలైన లేక అచేతన స్థితిలో

నున్న కన్యను హరించుకొని పోవుటయే. కన్యను బలాత్కరించి తీసికొని పోవుట రాక్షస పైశాచములందు సామాన్యమైనను పైశాచమందు కన్య యొక్క బంధువులు ఉదాసీనులైయుండుట, చేతకాని స్థితిలో నుండుట కద్దు. "అచేతమైన, నిద్రించిన, మత్తురాలైన స్త్రీతో మిథున కర్మ చేయుటయో పైశాచమగునని గౌతమ, విష్ణు స్మృతులందు కలదు. అట్లే మనువు."

"సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహోయత్రో పగచ్ఛతి
స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః"

ఛలపూర్వకమైనది పైశాచమగునని యాజ్ఞవల్క్యుడు. అట్లే దేవలుడు కూడ. ఇది సభ్యేతరమైన జాతులందు గోచరించెడిది. భారతదేశమున పశ్చిమోత్తర ప్రాంతమున పిశాచ జాతులుండెడివారని వారియాచారమును బట్టి ఇది పైశాచమని పిలువబడుచున్నదని చరిత్రకారులమాట.

2. రాక్షసము:

చివరినుండి రెండవది రాక్షసము. కన్య యొక్క బంధువులను, నానా బాధలు పెట్టి, చివరకు చంపియైనను విలపించుచున్న కన్యను బలాత్కారముగ హరించుకొని పోవుటను రాక్షసమందురని మనువు.

"హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశంతీం రుదంతీం గృహాత్
ప్రసహ్య కన్యాం హరతో రాక్షసో విధిరుచ్యతే."

ఈ పద్ధతి యుద్ధములందు ప్రీతికల జనులందు పొడసూపెడిది. ఇది యుద్ధములనుండి పుట్టినదని విష్ణు, యాజ్ఞులు కంఠోక్తిగా సెలవిచ్చిరి. "యుద్ధహరణేన రాక్షసః" ఇప్పటికిని కొన్ని ఆటవిక జాతులందు వివాహ మంటపములపై యుద్ధమును కన్యను అపహరించుకొని పోవుటను అభినయించుట కలదు. ఉదా: గోండ్‌జాతి.

కన్యయొక్క అభిప్రాయమునకు విరుద్ధముగ, అనగా బలాత్కారముగ అపహరించుకొని పోవుట క్రమశః తగ్గినదని చెప్పవచ్చును. తల్లిదండ్రులు ఇష్టపడని సందర్భమున మాత్రమే కన్యను బలాత్కారముగ గ్రహించుట

పురుమిత్రుని యొక్క కథలో గోచరించును. (ఋ.వే. 1.1.112) ముందు చెప్పిన దానికి దీనికి గల భేదమును గ్రహించవలెను. మహాభారతములో పేర్కొన్న రుక్మిణి, సుభద్రల వివాహము నిటస్మరించుకొనదగును.

కాలక్రమమున ఈ వివాహమునకు భారతజాతి స్వస్తిచెప్పినను క్షత్రియులందు కొంతకాలము వరకు మిగిలినది. వారు యుద్ధ ప్రియులు కనుక అట్లు జరిగినది. మనువు ననుసరించి క్షత్రియలకు రాక్షసము ప్రశస్తము. "రాక్షసం క్షత్రియస్యైకమ్." భీష్ముడు కన్యలను బలాత్కారముగ తీసికొని వచ్చు సందర్భముననిది ప్రశంసింపబడినది. "క్షత్రియాణాం తు వీర్యేణ ప్రశస్తం హరణం బలాత్." దీనినే హారీతుడు క్షాత్ర వివాహమని నాడు. ఇది శక్తికి, వీరత్వమునకు చిహ్నమని దేవలుడనుచున్నాడు. "వీర్యహేతుర్వివాహః సప్తమః సముదాహృతమ్." కాని ఈ వివాహములలో ముక్కాలు మువ్వీసము కన్య కూడ ఇష్టపడినవే. పృథ్వీరాజు - రాణి సంయుక్తల వివాహమట్టిదే.

పూర్వులు రాక్షస పైశాచములు చెప్పిరనగా, అదివారికి సర్వవిధముల సమ్మతమని భావింపరాదు. ఎనిమిది రకములైన వివాహములుగా కాక ఎనిమిది పద్ధతుల ద్వారమున కన్యను గ్రహింపవచ్చుననియే సూచన, అని మేధాతిథి వ్రాసియున్నాడు. ఈ కారణమును బట్టియే మంచి కన్య ఇతరోపాయములచే లభించనిచో చౌర్యమును పయోగించియైన వివాహమాడవచ్చునని వత్సుని అభిప్రాయము. (స్మృతిచంద్రిక.) సర్వస్మృతికర్తలు ఈ రెంటిని ఖండించిరి. కనుకనే ఆపస్తంబుడు, వసిష్ఠుడు పైశాచమును గుర్తింపలేదు. కాని సంకరులకు పైశాచము కూడునని పైఠీనసి.

బలాత్కృత కన్యను స్వీకరింపవచ్చునా కూడదా అను విషయమై వసిష్ఠుని మాటలను తిలకింపుడు. ఒక కన్యను బలాత్కారముగ గైకొని మంత్ర రహితముగ నున్నచో ఇంకొకనికి అట్టి కన్యనీయవచ్చును. ఆమె కన్యయేయగును. కన్యయొక్క భావిజీవితమును దృష్టియందుంచుకొని యిట్లునియమించినట్లు తోచును. హోమము, సప్తపది మొ॥ తంతు జరుగుటకు బలాత్కరించిన వాడు నిరాకరించినచో ఆమెను ఇంకొకనికిచ్చి వేయవచ్చుననియు, వానికి తీవ్రశిక్ష విధించవలెనని మనువు, యాజ్ఞులు.

స్మృతిచంద్రిక మొ॥ గాంధర్వ, ఆసుర, రాక్షస, పైశాచములందు, హోమము, సప్తపది అవసరమని దేవలుని పేర్కొనినవి.

### 3. గాంధర్వము:

కామాతురులుగ గంధర్వులు వర్ణింపబడినారు. "స్త్రీకామా వై గంధర్వాః" (తై.సం.) వారికి సంబంధించినది కావున గాంధర్వము. పత్నిని స్వీకరించుటలో మూడవ పద్ధతి గాంధర్వ పద్ధతి. స్త్రీ పురుషులిర్వురు పరస్పర మంగీకరించి ఒకరిని మరియొకరు వెంబడించుటను గాంధర్వమని ఆశ్వలాయనుడు. కన్యయే స్వయముగా వరుని ఎన్నుకొనుట (ప్రేమించుట) గాంధర్వమగునని హారీత గౌతములు. మనువు అభిభాషించినది సర్వోత్తమముగా నున్నది. "స్త్రీ పురుషులిద్దరు కాముకతచే వశీభూతులై స్వేచ్ఛాపూర్వకముగ కూడి యుండుట గాంధర్వమగును."

"ఇచ్ఛాయాఽన్యోన్య సంయోగః కన్యా యాశ్చ వరస్య చ
గాంధర్వస్య తు విజ్ఞేయో మైథున్యః కామసంభవః"

గాంధర్వముకూడ ప్రాచీనమైనదే. యువతీ యువకులు పరస్పర ప్రేమ రసాకృష్టులగుట సహజము. అనాది సిద్ధము. ఋగ్వేదమున ఒకానొకచోట (10.27.17) ఇట్లు కలదు. సుందరమైన వేషభూషలచే అలంకరింపబడ జనసముదాయమున తన పతిని వరించుచున్నది. ఆ వధువు భద్రయని పిలవబడుచున్నది. జనులు కూడిన సమయములందు, ఉత్సవములందు ఈ వివాహమున కవకాశము చిక్కుట, కొన్ని సందర్భములందు యువతీ యువకులకు సంబంధించినవారు కూడ అడ్డుపెట్టకుండుట కూఢ ప్రాచీన సాహిత్యమున గోచరించుచున్నది. అన్నివర్ణములకంటె క్షత్రియులలో దీనికి ప్రాచుర్యముండెడిది. వారు స్వతః స్వతంత్రులు కనుక.

కొందరి మతానుసారము ఈ వివాహము ప్రశస్తమని, కారణమేమన దాంపత్యము ప్రేమ మూలము కనుక.

"గాంధర్వమప్యేకే ప్రశంసంతి స్నేహాను గతత్వాత్"

-- గౌతమ.ధా.

మహాభారతమందు శకుంతలాపోషకుడైన కణ్వుడిట్లనుచున్నాడు. "పరస్పర కామముతో కూడిన స్త్రీపురుషుల వివాహము నిర్మంత్రమై శ్రేష్ఠమని చెప్పబడుచున్నది. సకామాయాః సకామేన నిర్మంత్రః శ్రేష్ఠ ఉచ్యతే." అన్ని వర్ణములకు గాంధర్వమును చెప్పెను నారదుడు. బ్రాహ్మము (ధర్మశాస్త్రాను సారముగ) ఉత్తమ వివాహమనియు, తన మత ప్రకారముగా గాంధర్వము గొప్పదనియు కామ సూత్రకర్త వచించెను. బ్రాహ్మణులకు మినహా అన్ని వర్ణములకు గాంధర్వమును మాధవుడంగీకరించెను. గాంధర్వము క్షత్రియ కుటుంబములలో ప్రచురముగా నున్నదని శాకుంతలమున కాళిదాసు--

"గాంధర్వేణ వివాహేన బహ్వ్యో రాజర్షికన్యకాః
శ్రూయంతే పరిణీతాస్తాః పితృ భిశ్చాభినందితాః"

పూర్వగ్రంథములందు కనబడు స్వయంవరము గాంధర్వమే. ఈ స్వయంవరము పెక్కు విధములు. కన్య రజస్వలయైన తర్వాత కూడ తండ్రి మంచి వరుని ఈమెకై చూడకపోయినచో (3 సంవత్సరముల వరకు) ఆమెయే భర్తకై వెదుకు కొనవచ్చును. (వసి.ధ.సూ.) తండ్రికాని, పోషకుడు గాని లేనిదైనచో అట్టికన్య స్వయముగా వరింపవచ్చునని యాజ్ఞ. (1.64) రామాయణ భారతములందు-స్వయంవరములు విస్తృతములు, క్షత్రియులు స్వయంవరమును మెచ్చుకొందురనియు, బంధువులను నిర్జించి, గ్రహించిన కన్యా వివాహముపట్ల మోజుచూపుదురని ఆది పర్వమున కలదు.

నలదమయంతుల కథ, ఇందుమతీస్వయంవరము మొ॥నవి కోకొల్లలుగా లభించును. ఇది బ్రాహ్మణులకు పనికిరాదని ఆదిపర్వమున కలదు.

తపతి అను స్త్రీని సంవరుణుడు అను రాజు కోరగా "నేను తండ్రి కలదానను, స్వతంత్రము నాకు లేదు. నా తండ్రినడుగుము" అని యన్నది.

గాంధర్వ ఆసురములకు సమముగ ఉత్తమలోక ఫలమును ఆదిత్య పురాణము చెప్పినది. "గాంధర్వవిధిచే కన్యకనిచ్చువాడు గంధర్వలోకమున

పూజింపబడును. ఇక శుల్కము పుచ్చుకొనియైనను తగిన వరునికి కన్యనిచ్చెనేని యితడును కిన్నరులచేత స్తుతింపబడును. గంధర్వ లోకమును పొందును."

కాని చాలమంది స్మృతికారులీ విషయమై ప్రోత్సాహమిచ్చినట్లు కానరాదు. ధార్మికమైన నైతికమైన ఆధారముల ప్రకారమిది అప్రశస్త ముగా భావించిరి. "గాంధర్వస్తు క్రియాహీనః రాగా దేవ ప్రవర్తతే" (వీర మిత్రోదయము). ఇది కాముకతయే కారణముగా కలిగినదగుటచే సమాజమున దీనికి ఉన్నతస్థానమీయలేదు. ఆస్తులపై స్వామిత్వమును గూర్చి, సంతానముయొక్క స్వామిత్వమును గూర్చి అనేకమగు చిక్కులేర్ప డుటచే వర్ణవ్యవస్థయొక్క కట్టుబాట్లు కూడ తీవ్రముగా నుండుటచే ఇది క్రమక్రమముగా సన్నగిల్లినదని చెప్పవచ్చునేమో!.

ఇది సుఖహేతువు, వరణ విధానమందు వక్రమార్గములు లేనిది, అనురాగము పరిపూర్ణముగా నున్నది ఇదియేయని కామ సూత్రకర్త నిష్కర్ష మాత్రము చేసినాడు.

"సుఖత్వాద బహుక్లేశాదపి చావరణాదిహ
అనురాగాత్మక త్వాచ్చ గాంధర్వః ప్రవరోమతః"

శ్రోత్రియులగు పెద్దల ఇండ్లనుండి అగ్నిని తెప్పించి పాణి గ్రహణము చేయవలెనని వ్రాసినాడు.

**ఆసురము:**

గాంధర్వము కన్న ది ఆసురము. ఈ వివాహమున వరుడు కన్యకు, ఆమె సంబంధులకు యథాశక్తి ధనమిచ్చి వివాహమాడునని మనువు.

"జ్ఞాతిభ్యో ద్రవిణం దత్వా కన్యాయై చైవ శక్తితః
కన్యాప్రదానం స్వచ్ఛంద్యా దాసురో ధర్మ ఉచ్యతే."

ఇందు కొంతవరకు ధనమునకు ప్రాధాన్యము కలదు. కొంతమంది ధర్మశాస్త్రకారులీ వివాహమునే మానుషమనిరి. ఇట్టి వివాహముల ప్రస్తావన

ఋగ్వేదమున కలదు. ధనలోభముచే వశీభూతులై అప్పుడపుడు కేవలము డబ్బు కల వ్యక్తులకు కన్యలను విక్రయించుట కలదు.

పూర్వము కన్యను కొని వివాహము చేసికొనుట దోష యుక్తముగా భావించెడివారుకారు. కాలక్రమమున నిది హీనముగా చూడబడినది. కొంత మంది కురురాజకుమారులకు ఈ పద్ధతి ననుసరించి భీష్ముడు వివాహము చేయించినటుల మహాభారతమున కలదు.

స్మృతికారులీ వివాహమును ప్రశంసింపలేదు. "కన్యయొక్క తండ్రి అణు మాత్రమైనను శుల్కమును గ్రహింపరాదు. లోభమువలన గ్రహించిన పిల్లను అమ్ముచున్నవాడగుచున్నాడని మనుస్మృతి. శూద్రుడు కూడ కన్యా దాన సమయమున ధనమును స్వీకరింపరాదని ఆపస్తంబుడు. అంతటితో ఆగలేదు. కొందరిట్లనుచున్నారు." 'ధనముకొరకు అమ్మబడిన కన్య, పత్నీస్థానము నలంకరింపలేదు. దైవ పితృ కర్మలకు యోగ్యురాలు కాదు. ఆమె దాసితో సమానమని బోధాయనుడు.'

"క్రీతా ద్రవ్యేణ యా నారీ న సా పత్నీ విధీయతే
న సా దైవేన సా పిత్ర్యే, దాసీం తాం కవయో విదుః."

అమ్మినవాడు ఘోర నరకమున బడి ఏడుతరముల ముందు, ఏడు తరముల వెనుక చేసిన పుణ్యమును పోగొట్టుకొన్నవాడగునని అందే కలదు.

ఇది పూర్వము, ఉత్తర-పశ్చిమ భారతదేశములో నుండెడిదని గ్రీకు చరిత్రకారుల వ్రాతలనుబట్టి తేలుచున్నది.

ఇందులకు భిన్నముగా నేడు కన్యనుండి వరుడు ధనమును స్వీకరించు చున్నారు. ప్రాచీనహిందూసాహిత్య మీ పద్ధతిని సమర్థింపకపోయినను, ఎక్కువగా దీని ప్రస్తావన చేయకపోయినను ఎడనెడ కాన్పించును. ఋగ్వే దమును బట్టి (10.23.11) తెలియుచున్నదేమనగా ఒక కన్యావివాహమున శారీరక దోషము సంభవించుట బట్టి ఆమె సంరక్షకులకు, వరునకు ధన మిచ్చినట్లు కలదు. వివాహమున ఒక ఋక్కు నందు కన్యను సాగనం

పునపుడు వారిచ్చు ద్రవ్యమును గూర్చి ప్రస్తావన కలదు. (ఋ.10.75) ఐతరేయమున ధనముపై ఆధారపడిన వివాహములను పశు వివాహములని కలదు. వరుని నుండి కన్యయా? లేక కన్యనుండి వరుడు గ్రహించిన సొమ్మునా యను విషయము స్పష్టముగా పేర్కొనబడలేదు. కట్నమిచ్చు టలో తండ్రి తనకు గల ఆస్తిలో కొంత భాగమును కన్యకు పంచునటుల తోచును. అలంకరించిన కన్యను దానము చేయుట దోషావహము కాదు కాని ఇది స్వచ్ఛందముగా, ప్రేమ పూర్వకముగా కాక, తప్పనిసరి యగుటచే దురాచారముగా పరిణమించుచున్నది. ఇది మన ప్రక్కనున్న ఇతరమతస్థులకు కూడ ప్రాకినది.

"ఏతద్దేశ ప్రసూతస్య సకాశాద గ్రజన్మనః
స్వంస్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వ మానవాః" -- మను

అనగా సమస్త ప్రజలు భారతదేశ అగ్రజన్ముల వలన విషయములను తెలిసికొని తమతమ జీవితములను తీర్చి దిద్దుకొందురుగాక, అను మాట గాలిలో నెగిరిపోయెను కదా!

### 5. ప్రాజాపత్యము:

ఆసురముకంటె ప్రాజాపత్యము శ్రేష్ఠము. కన్యయొక్క తండ్రి యోగ్యమైన వరుని చూచి ఉభయులు ధార్మిక కృత్యములలో ఒకరిని వెంబడించి యొకరు ఉందురు గాక అను నభిప్రాయముతో తన పిల్ల నిచ్చును. (యాజ్ఞ.) పిల్లతండ్రి వరుని ప్రార్థనా పూర్వకముగా తన పిల్లను పరిగ్రహించవలసినదిగా అడుగును. ఆశ్వలాయనుని మాటలలో 'మీరిద్దరు ధర్మమును ఒకరి ననుసరించి యొకరు పాలింపుడు' అను నాదేశముందును. కనుక ఇది ప్రాజాపత్యమైనది. "సహ ధర్మం చరత ఇతి ప్రాజాపత్యః" అట్లే గౌతమమనువులు.

"సంయోగ మంత్రః ప్రాజాపత్యే సహధర్మం చర్యతామితి"
"సహోభౌ చరతాం ధర్మమితి వాచాను భాష్య చ
కన్యా ప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః"

ప్రజాపతివలె సంతానమును గని పితృఋణమును పోగొట్టుకొని ధర్మమార్గ ప్రవర్తకులై యుండవలెనని ఇది సూచించుచున్నది. దేవలుని అనుసరించి ఇది సమయ బంధనముపై (Agreement) ఆధారపడియున్నది.

"సహధర్మ క్రియాహేతోర్దానం సమయ బంధనాత్
అలంకృత్యై కన్యాయా వివాహః సప్రజాపతేః" -- వీర.మి.

యాజ్ఞ దీనిని కాయ అనెను. కాయనగా ప్రజాపతియని బ్రాహ్మణములందు కలదు.

అన్ని రకములైన వివాహములందు భార్యాభర్తలిద్దరు కలిసి అన్ని కార్యములను చేయవలెనని ఆప.ధ.సూ. కాని ప్రాజాపత్యమున ఇంకను విశేషము కలదు. ఇందు భర్త యావజ్జీవితము గృహస్థుడుగానే యుండవలెను. భార్య బ్రతికి యుండగా సన్న్యాసి కారాదు. అట్లే మరియొక స్త్రీని వివాహమాడరాదు. ఇది కేవలము ఏకపత్నీ వ్రతమునకు చెందినది అని సంస్కార కౌస్తుభమునందు కలదు. యజ్ఞములందేకాక దానమునందు, చెరువులు త్రవ్వించుట మొదలగు ఇష్టాపూర్తములందు కూడ కలిసి యుండుట విశేషము. ఇది బ్రాహ్మముకన్న తక్కువ. ప్రాజాపత్యమునందు గల ప్రత్యేకమైన ఒడంబడిక బ్రాహ్మము నందు లేకపోయినను 'ధర్మార్థ కామములందు కలిసియే యుందునన్న నియమ మందు' కూడ కలదు. "ఏవం హి స్మరంతి, ధర్మేచార్థేచ కామేచ నాతిచరి తవ్యేతి" అని శబరస్వామి, జైమిని; పై.

ప్రాజాపత్యము శూద్రులకు కూడ ముఖ్యము. ఆసురము కూడ వారికి విధింపబడినది. బ్రాహ్మము, దైవము తప్ప తక్కినవి మూడు వర్ణములకు సమానమే యని కల్పతరు వచనము. బ్రాహ్మదైవములు విశేషించి బ్రాహ్మణునకు విహితములని అందే కలదు. "బ్రాహ్మణానాం సతామేషధర్మః"

6. ఆర్షము:

ప్రాజాపత్యముకన్న ఇది శ్రేష్ఠమైనది. దీనిననుసరించి కన్యయొక్క తండ్రి వరుని నుండి యజ్ఞాది ధర్మవిహిత కార్యములందు ఒకటి లేక రెండు గోమిధునములను గ్రహించి వివాహము చేయును.

"ఏకం గోమిధునం ద్వే వా వరాదాదాయ ధర్మతః
కన్యా ప్రదానం విధివదార్షో ధర్మః స ఉచ్యతే." -- మను.

అట్లే ఆశ్వ. బౌధ. ఆప.లు అనిరి. దీనిని కట్నముగా భావింపరాదు. గోమిధునమును స్వీకరించుటలో ఉద్దేశ్యమేమనగా కేవలము యజ్ఞ కార్య నిమిత్తమే ఆ దానముపయోగింపబడవలెను. ఈ రీత్యా చూచిన ఆసురము కన్న ఇది భిన్నమగుచున్నది. 'ఇది శుల్కము గాదు. విక్రయము కూడ కాదు. ఇది కేవలము అర్హణ మాత్రమే.' అని మనువు వ్రాక్రుచ్చినాడు.

"యాసాం వాదదతే శుల్కం [illegible]శయో వ స విక్రయః
అర్హణం తత్ కుమారీణామ[illegible]ం చ కేవలమ్."

ఇది ధర్మనిమిత్తమైనదే కాని [illegible]ము కాదని వీరమిత్రోదయమున కలదు. "ధర్మ నిమిత్తో[illegible] న లోభనిమిత్తకః."

ఈ వివాహము ఋషి పరంప[illegible]వారికి బ్రహ్మాణ కులమునందీ వివాహము జరుగుచుండెడిదని ఈ [illegible]మును బట్టి గ్రహింపవచ్చును. కాని డా॥ అవినాశచంద్రదాస్ కృత 'ఋగ్వేదిక్ కల్చర్' అను గ్రంథమున ఆధ్యాత్మిక మహత్త్వమును బట్టి ఒకానొక ఋషికి ఒక కన్యనిచ్చు వివాహము ఆర్షమై యుండునని కలదు. కాని ఈ వ్యాఖ్యయందు గోమిథునమును తీసికొనుట -- దాని యుత్పత్తి వివరింపబడలేదు. యజ్ఞములు క్రమక్రమముగా తగ్గుటను బట్టి ఈ పద్ధతియు క్రమక్రమముగా తగ్గినదనవచ్చును. కాలము గడచిన కొలది గోమిథునమును గ్రహించుటయే మిగిలినది. మనుస్మృతి యందీ ధ్వని లేకపోలేదు. కొందరిట్లనుచున్నారు. ఆర్ష వివాహమున గోమిథునమును స్వీకరించుచున్నారు. కాని అనుచితము. గ్రహించినది అల్పమైనను, అధికమైనను విక్రయమేయగు చున్నది.

"ఆర్షే గోమిథునం శుల్కం కేచిదాహుర్మృ థైవ తత్
అల్పోఽప్యేవం మహాన్ వాఽపి విక్రయస్తావదేవ సః"

7. దైవము:

ఆర్షము కన్న ప్రశస్తతరమైనది దైవము. "ఇందు అలంకృతమైన కన్యను యజ్ఞమునందు ఋత్విక్కుగా నున్న వరునికిచ్చును."

"ఋత్విజే వితతే కర్మణి దద్యాదలం కృత్య పదైవః" -- ఆ.గృ.

కన్య యజ్ఞ సందర్భమున దక్షిణగా నీయబడుచున్నదని బోధాయనుడు. "దక్షిణాసు దీయమానా స్వంతర్వేది యదృత్విజే స దైవః" యజ్ఞము నందీయబడిన దక్షిణదైవమగుచున్నది. మేధాతిథి మనువుపై వ్రాయుచు దక్షిణలో ఒక భాగముగ కన్యనీయబడుటను విమర్శించెను. అట్లే విశ్వరూపుడు కూడ. అపరార్కుడు మాత్రము వారికి భిన్నముగా చెప్పి దక్షిణగా నిచ్చుటను సమర్థించెను.

వివాహమున కన్యాదానము సేవానిమిత్తమై యున్నటుల కూడ వైదికసాహిత్యమున అనేకోదాహరణలు లభ్యమగును. యజ్ఞమునందు సేవానిమిత్తమై పురోహితులు వారి సంరక్షకులైన మహారాజుల నుండి కూడ సుందరమైన కన్యలను పరిగ్రహించుచుండెడివారని, వారిని వధువు అనెడి శబ్దముతో వ్యవహరించెడి వారనితోచును. యజ్ఞ సమయమున పురోహితునకు తమ కూతుండ్రనిచ్చుట పుణ్యముగా భావించిరి. యజ్ఞాదులు క్రమక్రమముగా లోపించుటచే ఈ పద్ధతికి స్వస్తి చెప్పిరి. ఆపైన దైవము బ్రాహ్మణులకే చెందును. కారణమేమనగా బ్రాహ్మణుడే ఋత్విక్కుగా నుండును కనుక. "దేవా ఋత్వి జస్తే ఏనమర్హం తీతిదైవః" అని విశ్వరూపుడు.

8. బ్రాహ్మము:

బ్రాహ్మమనగా వేద సంబంధమైనది. బ్రాహ్మమనగా ధర్మము. ఇది ధార్మికమైనది, ఉత్తమమైనది. (స్మృతిముక్తా ఫలము). వివాహము

సర్వాధికముగా వికసితమైనది బ్రాహ్మము నందే. బ్రాహ్మణులకు యోగ్యమైనది యను భావనచే బ్రాహ్మమని చెప్పవచ్చును. ఇందు పిల్లతండ్రి, శీలసంపన్నుడైన, విద్వాంసుడైన వరుని స్వయముగా పిలిచి, విధి పూర్వకముగా సత్కరించి, అతని నుండియేమియు శుల్కమును గ్రహింపక, సాలంకృతమైన కన్యను దానము చేయును.

"ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతి శీలవతే స్వయమ్
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మధర్మః ప్రకీర్తితః" -- మనువు.

స్మృతులీ వివాహమును ప్రశంసించినవి. ఇది అనాది సిద్ధము. ఋగ్వేదమున వర్ణింపబడిన సూర్య సోముల వివాహము బ్రాహ్మ వివాహమని చెప్పవచ్చును. ఈ వివాహ పద్ధతి నేటికి అనుసరింపబడుచున్నను ఇందు కట్నము చోటు చేసికొన్నది.

బ్రాహ్మ, ప్రాజాపత్య, ఆర్ష, దైవములందు 'కన్యాదానము' కలదు. పోషణ బాధ్యత తండ్రి నుంచి భర్తకు చెందునన్న అర్థములో ఇది ప్రయుక్తము. అమ్మట పుచ్చుకొనుట అను నర్థమందుగాక ఇచ్చుట ధర్మముగా భావింపబడినది. అన్ని దానములు ఉదకపూర్వకముగనే (బ్రాహ్మణుల విషయమై) జరుగవలెనని మనువు.

మహాభారతమునందు స్వయంవరమైన వెనుక వైవాహిక క్రియాకలాపము జరుపవలెనని స్పష్టముగా కలదు. రఘువంశమునందు ఇందుమతీ స్వయంవరము వెనుక హోమాదులు కలవు. ఆశ్వలాయనమున అన్ని వివాహము లందు హోమము, సప్తపది, జరుగవలెనని కలదు.

స్మృతికారులు బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యములు ప్రశస్తములని, ధర్మ్యములని పేర్కొనిరి. ఇందు పూర్వపూర్వములు ప్రశస్తములనిరి. పైశాచము సర్వవిధముల కూడనిది. పై నాలుగు బ్రాహ్మణులకుపయోగ్యములని మనువు. రాక్షస, పైశాచములు మినహాయించి మిగిలిన ఆరును బ్రాహ్మణులకు విహితమని మరియొక అభిప్రాయము. చివరి నాలుగును క్షత్రియులకు, గాంధర్వ, ఆసుర పైశాచములు వైశ్యునకు, శూద్రులకు కూడునని మనువు. పైశాచము, ఆసురము ఎవరికి కూడవని మరియొక అభిప్రాయము.

కాఠక.గృ.సూ. శుల్క విషయమై బంగారమును పేర్కొన్నది. ఇతిహాస పురాణములలో పేర్కొన్న స్వయంవర పద్ధతి సూత్రములందు లేదు.

దురదృష్టవశాత్తు ఒక కన్య బలాత్కరింపబడి చెరుపబడినచో కొన్ని ప్రాయశ్చిత్తములచే సంస్కృతమైనచో ఆమె పరిశుద్ధురాలగుననియు, భార్యా భర్తల సంబంధము ధర్మబద్ధమైనది కాని, బలాత్కారముచేసి, మోసముచే ఏర్పడునట్టిది కాదని ఆపస్తంబుని వచనము. "చరితే యథాపురం ధర్మాదధి సంభవః" దీనిని బట్టి మన పెద్దలు ఎంత ఉదారముగా సూత్రీకరించిరో గమనింపుడు.

వివాహమున కనుగుణమగు సంతానము కలుగునని ఆప.ధ.సూ.న కలదు. ప్రశస్త వివాహమునుండి ప్రశస్త సంతానము, నీచ వివాహము నుండి నీచ సంతానము కలుగునట. "యథాయుక్తో వీవాహస్తథాయుక్తా ప్రజాభవతి." (మనువు). బ్రహ్మ మొదలగు నాలుగింటి యందును వివాహమైనవారికి, ఆధ్యాత్మిక సంపత్తి, కీర్తి, దీర్ఘాయుర్దాయము, ధనము, కీర్తి కలిగిన సంతానమును, మిగిలిన వివాహముల వలన క్రూరులు, వేద నిందకులు, అధార్మికులు, అసత్యపరులగు సంతానము కలుగుదు రనెను. పై నాలుగు వివాహముల వలన కలిగిన సంతానము ఎన్నెన్ని తరములను తరింపచేయునో కూడ మను, యాజ్ఞలందు కలవు. పై తరములను తరింపచేయుటను ప్రత్యక్షరముగా (literally) స్వీకరింపనవసరము లేదని అవి బ్రాహ్మ వివాహమై పుట్టిన స్తుతి వచనములని వ్యాఖ్యానకర్తలు వ్రాసిరి. మహర్షులంత గట్టిగా చెప్పుటకు కారణము, సంఘమును ధర్మ యుతముగా పటిష్ఠముగా చేయవలెనను తలంపే.

మనువుననుసరించి కేవలము కన్యకే (అవివాహిత) వివాహమునందు కర్మకాండకావలెను. కాని మనువువెనుకగల స్మృతికర్తలు, యువతీ యువకుల సహవాసము వెనుకగూడ, వైవాహిక విధుల ఆవశ్యకతను గుర్తించిరి. ఈ విషయమై వెనుక కొంత ప్రస్తావించితిని. విధి పూర్వకముగా వివాహము కానివారికి కలిగిన సంతానము అపయశస్సును కలిగించి నిందా కారణమగును. మాధవాచార్యు డిట్లనుచున్నాడు. "గాంధర్వ ప్రభృతి వివా

హము లందు సప్తపది మొదలైన వైవాహిక క్రియలు లేకపోవుటచే పతి పత్నీ సంబంధము స్థాపింపబడుటలేదు." స్వీకరించుటకు పూర్వము ఈ క్రియాకలాపము లేనిచో తరువాతనైన అనివార్యముగా భావించి జరుపుకొనవలెను. దీనివలన హిందూజీవనవిధానమును ధార్మికభావన ఎంత ఉచ్చదశలో నున్నదో, పవిత్రభావమెట్లు మిళితమైయున్నదో తెలిసికొనవచ్చును.

## వివాహము - హద్దులు

వివాహమునకు సంబంధించి వధూవరులకు, వారికి సంబంధించిన వారినెన్నుకొనుటలో అనేక ప్రశ్నలుదయించును. ఎవరిని వివాహమాడవచ్చును. ఎవరిని వివాహమాడ రాదను పెక్కు శంకలుదయించును.

## సగోత్ర - సపిండ - సప్రవర నిషేధము:

సమాన గోత్రమైనను ప్రవర భిన్నముగా నుండవచ్చును. సమాన ప్రవరయైనను గోత్రము భిన్నముకావచ్చును. హిర.గృ.గో.భి, ఆప.ధ.సూ. లందు సగోత్ర వివాహము నిషిద్ధమనిరి. ప్రవర విషయమెత్తుకొనలేదు. గౌత, వసి, ధ.సూ., మానవ, వారాహములు సప్రవరమని నిషేధించినవి. సగోత్రము నెత్తుకొనలేదు. ఆశ్వ.పార. లందు సగోత్రము గురించికాని, ప్రవరకూర్చి కాని ప్రస్తావన లేదు. విష్ణు.ధ.సూ. వైఖ. యాజ్ఞ, నారద, వేద వ్యాసాదులు, సగోత్రమును, సప్రవరను నిషేధించిరి. గోభిల, మను, వైఖ, ఆప.ధ.సూ.లందు వరుని యొక్క తల్లికి కన్య సపిండురాలుగా నుండరాదనిరి. గౌతమ, వసిష్ఠ, విష్ణు, ధ.సూ. వారహ, శంఖ.ధ.సూ. యాజ్ఞ మొదలగువారు తండ్రి తరపున 7 తల్లి తరపున 5 తరముల వరకు సపిండురాలైన కన్యను చేసికొనరాదనిరి. పిల్లయొక్క గోత్రముతోనే కాక పిల్ల తల్లియొక్క గోత్రము వరుని గోత్రముతో సమానమైనను కూడదని వేదవ్యాసస్మృతి నిషేధించినది.

కన్య రోగగ్రస్తురాలైన ఆమెతో వివాహము అసౌఖ్య దాయకము. ఇది దృష్టము. సగోత్రము, సాపిండ్యము అదృష్టము. దృష్టప్రయోజనము కలిగినది. అసౌఖ్యదాయకమైనను వివాహముగా చెల్లుబడియగును. కాని

అదృష్ట ఫలకమగు సగోత్రవివాహము వివాహ మనిపించుకొనదని పూర్వ మీమాంసయందు విస్తృతముగా చర్చించిరి.

మరియొక గమనిక. ఒక సూత్రకర్త ఒక్క ప్రవరనే ఎత్తుకొనుట, మరియొక సూత్రకర్త గోత్రమునే ఎత్తుకొనుటను అపార్థము చేసికొనరాదు. ప్రవరనెత్తుకొన్నవానికి సగోత్ర వివాహము పనికి వచ్చునని భావింపరాదు. గోత్ర, ప్రవర, సపిండాదులను గూర్చి నిబంధన గ్రంథములందు విపుల ప్రస్తావన కలదు. లేదా హిందూవివాహ విశిష్టత అను గ్రంథమును పరికింపుడు.

సగోత్రములోకాక భిన్న గోత్రములోని కన్యను వివాహమాడుట ఒక్క భారతదేశములోనే కాక విభిన్న జాతులందు కూడ కలదు. కాని మనకున్న గోత్ర వ్యవస్థ వారికి లేకపోయినను ఒక్కొక్క సముదాయమునుండి మరియొక సముదాయము పృథక్కరింపబడి యుండును. స్మృతులు సగోత్ర వివాహమును తప్పని ఘోషించినవి. అసగోత్ర వివాహమును సమర్థించినవి.

"అసపిండా చ యా మాతురసగోత్రా చ యా పితుః
సా ప్రశస్తా ద్విజాతీనాం దారకర్మణి మైథునే." (మను.)

సగోత్ర కన్యను వివాహమాడినచో ఆ కన్యను త్యజించి చాంద్రాయణ వ్రతము చేయవలెనని చెప్పినవి.

"పరిణీయ సగోత్రాం తు సమానప్రవరాం తథా
త్యాగం కుర్యాత్ ద్విజస్తస్యాస్తతశ్చాంద్రాయణం చరేత్."
(గధాధరుడు పేర్కొనినది.)

ఇంకను పెక్కు కఠోర దండనలు స్మృతులందు కలవు.

సాపిండ్యమును గూర్చి పెద్ద చర్చ కలదు. స్థలాభావముచే విరమించు చున్నాను. కాని దగ్గర బంధువైన మేనమామ కూతురిని వివాహమాడుటను సర్వ స్మృతులు నిషేధించినను కొందరు వ్యవస్థిత వికల్పముగా పరిగణించి దేశాచారమును పరిగణించి చేసికొనవచ్చునని తెల్పిరి. విద్యారణ్యులు గట్టిగా సమర్థించిరి.

## సవర్ణ వివాహము:

అసగోత్ర వివాహ మెంత నియమబద్ధమైనదో సవర్ణ వివాహము కూడనంతే. అన్ని స్మృతులీ విషయమున ఏకకంఠముతో ఉద్ఘోషించినవి. ద్విజుడు తన వర్ణములో నున్న కన్యనే వివాహమాడవలెనని వ్రాసినవి. "ఉద్వహేత్ ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితామ్" (మనువు) పూర్వ యుగములందీ పట్టింపు తీవ్రముగా లేకపోయినను అనంతర కాలమున బహునియమములతో కూడియున్నది.

## అనులోమ వివాహము:

వైదికసాహిత్యమున అనులోమవివాహమును గూర్చి చాలచోట్ల క . పురోహితవర్గమునకు చెందిన పురుషులకు రాజవంశపు కన్యల నిచ్చుట ఉండెడిది. ఇది చ్యవన, శ్యావాశ్వ, విమదవృత్తాంతములను బట్టి తెలియును. ఇందులకు భిన్నముగా కూడ కలదు. క్షత్రియుడైన స్వనయ భావయవ్యుని ప్రియపత్ని అంగిరస సంబంధమైన బ్రాహ్మణ కన్యయేయని యందురు. అథర్వవేదమున బ్రాహ్మణునకు సర్వ వర్ణములవారి కన్యలను పరిగ్రహించు గౌరవమీయబడినది. అట్లే ప్రతిలోమ వివాహములు కూడ లేకపోలేదు.

## అంతర్వర్ణ వివాహము (వర్ణాంతర వివాహము):

వర్ణాంతర వివాహమెట్లు సంఘమున ప్రవేశించినదో, ఏ విధముగ ప్రోత్సాహము లభింపలేదో తెలిసికొందుము. ధర్మశాస్త్రకారులు అనులోమ వివాహము నంగీకరించిరి. సమాజము కూడ దానిని స్వీకరించినది. బ్రాహ్మణుడు మూడు వర్ణములలోని కన్యలను, క్షత్రియుడిద్దరిని, వైశ్యుడు సమాన వర్ణములోనున్న స్త్రీని వివాహమాడవచ్చును. కొందరి మతప్రకారము పై వర్ణముల వారు శూద్ర స్త్రీని అమంత్రకముగా స్వీకరింపవచ్చునని పరాశరుడు. ద్విజాతులకు సమాన వర్ణముతోనున్న స్త్రీతో వివాహము ప్రశస్తము. కాని కాముకతచే పీడింపబడినవాడు నిమ్నతర (అవర) వర్ణములకు చెందిన కన్యలను వివాహమాడవచ్చునని మనుస్మృతి.

నిమ్న వర్ణమునకు చెందినవాడు ఉచ్ఛ వర్ణమునకు చెందిన స్త్రీని వివాహమాడుటను ధర్మశాస్త్రములంగీకరింపలేదు. కాని సమాజములో అన్ని పద్ధతులున్నట్లు తోచును. ప్రతిలోమ అనులోమ వివాహములు లేనిచో నాల్గు వర్ణములు అష్టాదశ వర్ణములుగా పరిణమింపవుకదా! విభిన్న వర్ణముల వారితో వివాహమాడినపుడు మృతాశౌచమెట్లు పాటించవలెనను విషయమై ధర్మశాస్త్రములందు కలదు. అందువలన పరోక్షముగా ఈ వ్యవస్థయొక్క అస్తిత్వమును సూచించినట్లే యగుచున్నది. సంపత్తిని విభజించుటలో విభిన్న వర్ణముల స్త్రీలకు కలిగినసంతానము వారి వారి భాగములను పంచుకొనుట ధర్మ శాస్త్రములందు కలవు.

చాలకాలము వర్ణాంతర వివాహములు జరిగినట్లు తోచును. మహాకవి బాణునికి, ఇద్దరు అన్యవనితలనుడి పుట్టిన సోదరులుండెడివారు. అందొకడు శూద్రస్త్రీయందు పుట్టినవాడు. రాజశేఖరునిభార్య అవంతిసుందరి క్షత్రియ కన్యయే. కల్హణుడు వ్రాసిన రాజతరంగిణిలోను, కథాసరిత్సాగరమున ఈ వివాహములు జరిగినట్లు కలదు. అనంగమతి యొక్క స్వయంవరమున "రాజకుమారి బ్రాహ్మణ కుమారుల యొక్క వివాహము విద్యావినయ సంగమమువలె నుండు" నని ఆ గ్రంథకర్త వ్రాసెను.

"తయోస్తు సోఽభూద్రాజేంద్ర పుత్రీ విప్రేంద్ర పుత్రయోః
సంగమోఽన్యోన్య శోభాయై విద్యా వినయ యోరివ"

ఇట్లెన్నియో దృష్టాంతములు కలవు. పురాణములందు కలివర్జ్య సూచిలో వర్ణాంతర వివాహము చేర్పబడలేదని రాజబలిపాండే ప్రభృతులు వ్రాసిరి. కాని ఆదిత్య పురాణములో నిషేధించినట్లు కలదు. దీనిని నిబంధన గ్రంథములు నిషేధించినవి. కలియుగములో విడువదగిన వానిలో బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులకు తమకంటె ఇతర వర్ణపు స్త్రీతో వివాహము పనికి రాదని బృహన్నారదీయ వచనమునుదాహరించినవి. "ద్విజానామ సవర్ణాసు కన్యా సూపయమస్తథా" మన్వాది స్మృతులలో పేర్కొనబడినవి మిగిలిన యుగములకు సంబంధించినవిగా గ్రహింపవలెను. అనులోమములను గుర్చి పెక్కు ఉదాహరణలు పేర్కొనవచ్చునుగాని ప్రతిలోమములు ఎక్కడోగాని

లేవు. శూద్రస్త్రీని వివాహమాడుటను పెక్కు స్మృతులు నిందించినవి. ఇంతకు ముందు పేర్కొన్నట్లు మనువు వర్ణాంతర వివాహములు కామ సంభవములనెను. వర్ణాంతర వివాహము వలన పుట్టిన సంతానమునకు కాలక్రమమున సమాజమున నిమ్నస్థానమీయబడినది. వర్ణగతమైన ఉచ్చత - నీచత, వర్ణ సాంకర్యముపై అనాదర భావము మొ॥ అనేక కారణములచే వర్ణాంతర వివాహములకు కాలక్రమమున ప్రోత్సాహము లభింపలేదు.

కుల లేక వంశపరీక్ష:

లోకమందు కులమనగా బ్రాహ్మణాది వర్ణార్థమున వాడుచున్నారు. ఇక్కడ కులమనగా వంశము. వధూవరుల బంధు వర్గము విశిష్ట వంశమునకు చెందినదా? కాదా యను మీమాంస అనాది నుండి యున్నట్లు తోచును. "మొట్ట మొదట తల్లిదండ్రుల వంశపరీక్ష చేయవలెనని ఆశ్వ లాయనుడు." "కులమగ్రే పరీక్షేత మాతృతః పితృ తశ్చేతి" ఉత్తమ కులమునకు చెందిన వారితో సంబంధ బాంధవ్యములుండవలెనని, అధమ కులముతో సర్వదా సంబంధము త్యాజ్యమని మనువు.

కాలక్రమమున బ్రాహ్మణులలో కులమును గూర్చి ఎక్కువ పట్టుదల ప్రబలినది. కులము ముందు, విద్య వెనుకయైనది. "బ్రాహ్మణులు కేవలము కులమునే పరిగణనకు తీసికొనవలెను. వేదము, విద్య లేకపోయినను సరియే! కన్యాదానమున, శ్రాద్ధమునందు విద్వత్తకు, జ్ఞానమునకు ప్రముఖ స్థానములేదని విష్ణు. ధ.సూ.లందు కలదు."

"బ్రాహ్మణస్య కులం గ్రహ్యం నవేదాః నపదక్రమాః
కన్యాదానే తథా శ్రాద్ధే న విద్యా తత్ర కారణమ్"

యాజ్ఞవల్క్యుడు కులీనతనిట్లు వ్యాఖ్యానించెను. 'పది తరములనుండి శ్రోత్రియులుగా నుండుట శ్రేష్ఠమగుచున్నది.' "దశపూరుష విఖ్యాతాచ్ఛ్రోత్రియాణాం మహాకులాత్." దీనిపై తల్లివైపు ఐదుతరములనుండి తండ్రివైపు ఐదు తరములనుండి విద్యా చరిత్రలలో మిన్నలై యున్న కులము శ్రేష్ఠమైనదని విజ్ఞానేశ్వర వ్యాఖ్య.

శ్రుతి, స్మృతి విహితమైన కర్మలను చేయుటలో విఖ్యాతులైనవారు, ఉత్తమ కులోత్పన్నులు, అవిచ్ఛిన్నముగా బ్రహ్మచర్య పాలన చేయువారు, స్వయముగా ఉత్తమ కులముల వారితో సంబంధ బాంధవ్యములు కలిగిన వారు, సంతుష్టులు, నమ్రులు, కర్తవ్యా కర్తవ్యములను తెలిసినవారు, క్రోధ, లోభ, ఈర్ష్య మోహాభిమానముల నుండి దూరులైనవారు, శాంతమనస్కులు మొ॥ వారు ఉత్తమ కులమునకు చెందినవారని మనుస్మృతి.

నైతిక, భౌతిక కారణములచే అనేక వంశములు నిషేధింపబడినవి. మనుస్మృతి యందిట్లు కలదు. "వివాహ సంబంధమున దిగువ చెప్పబడిన దశవిధకులములు ఐశ్వర్య సంపన్నములైనను విడువదగినవి. ఉత్తమ క్రియలను చేయని వంశము, పురుష సంతతి లేనిది, వేద శాస్త్ర పఠనము లేనిది, శరీరముపై పొడుగు, దట్టముగా వెంట్రుకలున్న వంశము, అర్శ, క్షయ, మందాగ్ని, మృగీ, శ్వేత, కుష్ఠ, రోగ గ్రస్తులుకల వంశములు త్యాజ్యములు." వంశపారంపర్యముగా వచ్చు వ్యాధులు కలిగిన వంశము కూడ విడువదగినదే. మమస్మృతి పైవానిని పేర్కొనుచు ఇంకను నాల్గు వంశములను కూడ చేర్చినది. చాల పొడుగు, చాల పొట్టి, వెట్టి తెలుపు, వెట్టి నలుపు, వికలాంగము కాని అధికాంగము కాని యుండుట, పాండువు మొ॥ రోగములతో కూడిన వంశములు త్యజింపదగినవి.

నైతిక దృష్టితో చూచిన ఇవి వర్జింపతగినవి. చోరులు, మోసగాండ్రు, నపుంసకులు, నాస్తికులు, నింద్య సాధనల వలన జీవితమును గడుపు కొనువారు, కురూపులు, బలవంతులైన శత్రువులతో ఎల్లప్పుడు శత్రుత్వము వహించువారు, రాజ్యమునకు శత్రువులు, శ్రాద్ధ భోజనమలవాటుగా కలిగిన వారు, పిరికివారు, అపమానితులు, వంధ్యలు, పతిని చంపగోరు పత్నులు కలిగిన వంశములు పనికిరావని మనువు.

ఇంత తీవ్రముగ కుల విషయమై చెప్పుటకు కారణమేమనగా ప్రధాన ముగ సంతాన విషయ సంబంధమైనవి. శ్రేష్ఠతమమైన సంతతి కావలెనననిన భౌతిక, నైతిక దృష్టులతో పరిశీలించిన ఉత్తమమైన దంపతులనివార్యము. "తల్లిదండ్రుల గుణానుసారముగ సంతతి కూడ నుండును." అను హారీతుని

వాక్యములు గుర్తింపతగినవి. "కులానురూపాః ప్రజాః సంభవంతి." దుర్యోని నుండి పుట్టిన పంతానము తన దుష్ప్ర కృతిని విడువలేదని మనువు. పై లక్షణములు లేని కులములు ఉత్తమ కులములైనను అకులీనతను పొందునని మనువు. "కులాన్యకుల తాంయాంతి."

ఉభయుల మధ్య సమాన విత్తము కలిగియుండుట, విద్యయందు సమానులగునపుడు స్నేహము, వివాహము రాణించునని విపరీతమైనచో రాణించదని మహాభారతమున కలదు.

వరుని యోగ్యతలు:

బుద్ధిమంతునకు కన్యనీయవలయునని ఆశ్వలాయనుడు. "బుద్ధిమతే కన్యాం ప్రయచ్ఛేత్." గుణవంతున కీయవలసినదను బోధాయనుని మాటలు శాకుంతలమున ప్రతిధ్వనించినవి.

సమస్త స్మృతికారులు బ్రహ్మచర్యమును ప్రప్రథమముగా స్వీకరించిరి. రెండవ విషయము ఆయుస్సు. సర్వ ప్రథమముగా వరుని ఆయువును గూర్చి తెలిసికొనవలెను. వివాహ యోగ్యమైన వయస్సు దాటిన వెనుక తదితర లక్షణములతో పనియేమి?యని లింగపురాణము వినీత క్రోధుడై, సంతోషముతో నున్న పురుషునికి సంతోషముతో పిల్లనిచ్చి వివాహము చేయవలెనని వారాహము. విద్య చారిత్ర్యము, బాంధవ్యము, శీలమును పరిగణింపవలెనని గౌతమ ఆప.లు. బ్రహత్పరాశరమున కులము, విద్య, యౌవనము, బలము, ఆరోగ్యము, అంగబలము, అర్థిత్వ సంపదలు అను 8 లక్షణములు కలవు.

వధువునకు స్త్రీత్వమెట్లు అనివార్య గుణమగుచున్నదో అట్లే పుంస్త్వము కూడ పురుషులకు ముఖ్యమైన గుణము. బీజ రహిత పురుషులు క్షేత్రమును పొందుట కర్హుడు కాడని పార.గృ.సూ. అతని యొక్క అవయవముల లక్షణములను బట్టి పురుషత్వమును పరీక్షించిన వెనుక కన్యనీయవలెనని అందే కలదు. నారదుడు నపుంసకులు పదునాల్గు తరగతులని వారు విసర్జింపతగిన వారని వ్రాసెను.

అనన్య పూర్వకత్వము, కౌమార్యము వధువుపట్ల ఆవశ్యములు. వరున కవి తప్పనిసరికావు. అయినను బ్రహ్మచర్యము తప్పక యుండవలసినదే. పురుషునికి భార్య పోయినను, శారీరకముగా అశక్తుడైనను రెండవ వివాహము చేసికొనుట కర్తుడగును. (యాజ్ఞ) ధార్మిక కారణముల వలన చూచినను రెండవ మారు చేసికొనుట తప్పనిసరి యగుచున్నది. భార్యకు దాహక క్రియలు జరిపిన వెనుక గృహ్యాగ్నిని అర్చించుటలో ఎట్టి విలంబనము చేయక ద్వితియ వివాహము చేసికొనవలెనని యాజ్ఞ.

భార్య చనిపోయిన వానికి కన్యనిచ్చుట కంటె అసలు వివాహము చేసికొనని వానికిచ్చుట శ్రేష్ఠముగ, పుణ్య కరముగ భావించిరి. ఇంతకు ముందు వివాహము కానివానికి కన్యాదానము చేయుటవలన అనంతపుణ్య ఫలము వచ్చును. రెండవ వివాహమునకు సిద్ధముగా నున్నవానికిచ్చినచో అందు సగము ఫలమువచ్చును. చాల పర్యాయములు వివాహమాడిన వానికిచ్చినచో నిష్ఫలమే. (వీ.మి.)

ఈ దిగువ పేర్కొనబడినవారిని సర్వదా విసర్జింపదగినవారని కాత్యాయనుడు. పరివ్రాజకుడు, మిత్రులచే కులముచే విడువబడినవాడు, పతితుడు, అసవర్ణుడు, పక్షపాతరోగి, రహస్య వేషములో నున్నవాడు, బాన కడుపుకలవాడు, సగోత్రుడు పనికిరారు. అట్టివారితో వివాహమైనను కన్యను మరల తీసికొని రావచ్చునని వసిష్ఠుడు. "దత్తా మహి హరేత్ కన్యాం" చాలా దగ్గరగానున్నవానికి, చాల దూరముగా నున్నవానికి, అతి బలునకు, అల్ప బలునకు, జీవికకు సాధనములేనివానికి, మంద బుద్ధికి కన్యనీయరాదని వసిష్ఠుడు, పైవారికి ధనాశతో నిచ్చినచో రాబోవు జన్మలో ప్రేతత్వమును పొందునని పరాశరుని అభిభాషణము. నేటి సమాజమున స్మృతులందు వర్జింపబడిన వ్యక్తులకు కూడ పిల్లనిచ్చుచున్నారు. ధనమే నేడు పావనమైనది.

## వధూ యోగ్యతలు:

యజ్ఞ వేదిని స్త్రీతో పోల్చినట్లు శత పథమున కలదు. ప్రథుశ్రోణి, విమృష్టాంతర, కృశించిన నడుము కలిగిన స్త్రీతో పోల్చినట్లు విదితమగు

మన్నది. ఆశ్వలాయనము బాహ్య శుభలక్షణములను వర్ణించినది. భారద్వాజము నాలుగు విషయములపై శ్రద్ధ ఉంచవలెనన్నది. విత్తము, రూపము, ప్రజ్ఞ, బాంధవము (కులము) అనునవి. "చత్వారి వివాహ కారణాని విత్తం రూపం ప్రజ్ఞా బాంధవమితి." ఇందు రూపము కలదు. ఈ రూపమునకే కొందరు అధిక ప్రాధాన్యమిచ్చిరి. 'ఎవతె యందు పురుషుని మనస్సు రమించునో, నేత్రానందకరముగా నుండునో ఆ కన్యను శుభ లక్షణ సంపన్నురాలినిగా భావించవలెను. ఆమె జ్ఞానముతో పనియేమి?' యని యనిరి.

"యస్యాం మనోఽనురమతే చక్షుశ్చ ప్రతిపద్యతే
తాంవింద్యాత్ పుణ్యలక్ష్మీకాం కిం జ్ఞేనేన కరిష్యతీతి."

కాని చాలమందికిది నచ్చలేదు. ప్రజ్ఞాహీనురాలైన, బుద్ధిలేని స్త్రీతో సహవాస మెట్లు పొసగును? అని అనిరి. "అప్రజ్ఞయాహి కథంసం వాసః".

వధువుయొక్క శారీరక లక్షణముల గూర్చి స్మృతులందధికమైన ప్రస్తావన కలదు. "శారీరక దోషములు లేక సౌమ్యమైన పేరు కలిగిన, హంసలేక గజగమనము కలిగిన స్త్రీని వివాహమాడవలెనని ఒక వచనము." "పలుచని రోమములు, కురులు, దంతములు కలది, మృదు శరీరము కలదియునైన స్త్రీ యోగ్యమని మనువు. సుందరముగా నున్న వధువును సుందరముగా చేసికొనవలెనని యాజ్ఞ. సామాన్యముగా చెప్పెను. శీతాతపుడు, బాహ్య సౌందర్యమును గూర్చి విపులముగా వర్ణించెను." 'హంసవలె మధుర వాక్కుగల, మేఘ సదృశ వర్ణము కలిగిన, విశాలమైన నేత్రములుకల స్త్రీని వివాహమాడు వాడు సుఖపడును." (వీర.మి.)

ఈ దిగువ పేర్కొనబడిన స్త్రీలను వివాహమాడరాదు. కపిల వర్ణపు కేశములు గలది, గొప్ప యంగములు కలది, విడువని వ్యాధి కలది, రోమములు లేనిది, అధిక రోమములు కలది, కఠినోక్తులాడునది, పచ్చని కన్నులు కలిగిన స్త్రీ పనికిరాదని మనువు.

వీరమిత్రోదయమున విష్ణు పురాణోక్త శ్లోకమున "ముఖముపై మీసములు, గడ్డములు కలిగిన దానిని పురష సదృశ ఆకారము, కర్కశవాణి,

అవహేళన పూర్వకముగా మాటలాడుదానిని, క్షీణదృష్టికల, జఘన స్థలమున వెంట్రుకలు కలది, ముడుతలు పడిన చెక్కిళ్లు, పాండు రోగముకల, నీళ్లు కారు కన్నులుగల, చాల పలుచని కాళ్లు చేతులుగల, ఎక్కువ పొడుగు, చాల పొట్టికల, మిక్కిలి తక్కువ దంతములు కల దానిని వివాహమాడరాదని కలదు."

అశుభమైన నామము కలిగిన స్త్రీని వివాహమాడరాదని మనువు. "నక్షత్రములు, వృక్షములు, నదులు వీని పేర్లు గలది, హీనజాతి, పర్వతములు, పక్షి, పాము, దాసులు వీరి పేరులు గలది, భీకర నామము కలిగిన స్త్రీని వివాహమాడరాదు."

రేఫ, లకారము అంతముగా నున్న నామములు కల స్త్రీ పనికిరాదని ఆపస్తంబుడు "సర్వాంశ్చ రేఫలకారాంత వర్ణాః వివర్జయేత్." వేదనామములను, గంధర్వ నామములు కూడ మనుస్మృతి యందు నిషిద్ధము. వేదపవిత్రతకు భంగము వాటిల్లునను భయముతో నిషేధించిరేమో! కాముకతకు ప్రతీకమైన గంధర్వ నామములను కూడ విడిచి యుండవచ్చును.

ఇంకను కొన్ని ముఖ్య విషయములను గ్రహించిరి. సోదరుని కల కన్యను, నగ్నికయైనను సుందరముగా నున్నదానిని వివాహము చేసికొనవలెనని వారాహము. (భ్రాతృహీనమైన కన్యను ధార్మిక కారణముల వలన త్యజింప తగినదిగా భావించిరి. కారణమేమన పుత్రికాపుత్రుడు, మాతామహునికి కూడా కొడుకు వంటి వాడగును. తాత చనిన వెనుక శ్రాద్ధాది క్రియలన్నియు మనుమడే నిర్వహింపవలసి యుండును. కాలక్రమమున ఈ నియమమునకు తిలోదకమిచ్చిరి. అర్థిక లాభము పీటవేసికొని కూర్చుండుటయే కారణము. ఇంకను వధువు అవిధవై యుండవలెను. ఇది అగ్రవర్ణములలో నేటికి తొంబది తొమ్మిది పాళ్లు పాటింపబడుచున్నది. ఇక నగ్నిక విషయము. అనగా ఋతుమతి కానిది, వికసించని వక్షఃస్థలము కలదియని నిబంధనకారు లర్థమొసంగిరి.

"నగ్నికాంతు వహేత్ కన్యాం యా వన్నర్తుమతీ భవేత్
అవ్యభిజాతా భవేత్ కుచహీనా చనగ్నికా."

మానవ గృహ్య టీకాకారుడు నగ్నికతో వివాహము సర్వోత్తమమని వ్రాసెను. వివస్త్రయై యున్నప్పటికి శ్రేష్ఠముగా నున్నచో వివాహ మాడవచ్చును.

ఇంతకు మించినది మరియొకటి కలదు. "అది వరుని కంటె వధువు యొక్క వయస్సు తక్కువగా నుండుట, అనన్య పూర్వికయై యుండుట." (ఇంతకుముందు వివాహము కానిది). (యాజ్ఞ.స్మృ.) స్త్రీకి తక్కువ వయసులోనే (16 సం॥) సంపూర్ణ శారీరక వికాసముండుటచే ఆరోగ్య రీత్యా పురుషునికన్న తక్కువ వయస్సు ఉండవలెను.

అన్యపూర్విక అనుదానికి రెండర్థములు కలవు. పునర్భువ, స్వైరిణి. యాజ్ఞ. ననుసరించి రెండవసారి వివాహము చేయబడనిది. ఇతర పురుషునితో శారీరక సంబంధము కలిగినను లేక పోయినను సరే పునర్భువ అనిపించుకొనును. స్వేచ్ఛాపూర్వకముగా పతిని విడిచి పెట్టి సవర్ణుడైన ఇతర పురుషునితో తిరుగునది స్వైరిణియగును. ఆపై రెండు లక్షణములు లేనిది అనన్యపూర్విక. వివాహము చేసికొనుటకు వెళ్లినపుడు నిద్రించుచున్న, ఏడ్చుచున్న ఇంటిలో లేనిదానిని కూడదని ఆప.గృ.న కలదు.

భార.గృ.ని బట్టి విత్తరూప ప్రజ్ఞాబాంధవములందు అన్ని సమకూరనిచో విత్తమునకు ప్రాముఖ్యమీయ నవసరములేదని, రూపము లేకపోయినను ప్రజ్ఞ, కులములకు ప్రాముఖ్యమని చెప్పెను. అందమునకు ప్రజ్ఞకు మధ్యలో విద్యకూడ ఐదవ కారణముగా మానవము పేర్కొన్నది.

తనకంటె రెండు మూడేండ్లు తక్కువ వయస్సు కలదానిని వివాహ మాడవలెనని కామసూత్రకర్త. ఎట్టి కన్యను పరిగ్రహించినచో తాను కృత కృత్యుడనని తలంచునో సాటివారిలో తలవంపులు కాకయుండునో అట్టి కన్యక యోగ్యమని ఘోటకముఖుడు. (కా.సూ.).

మెల్లచూపుగలది, వృషభాకారముగా, శరభాకారముగా నున్నదానిని, గూని, బట్టతల కలదానిని, క్రీడలందు అభిరుచి మిక్కిలిగా చూపించుదానిని, పెక్కు స్నేహితులు కలదానిని వివాహమాడరాదని ఆప.గృ.సూ.

వధూపరీక్షలో ముఖ్యమైనది యేమనగా స్త్రీ, సంతానము కనుటకు యెగ్యురాలగునాకాదా? యనుట. విజ్ఞేనేశ్వరుని మతప్రకారము అసలు స్త్రీ శబ్దమే గర్భధారణకు అనుకూలమని అర్థమిచ్చుచున్నది. "స్త్యాయతి సంఘాతో భవత్యస్యాం గర్భ ఇతిస్త్రీ." దీనియందు గర్భము కూర్పబడును అని వ్యుత్పత్తి.

మట్టిముద్దల పరీక్ష:

స్త్రీ సంతానవతి యగునా? లేక గొడ్రాలగునా? యనునది తేల్చుటెట్లు? ఒక విశ్వాసము ననుసరించి ఈ పరీక్ష చేసెడివారు. ఆశ్వలాయమున ఇట్లున్నది. రెండు పంటలు పండు భూమినుండి, నీళ్లు ఎండని గుంటనుండి, జూదగృహము నుండి, నాలుగు దారులు కలిగిన ప్రాంతమునుండి, ఊషర క్షేత్రమునుండి, శ్మశాన స్థలమునుండి మట్టి పెల్లలను గ్రహించి 'ఋతమగ్రే' అను మంత్రముతో అభిమంత్రించిన వెనుక అందొక మట్టి ముద్దను కన్య స్పృశింపవలెను. "ఆరంభమున ఋతము సర్వ ప్రథమముగ పుట్టినది. సత్యము ఋతమున ప్రతిష్ఠితమైనది. ఈమె స్పృశించుట ద్వారా ఇది ప్రకటితమగుకాక. అది సత్యము" అని ఆ మంత్రమున కర్థము. వరుసగా ఆమెకు కలిగిన సంతానము అన్నోదతములకు లోటులేనివారు కలుగుట, పశుసమృద్ధి, అధ్యాత్మ సంపత్తి, అన్ని విధముల సంపద, జూదప్రవృత్తి, స్వైరవిహారము, బీదతనము, పతిఘ్నియగుటను సూచించును. గోభిల, గృ.పై చెప్పినవి పేర్కొనుచు అన్నియు కలిపిన ఒక మట్టి ముద్దను కూడ తొమ్మిదవ దానినీ పేర్కొనెను. దానిని ముట్టినను స్వీకరింపవచ్చునెను. ఆప.గృ.న మరియొక పద్ధతి కలదు. ఇరు పక్షములవారు అంగీకరించినచో ఒక మట్టి ముద్దయందు నానా బీజములుంచిన దానిని, యజ్ఞవేది, దున్నిన భూములనుండి మట్టి పెల్లలను, గోమయముతో మన్నదొకటి, శ్మశానపు మట్టితో నున్నది. ఇట్లైదింటిని ఎదురుగా నుంచి

తీసికొమ్మనిన చివరిది మినహాయించి దేనినైనను స్పృశించిన గ్రహింప వచ్చును. అట్లే మిగిలిన సూత్రములు కూడ కొన్ని కొన్ని క్రొత్త పద్ధతులను చెప్పినవి.

ఈ పరీక్షా విధానము నేడు లోపించినది. ఇది యొక్కటియేకాదు. అనేక శకునములను పరస్పరము వివాహము చేసికొనువారు గుర్తింపవలెనని కామసూత్రకర్త. అది దైవ విధానము. నేడు పెక్కురు పాటించుటలేదు.

## వివాహయోగ్యమైన వయస్సు:

ఈ విషయమై పెక్కు మత భేదములు కలవు. పండితులనేక సిద్ధాంత రాద్ధాంతములు చేసిరి. ఆధునికులు ప్రౌఢ వయస్సును సమర్థించగా సనాతన వాదులు బాల్య వివాహమునే సమర్థించిరి. ఉభయుల వాదములను పేర్కొందును.

విష్ణు పురాణమును బట్టి వధూవరుల వయస్సు 1:3 నిష్పత్తిలో నుండవలెను. అంగిరసుని మత ప్రకారము వరుని కన్న వధువు 2 లేక 3 లేక 5 సంవత్సరములు చిన్నదిగా నుండవలెను. మహాభారతమున 16 సంవత్సరములు ప్రాయము కలిగిన ఉదంకునకు, గౌతముడు తన పిల్లనిచ్చినట్లు కలదు. అనుశాసన పర్వమునందు (144.14) వర వధువుల వయస్సు 30-10, 21-7 గా పేర్కొనబడినది. "ముప్పదేండ్ల వరుడు పండ్రెండేండ్ల కన్యను పెండ్లాడవలయును. 24 ఏండ్లవాడు 8 ఏండ్ల కన్యను వివాహమాడవలెను." అని మనువు ఉచిత కాలములో పెండ్లి చేయని తండ్రిని లోకులు నిందింతురని మనువు. కన్య ప్రదాన కాలమును వ్యాఖ్యాతలిట్లు వ్రాసిరి. "ప్రదానం ప్రాగ్బృతో రితి గౌతమ వచనాత్, ఋతోః ప్రాక్ ప్రదానకాలః" అనగా ఋతువునకు ముందే అని గౌతమ వాక్యమును ధ్రరించిరి. వసిష్ఠుడింకను తీవ్రముగా చెప్పెను. ఋతు కాలభయము వలన తండ్రి నగ్నికనైనను వివాహము చేయవలెను. లేనిచో ఋతుమతియైన కన్య

ఇంటిలో నున్నచో తండ్రి దోశభాక్కగును." కొంతమంది స్మృతికర్తలు వివాహయోగ్యమైన కన్యలను 5 విధములుగా విభజించిరి. 1) నగ్నికలేక నగ్న, 2) గౌరి (8 సంవత్సరముల ఈడు), 3) రోహిణి (9 సం॥ కలది), 4) కన్య (10 సం॥ కలది), 5) రజస్వల (10 సం॥ పై బడినది) (ఈ పదములకు అర్థభేదము కలదు). నగ్నికను సర్వోత్తమముగా భావించిరి. ఇంకను తీవ్రముగా నున్న వాక్యములు గలవు. "ఎంతవరకు లజ్జయనునది యెరుగదో, ఎంతవరకు దుమ్ములో ఆడుకొనునో అంతవరకు వివాహయోగ్యమైన వయస్సుగా పరిగణించి వివాహము చేయవలెను." అని బ్రహ్మపురాణమున కలదు.

"యావల్లజ్జాం న జానాతి యావత్ క్రీడతి పాంసుభిః
తావత్ కన్యా ప్రదాతవాన చేత పిత్రోరధోగతిః
షడబ్దమధ్యేనోద్వాహ్యా"

అని ఒక వచనముండుటచే ఆరు సంవత్సరముల లోపుగ పనికి రాదు.

లేగాక్షి. గృ.న. స్త్రీలకు 10 లేక 12 సంవత్సరముల పర్యంతము బ్రహ్మచర్యమని కలదు. వైఖానసమున బ్రాహ్మణుడు నగ్నికను (8 ఏండ్లు దాటి 10 లోపు) గాని గౌరిని గాని (10 నుండి 12 సం॥ లోపు) వివాహమాడవలెనని కలదు. నగ్నికయనగా 10 సం॥ ప్రాయపుదని భవిష్య పురాణ వాక్యమును అపరార్కుడు పేర్కొనెను. రజస్వలకాని పిల్లకు వివాహము చేయనివాడు, అతని పితృదేవతలు, ఆ పిల్లయొక్క ఋతురక్తము త్రాగినవారగుదురని, రజస్వలయైన ఆ పిల్లను చూచిన తల్లిదండ్రులు, సోదరుడు నరకమునకు పోవుదురని, అట్టివారితో సహపంక్తి భోజనము నిషిద్ధమని పరాశరుడు. పై గౌరికి కలిగిన సంతానము 21 తరముల వారి నుద్ధరించునని వాయుపురాణము. గౌరి (7 సం॥), కన్యక (10 సం॥), కుమారి (12 సం॥) ప్రాయమని కాశ్యప వచనమును గృహస్థ రత్నాకరము పేర్కొన్నది. ఇట్లెన్నియో వాక్యములు బాల్య వివాహమును సమర్థించుచున్నవి. సీతారాముల వయస్సు క్రమముగా 6-13 సం॥లు.

బాల్య వివాహములు భారతదేశముననే కాక పాశ్చాత్య దేశములలో కూడ కలవు. 1929 వరకు వధూవరుల వయస్సు 12-14 గా గుర్తింపబడినది. 300 సంవత్సరముల వెనుక 9, 10 సంవత్సరముల ప్రాయపు వారికి వివాహము ఇంగ్లండులో జరిగెడివని Winternitz in die Frah న వ్రాసియున్నాడు.

చిన్న వయస్సులో వివాహము జరిగినదనగా అదియొక పవిత్ర కర్మగా భావించిరి కాని వెను వెంటనే గర్భాదానము జరిగినట్లు భావింపరాదు. రజస్వల కాకముందు తన భార్యయైనను రమింపరాదని ఋషులనిరి. ఈ వివాహములు బ్రాహ్మణులనుద్దేశించియేనని తోచును. వైఖ.న. బ్రాహ్మణ వధువు నగ్నికగా నుండవలెనని కలదు గాని క్షత్రియ వైశ్యుల ప్రస్తావన లేదు. మాలతీ మాధవమున నాయిక ప్రౌఢ వయస్క, హర్ష చరిత్రమున రాజ్యశ్రీ కూడ అంతే. ఈ బ్రాహ్మణ నియమము క్షత్రియుల పట్లకాదని సంస్కార ప్రకాశమునగట్టిగా కలదు. "న క్షత్రియాదీనామ్, కుంత్యాదిషు తథా దర్శనాత్."

చిన్న వయస్సుననే వివాహము చేయువలెననుటకు కొన్ని కారణములను మనమూహింపవచ్చును.

ముందు సోముడు, గంధర్వుడు, అగ్నియు కన్యకు రక్షకులనియు, సోముడు ముందనుభవించునని, ఆమెకు స్తనములు వచ్చునపుడు గంధర్వుడు అనుభవించుననియు, రజస్వల యైనపుడు అగ్ని భోగించుననియు కనుక స్త్రీత్వము బాగుగా బహిర్గతము కాక మునుపే ఆమెకు వివాహము కావలెనని ఒక అభిప్రాయము. దీనిని సంవర్తుడు బలపరచుచున్నటుల తోచును. పై మాటలను వ్రాసి

"తస్మాత్ వివాహయేత్కన్యాం యావన్న ర్తుమతీ భవేత్.
వివాహే హ్యష్టవర్షాయాః కన్యాయాస్తు ప్రశస్యతే."

అను సంవర్తుని మాటలను స్మృతిచంద్రిక పేర్కొన్నది.

ఆ పైన పురుషులకు ఉపనయనమెట్టిదో స్త్రీలకు ఆ వయస్సుననే (7 లేక 8) వివాహము జరుపవలెనని ఒక భావన.

"వివాహం చో పనయనం స్త్రీణామాహ పితామహః
తస్మాద్గర్భాష్టమః శ్రేష్ఠో జన్మతో వాష్టవత్సరః"

అని స్మృతిముక్తా ఫలము.

ఆపైన అవివాహితగా చనిపోయిన స్వర్గాది ఉత్తమ లోకములు లేవను భయము కూడ కారణమైయుండును. భారతమున శల్య పర్వమునందు కుణిగార్గ్గని కూతురు దీర్ఘకాలము తపస్సు చేయగా, వివాహము చేసికొనని చో స్వర్గమునకేగవని ఉపదేశింపబడగా గాలవవంశ శృంగవంతుని చనిపోవు రోజునకు ముందురోజున వివాహము చేసికొనినట్లు కలదు.

ఇక ఆధునికులు తమ వాదమునిట్లు సాగింతురు. తండ్రి ఇంటిలో పెరుగుచున్న బాగుగా వయసు వచ్చిన ఘోషయను స్త్రీకి అశ్వినులు ఒక వరుని సమకూర్చినట్లు కలదు. సూర్యునియొక్క పుత్రియైన సూర్యయొక్క వివాహము సోమునితో యువతిగా ఉత్సుకతతో నున్నపుడు జరిగినది. అథర్వ వేదమున స్త్రీ పురుషుని, పురుషుడు స్త్రీని పొందుటకు కొన్ని అభిచారిక క్రియలు చేసెడివారని అనుచున్నారు. ఛాందోగ్యమున ఒక అధ్యాపకుడు 'ఆటికీ' పత్నిని స్వీకరించును. దీనికి టీకాకారులు 'అజాతపయోధర' అని వ్రాసినను భ్రమణ శీలమైన జీవమునకు తగినదని ఆధునికుల వాదన.

వివాహమైన వెనుక సంవత్సరము కాని, 12 రాత్రులు కాని, 6 రాత్రులు కాని, 3 రాత్రులు కాని బ్రహ్మ చర్యమును పాటింపవలెనను సూత్రకారుల మాటలను బట్టి రజస్వల యగుటకు సిద్ధముగా నున్న, లేదా రజస్వలయైన వయస్సు కల దానితోనే బ్రహ్మచర్యము పాటింపవలెనను నియమముండును గాని 8, లేక 10 సంవత్సరముల వయస్సు కలదానితో బ్రహ్మచర్య ప్రస్తావనకే అవకాశముండదని అనుచున్నారు.

హిరణ్యకేశి గృహ్యముపై మాతృదత్తుడు "నగ్నికాం ఆసన్నార్తవాం..........తస్మాద్వ్ప్రవిక్షేపణార్హా నగ్నికా మైథునార్హేత్యర్థః " అనుటను బట్టి నగ్నికయనగా ఇక కొద్ది కాలములోనే ఋతుమతి కాగలది, సంభోగించుటకు తగినది' అను నర్థములు సిద్ధించుచున్నవని అనుచున్నారు. శ్రోత్రియుడగు కుమారుని కనవలెనను కోరిక కలవారు త్రిరాత్ర బ్రహ్మచర్యము చేయవలెనని, అనూచానుడు కావలెననిన 12 రాత్రులీ వ్రతము చేయవలెనని బోధాయనుని మాటలను బట్టి యుక్తవయస్కురాలైన స్త్రీతోనే ఇది సాధ్యమని వాదించుచున్నారు. సాంఖ్యాయన గృహ్యమున "అథయదిక్షిప్రం గర్భకామా పాణి గ్రహణాదారభ్య వరేణ దశ రాత్రమవి ప్రవాసః" శీఘ్రముగా గర్భము కావలెననిన కోరిన కన్య కన్యయయినచో పాణి గ్రహణము మొదలు పది రాత్రుల వరకు వరుని విడువక యుండవలెనని కలదు. ఇంకను వివాహ మంత్రములలో 'ఆరోహోరుం...............' మంత్రములను పఠించుటచే గర్భాధాన యుక్తమైన వయస్సులోనే వివాహములు జరిగెడివని ఆధునికుల వాద సారాంశము.

వివాహమున త్రిరాత్ర దీక్షయైన వెనుక శేషహోమముండును. ఆ హోమమైన వెనుక 'ఆరోహోరుం..........' అను గర్భాధాన మంత్రములను పఠింతురు. అంత మాత్రముననే సమావేశనము (గర్భాధానము) నియతమని కాదు. అయినచో ఎందులకు పఠించుచున్నారని సందేహము. ప్రమాద వశముచే వధూవరులు గర్భాధానము కంటె పూర్వమే మంత్ర రహితముగా కూడుదురేమో అను శంకచే పఠించుచున్నారని సంప్రదాయవేత్తలందురు. వివాహ మధ్యలో ప్రథమ రజస్వలయైనచో శుద్ధియైన వెనుక ఈ సమావేశనము విహితమని అందురు. ఇందులకు భిన్నమైనచో వివాహమునకు ముందు రజస్వలయైనచో ఆమెకు ప్రాయశ్చిత్తము, అట్టి స్త్రీని చేసికొనిన వానికి పాణిగ్రహణమైన వెనుక కూష్మాండ హోమములు చేయవలెనను విధి, గర్భాధాన ముహూర్తములు చెప్పుట అనవసరమగుచున్నవి కదాయని సంప్రదాయజ్ఞులందురు.

దేవీభాగవతమందు శీలుడను ఒక వైశ్యుడు నా కుమార్తెకు 10 సం॥ వచ్చినవి. ధనము లేదు, ఏమి చేయుదును? అని విచారించును. 11 సంవత్సరములు వచ్చిన యెడల దాన ఫలము లేదని వాపోవును.

ధర్మప్రదీప మను గ్రంథమున మహా విద్వాంసులైన అనంత కృష్ణశాస్త్రి గారు ప్రౌఢ వివాహము క్షత్రియులకే కాని బ్రాహ్మణులకు కాదని నిర్ణయించిరి. నేటి రాజ్యాంగము బాల్య వివాహములను నిషేధించినది. నూటికి తొంబది తొమ్మిది మంది ప్రౌఢ వివాహములనే చేయుచున్నారు. రజస్వలయైన స్త్రీకి కొన్ని ప్రాయశ్చిత్తములను, వరునకు కూష్మాండ హోమములు విధించుటచే అట్లు చేసినచో శాస్త్రమును, రాజ్యాంగమును పాటించిన వారమగుదుమేమో యోచింపుడు.

ఉచిత కాలము:

జ్యోతిష సంబంధమైన పెక్కు నియమములు కలవు. ఉత్తరాయణమున, శుక్లపక్షమున, శుభతిథియందు చేల, ఉపనయన, గోదాన వివాహములు జరుపుకొనవలెననియు, కొందరి మత ప్రకారము సర్వకాలము వివాహయోగ్యమైన కాలమని ఆశ్వ.గృ.న కలదు. అట్లే సాంఖ్యాయనము. కాని జ్యోతిర్నిబంధ మందు అన్ని కాలములు పనికి వచ్చునన్నమాట ఆసురాది అధర్మ వివాహ విషయమున అని కొందరనుచున్నారని, కొందరు ఆసన్న ఋతు కాల విషయమని అనుచున్నారని కలదు. (సంస్కార రత్నమాల).

శుచి, (ఆషాఢ), తపస్ (మాఘ) తపస్య (ఫాల్గున) ఇవి తప్ప మిగిలిన మాసములన్నియు శుభములేయని కొందరందురనియు, అన్ని మాసములు యోగ్యములేయని కొందరందురని బోధాయనుడు. చిత్రా నక్షత్రము కూడదని భారద్వాజుడు.

ఆప.గృ.న శిశిర ఋతువునగల మాఘ ఫాల్గునములు, ఆషాఢము మినహా అన్ని నెలలు, కల్యాణ నక్షత్రములు పనికి వచ్చునని కలదు. ఆర్ష

వివాహములో గోదానమునకు మఘా నక్షత్రము మంచిదని, వివాహిత కన్యను ఫల్గునీ నక్షత్రమున వరుడు తన ఇంటికి తీసికొని వెళ్లవలెనని కలదు.

ఇంకను అందే ఇట్లు కలదు. ఒక బ్రాహ్మణ వాక్యమునను సరించి స్వాతి నక్షత్ర యుక్త సమయమున వివాహము చేసినచో. (నిష్ఠా) వధువు వరునితో చాల ప్రేమ కలిగియుండుననియు, మరల పుట్టింటికి రాదని కలదు. "యాం....... గచ్ఛతి" అనునవి తై. బ్రాహ్మణమున వచ్చును. అట్లే భారద్వాజము చెప్పినది. బౌధ.గృ. ఆప.గృ. చెప్పినట్లే మాసములను చెప్పుచు రోహిణి, మృగశీర్ష, ఉత్తరఫల్గుని, స్వాతి నక్షత్రములు కల్యాణ నక్షత్రములనియు, పునర్వసు, తిష్య (పుష్య) హస్త, శ్రవణ, రేవతి నక్షత్రములు మిగిలిన మంగళ కార్యములకు శోభనములని కలదు. మానవ.గృ.న రోహిణి, మృగశిర, శ్రవణ, (శవిష్ఠ, ధనిష్ఠ) ఉత్తరాషాఢ, ఉత్తర ఫల్గుని, ఉత్తరాభాద్ర నక్షత్రములు వివాహమునకు మంచివనియు, వధువు పుట్టింటినుండి అత్తింటికేగునపుడు కూడ అవి మంచివని కలదు. అట్లే కారక, వారాహములు, భగుడు అధి దైవముగాగల ఉత్తర ఫల్గుని యందు వివాహము జరిపినట్లుగా రామాయణమున బాలకాండ యందు కలదు. తైత్రిబ్రా. ప్రకారము ఉత్తర ఫల్గునికి దేవత భగుడు. అట్లే అధి దైవముగాగల నక్షత్రమునందే వివాహము జరిగినట్లు భారతమున కలదు. (ఆదిపర్వ.) కార్తిక బహుళమునుండి, వైశాఖ పూర్ణిమ వరకు వివాహ యోగ్యకాలమనియు, లేదా ఎవరి ఇష్ట ప్రకారము వారు చేసికొనవచ్చున నియు, చైత్రమును కాని అందు సగము పక్షమును గాని విసర్జింపవలెనని కౌశిక సూత్రము.

నిబంధన కారులు పెక్కు విషయములు విపులముగా వ్రాసిరి. అన్నింటిని పేర్కొనుట కష్టమైనను కొన్నింటిని పేర్కొందము. రాజ మార్తాండమున ఇట్లున్నది. చైత్రము పుష్యము మినహా అన్ని మాసములు మంచివనియు, వధువు ప్రౌఢ వయస్కయైనచో చాలమంచి కాలము కొరకు

వేచి యుండవద్దని, చంద్రలగ్న బలము బాగుగా నున్నచో చాలునని, పది సంవత్సరములలోపుగానున్న పిల్ల వివాహములో శుభమైన అయన మాస తిథులను పరికించవలెను.

సూత్రకారులకు, స్మృతికారులకు వివాహము పట్ల భిన్నాభిప్రాయ మున్నచో దేశాచారమును పాటింపవలెనని సంస్కార రత్నమాలాకారుని ఉపదేశము. జ్యేష్ఠునికి, జ్యేష్ఠకన్యకు జ్యేష్ఠమాసమునగాని, జ్యేష్ఠ నక్షత్రమున గాని వివాహము పనికిరాదు. ఆ జ్యేష్ఠులకే పుట్టిన మాసముగాని, పుట్టిన తిథియందు గాని, పుట్టిన నక్షత్రమున గాని వివాహము పనికిరాదు. బుధ, శుక్ర, లక్ష్మివారములు, వారములలో వివాహమునకు మంచివి. రాత్రి యందు వివాహమైనచో ఏ రోజైనను పనికివచ్చునని మదనపారిజాతమున కలదు.

వివాహమున వధువునకు చంద్రబలముండవలెను. కన్య రజస్వ లయైనచో గురుశుద్ధి పర్యంతమువేచి యుండనవసరములేదని శాంతి జరుపుకొనవచ్చునని నిర్ణయసింధువున కలదు.

ఇంకను కొన్ని జ్యోతిష సంబంధమైన విషయములు కలవు. వర్ణ, వశ్య, నక్షత్ర, యోని, గ్రహ, గణ, రాశి, నాడీ కూటములని యెనిమిది కూటములు గలవు. ఇందు ఉత్తరోత్తరము బలీయము. ఇప్పటికిని గణ నాడులకు ప్రాధాన్యమును పరికించుచున్నారు. 27 నక్షత్రములు మూడు విభాగములుగానుండును. దేవగణ, మనుష్యగణ, రాక్షస గణములుగా విభక్తము. వధూవరులిద్దరు ఒకే గణమునకు చెందిన నక్షత్రములలో జన్మించినచో మంచిది. భిన్న గణములైన పెక్కు నియమములు గలవు. ఆదినాడి, మధ్యనాడి, అంత్యనాడియని నాడులు మూడు రకములు. ఒకే నాడికి చెందిన నక్షత్రములు కలిగిన వారికి కీడు సంభవించునని, భిన్న నాడులకు చెందియుండువలెనను నియమములు, వివాహ నిశ్చయమైన వెనుక వచ్చు ఆశౌచములు, వధూవరుల తల్లులలో ఎవరైనను రజస్వల

య్యైనచో ఎంతవరకు పనికిరాదోయను నియమములు, ఇంకను పెక్కింటి గూర్చి నిబంధన గ్రంథములు పరికింపుడు.

విధానము:
(మన ప్రాంత పద్ధతి-ఆప.విధానము సంస్కార దీపికననుసరించి)

స్నాతక వ్రతానంతరము వరుడు, వరుని బంధువులు కన్యాదాత ఇంటికి తరలిరాగా ఈ కార్యక్రమమారంభమగును. పెండ్లి కూతురు మంగళ స్నానము చేసిన వెనుక వరుడు మంగళ స్నానము చేయును. గణపతి పూజ, పుణ్యాహ వాచనములు చేసిన వెనుక వివాహ సంకల్పము.

రక్షాబంధనము:

దేవతల రక్షణను అభిలషించుచు సంకల్పించిన కార్యము నిర్విఘ్నముగా కొనసాగుటకు రక్షను వరుని కుడిచేతికి కట్టుదురు. తనకు తగిన కన్యను అన్వేషించుటకై ఉత్తములు, మంచి హృదయము కలిగిన వేదవేత్తలను పంపు మంత్రములు పఠింపబడును. కాని నేడు కన్యా దాతయే వరుని వెదుకుచున్నాడు.

వధ్వన్వేషణ:

"ప్రసుగ్మంతా.........." ఆదిగా గల మంత్రములు పఠింప బడును. కాబోవు దంపతులు చేయు యజ్ఞమందు తనకు సోమ రూపమైన అన్నము దొరకునని, ఇంద్రుడీ వివాహ కార్యమునకు తోడ్పడునని, అర్యమాది దేవతలు దాంపత్యమును సంఘటన చేయవలెనని, మార్గములో అన్వేషించువారికి ఎట్టి ఆటంకములు లేకుండ ఉండవలెనని పరమేశ్వరుని ప్రార్థించును.

గౌరీపూజ:

కన్యకూడ వేరొకచోట గౌరీపూజ చేయును. గౌరీదేవి అనుగ్రహము వలన ఆమెవలెనే సువాసినీత్వము భర్తృసౌఖ్యము పొందవలెనను

ఉద్దేశ్యముతో పూజించును. గౌరీశంకరులు అర్ధనారీశ్వరులు గదా. శబ్దార్థ ములకెట్టి అవినాభావ సంబంధము కలదో అట్టి సంబంధము కలిగినవారు. ఒక క్రొత్త వెదురు గంపలో ధాన్యము లేక బియ్యము పోసి అందులో కూర్చుండి వధువు పూజ చేయును. పూజ వెనుక పూజింపబడిన కంకణము వధువు చేతికి కట్టబడును.

## గోత్రప్రవరలు చెప్పుట:

'అనువహం' అను మంత్రములను చెప్పుచు వరుని శ్రేయస్సు కోరు వారు కన్యాదాతను సమీపించి వరుని గోత్ర ప్రవరలు చెప్పి వారి కుమార్తెను కోరుదురు. కన్యాదాత గోత్ర ప్రవరలు కూడ చెప్పి ఆయన అంగీకారము ప్రకటింపబడును. ఉభయ ప్రవరలు, ప్రతివచనము మూడుసార్లు చెప్పుదురు. వరుడు ధర్మ కార్యముల నిమిత్తము సత్సాంతాన నిమిత్తము పెండ్లాడుచు న్నానని సంకల్పించును. "ధర్మ ప్రజా సంపత్త్యర్థం స్త్రియముద్వహే." మరల సంకల్పము చేసి వివాహాంగ మైన రెండవ యజ్ఞోపవీతమును ధరించును. ఇది కన్యాదాత వేయుట కూడ కలదు. ఉపవీతమును ధరించి ఆచమనము చేయును.

## కన్యామహాదానము:

కన్యాదాత ఆచమనము చేసి సంకల్పించును. ఇందు మహా సంకల్పము చదువుదురు. ఈ మహా సంకల్పము గొప్ప భౌగోళిక జ్ఞానమొసంగును. సమస్త పర్వత, నదీనద, దేశ, పుణ్యతీర్థ, ఖండ, మహారణ్య, ద్వీప, వర్ష, కల్ప, మన్వంతర, మహాయుగముల ప్రస్తావన యుండును. కన్యాదాత కోట్లాది సంవత్సరములు బ్రహ్మలోకాదులందు నివసించుటకై సమస్త యజ్ఞ ఫలములు సిద్ధించుటకై తనతో కూడి పది తరములు వెనుక పది తరములు ముందు వారు మొత్తము 21 తరముల వారు తరించుటకై అలంకరించిన కన్యను ఉదక పూర్వకముగా దానము చేయుచున్నానని కన్యా మహాదానము చేయును. ఇక్కడ మిగిలిన దానములలోవలె 'మమ' అని అనడు. నాది

కాదు నీదే యనుట ఉండదు. తన కూతురుపై హక్కు విడువకుండ దానము చేయును. భర్త ఈమెను బాధించుట, వదలివేయుట జరిగినను తండ్రి పోషింపదగిన వాడు కనుక ఇట్లు చేయును. కన్యాదానములో ప్రతిపాదయామి అని కన్యాదాత అనును. అంతియకాని 'సంప్రదదే' అనుట లేదు. వరుదు ఓం స్వస్తి అని గ్రహించును కాని 'ప్రతిగృహ్ణామి' అనుట లేదు.

### వరపూజ:

కన్యాదాత భార్యా సహితుడై వరుని పాదములు ఒక పళ్లెములో నుంచి కడిగి ఆ జలమును శిరస్సుపై చల్లుకొనును. పెద్దవారిచేత కాళ్లు కడిగించుకొన్నందులకు, పోయిన తేజస్సు తిరిగి సంపాదించుటకై వరుదు "మయి మహోమయి యశోమయీాం ద్రియం వీర్యం" అను మంత్రమును జపించును. అనగా నాయందు తేజస్సు, కీర్తి, ఇంద్రియములు, వీర్యము ఉండుగాక అని అనును. కన్యాదాత వరుని లక్ష్మీనారాయణ స్వరూపునిగా భావించి నూత్న వస్త్రములు, అంగుళీయకము మొ॥ యథాశక్తిగా నిచ్చి పూజించును. కన్యధార (కన్నెధార) కన్యదాత యొక్క దోసిట సదక్షిణ చందన తాంబూలముంచి ఉదక ధారతో నా దోసిటిని వరుని దోయిట ఉంచును.

### కన్యాగ్రహణము:

వరుదు స్వస్తియని 'దేవస్యత్వా............' మొ॥ మంత్రములను చెప్పును. ప్రేరకుడగు పరమేశ్వర ప్రేరణచే, అశ్వినీ కుమారుల బాహువులచే, పూషన్ అను దేవత బాహువుల చేతను నిన్ను గ్రహింతును. కామమే దాత, కామమే ప్రతిగ్రహీత అని ఆ మంత్రముల కర్థము. కన్యాదాన సిద్ధికై నాశక్తి కొలది దక్షిణనిచ్చుచున్నానని కన్యాదాత అనును.

ఆదేశములు: ధర్మ, అర్థ కామ విషయములందు ఈమె నతిక్రమించి పోరాదని (చేయవద్దని) దాత అనును. ఈమె సలహా లేక చేయనని వరుడు ముమ్మారు ప్రతిజ్ఞ చేయును. "ధర్మేచ, అర్థేచ, కామేచ త్వయైషా నాతి చరితవ్యా" అను దానికి నాతిచరామి బదులు పల్కును.

ఆ పైన వరుడు వైవాహికాగ్నిని నిశ్చయించిన కుండమందు అగ్ని ప్రతిష్ఠాపన చేయును. తరువాత మధుపర్కము.

మధుపర్కము: మధుపర్కపూజయనగా తేనె, పెరుగు కలిపిన ద్రవ్యము వరునకిచ్చుట. ఈ సమయమందిచ్చు వస్త్రములకు మధుపర్కములని పేరు కాలక్రమేణ వచ్చినది. కొందరు మధుపర్కమునకు 3 వస్తువులని మూడవది నేయి యని అందురు. మరి కొందరు వేపుదు బియ్యము, పేలపిండి కలిపి యిదందురు. తరువాత వచ్చునది గోదానము.

గోదానము: ఒక గోవునిచ్చుట, వరుడు 'ఓం ఉత్సృజత' అని అంగీ కారమును సూచించి విడిచిపెట్టగోరుట అనునది మంత్రముల వలన తెలియుచున్నది. నేడు గోవునకు బదులుగా ఒక దర్భనిచ్చుచున్నారు. ఇందు 'యజ్ఞో వర్ధతాం.........' అను మంత్రములను పఠింతురు. 'ఓ గోవా! నీవు యజ్ఞ సాధనమవు' ఇది రుద్రులకు తల్లి, వసువులకు కుమార్తె. ఆదిత్యులకు సోదరి, యజ్ఞమునకు నాభి వంటిది. ఇది ఖండింపదగనిది అని అర్థము. పెండ్లి కుమారుని నూత్న వస్త్రములు మొ॥ వానిచే పూజింపగా వరుడు వానిని ధరించి సభకు నమస్కరించును.

సుముహూర్తము: పిమ్మట సుముహర్తమందు చూర్ణికయును, మంగ ళాష్టకములను పఠింతురు. శుభముహూర్తములో వధూవరులు మంగళ ద్రవ్యములైన బెల్లము, జీలకట్ర కలిపిన ముద్దను ఒకరి తలపై నొకరు పరస్పరము చూచుకొనుచు ఉంతురు. Positive Electric Charge ఇట్టి పరస్పర వీక్షణమే సుమూహుర్తము. ఈ సమయమున "ధ్రువంతే రాజా......... " అను మంత్రమును చదువుదురు. వరుణ, బృహ స్పతి, ఇంద్ర, అగ్నులు రాష్ట్రమును ధ్రువమైన దానిని గావింతురుగాక.

పర్వతమువలె చలింపక యుండవలసినది. ఇంద్రుని వలె శత్రుహంతవై యుందువుగాక.

"జరా న ప్రాప్యతే యస్మాన్మంగళం శుభకర్మసు" అని సంస్కారరత్న మాల.

జీలకఱ్ఱ ముదుసలితనము రాకుండ చేయునని ఇది మంగళకరమైనదని అర్థము. వంటలలో ప్రతిదినము మనము వాడుచున్నాము.

ఇతర ద్రవ్యములకు మాధుర్యమును బెల్లము ప్రసరింప చేయుచున్నదని భూదేవతను భోగ్యపదార్థములనిమ్మని యడుగు సందర్భమున బెల్లమును గూర్చి కృ.యు.సం. (1-1-14) చెప్పినది. చద్ది దోషము బెల్లమునకు, బెల్లముతో వండిన పదార్థములకులేదు. ఇట్టి మంగళకర ద్రవ్యములు పరస్పర ప్రీతికి సాధనములు.

ఆశీర్వచనము:

వివాహమునకు పిలువబడిన పెద్దలు, వైదికులు, అక్షతలు వేసి వధూవరుల నాశీర్వదింతురు.

సుముహూర్తములో వరుడు, వధువును చూచి "అభ్రాతృఘ్నీం వరుణాపతి ఘ్నీం..........." అని జపించును. అనగా ఓ. వరుణా! ఈమెకు సోదరులను చంపనట్టి లక్ష్మినిమ్ము. ఓ బృహస్పతీ! భర్తను చంపనట్టి లక్ష్మినిమ్ము. ఓ ఇంద్రా! పుత్రులను చంపనట్టి లక్ష్మినిమ్ము. ఓ సవితా! సమస్త సంపదలిమ్ము. ఒకసారి కన్నులు మూసికొని 'అఘోరచక్షుః' అను మంత్రము చెప్పును. "ఓ చిన్నదానా! భయంకరమైన కన్నులు లేని దానవై, భర్తను చంపని దానవై, మంచి మనస్సు కలిగిన దానవై, బ్రతికెడి సంతానమును కనుచు నావారికి సుఖమును గూర్చుదానివి కమ్ము."

ఆ వెనుక వధూవరులిద్దరు ఆచమించి "ఆవాభ్యాంకర్మాణి కర్తవ్యాని ప్రజాశ్చోత్పాదయితవ్యాః" మనము పుణ్య కార్యములను చేయుదము, సంతానమును బడయుదమని సంకల్పింతురు. "పతికి హింస కలిగించు

అలక్ష్మిని తుడిచివేయుచున్నానని అర్థమిచ్చు" 'ఇదమహం' మంత్రమును పఠించి పెండ్లికూతురు కనుబొమల మధ్య భాగమును దర్భలతో తుడుచి వానిని పడమరగా పారవేయును. తరువాత జీవాగ్ంరుదతీ..............అను మంత్రము పఠింతురు. అందు కన్యా వియోగమును గూర్చి బాధపడు బంధువులకు 'ఈ శుభ సమయమున విచారింపకుడు' అని వరుడనును.

## యుగచ్ఛిద్రాభిషేకము:

తరువాత వధువు శిరస్సుపై దర్భలతో గుండ్రముగా చుట్టిన చుట్ట కుదురును = (ఇణ్వము = ఇరువది దర్భలను అయిదు దర్భలచే గుండ్రముగా చుట్టునది) ఉంచి దానిపై బండికాడి యొక్క కుడివైపు నందలి రంధ్రముందునట్లు అమర్చి, 'ఓ ఇంద్రా! ఇరుసు రంధ్రమునుండి, రథము యొక్క రంధ్రమునుండి కాని బెజ్జమునుండి పవిత్ర జలమును స్రవింపచేసి అపాల అను కన్యకను సూర్యతేజస్సు కలదానిగా చేసినట్లే ఈమెను కూడ చేయుము.' అను అర్థమిచ్చు ఖేనసః ఖేరథః అను మంత్రములను పఠింతురు.

దీనికొక కథ కలదు.

## అపాల కథ

అత్రి మహాముని కూతురు బొల్లివ్యాధిచే బాధపడుటచే ఎవరును వివాహము చేసికొనరైరి. ఆమె పాలకులు లేనిదగుటచే అపాలయైనది. పెండ్లి కోరికతో నుండగా ఒక రోజు స్నానమునకై నదిలోనికి దిగి ప్రవాహ వేగముచే కొట్టుకొని పోవుచు చేతికి దొరికిన సోమలతను శాస్త్రప్రకారముగా అర్పించు అవకాశములేక పోవుటచే నోటితో నమలి ఆ రసమును ఇంద్రునకర్పించెను. ఇంద్రుడది గ్రహించి రథము, ఇరుసు, కాడి రంధ్రములనుండి ఆమెపై జలమును స్రవింపచేయుటచే ఆమెకు బొల్లిపోయి తుదకు వివాహమగును. ఈ కథను హరదత్తాచార్యులవారు మంత్రపన్న వ్యాఖ్యానములో వ్రాసిరి.

కాడి రంధ్రములో బంగారముంచి 'శం తే హిరణ్యాగ్ం.........' అను మంత్రములను చెప్పి వధువును అభిషేకింతురు. "బంగారము సుఖమగు గాక, భర్తయైన నాకు సుఖము కలుగుగాక, పవిత్రవై భర్తనైననాతో నీ శరీరమును చేర్తువుగాక" అని దాని భావము. పిమ్మట "హిరణ్యవర్ణాః" అను అయిదు మంత్రములతో అభిషేకింతురు. సూర్యాగ్నులను పుట్టించిన, బడబాగ్నిని ధరించిన ఈ ఉదకములు ఇహ పర సౌఖ్యమును కలుగచేయుగాక. వరుణుడు అధిష్ఠాతగా గల ఈ ఉదకములు నీకు సుఖము నిచ్చుగాక అని అర్థము.

'పరిత్వాగిర్వణో' మంత్రముచే ఖండింపని, ఉతుకని వస్త్రమును ఆమెకు కప్పుదురు. ఈ స్తుతి వాక్యములు ఇంద్రుని కప్పునటుల ఈ వస్త్రము పెండ్లి కూతురిని ఆవరించునని హరదత్తులు వ్రాసిరి.

యోక్త్రబంధనము:

ఆ తరువాత 'ఆశాసానా.............' అను మంత్రమును చెప్పి అగ్ని పరిచర్యకు వ్రతము బాగుగా చేయుటకై కట్టుచున్నానని యెక్త్రమను త్రాటిని వధువు మొలకు కట్టును. సంతానసౌభాగ్య, శరీర శోభ కలుగుటకై కట్టును. అది దాని ప్రయోజనము. మంగళ సూత్రము వ్రత స్వీకరణమునకు గుర్తైనట్లు ఈ యోక్త్ర బంధనము కూడ అట్టిదే అని విద్యారణ్యభాష్యము.

మంగళ సూత్రధారణ:

ఆపైన రెండు పళ్లెరములతో తెచ్చిన తలంబ్రాలపై మంగళ సూత్రము లుంచి పూజించి ముత్తైదువుల కంఠములను స్పృశింపచేసిన పిమ్మట వరుడు వధువునకు ఎదురుగా నిలబడి

"మాంగల్యం తంతునానేన మమ జీవన హేతునా
కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతం."

అను శ్లోకమును చదువుచు రెండు సూత్రములను మూడేసి ముళ్లు వేయును. "నా జీవనమునకు గుర్తుగా ఈ మంగళ సూత్రమును నీ

కంఠమున కట్టుచున్నాను. నీవు నూరేండ్లు బ్రతుకుము.” అని భావము తరువాత ముదులకు కుంకుమ పూయవలెను. ఆపైన.

## కపిలావాచనము (తలంబ్రాలు):

వరుడు, వధువు దోసిటలో పాలు చల్లి, కడిగి ఆరబెట్టిన బియ్యమును కొద్దిగా రెండు మార్లు వేసి మఱల పాలు వానిపై చల్లును. వధువునకు చేసినట్లే పురోహితుడు వరుని దోసిటలో కూడ బియ్యము పోసి పాలు చల్లును. ‘కపిలాగ్ంస్మారయంతు.................’ అను మంత్రములు పఠింపబడును. తొలిసారి వరుడు, ముందు వధువు శిరమున, నే గోరుచున్న సంతానము వృద్ధియగుగాక అనుచు పోయును. రెండవసారి వధువు పాడిపంటలు వృద్ధియగుగాకయని పోయును. మూడవసారి వధువు శిరమున త్యాగము సమృద్ధమగుగాక అని అనుచు పోయును. నాల్గవసారి ధనవృద్ధి యగుగాక అని ఒక శిరస్సుపై నొకరు పోసికొందురు. ఇందు చదువు మంత్రములలో ఒకరిపట్ల ఒకరు తృప్తికలుగునట్లు దేవతలు అనుగ్రహింపవలెనని పశు, యజ్ఞ, కామ సమృద్ధి కావలెనని ప్రార్థనలుండును.

పిదప బంధువులు, మిత్రులు కానుకలను సమర్పింతురు. అనంతరము ప్రధాన హోమము. దానికి ముందే ఐక్య సూచకముగా పురోహితుడు నూత్న వధూవరుల కొంగులను ముడివేయును. దీనినే బ్రహ్మగ్రంథి లేక బ్రహ్మముడి యందురు.

## ప్రధాన హోమము:

ప్రధాన హోమమునకై వరుడు వధువు కుడి చేయి పట్టుకొని అగ్ని దగ్గరకు తీసికొని వెళ్లుచు ‘పూషాత్వేతో నయతు............’ ఆదిగా గల మంత్రమును పఠించును. అనగా నిన్ను సూర్యుడు చేతిని పట్టుకొని ఇచట నుండి అగ్ని కడకు తీసికొని పోవుగాక. అశ్వినీ కుమారులు నిన్ను రథముపై వెళ్లుటకు అనుమతింతురుగాక. గృహ యజమానురాలవై రమ్ము. యజ్ఞమును గూర్చి చెప్పవలసిన దానిని చెప్పుము. అని దాని యర్థము. ఈ హోమమునందు అగ్నినుద్దేశించి, చత్వారి శృంగా......................ఇత్యాది

మంత్ర ప్రార్థనలుండును. ఈ యగ్నికి 4 వేదములే 4 కొమ్ములు. ప్రాతః మధ్యాహ్న సాయం సవనములు మూడు పాదములు. బ్రహ్మోదన, ప్రవర్గ్యములు, రెండు శిరస్సులు, ఏడు ఛందస్సులు ఏడు హస్తములు, మంత్ర, కల్ప, బ్రాహ్మణములను మూటిచే కట్టబడి కోరికలనిచ్చునదై ఈ యగ్ని జాజ్వల్యమానముగా ప్రకాశించుచున్నది.

## పాణి గ్రహణము:

"సోమః ప్రథమో వివిదే గంధర్వో వివిధ ఉత్తరః తృతీయో అగ్నిష్టే పతిస్తు రీయస్తే మనుష్యజాః............" ఈమెను సోముడు ముందు పొందెను. అతడు విశ్వావసువను గంధర్వునకిచ్చెను. అగ్ని మూడవవాడై ఈమెను గ్రహించెను. నాల్గవ భర్తను నేను. అను అర్థముగల మంత్రమును పఠింతురు. పిమ్మట ఆమె తిరుగవేసిన కుడిచేతిని వరుడు తన బోర్లించిన కుడి చేతితో పట్టుకొనును. స్త్రీ సంతానము కోరువాడు నాలుగు వ్రేళ్లను పట్టుకొనవలెను. పురుష సంతతిని కోరువాడు బొటన వ్రేలునే పట్టుకొనవలెను. ఇద్దరు కావలెనని మొత్తమన్ని వ్రేళ్లను పట్టుకొనవలెను. ఇందు చెప్పబడు మంత్రములు నాలుగు 'గృభ్ణామి తే............' మొ॥నవి. ఉత్తమ సంతానమును కనుటకై నీ హస్తమును గ్రహించుచున్నాను. భగ, అర్యము, సవిత అను దేవతలు నిన్ను నాకిచ్చిరి. యావజ్జీవము కలిసి యుందుముగాక. ఓ సరస్వతీ! ఈ వివాహమును రక్షింపుము. భక్తుల కిచ్చుటకై బంగారమును హస్తమునందు ధరించిన అగ్నికి స్నేహితుడైన వాయువు నిన్ను నాయందెల్లపుడు ప్రేమ కలదానిగా చేయుగాక. అని అర్థము. ఆపైన.

## సప్తపది:

వరుడు, వధువును అగ్ని కుత్తరమున కుడికాలితో తూర్పునకుగాని ఉత్తరమునకు గాని ఏకమిషే అను ఏడు వాక్యములచే ఏడడుగులు నడిపించి తన కోర్కులు తెల్పి తన సఖ్యమును ప్రకటించును. "హేవధు! నీవు నన్నసరించి నడువుము. విష్ణువు నీవు నడచు మొదటి యడుగువలన

అన్నమును, రెండవ యడుగువలన బలమును, అట్లే (3) కర్మమును, (4) కర్మ సుఖమును, (5) పశు సమృద్ధిని, (6) ఋతు సంపదను, (7) యజ్ఞము కొరకై ఏడుగురు ఋత్విక్కులను కలుగచేయుగాక."

"సఖా సప్తపదా భవ...................... " ఆదిగా గల మంత్రముల భావములను పరికింపుడు. ఈ కార్యములనిట్లు చేయుదమని పరస్పరము భావించుకొన్న వారమై ధర్మ కార్యములను చేయుదము. నేను సామవేదమును, నీవు ఋగ్వేదమైతివి. ఋక్కునే సామముగా గానము చేయుచున్నారు. అట్టి యవినాభావ సంబంధముతోనుందుమని యర్థము. నేనూర్ధ్వ మందుండుటచే ఆకాశముతో సమానుడను. నీవు క్రిందనుండుటచే భూమితో సమానురాలవు. నేను వీర్యముంచువాడను. నీవు వీర్యమును భరించు దానవు. మనస్సు నేను వాక్కు నీవు. మనస్సుతో తలచినదే వాగ్రూపేణ వ్యక్తీకరింతుము గదా! అట్లే అన్యోన్య సంబంధముతో నుందుముగాక! అను మహోదాత్త భావములతో కూడిన మంత్రములవి. దీనివలన వధువు తన గోత్రమును విడిచి భర్త గోత్రమును స్వీకరించును. ఈ సప్తపది పూర్తికానిచో వివాహము కానట్లే. నేటి న్యాయశాస్త్రము కూడ అంగీకరించినది.

తరువాత 16 హోమములుండును "సోమాయ జనివిదే స్వాహా............ అగ్నయ ఇదం........." వీని భావము: చంద్రునికి, గంధర్వునకు, అగ్నికి హవిస్సులనర్పించుచున్నాను. 'ఓ ఇంద్రా!' ఈమెను పితృ కులమునుండి విడుచునట్లు పతి గృహము నుండి విడువకుండునట్లు అనుగ్రహించవలసినది. ఈమెను భర్త ఇంటి యందు బద్ధాను రాగమై యుండునట్లు చేయుము. ఓ ఇంద్రా! ఈమె యందు పదిమంది కొడుకులనిమ్ము. భర్తనైన నేను పదునొకండవానిగా ావింపుము.

జీవించిన పుత్రులు కలిగిన దానివిగా కావింపుము. ఈమె జుట్టు విరగబోసికొని ఱొమ్ము బాదుకొనకుండుగాక. అంతరిక్షము వెనుక భాగమును, వాయువు తొడలును, అశ్వినీ కుమారులు వక్షమును, సూర్యుడు పుత్రుని రక్షింతురుగాక. బృహస్పతి, విశ్వే దేవతలు

రక్షింతురు గాక! శిరస్సు నుండి వాడిన మాలికను తీసి చెట్టు మొ॥ వాని యందుంచిన రీతిగా గొడ్రాలి తనమును, పిల్లలు చనిపోవుటను అను అలక్ష్మిని శత్రువుల కొరకు విడిచి పెట్టుచున్నాను.

ఓ అగ్నీ! వరుణుని మాయందు కోపము లేనివానిగా చేయుము. దుఃఖమును పోగొట్టు ఔషధమును కలుగచేయుము. వీనికే ప్రధాన హోమమని పేరు. తరువాత.

## అశ్మారోహణము: (సన్నెకల్లు త్రొక్కించుట)

"ఆతిష్ఠేమ..........." అను మంత్రములభావమిది; ఓ చిన్నదానా! ఈ రాతినెక్కుము. దీనివలె శాశ్వతముగా, స్థిరముగా నుందువు గాక. యుద్ధము చేయువారికి పరాభవమును కలిగించుము. ఇట్లు స్థిరత్వము నభిలషించు వరుడు వధువును సన్నెకల్లు త్రొక్కించును.

## లాజహోమము:

తరువాత నామె దోసిటిలో నేయి అభిఘరించి ఆమె సోదరుడు రెండుసార్లు పేలాలు పోయగా మరల అభిఘరించి ఆమెచేత లాజ హోమమును చేయింతురు. అంగుళల చివరి భాగములచే కాక అంజలి యొక్క ఎడమ పార్శ్వమునుండి చేయవలెనని పెద్దల తీర్పు. అందుగల మంత్ర భావమును పరికింపుడు. భర్త దీర్ఘాయుర్దాయ నిమిత్తమై మనస్సున ఇట్లు తలచుచున్నది.! ఓ అగ్నీ! ఎద్దు మొ॥ నవి జలప్రవాహమును లక్ష్యపెట్టక దాటునట్లు సమస్త శత్రువులను లక్ష్యపెట్టకుందుముగాక. తరువాత

"అర్యమణం ను దేవం..............." అను మంత్రములుందును పూర్వము స్త్రీలు అగ్నిని పూజించి భర్తలను పొందిరి. ఆ అర్యముడు ఈ లాజలచే పూజింపబడిన వాడై ఈమెను పితృకులము నుండి విడిపించుగాక. పతి గృహములో బద్ధురాలగునట్లు చేయుగాక.

'ఓ అగ్నీ! చెట్లు నేతులతో పెరుగక నీటితో ఎట్లు పెరుగునో అట్లే దంపతులను అన్యోన్యరాగము కలవారినిగా చేయుము. నీవు

దాతలలో దాతవై యుంటివి. హోమములు, ప్రదక్షిణలైన వెనుక జయాది హోమములుండును. అవి పూర్తియైన వెనుక.

## యోక్త్రవిమోచనము:

"ప్రత్వా ముంచామి........." అను మంత్రములను చెప్పి వరుడు వధువు మొలకు కట్టిన త్రాటిని విప్పును. "నిన్ను వరుణ పాశమునుండి విడిపించుచున్నాను. బ్రహ్మలోకములో కూడ భర్తనైన నాతో నిన్ను శాశ్వతముగ ఉండునట్లు చేయుదును." అను నర్థమిచ్చు మంత్రమది.

## ప్రవేశ హోమము:

వరుడు భార్యను తన ఇంటికి తీసికొని వెళ్లి అక్కడ చేయవలసిన హోమము ప్రవేశ హోమము. కాని ఇప్పుడు కన్యాదాత ఇంటి యందే చేయుచున్నారు. ఆమెను తీసికొని పోవు రథము లేదా బండిపై ఏగు నపుడు పూర్వకాలమున పఠింపబడు మంత్రములను నేడు కూడ పఠించు చున్నారు. ఇంటిలో ఆమె సంకోచములు లేక నిర్భయముగా మెలగుటకు తగిన మాటలతో ఆమెకు ధైర్యము చెప్పును. "మూర్ధానం పత్యురారోహ" 'భర్తనైన నాపై ఆధిపత్యము వహించి నన్ను శాసింపుము. సంతానముచే పదవ దగు విరాట్ ఛందస్సువలె పది మంది పుత్రులతో కూడి యుండుము.' "స్త్రమాజ్ఞీభవ" అత్తమామలకు, వదినలకు, సంతానమునకు భర్తనైన నాకు యజమానురాలవు కమ్ము. అందరి అభిమానమును సంపాదించి వారితో చనవుగా మసలుకొనుము. తన ఇంటికి వచ్చిన వెనుక ఇంటికి ఈశాన్య ప్రదేశమందు ఇద్దరు దక్షిణోత్తరులై కూర్చుండి పదమూడు మంత్రములతో హోమము చేయుదురు. "ఆగనోష్ఠం..............." మంత్రములలో సమస్త భాగ్యములు కలిగిన నా భార్య నూరు సంవత్సరములు అగ్నిని సేవించుగాక. ఓ ప్రజాపతీ! ఇంద్రాగ్నులారా! మాకు సుఖము నొసంగుడు. బృహస్పతి నా కొరకు నిన్ను ఇచ్చెను. విశ్వకర్మ ఈ భార్యను పుట్టించెను. నా వలన సంతానమును బొంది నూరేండ్లు జీవింపుము. ఇట్లు దంపతులు, ఆయు ర్దాయము, పరస్పర ప్రేమ, సత్సంతానము, ధనధాన్య సమృద్ధిని కోరుదురు. ఈ ప్రవేశ హోమము వలన అగ్నికి గృహ్యాగ్నిత్వము సిద్ధించును.

తరువాత జయాది హోమములుండును. తరువాత 'ఇహ గావః' అను మంత్రమును పఠింతురు. అనగా గోవులను గుఱ్ఱములను సంబోధించుచు మీ సంతతిని వృద్ధి పొందింపుడని వరుడు కోరును. పురుష సంతానము కలిగిన జీవించిన పుత్రులు కలిగిన స్త్రీ యొక్క కొడుకును వధువు తొడమీద కూర్చుండ బెట్టి "చంద్రుని చేత దేవతలు బలవంతులైరి. చంద్రునిచే ఓషధులు, భూమి దృఢముగా నున్నవి. నక్షత్రముల సమీపమున చంద్రుడున్నాడు." అను నర్థమిచ్చు 'సోమేనా దిత్యా' అను మంత్రము పఠింతురు. ఆ మూడు సంవత్సరముల వయస్సు కలవానికి మూడింటికి తక్కువకాని ఫలములిత్తురు. "నాతో అన్ని సంపదలనుభవించి, వార్ధక్యమును పొంది పుత్రాదులకు కూడ యజ్ఞకర్మలిట్లు చేయుడు" అని చెప్పుదువుగాక" అను నర్థమిచ్చు 'ఇహప్రియం' అను రెండు మంత్రములను పఠించును.

అది మొదలు నక్షత్రములు కనబడు వరకు ఇద్దరు మాట్లాడరాదు. దీనివలన ఈ హోమము సూర్యాస్తమయమునకు పూర్వమే చేయవలెనని తోచుచున్నది.

ధ్రువ, అరుంధతి నక్షత్ర దర్శనము:

నక్షత్రములగపడిన వెనకు వరుడు వధువునుతూర్పుగా గాని ఉత్తరముగా గాని బయటకు తీసికొని వెళ్లి ధ్రువ, అరుంధతి నక్షత్రములను చూపింపవలెను. 'ధ్రువక్షితిః' మంత్రముతో ధ్రువుని చూపునపుడు "నీవు నాశనము లేనిదానవగుచు ఇతర నక్షత్రములు స్థిరపదమును పొందుటకు మార్గదర్శకమగుచున్నావు. మాపై యుద్ధమునకు వచ్చు శత్రువులనుండి రక్షింపుము" అని చదువును.

'సప్తర్షయః' అను మంత్రమును చదువుచు అరుంధతి నక్షత్రమును చూపుదురు. కశ్యపుడు మొ॥ ఏడుగురు మునులు తమ ఏడుగురి భార్యలలో, అరుంధతి అగ్రగణ్యురాలని, మనస్సు నందైనను వ్యభిచారగుణములు లేనిదని భావించిరి. ఈమె వసిష్ఠునితోనే యుండును. అట్లే ఈమెను ఈ ఏడుగురికి పిమ్మట ఎనిమిదవ దానిగాను, పవిత్రవంతురాలినిగా తలచితిమి.

ఇచ్చుట భర్త తాను ఎనిమిదవ మహర్షిగా భావించినట్లు తోచుచున్నది. ఆదర్శదంపతులైన అరుంధతీ వసిష్ఠుల దాంపత్యము ఆదర్శవంతమైనది కదా!

## ఆగ్నేయ స్థాలీపాకము:

తదుపరి స్థాలీపాకముండును. అనగా గిన్నె యందు వండుట. బియ్యము నిమిత్తము ధాన్యము దంపుట చెరుగుట, కడుగుట చేయ వలెను. ఆ అన్నమునుండి అగ్ని మొ॥ దేవతలకు హవిస్సు లిచ్చి మిగిలినది ఇద్దరికి తక్కువగాకుండ బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను. ఇది మొదలు 'యావజ్జీవం హోష్యామి' అని ప్రతిజ్ఞ పూని రెండు పూటల తండులములతో ఔపాసన హోమము చేయవలెను. 'స్థాలీపాకాంతో వివాహః' అను కోరికను బట్టి దీనితో పూర్తి వివాహ సిద్ధి యేర్పడుచున్నది.

## త్రిరాత్ర వ్రత దీక్ష:

దీని తరువాత మూడు రోజులు వధూవరులు బ్రహ్మచర్యమును పాటించుచు ఉప్పు, కారము మొ॥ వస్తువులు తినకుండ నేలమీద నిద్రించుచు బ్రహ్మచర్యమును పాటించుచు గడుపవలెను. "త్రిరాత్రం ఉభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షార లవణ వర్జనం చ".

## గంధర్వ స్థాపనము:

స్థాలీపాకమైన తరువాత ఒక దండమును గంధముతో పూసి వస్త్రమును గాని, త్రాటిని గాని కట్టి, ప్రాణ ప్రతిష్ఠ చేసి, పూజించి విశ్వావసువను "గంధర్వుడా! ఈ దండమును ఆవహించి యుండి మమ్ములను అన్యోన్య ప్రీతిగల వారినిగా చేసి రక్షింపుము," అనునర్థమిచ్చు శ్లోకమును పఠింతురు. వివాహాంగముగా మూడవ నాడు సదస్యము చేసెడివారు.

సదస్యము:

సదస్యమనగా సభాపూజ. వేద విద్వాంసులను రావించి వారి సమక్షములో ఇంద్రాది అష్టదిక్పాలక పూజ, గణపతి పూజ, సరస్వతీపూజ చేయుదురు. వారిని యథాశక్తి సన్మానించి వారి ఆశీర్వచనమును నూత్న దంపతులు గైకొందురు. ఫలప్రదానము, మంగళహారతితో ఫలప్రదానమైన వెనుక ఆశీర్వాదముతో ఇది సమాప్తము.

నాల్గవరోజున రాత్రి రెండు యామములు దాటిన తరువాత గంధర్వ రూపమైన దండమును ఉదీర్ష్వాతో............. అను మంత్రములచే ఎత్తివైచి శేషహోమము చేయుదురు. దీనివలన దీక్షా విసర్జనమగును. ఆ దండమును కడిగివేయుదురు. 'ఈమెను నాకు భార్యగా విడిచిపెట్టి మరియొక స్త్రీని కోరుము' అని ఆ మంత్రమున కర్థము.

శేష హోమము:

"అ త్తే" మొ॥ ఏడు మంత్రములతో ఏడు హోమము లుండును. అందు అగ్ని, వాయువు, సూర్యుడు, ప్రజాపతి మొ॥ దేవతలకు హవిస్సులనిచ్చి తన భార్య యందున్న అమంగళకర లక్షణములను తొలగింపుడనియు, శత్రువులను నశింపచేయుడనియు ప్రార్థించును. తరువాత జయాదిహోమములుండును.

సమీక్షణము:

'అపశ్యం త్వా మనసా' అను రెండు మంత్రములలో మొదటి మంత్రముచే వధువు వరుని, రెండవ మంత్రముచే వరుడు వధువును చూచుకొందురు. 'నాయందు సంతానము కనుమని, ఋతుకాలమందు గర్భధారణమందు కోరిక కలదానివికమ్మ్మ' అని అర్థము.

'సమంజంతు' అను మంత్రముచే రెండు వక్షముల నొక్కమారు తుడువవలెను. అనగా 'విశ్వేదేవతలు, ఉదకములు, వాయువు, బ్రహ్మ--వీరు మన మనస్సులను స్నేహముతో కూడినవిగా చేయుదురుగాక! సరస్వతి మనలనిద్దరను అనుకూల సంభాషణ కలవారినిగా చేయుగాక!' అని అర్థము.

తరువాత వరుడు ప్రజాపతే 'తన్వం' అను మూడు మంత్రములను జపించును. ప్రజాపతి, ఇంద్ర, సూర్యులు మాకు బలమిత్తురుగాక అని ప్రార్థించును. పిమ్మట గర్భాధాన మంత్రములను చెప్పెదరు. తరువాత కంకణమును విప్పవలెను. వివాహములో కొన్ని లౌకిక ఆచారములుండును. కొన్ని పదములు వాని యర్థములు.

పాకెన తగవు: సదస్యము రోజున మధ్యాహ్ననంతరము మంగళ వాద్యములతో ఫలాహార వస్తువులను విడిదెకు కొనిపోయి యిచ్చుట.

చతుర్థ తగవు: ఇది నాల్గవ రోజున సాయం సమయమున మంగళ ఘోషములతో అభ్యంగమునకు వలయు సామగ్రిని విడిదకు కొనిపోయి యిచ్చుట.

కంథ: మగపెండ్లివారు పెండ్లి కుమార్తె చేత గౌరీ పూజ చేయించు నిమిత్తము తెచ్చు ఫలాదులు.

కొట్నాలు: రెండు బుట్టలతో ధాన్యమును నూత్న వధూవరుల ముందిడ ముత్తైదువులు దంచి ఆ ఊకను వధూవరుల శిరమున పళ్లెరములతో చేరుగుదురు. తరువాత తలలకు చమురు పెట్టుదురు. తరువాత అన్య వస్త్రములను ధరించి మధుపర్కమును చాకలికి వేసి బహు శీఘ్రముగా ఆరవేసి తీసికొని వచ్చు ఏర్పాటు చేయవలెను. అభ్యంగన మైన వెనుక ప్రాతరౌపాసనము చేసి అగ్నికి ఉద్వాసనము చెప్పుదురు. ఇవి ప్రాంతీయాచారములు.

నాకబలి:

చివరిది నాకబలి. లోకములలో 'నాగవల్లి' యని వాడుక. ఈ తంతును ముత్తైదువులనడిగి చేయవలెనని భాష్యకారులు వ్రాసియున్నారు. దీనికి ముందే వరుడు విడిదెకు వెడలి ఆరనిచ్చి తెచ్చిన మధుపర్కముల ధరించి పాన్పుమీద అలుక పాన్పు సాగించును. మామగారు అతని కోర్కెలను తీర్చును. తరువాత తోడల్లునకు మరదలు మాడకట్నము చెల్లించి పెండ్లి కుమార్తెను వెంటబెట్టుకొని అంతకు ముందు సిద్ధముచేసి యుంచిన ప్రోలువద్దకు వచ్చి ముందు ముప్పది మూడు జ్యోతుల

పళ్లెములు రెండు పట్టుకొని ముత్తైదువులు నలుగురు నడుచుచుండగా అందరికంటె ముందు పురోహితుడు 'వాతో దేవతా సూర్యోదేవతా..........' అను మంత్రములు చెప్పుచు వసంతముతో దారిచూపు చుండగా ప్రోలునకు మూడు ప్రదక్షిణములను చేయును. ఇందు సర్వ దేవతలను ఆవాహనచేసి పూజింతురు. నూత్న వధువునకు దృష్టిదోష (దిష్టి) మును పోగొట్టుటకు చేయు దేవతా బలులే నాక బలియని చెప్పవచ్చును.

తెలుపు, పసుపు, ఎరుపు రంగులుగల బియ్యపు పిండి పసుపు, కుంకుమ లతో పుష్కరాకారముగా (చతురశ్రమని కొందరు) ముగ్గులు పెట్టుదురు. అందు మధ్యలో ఏనుగుల ఆకారముతో ముగ్గులు పెట్టుట కలదు. కొందరు ఉప్పుతో ఒక యేనుగు, పప్పుతో ఒక యేనుగు దిద్దుదురు. దాని చుట్టు 32 చిన్న మట్టి పిడతలను కోట ప్రాకారము మాదిరిగా అమర్చి ఆ పిడతలకు దారము చుట్టి నాల్గు దిక్కులయందు దీపములు పెట్టి యుండగా సువాసినీ స్త్రీలు జ్యోతులు తీసికొని వత్తురు. 33 జ్యోతులు 33 కోట్ల దేవతలకు గుర్తుగా గ్రహింపవచ్చును. ఈ దేవతలకు వసంతముతో అర్ఘ్యమునిత్తురు. దంపతులు ప్రదక్షిణము చేయుదురు. ఆయుధపూజ చేయుదురు. కొన్నిచోట్ల దంపతులు ఉప్పేనుగపై ఒకరు పప్పేనుగపై నొకరు కూర్చుండి పూజ చేయుదురు. భార్యాభర్తలు ఉప్పు, పప్పు మాదిరిగా ఒకరి కొకరు తోడునీడగా నుండవలెనని భావము. పూజయైన పిమ్మట పిడతలకు కట్టిన దారము తీయగా పోటీపడుచు మిగిలిన వారు పిడతలు తీసికొందురు. ఇదియొక దుర్గమును పట్టుకొని అందు ప్రవేశించుటను సూచించును. ఈ సందర్భమున పెండ్లి కుమార్తెకు పట్టు చీరనిత్తురు. ఈ నాకబలిని గర్భిణీ స్త్రీలు చూడరు. దీని పూజా విధానమున మంత్రములను విధించు సూత్రము లేకున్నను అనేక దేవతా మంత్ర నామములతో నున్న మంత్రములను చదువుచున్నారు. తరువాత నూత్న దంపతులు చేతులు కడుగుకొని కండ్లు తుడుచుకొని అక్కడనే విఘ్నేశ్వర పూజచేయుదురు.

నీలలోహిత పూజ:

గౌరీపూజ చేయుదురు. కృసరాన్నమును (పులగము) నివేదన చేయుదురు. పిమ్మట వధువు మెడలో వరుడు కుత్తుకంటుకట్టును.

సూత్రములు ఒకటి నలుపు, రెండవది ఎరుపుగా నుండును. నల్లపూసలు, ఎఱ్ఱపూసలు లేక బంగారు పూసలు కలిపి గ్రుచ్చినది కాన దీనికి నీలలోహితమనియు పేరు. ఇందు నీలలోహితే భవతః అను మంత్రమును చదువుదురు. ఎవరైనను అభిచారము చేసినచో దాని బాధ లేకుండుటకు, "ఈ సూత్రము శత్రువులచే నీపై ప్రయోగింపబడు పరాభవాదులను త్రిప్పికొట్టును. ఈమె బంధువులు వృద్ధి పొందుదురుగాక. ఈమె పతి స్నేహపాశముచే బంధింపబడుగాక" అను నర్థమిచ్చు మంత్రముతో పతికట్టును. కుత్తుకంటు (క్రుత్తుకకు అంటియుండునగ్న) సుమంగళీత్వమునకు గుర్తు. ఈ తంతు ఆచార ప్రాప్తమే. దీనిని ఆమె విడువరాదు.

ఆ తరువాత రెండు నీళ్ల బిందెల ముందుంచి ఒక బంగారు ఆభరణము ఒక వెండి ఆభరణమును ఆ బిందెలలో వేసి దంపతులనిద్దరును ఒక మారు తీయుడని, ఆ తీసిన వస్తువులను పురోహితుడు పుచ్చుకొని 'ఇయం వై రజితా' మంత్రముతో ఆ ఆభరణమునకు అంటిన నీటిని దంపతుల శిరస్సులపై చల్లును. ఇట్లు మూడుసార్లు చేయును. పిమ్మట దండాడింపు.

మిథున విడియములు:

నూత్న దంపతులు పాత దంపతులను పిలిచి తాంబూలములిచ్చి వారిని గౌరవించి వారి ఆశీస్సులను పొందుదురు. ఈ తంతుకు మిథున విడియములని పేరు. వాడుకలో మిథున వడియాలనుచున్నారు. పిమ్మట అప్పగింతలు. వధువు తల్లిదండ్రులు వరునకు, అతని తల్లిదండ్రులకు, బంధువులకు తన కుమార్తెను అప్పగించుట. ఆ సమయమున బట్టలు పెట్టుదురు. అప్పగింతలు సమయమున ఎవరి గుండెయైనను ఒకమారు కరుగును. ఇందుగల పాటలు కరుణ రసముతో కూడినవి.

"అష్టవర్షా భవే త్కన్యా పుత్రవత్పాలితా మయా
ఇదానీం తవ దాస్యామి దత్తా స్నేహేన పాల్యతాం"

అను శ్లోకముతో అప్పగింతురు. ఎనిమిదేండ్లు ఈమెను కొడుకుల మాదిరిగా ప్రేమతో పెంచితిమనియు, మీకు ఇప్పుడిచ్చుచున్నామనియు, మీరీమెను

ప్రేమతో చూడుడని పిల్ల తండ్రి వేదుకొనును. ఇది మన తంతు. తరువాత మనుగడుపులు (మనువు గడుపుట), పదునారు రోజుల పండుగ మొ॥ ఉండును.

## భిన్నభిన్న పద్ధతులు - ఆచార భేదములు:

వధూవరుల నెన్నుకొన్న వివాహ సంబంధి విధివిధాన మారంభమగును. ఈ విశాల దేశమున, బహుభాషాయుత ప్రదేశమున, రకరకములైన పద్ధతులు, రీతులు, చోటుచేసికొన్నవి. ఇది ఆనంద ప్రదమగుటచే అనేక దేశాచారములకు నిలయమైనది.

సూత్రములందు వివాహ కర్మకాండ విశేషముగ, విపులముగ వర్ణింపబడినది. విధానములందు ఒక గృహ్య సూత్రమునకు మరియొక దానికి కొన్నిచోట్ల భేదమగుపించును. కారణమేమన ప్రతి వేదశాఖకు స్వతంత్రమైన సూత్రముండును. ఇందు ప్రాదేశికమైన జన సంబంధి భేదములుండును. కాని ఇందు తత్త్వ భేదము మాత్రముండదు. కారణమేమన ఒకే ధార్మిక తత్త్వముపై సమస్త కర్మకాండ ఆధారపడియున్నది. ఈ సూత్రకర్త వైదిక మంత్రములనుదాహరించి సనాతన మార్గమును ఉపదేశించును. దేశ కాలాదుల వలన కొన్నికొన్ని ఆచారములు, పద్ధతులిందు ప్రవేశింపకపోలేదు.

ఆశ్వ.గృ.నందు వివిధ ప్రాంతములలో విభిన్న ఆచారములు కలవనియు వానిని తప్పక పాటింపవలెనని కలదు. "పద్ధతి చెప్పబడినది, కాని వారి వారి దేశాచారముల ప్రకారము అనుసరింపవలసియుండును" అని నారాయణ భట్టు వ్రాసియున్నాడు. "క్రమ ఉక్తః స చ దేశాచారవశే నాను సర్తవ్యః" అని ప్రయోగ రత్నమున కలదు. నిర్ణయ సింధువునందు "వివాహమునందు జనపద ధర్మముల పట్ల గ్రామ ధర్మముల పట్ల విశ్వాస ముంచవలెను" అని కమలాకరుడు వ్రాసెను. "జనపద ధర్మాన్ గ్రామ ధర్మాంశ్చ వివాహే ప్రతీయాత్." చాలామంది ధర్మ శాస్త్రములందు స్పష్టీకరింపబడిన విధులను అతిక్రమించి దేశాచారములను పాటించుచున్నారు. అని సంస్కార కౌస్తుభకారుడు అనుచున్నాడు. "సకల గ్రంథా

నన్నాదృత్యాచారాను సరణమే వేచ్ఛా పరితోషార్థం యథాచారమపి ప్రయోగో లిఖ్యతే."

ఆప.గృ. కొన్ని ఆచారములను స్త్రీలను అడిగి తెలిసికొని పాటింప వలెనని వ్రాసెను. దానిపై సుదర్శనాచార్యుడు, గ్రహాదులను పూజించుట, అంకురారోపణము, ప్రతి సరమును కట్టుట (చేతి మణికట్టునకు కట్టు దారము) మొ॥ సాధారణమనియు, నాకబలి, యక్షబలి, ఇంద్రాణి నర్చించుట అనునవి మంత్ర రహితముగా జరుపబడుచున్నవని వ్రాసెను. కాఠక.గృ. దేశ కులాచారములను పాటింపవలెనని వ్రాసెను. దానిపై వ్యాఖ్యానకర్తలు పెక్కు ఆచారములను పేర్కొనిరి.

ఈ సంస్కారములో కొన్ని ముఖ్యమైనవి ప్రాథమికమైనవి, కొన్ని అముఖ్యమైనవిగా నుండును. పాణి గ్రహణము, హోమము, అగ్ని ప్రదక్షిణము, సప్తపది మొ॥వి ముఖ్యమైనవి. కొన్ని ముఖ్యమైన వానిని అనుసరించియుండును. ఉదా: ధ్రువనక్షత్ర సందర్శనాదులు ముఖ్యమైన వానినన్నింటిని అన్ని సూత్రములు పేర్కొన్నవి. ఇందు కూడ ఒకే క్రమము పాటింపబడలేదు. ఉదా: సప్తపదికి ముందే అగ్ని ప్రదక్షిణము ఆశ్వ.చెప్పగా దీనికి విపరీతముగా ఆప.గృ.చెప్పినది. గోభి. గృ; ఖాదిర, బౌధలందు సప్తపది తరువాత పాణి గ్రహణము చెప్పగా పెక్కు సూత్రకారులు సప్తపదికి ముందుగానే చెప్పిరి. కొన్నింటిని అసలే చెప్పనివి కలవు. ఉదా: ఆశ్వలాయనమున, ఆప, బౌధ, మానవములందు కల మధుపర్క ప్రస్తావనలేదు. అట్లే కన్యాదానము కూడ చెప్పబడలేదు.

రఘు వంశమునందు కాళిదాసు, మధుపర్కము, హోమము, అగ్ని ప్రదక్షిణము, పాణి గ్రహణము, లాజహోమము, ఆర్ద్రాక్షతా రోపణములను ముఖ్యముగా పేర్కొనినట్లు తోచును.

తల్లిదండ్రుల యనుమతి: 8 రకములైన వివాహములందు గాంధర్వాదులందు తప్ప తల్లిదండ్రుల యనుమతి విధిగా నుండును. ముందిది లేనిచో వివాహమే లేదు. ఇందుకు అనేక దృష్టాంతములు కలవు. వాయు

దేవుడు, కుశనాభుని నూర్గురు పుత్రికలను తనను పెండ్లియాడుడని, దీర్ఘాయువునిత్తునని పల్కగా మా తండ్రిని కాదని, స్వతంత్రముగా వరించు వారము కాదని, అతడెవరికి మమ్ములనిచ్చునో వానినే భర్తగా వరింతుమని బదులుచెప్పిరి.

"మా భూత్స కాలో దుర్మేధః పితరం సత్యవాదినమ్
అవమాన్య స్వ ధర్మేణ స్వయంవర ముపాస్మహే
పితా హి ప్రభురస్మాకం, దైవతం, పరమం చ నః
యస్య నో దాస్యతి పితా స నో భర్తా భవిష్యతి." -- బాలకాండ.

అట్లే దండుడను రాజు శుక్రుని కుమార్తెయగు అరజను మోహింపగా పైవిధముగనే సమాధానము చెప్పుట, తండ్రి యనుమతి నిచ్చిన వెనుకనే సీతను రాముడు పరిగ్రహించుట మొ॥ నవి పూర్వ సాహిత్యమున అనేకములు కలవు.

వధూవరగుణ పరీక్ష: దీనినందరు పేర్కొనిరి.

## కన్యావరణము (వరప్రేషణ - వాగ్దానము)

"సరిసంఖ్య కలిగిన బ్రాహ్మణులను కన్యావరణములకై ఉత్తరాయణ మున, శుక్లపక్షమున, శుభ నక్షత్రమున పంపవలెను. దక్షిణ పూర్వకముగా నీయబడిన కన్య విషయమున ఇట్లు పంప పనిలేదు" అని బోధాయనుడు. "ఉదగయన ఆపూర్యమాణపక్షే పుణ్యే నక్షత్రే యుగ్మాన్ బ్రాహ్మణాన్ వరాన్ ప్రహిణోతి. అథ యది దక్షిణాభిస్సహ దత్తా స్యాన్నా త్ర వరాన్ ప్రహిణుయాత్." ఇట్లు కాఠకము, జైమినీయము కూడ పంపవలెనని చెప్పినవి. కన్యావరణము, కృత్తికా నక్షత్రములందు, స్వాతి, పూర్వ ఫల్గుని, పూర్వషాఢ, పూర్వ ప్రోష్ఠపద, నక్షత్రములందు జరుగవలెనని కాఠక, మాన వములు చెప్పినవి. ఇన్వాక నక్షత్రమునందు (మృగశీర్ష) వెళ్లినచో వధువు బంధువులచే స్వాగత సత్కారములు పొంది వెళ్లిన పని పూర్తి చేసికొని వత్తురని ఆపస్తంబుడు. కృత్తిక, స్వాతి, పూర్వాత్రయము వరించుటకు తగిన నక్షత్రములని, మృగశిర, ధనిష్ట, ఉత్తరాత్రయము వాగ్దానమునకు, వివాహమునకు యోగ్యములని వారాహము.

వధువునకై ఆమె తండ్రి ఇంటికి కొంత మందిని పంపుట అనాది నుండి వచ్చు ఆచారము. సవిత్ర దేవత కూతురగు సూర్యను సోమునికిచ్చు సందర్భమున కొన్ని మంత్రుములు ఋగ్వేదమున కలవు. ఇద్దరు అశ్వినీ కుమారులు సోమునితో సూర్య వధువును వివాహము చేయించుటకై వెళ్లిరి. సవిత ఇచ్చుట కంగీకరించెను. వరుడు గౌరవ పూర్వకముగా సత్కరింప బడెను. మధ్యకాలము నందు కూడ ముఖ్యముగ క్షత్రియులలో కూడ ముందు వరుడే వధువునన్వేషించుట కానవగును. హర్షచరితమునందు మౌఖరీవంశమునకు చెందిన రాజైన గ్రహవర్మ, హర్షుని చెల్లెలైన రాజ్యశ్రీకై దూతలను పంపును. ఆధునిక కాలమున దీనికి భిన్నముగానున్నది. కన్యయొక్క తండ్రియే వెదుకుచున్నాడు. శూద్రులందును. కొన్ని ఇతర వర్ణములందును అక్కడక్కడ పూర్వాచారమే కన్పించుచున్నది.

నారదస్మృతి యందు వరుని మిత్రుడు కన్యాదాత ఇంటికి వెళ్లి నిశ్చయించుటయే కాదు, వరుడే మిత్రులతో కలిసి వివాహమును నిశ్చయించుకొనుటకు వెడలునట్లు వ్రాయబడినది. "వస్త్రాలంకారముతో, మంగళ వాద్యములతో, వేద మంత్ర పఠనముతో ప్రేమపూర్ణ హృదయముతో కూడిన వరునితో, మిత్రుడు వధువు తండ్రి ఇంటికి వెడలవలెను. శచీదేవిని ఆరాధించిన వెనుక వరుడు అలంకరించిన వధువును సత్కరించిన వెనుక సౌభాగ్యము, స్వాస్థము, సంతతి కొరకు ప్రార్థన చేయవలెను." (వీర.మి.).

గదాధరుడిట్లు వ్రాయుచున్నాడు. "జ్యోతిష శాస్త్రమునసరించి శుభ దినమున మంచి వస్త్రములను ధరించి శుభశకున పక్షిని చూచి ఇద్దరు గాని, నలుగురు కాని, లేక ఎనమండుగురు కాని వరుని, తండ్రితో కూడి కన్యాదాత ఇంటికేగవలెను. నా కొడుకునకు నీ కన్యనీయ వలసినదిగా వరుని తండ్రి ప్రార్థించగా గోత్రోచ్చారణయైన వెనుక కన్య నిచ్చుచున్నానని, శాంతమైన, స్థిరమైన చిత్తముతో కన్యను చూడవలసినదని చెప్పగా వరుని చూడుడని వరుని తండ్రియనును." (వాగ్దానవిధి, గదాధర ద్వారా పా.గృ.సూ.) ఈ విధముగా నోటిమాటయైన వెనుక వరుని తండ్రి కులాచారమునసరించి కన్యను పూజించును. బ్రాహ్మణాశీర్వచనముచే ఈ

కర్మ పరిసమాప్తి. ఉత్తరదేశమున వధువు తండ్రి ఇంత కట్నమిత్తునని అంగీకరించుట, వరునకు యజ్ఞోపవీతము, ద్రవ్యము, కొన్ని ఫలములు కాన్కగా పంపుటచే వరరక్ష జరుగును. దీనినే వారు ఫలదానమందురు.

కన్యావరణముకన్న వరవరణము గొప్పదను అభిప్రాయమును చండేశ్వరుదు వ్యక్తీకరించుచున్నాడు. "వధువు సోదరదు, వరుని ఇంటికి వెళ్లి వరవరణ నిమిత్తమై పైన పేర్కొన్నవి ఈయవలెను."

"ఉపవీతం ఫలం పుష్పం వాసాంపి వివిధానిచ
దేయం వరాయ వరణే కన్యాభ్రాతా త ద్వైవచ"

అని కృత్య చింతామణి. ఉత్తర దేశమున దీనిని తిలక్ అని అందురు. ఈ విధి వివాహమునకు పూర్వమొక రోజు ముందుగా జరుగవలెనని గదాధరుదు కాని చాలరోజుల ముందుగానే జరుగుచున్నది.

## వివాహపూర్వము వరుని ఇంటియందు జరుగునవి:

శాంఖ్య, గృ.సూ.న వధువు తండ్రి పిల్లనిత్తునని చెప్పగా వరుదు తన ఇంటి యందు కొన్ని ఆజ్యహోమములు చేయవలెను. బోధాయనుదు నాందీముఖ శ్రాద్ధమును చేసిన వెనుక బ్రాహ్మణ భోజనానంతరము తరలి వెళ్లవలెనని వ్రాసెను. కారకము కూడ కొన్ని హోమములను విధించినది. "రేపుగాని, యెల్లుండిగాని కన్యకు వివాహము జరుగబోవుచుండగా నీ రోజు రాత్రియందు అర్ధరాత్రి గడచిన పిమ్మట ఓషధులు, పుష్పములు, సుగంధి ద్రవ్యములతో కూడిన జలములచే కన్యకు శిరఃస్నానము చేయించి కుసుంభ వర్ణము గల వస్త్రమును గాని, లేక నూత్న వస్త్రమును గాని కట్టబెట్టిన వెనుక హోమము లుండును. అట్లే వరుని ఇంట కూడ నుండును." (ఆ.ప. సమీక్ష నుండి).

## వివాహ లగ్నము:

దీనిని గూర్చి ఇంతకు ముందే వివరించితిని.

**మృదాహరణము లేక అంకురారోపణము:**

వివాహమునకు కొన్ని దినములకు పూర్వము పుట్టమన్నును తీసి కొనివచ్చి అయిదు క్రొత్త మూకుళ్లలో దానిని పోసి నవధాన్యములను పాలలో తడిపి అందు చల్లుదురు. దీనినే అంకురారోపణమందురు. ఆ మూకుళ్లను పంచపాలికలందురు. ఇది వివాహమునాడైనను చేయవచ్చును. విధి పూర్వకముగా వానిని పూజించి వివాహమండపము నొద్దనుంతురు. 16 రోజుః పండుగనాడు వానికి మరల పూజలు చేసి, మొక్కలతో కూడ మట్టిని బయట పోయుదురు. అందులోని మొలకలెట్లు వచ్చుచున్నవో అట్లే సంతానము వృద్ధియగుగాక అని భావము. వివాహమునకు పూర్వము తొమ్మిది, ఏడు, ఐదు, లేదా మూడవ దినమున శుభ సమయమున నృత్యగీతాదులతో గృహమునకు పూర్వముగాని, ఉత్తరపు వైపున నుండిగాని ఒక పాత్రతో మట్టిని తీసికొని రావలెనని గధాధరుడు (పా.గృ.సూ.).

లగ్నమునకు ముందుగా వధూవరుల ఇండ్లలో అభ్యంజన స్నానములు, పసుపు కొట్టుట, పేరటాండ్రను పిలుచుట, పెండ్లి కొడుకును, పెండ్లి కూతురిని చేయుట మొ॥ పెక్కు ఆచారములుండును.

**మండపకరణము:**

వివాహము, చేలము, ఉపనయనము, కేశాంతము, సీమంతము అను నవి ఇంటికి బయటనే ప్రత్యేక మండపమున జరుపబడవలెనని పార.గృ.సూ. చెప్పినది.

**ఘటిక:**

వివాహ దినమున ఘటికాయంత్రమును (గడియారము) ఈ శ్లోకమును పఠించిన వెనుక స్థాపింతురు. "నీవు యంత్రములకు ముఖమగుచున్నావు సృష్ట్యారంభమున బ్రహ్మ నిన్ను నిర్మించెను. కాలమే పతిపత్నుల భావాభావములకు సాధన కారణమగుచున్నది."

"ముఖం త్వమపి యంత్రాణాం బ్రహ్మణా విర్మితం పురా
భావాభావాయ దంపత్యోః కాలః సాధన కారణమ్."

-- గధాధర ద్వారా పా.గృ.సూ. 1-4-8

ఇది కాలమును సూచించు యంత్రము. నేడు దీని ఉపయోగములేదు.

వరయాత్ర:

కుతూహల పూర్వకముగా అహ్లాదరకమగు సన్నివేశములతో వరుడు, తన మిత్రులు, బంధువులతో కూడి యోగ్యమగు వాహనమెక్కి వధువు ఇంటికి వెళ్లును.

"కుతు కౌతుక బంధశ్చ మిత్ర బాంధవ సంయుతః.
యానం యథార్హ మారుహ్య యాతవ్యం చ వధూగృహమ్."-- వీ.మి.

తరలివెళ్లు సమయమున వరుడు గృహబహిర్ద్వారమున పూర్వాభి ముఖుడై యుండగా జ్యోతులతో, మంగళ ఘటములతో నున్న స్త్రీలు స్వాగతము పల్కుదురు. ఈ వివాహ ప్రస్థానము ఋగ్వేదమున, అథర్వణ వేదమున కూడ కలదు. దీనిని అశ్వ. సాంఖ్యా.గృ.సూ.లు పేర్కొన్నవి. పూర్వకాలమున వరుడు, రథమును గాని, ఏనుగుపైగాని, అశ్వముపైగాని ఎక్కి వెళ్లెడివాడు. పల్లకి ఎక్కుట అర్వాచీన కాలమని పాండే వ్రాసెను. కాని చతురంతయానమున ఇందుమతీ స్వయంవరమున కాళిదాసు వ్రాసెను.

"మనుష్య వాహ్యం చతురంతయానం"

మగపెండ్లి వారు, వరుని స్నాతక వ్రతమైన వెనుక వధువున్న గ్రామమునకు తరలి వెళ్లుదురు. స్నాతకానంతరము నదిని దాటకూడదను విధిచే చాలసుంది పెండ్లివారి యూరికేగి విడిది గృహములోనే జరుపుకొని మేళతాళములతో కల్యాణమండపమునకు బయలుదేరుదురు. దారిలోనే ఆడపిల్ల తరపువారు పానకాదులచే వీరిని గౌరవింతురు. దీనినే ఎదుర్కోలు సన్నాహ మందురు. ఇందు పానకపు బిందెలు, పాత్ర వరుని సోదరికి చెందును.

మధుపర్కము:

ఇంతకుముందే కొంత వివరించితి. వరుని వధువునింటి వద్ద ఆహ్వానించుటను. ఆప. బౌధ. మానము, కాఠకములు చెప్పినవి. సాంఖ్య, గృ. రెండు మధుపర్కములను చెప్పినది. ఒకటి వివాహమునకు ముందు, వివాహమునకు వెనుక, అనగా వరుడు తన ఇంటికి వచ్చినపుడు. కాఠక. గృ.పై, ఆదిత్య దర్శనుడు కొందరి మతప్రకారము వివాహానంతరమున నీయవలెననియు, కాని తన మతప్రకారము అన్ని ప్రాంతములందు వివాహమునకుముందే ఈయబడుచున్నదని వ్రాసెను.

అతిథిని పూజించినట్లుగానే వరుని పూజింపవలెనని బోధాయనము, ఆపస్తంబుడు, రెండు గోవులను (ఇంట నొకటి, వివాహ స్థలమున నొకటి) యని చెప్పెను. అట్లే సాంఖ్యాయనుడు అర్ఘ్య సమయమున నొక గోవును, ఇంటివద్ద నొక గోవును ఈయవలెనని ఈ రెండు మధుపర్కపుటావులని పేర్కొనెను.

పార. పద్ధతి వ్రాయుదును. మామ వరుని పూజించి కుశాసనము వేయును. వరుడు ఈ దిగువ అర్థమునిచ్చు మంత్రమును పఠించి ఆసనముపై కూర్చుండును. "సూర్యుడు విద్యుజ్జగత్తునందు ఉచ్చతముడై యుండునట్లు వీరిలో ఉచ్చస్థుడనైయుందును గాక." అర్ఘ్యజలమును స్వీకరించుచు నా సారము చ్యుతి పొందకుండుగాక, ఆచమన సందర్భమున నీవు ఐశ్వర్యము, గౌరవము వెంబడి నా దగ్గరకు రమ్ము. నన్ను తేజస్సు, ఓజస్సులతో నింపుము. నన్ను సమస్త ప్రాణులకు ప్రియునిగా, పశువులకు స్వామిగా ఏ ప్రాణిని హింసించని వానిగా అనుగ్రహింపుము. ఆ వెనుక అతడు 'సవిత్ర దేవుని ప్రేరణచే' ఆదిగాగల వాక్యములచే మధుపర్కమును స్వీకరించును. ఆచమనము చేసిన వెనుక శరీరమున గల అంగములను ఈ వాక్యముల ద్వారా స్పృశించును. 'నాముఖమున వాణి (భాషణశక్తి) నివసించుగాక! నా నాసికారంధ్రములందు ప్రాణవాయువుండుగాక! నా నేత్రములందు చూచుశక్తి, శ్రోత్రములందు శ్రవణశక్తి, బాహువులందు బలము, జంఘలందు ఓజస్సు ఉండుగాక! నా అంగము లక్షతమగుగాక. నా శరీరము క్షమతో కూడియుండునుగాక.'

వధూసత్కారము:

మధుపర్కమైన వెనుక పిల్లవాని తండ్రి సుగంధము, మాలలు, భూషణములు మొ॥ వాని ద్వారా వధువు నర్చించును (గర్గపద్ధతి), వధువు గౌరీపూజ చేసిన తరువాత ఆమె మేనమామ వెదురు గంపలో కూర్చున్న ఆమెను గంపతో సహితముగ తీసికొని వచ్చును. అతనిని వరుడు పంచల చాపునిచ్చి గౌరవించును. తరువాత వధూవరుల మధ్యను తెరకట్టుదురు.

ప్రతిసరబంధము: వధువు చేతికి రక్షాబంధనము. సాంగృ.కౌశి.సూత్రములు పేర్కొనినవి.

వధూవరప్రవేశము: ప్రత్యేక మండపమున వధూవరుల ప్రవేశము. పార. గృ.న కలదు.

పరస్పర పమీక్షణము: బౌధాయనమున స్నానము చేసిన, అలంకృతమైన ఒక బాణము ధరించిన కన్యను ఒక మంత్రము పఠింపబడుచుండగా వరుడు చూచును. అట్లే ఆప. హిర. వైఖ. మానవమున వరుడు స్వచ్ఛమైన హృదయముతో వధువును 'నన్ను చూడుము' అని చెప్పి మంత్రము చదువుచుండగా ఆమె ఈతనిని చూచును. పారస్కరము ప్రకారము వధువు తండ్రిగాని, లేక పురోహితుడుగాని మంత్రపురస్సరముగా పరస్పరము చూచునట్లు చేయుదురు. ఇందు విశ్వేదేవతలారా! జలాధి దేవత! మా హృదయములను ఏక సూత్రము చే కట్టుడు. (సమంజంతు) మాతరిశ్వ! ధాతా! మమ్ములను సంయుక్తులను చేయుడు. (సందధాతునే) సమంజ నము స్నేహమునకు, ప్రేమకు, భావి దంపతుల సంబంధమునకు ప్రతీకము వంటిది. పరస్పరము, అభిముఖముగా నుండి చూచుకొనుట యని కొందరనగా, కొందరి మతప్రకారము 'సమీక్షణము' విడిగా పేర్కొనబడినదనిరి. ఆశ్వ.గృ. పరిశిష్టమునందు వధూవరుల మధ్యలో ఒక తెరను కట్టవలెననియు, మంచి ముహూర్తమున దానిని తొలగించవలెననియు కలదు. అట్లే లఘు. ఆశ్వ. కూడ చెప్పనది. ఈనాటికి ఈ ఆచారము కలదు.

సమంజనము: వధూవరులను అభ్యంజనము చేయించుట అని ఒక వ్యాఖ్యానము. సాం.గృ. గోభి. గృ.లందు ఋక్ x 85.47 మంత్రముతో అభ్యంజనము, లేక చల్లుట చెప్పబడినది.

గోత్రోచ్చారణము:

కన్యాదానమునకు పూర్వము వధూవరుల పూర్వుల నామములను ప్రవర సహిత గోత్రములను మూడుసార్లు ఉచ్చరింపవలెనని వాసుదేవుడు, హరిహరుడు వ్రాయుచున్నారు. ఒక్కమారే ఉచ్చస్వరముతో నుచ్చరించవలె నని గంగాధరుని అభిప్రాయము (గర్గపద్ధతి). వివాహమును చూచువారికి వధూవరులిద్దరు గొప్పకులమున జన్మించిన వారని, పూర్వుల పరంపర అనేక తరముల నుండి వచ్చుచున్నదని సూచించుటయే దీని ప్రయోజనము. గృహ్య సూత్రములీ విధిని పేర్కొనలేదు. పద్ధతి గ్రంథములే పేర్కొన్నవి.

కన్యా ప్రదానము:

మానవ కాఠకములందు కన్యను చూచిన వెనుక వరుడు వివాహము చేసికొని వచ్చుటకు ముందుగా విధించినవి. ఇది కన్యావరణములోనే అంతర్భూతమగును. ఈ రెండును రెండు రకములైన కన్యాదానమును చెప్పినవి. 1) బ్రహ్మదేయ వధువునిచ్చుట, 2) శుల్కదేయ వధువునిచ్చుట. బ్రహ్మ వివాహ పూర్వకముగా నీయబడినది బ్రహ్మదేయ వధువు. దాత ప్రతి గ్రహీతలు కూర్చొనియుండగా ఒక కంచు పాత్రలో నీటిని పోసి దానియందు వ్రీహి, యవలు, బంగారమును ఉంచగా, దాత ప్రతిగ్రహీ తలు ఇచ్చుచున్నాను. పుచ్చుకొనుచున్నానని ముమ్మారు పలుకుదురు. మానవ.గృ. ప్రకారము ఒక సుమంగళి దీనిని గ్రహించి పిల్ల తండ్రికిచ్చును.

శుల్కమును గ్రహించి యీయబడునది శుల్కదేయ వధువు. దాత కన్యామూల్యముగా బంగారమునిచ్చును. దాత సంతానము కొరకిచ్చుచు న్నానని చెప్పగా 'భాగ్యము కొరకు' అని ప్రతిగ్రహీత గ్రహించును. అని లేగాక్షి. వైఖ.గృ. నందు బ్రాహ్మపద్ధతి చెప్పబడినది. బౌధ.పార. లు వధువును వరునకిత్తురనియే చెప్పినవి కాని వివరముల జోలికి పోలేదు.

ఈ దానము షోడశ మహా దానములలో నొకటి. సూత్రములు వధువు తండ్రి కన్యాదానమును చేయుటను పేర్కొనగా స్మృతులందు దగ్గరవారికి కూడ ఈ అధికారమును సంప్రాప్తింపచేసినవి. తండ్రి, తాత, సోదరుడు, సజాతీయవ్యక్తి, తల్లి వీరలలో యథా క్రమముగా పూర్వా

భావమునందు ఉత్తరోత్తరులు కన్యాదానము చేయుటకు అర్హులని యాజ్ఞవల్క్యుడు. నారదుడు, తాతను పేర్కొనలేదు. మిత్రుని, తల్లితండ్రిని పేర్కొనెను. (వీర.మి.).

ఇందే, "నీవు నీమనస్సు ద్వారా వాయువేగముతో నానా దిక్కులకు తిరుగుచున్నావు. బంగారు రెక్కలు కలిగిన నీ మనస్సు నాయందు కేంద్రీకరింపబడుగాక" అని పార.గృ.న కలదు.

"యదేషి మనసా దూరం దిశోఽనుపవమనో వా
హిరణ్య పర్ణో వై కర్ణః స త్వా మన్మన సాం కృణోతు."

పద్ధతి గ్రంథములందు దీనినే వధ్వా దేశమని వ్రాసిరి. దీని వెనుక సమీక్షణముండును.

వివాహ సంబంధమైనకానుక: గోభి, భార, జైమిని, పార.లు వరుడు, వధువునకు క్రొత్త వస్త్రముల (అహత) నిచ్చునని వ్రాసియున్నవి. అహతమనగా ప్రచేతసుడు.

"ఈషద్ధౌతం నవం శ్వేతం సదశం యన్న ధారితమ్
అహతం తద్వి జానీయాత్సర్వ కర్మసు పావనమ్."

-- సంస్కార రత్నమాల.

వార్ధక్య పర్యంతము జీవింపుము అను నర్థమిచ్చు మంత్రమును చదువుచు ఇచ్చును.

ప్రోక్షణము, అభ్యంజనము, యోక్త్రబంధనము:

పూర్ణ జలకుంభమును ఆకులతో నున్న జమ్మి కొమ్మతో కప్పి ఒకడు తీసికొని రాగా ఆ నీటితోనే 'శం న ఆపః' అని (ఓషధులతో కూడిన నీటితోనే) కన్యకు స్నానము చేయింపవలెనని కాఠక.గృ.న కలదు.

మానవ. గృ.ల కాడినుండి జలముచే అభిషేకము చేయునపుడు 'బాణ' అను వాద్యమును వాయించవలెనట. అశ్మారోహణము చెప్పిన వెనుక లాజహోమమునకు ముందు ఈ గృహ్యమే యోక్త్రబంధనమును,

సమంజనమును చెప్పినది. దర్భత్రాటిని మొలకు కట్టిన వెనుక వధువు వరునికి మూడు సార్లు కాటుక (త్రైకకుభ - అంజన) పెట్టును. ముందు కుడికంటికి తరువాత ఎడమకంటికి మంత్ర పూర్వకముగా జరుగును. మిగిలిన కాటుకను వరుడు వధువు కంటికి మౌనముగా పెట్టును.

## వధూవరులు జతగా కూర్చుండుట:

అగ్నికి పడమర వైపున తూర్పుముఖముగా వధూవరులు కూర్చుందురని అన్ని సూత్రములందుకలదు. వధువు వరునికి కుడివైపున కూర్చుండునని బౌధ, గోభి, జైమిని, హిర, ఆప, ఖాదిరములు చెప్పగా కాఠకమున దీనికి విరుద్ధముగా వరుడు వధువునకు కుడివైపున కూర్చుండునని వ్రాసినది.

## వైవాహిక హోమము:

ఆహుతుల గురించి ఎన్ని మంత్రములు పఠింపవలెనను విషయమై భిన్నాభిప్రాయములు కలవు. పారస్కరమునందు రెండు ఆఘారాహుతులు, ఆజ్యభాగాహుతులు రెండు, మహావ్యాహృతులతో ఆహుతులు, ప్రాయశ్చిత్తాహుతులు, ప్రాజాపత్య స్విష్టకృత్ ఆహుతులు వేల్చవలయును. రాష్ట్రభృత్, జయ, అభ్యాతానములతో ఆహుతులను వేల్చవచ్చునని యనెను. యజుర్వేద సంబంధి సూత్రములు రాష్ట్ర భృదాదులను చెప్పనవి. మానవ గృహ్యమున నక్షత్రమునకు, దాని అధిదేవతకు, తిథికి, దాని అధిదేవతకు, ఋతువునకు దాని అధిదేవతకు కూడ ఆహుతులను విధించినది. కాఠక, జైమినీయములు ఆహుతులైన వెనుక మిగిలిన శేషమును కన్య శిరస్సుపై నుంచవలెనని పేర్కొన్నవి. సాంఖ్యాయనమున, ఆహుతుల వెనుక కన్యతండ్రిగాని, సోదరుడు గాని కన్య కెదురుగా నిలిచి ఖడ్గాగ్రముచే గాని స్రువముచే గాని యామె మూర్ధ ప్రదేశమున ఆజ్యముంచును. (అ.క. సమీక్ష).

ఈ హోమములందు అనిష్టమును కలిగించు శక్తులపై విజయమును సాధించుటకు, లేదా వానినుండి రక్షణ కొరకు ప్రార్థనలుండును.

పాణిగ్రహణము:

గోభి. యందు వరుడు కన్యాకరమును పట్టుకొని అగ్నికి ఎదురుగా తీసికొని వచ్చుచు 'సోమోఽదదత్ గంధర్వాయ' అని పఠించవలెనని కలదు. ఈ విషయమై మన పద్ధతిలో కొంత వివరించితిని. ఈ ఋక్కును సాయణాచార్యుల వారిట్లు వ్యాఖ్యానించిరి. ఎంతవరకు కామ భోగమునందు కోరికపుట్టదో ఆకాలమున సోముడు కన్యను ఉపభోగించుచున్నాడు. ఎప్పుడై వచో నది ఆరంభమగుచున్నదో అపుడు గంధర్వుడు పరిగ్రహించుచున్నాడు. వివాహ సమయమాసన్నమైనపుడు అతడగ్నికిచ్చుచున్నాడు. అతడు మను ష్యునకు ఐశ్వర్యము, సంతానోత్పత్తి కొరకిచ్చుచున్నాడు. స్మృతులందింకను స్పష్టముగా కలదు. ముందు కన్యను దేవతలు అనుభవించుచున్నారు కనుక స్త్రీలకెట్టి పాపమునంటదు. సోముని వలన పవిత్రత, గంధర్వుని వలన వాణి, అగ్నినుండి సర్వమేధత్వము కన్యకు సంప్రాప్తించుచున్నవి. అందువలన స్త్రీలకు సదా పరమ పవిత్రత ప్రాప్తించుచున్నది.

"పూర్వం స్త్రియః సురైర్భుక్తాః సోమ గంధర్వ వహ్నిభిః
గచ్ఛంతి మానుషాన్ పశ్చాన్నైతా దుష్యంతి ధర్మతః
సోమః శౌచం దదౌ తాసాం గంధర్వశ్చ తథా గిరమ్
పావకః సర్వమేధత్వం మేధత్వం యోషితాం సదా." -- అంగి.స్మృతి.

దీనివలన విభిన్న దశలలో స్త్రీ యొక్క శారీరక మానసిక వికాసముపై దేవతల ద్వారా జరుగునట్లు అవగతమగుచున్నది. స్త్రీల రజస్సునకు కూడ అగ్ని కారణము. అందుచే స్త్రీలు సంతానము కనుటకు సమర్థలగుచున్నారు.

శాంఖ్యాయన, ఆశ్వలాయనములందు పాణిగ్రహణ సమయమున వరుడు నిలబడి పడమరకు అభిముఖుడుగా నుండుగా వధువు కూర్చుని తూర్పునకు తిరిగి యుండును. కాఠక. గృ.న ఇద్దరు కూర్చుని యుందురు. వధూవరుల హస్తములు పాణిగ్రహణ సమయమున ఫలపుష్పాది యుత ముగనే యుండవలెనని కలదు.

గోభిలము, హోమము, అగ్ని ప్రదక్షిణము, లాజహోమము సప్తపది వెనుక .పాణిగ్రహణము చెప్పినది.

వివాహమున ఇది ముఖ్యవిధిగా పరిగణింపబడుచున్నది. మనవలెనే ప్రాచీన రోమనులు కూడ దీనిని పాటించినటుల తెలియుచున్నది. దీనిని వారు "dextraram junction" అని అందురని వెబర్ వ్రాసియున్నాడు.

గాథా గానము:

కాఠక. గృ.ని బట్టి పాణిగ్రహణమైన వెనుక పురోహితుడు కొన్ని ఋక్కులను (గాథలను) వరునిచే పఠింపచేయును. కొందరి మత ప్రకారము వధూవరులచే పఠింపచేయును. అవి 21 గాథలని దేవపాలుడను వ్యాఖ్యాత వ్రాసెను. పార.గృ.న అశ్మారోహణమైన వెనుక రెండు ఋక్కులు గల ఒక గాథను గానము చేయునని కలదు. అది సరస్వతీ స్తోత్రపరము. "భాగ్యవంతురాలు, స్తుతింబడు దానవునగు ఓ సరస్వతీ! ఈ వివాహమును మిక్కిలి రక్షింపుము. సమస్త భూతములలో నిన్ను ముందుగా స్తోత్రము చేయుచున్నాను. అది స్త్రీలకు ఉత్తమ యశస్సునిచ్చును." అను నర్థమిచ్చు మంత్రమును పఠించును.

అశ్మారోహణ, లాజహోమ పరిణయన క్రమము:

ఈ క్రమముపై సూత్రములు భేదించినవి. హిరణ్యకేశి ప్రకారము పాణిగ్రహణమునకు ముందే అశ్మారోహణము. ఆ వెనుక లాజహోమ పరిణయనములు. పారస్కరమున పాణిగ్రహణమునకు ముందే లాజహోమము. ఆ వెనుక అశ్మారోహణ పరిణయనములు.

పెక్కు సూత్రములందు అశ్మారోహణ, లాజహోమ, పరిణయనముల వరుస పాటింపబడినది.

అశ్మారోహణము:- వధువును రాతిపై త్రొక్కించుట. శత్రువులను అణచి వేయు శక్తికి, దార్ఢ్యమునకు రాయి ఒక గుర్తువంటిది.

కౌశికుని అభిప్రాయముననుసరించి గుండ్రాయి గోమయముపై నుండ వలెను.

మానవ గృహ్యమున వధూవరులిద్దరు రాతిపై కుడికాలును మోపుదురు. ఈ సమయమున ఒక మంత్రమును పఠింతురు. "ఇంద్రుదు, ఇంద్రాణితో గంధమాదన పర్వతమునుండి దిగినట్లు నీవు నీ భార్యతో కలిపి దిగుము." వధువు నీమంత్రముతో సంబోధింతురు. "రాయి నెక్కుము. పాదమునుంచుము, దీర్ఘాయుర్దాయముతో సంతానముతో నుందువుగాక." ఇది రెండుసార్లు జరుగును.

లాజహోమము:- పేలాలు నక్షత్ర స్వరూపములని యజుర్వేదము. మేధకై, యశస్సుకై లాజహోమము విధింపబడినది.

శాంఖ్య, పారలు వధువు నిలబడి చేయవలెనని వ్రాసినవి. శాంఖ్య.న ఆమె తండ్రిగాని, సోదరుడు గాని శమీపత్ర సహిత లాజలను ఆమె అంజలిలో పోయునని కలదు. కాఠక. గృ.న సోదరుడుగాని బ్రహ్మచారి గాని ఆమె అంజలిలో పోయవలెనని కలదు.

హిర. గృ.న ఆమె అంజలిలో వరుడే రెండుసార్లు పోయును. ఆమె అంజలితో కలిపి హోమము చేయును.

మానవ.గృ.న వధువు సోదరుడుగాని బ్రహ్మచారి గాని దోసిలితో వధూవరుల అంజలులలో పోయును. వధూవరులిద్దరు హోమము చేయుదురు.

కౌశిక సూత్రమున అశ్మారోహణమైన వెనుక రాతిపై నిలబడిన వధువు 3 సార్లు హోమము చేయును. నాల్గవది కామునకు హోమము.

వరుడు మంత్రములను చదువు చుండగా వధువు మూడుసార్లు వేసి నాల్గవది మంత్రరహితముగా వేయునని ఆశ్వలాయనము. కొంతమంది మూడుసార్లేనని చెప్పిరి.

భార.గృ.న "నాకు భాగ్యమును కలిగించు లాజలను హోమము చేయుచున్నానని" వధువు పలుకునట్లు చేయుదురు.

వధువు అంజలిలో ఆమె సోదరుడు లాజలను పోయుట చాలమంది సూత్రకారులు పేర్కొనిరి. యాస్కుని వ్యుత్పత్తి ప్రకారము 'స్యాల' యనగా లాజలను పోయువాడని అర్థము వచ్చును.

అగ్నిప్రదక్షిణము (పరిణయనము):

లాజహోమమైన వెనుక అగ్ని చుట్టు ప్రదక్షిణము చేయుదురు. వరుడీ దిగువ మంత్రమును పఠించును. 'ఓ అగ్ని! ఈమెను తండ్రి మొదలగు వారు వివాహాధిష్ఠాన దేవతయగు సూర్యయను దేవతతో కూడ పూర్వమందు నీకిచ్చిరి. ఇప్పుడీమెను నాకు భార్యగా చేసి దీనియందు నా వలన సంతానమును పొందునట్లు చేయుము.'

"తుభ్యమగ్రే పర్యవహన్త్సూర్యాం వహతునా సహ
పునః పతిభ్యో జాయాందాఅగ్నే ప్రజయా సహ."

శాంఖ్యాయనము అశ్మారోహణమైన వెనుక ప్రదక్షిణము చెప్పగా ఆశ్వలాయనము పాణిగ్రహణమైన వెనుక విధించినది. ఇంకను సూత్రకారులతో క్రమమును గూర్చి భిన్నాభిప్రాయములు కలవు.

లాజహోమమునుండి పరిణయనము వరకు రెండుసార్లు అగ్ని ప్రదక్షిణము చేయించవలెనని పారస్కరము.

శిఖా విమోచనము:

"ఆశ్వలాయనమున ప్రదక్షిణమైన వెనుక కన్య స్వదేశాచారము ననుసరించి రెండు సిఖలను కట్టి యుండిన నందు దక్షిణోత్తర శిఖలను క్రమముగా వరుడు విప్పును." (అ.క.స.) వరుణ పాశమునుండి విముక్తి చేయుచున్నానని యర్థము. ఈ ఆచారము రోమనులలో కూడ కలదని హోస్ దొర వ్రాసియున్నాడు.

సప్తపది:

బౌధాయనమున ఇది వివాహారంభముననే, హోమమునకు ముందే కలదు. కాని ఆప. యందు పాణిగ్రహణమైన వెనుకవచ్చును. పారస్కరమున

ఐదవ యడుగు వేయునపుడు పశు సమృద్ధి కావలెనని కోరగా ఆశ్వలాయనమున సంతానము కావలెనను కోరిక కలదు.

హిర. గృ. అగ్నికి పడమరగా తూర్పువైపునగాని, ఉత్తరపు వైపున గాని వేయించవలెనని కలదు.

బౌధ. హిర. లందు వధువు ఏడవయడుగున ఆగి యున్నపుడు వరుడు ఏడడుగులతో 'మనము సఖులమైతిమి. నీ బంధమునుండి విడివడకుండ నుందును గాక! నా బంధమునుండి విడివడకుండ నుందువుగాక' అను నర్థమిచ్చు మంత్రమును పఠించును.

కాఠక. గృ. అగ్నికి ఉత్తరమున దర్భలు పరచియుండగా వానిపై వరుడు వధువుచే ఏడడగులు వేయించును.

కౌశిక సూత్రమున 'సప్త మర్యాదా' అను మంత్రముచే అగ్నికి ఉత్తరపు దిక్కున తూర్పునకుండునట్లుగా ఏడుగీతలు గీసిన స్థలముపై వధువు పాదము నుంచును. కొందరు ఏడు బియ్యపు పోగులపై త్రొక్కునట్లు చేయుదురు.

అథర్వ వేదమున ఒక మంత్రమునందు ఒక ఋషి వరునితో ఏడడుగులు వేయుటతో నీవు నాకు మిత్రుడవైతివని అనును.

సప్తపది యైన వెనుకనే తన గోత్రము నుండి విడివడి పతి గోత్రమున వధువు చేరునని ఇంతకుముందే చెప్పితిని. దానికి ప్రమాణము:

"స్వగోత్రాత్ భ్రశ్యతే నారీవివాహాత్ సప్తమే పదే
పాణిగ్రహణ మంత్రాస్తు నియతం దారలక్షణమ్
తేషాం నిష్ఠాతు విజ్ఞేయా వివాహాత్ సప్తమే పదే." -- మ.స్మృతి.
"నోదకేన న వాచా వా కన్యాయాః పతిరుచ్యతే
పాణిగ్రహణ సంస్కారాత్ పతిత్వం సప్తమే పదే." -- యా.స్మృ.

## మూర్ధాభిషేకము:

సప్తపది యైన వెనుక వధువు శిరస్సుపై ఈ మంత్రముతో అభిషించనము చేయుదురు. 'ఓ జలము లారా! ఔషధ ప్రదానము చేయుడు.' (పా.గృ.)

జలము, ఔషధ తత్త్వమునకు, పవిత్రతకు ప్రసిద్ధి పొందినది. ఈ విధి వలన వధువు శారీరక దోషము నుండి విముక్తురాలగును. వైవాహిక జీవనమున పవిత్రత ఏర్పడును.

సాంఖ్యాయనమున దంపతుల శిరస్సులపై నీటిని చల్లుట కలదు. ఆశ్వ. గృ.న వధూవరులు సప్తపదియైన వెనుక నిలబడి యుండగా అక్కడ నున్న ఉదకుంభము నుండి గ్రహింపబడిన జలముచే వారి శిరస్సులపై చల్లుదురు. 'సమంజంతు విశ్వేదేవా:' అను మంత్రమును అభిషేక సమయమున వరుడు పఠింపవలెనని గోభిలము.

## హృదయాలంభనము లేక హృదయస్పర్శ:

యజుర్వేద సంబంధి సూత్రములందు ఉపనయనములో మాదిరిగా సప్తపదియైన వెనుక వరుడు కొన్ని మంత్రములతో వధువు హృదయమును తాకును. హిర. గృ. సూ.న వరుడు, వధూనాభిని కుడిచేతితో 'నీవు సమస్త ప్రాణ వాయువులకు కేంద్రము వదులుకాకుము' అను నర్థమిచ్చు మంత్రముతో తాకును.

భార. గృ. సూ.న వరుడు వధువు హృదయమును స్పృశించుచు 'నీ హృదయము నా హృదయమందు, నీ మనస్సు నా మనస్సుయందు ఉండుగాక. ఏకాగ్రతతో నా మాటను విందువు గాక! నా సఖురాలవై యుండు' మనును. తరువాత ఆమె చెవిలో ఇట్లు జపించును. "నీ ఆలోచన నాలో ప్రవేశించుగాక. నీ కన్నులు, మనస్సు నా కనుబంధమై యుండునుగాక." ఇంచుమించుగా నట్లే పారస్కరమున కూడ కలదు. హృదయము భావములకు కేంద్రము, దీనిని స్పృశించుట ద్వారా దాని

నుద్బుద్ధము చేయుచున్నాడు. ఇదియొక ప్రతీక. వధూవరుల పరస్పర స్నేహమునకు ఇది నాంది వాక్యమువంటిది.

### సూర్యోదీక్షణము - ధ్రువదర్శనము:

ఇంచుమించు వివాహ సంస్కారము సమాప్తమగుచుండగా పగలు సూర్యుని 'తచ్చక్షుః' అను మంత్రముతో వధువునకు చూపింతురు. (పా.గృ.) రాత్రి యందు ధ్రువనక్షత్రము చూపింతురు. ఆమె ధ్రువ నక్షత్రము చూడలేకపోయినను నేను చూచుచున్నానని అనవలెనని పార. గృ.ల కలదు.

జైమిని. గృ.న వివాహమైన వెనుక వధువు పుట్టింటనే పై నక్షత్రాదులను చూపించవలెనని కలదు. కాని పెక్కు సూత్రకారులు వరుని ఇంటియందే చూపించవలెనని వ్రాసిరి.

### ప్రేక్షకాను మంత్రణము:

గోభిలమున సప్తపదియైన వెనుక వరుడు సుమంగలీరియం అను మంత్రముతో వివాహమును చూచుటకు వచ్చిన వారితో "వధువు సుమంగళి, సౌభాగ్యవంతురాలినిగా దీవించి మీమీ గృహములకు తరలుడు" అని కోరును. అట్లే కాఠక, మానవ పారస్కరములు. ఈ సందర్భమున సిందూరదానమును ఉత్తరదేశమున చేయుదురు. ఇది సూత్రములందు లేదు. పద్ధతి గ్రంథములందు కలదు. ఆచారమును బట్టి సిందూరదానము చేయుచున్నారని గదాధరుడు వ్రాసెను. ఇప్పటినుండి వధువు సుమంగళియని పిలువబడును.

### యోక్త్రి విసర్జనము, సీమంతము, సహభోజనము:

వారహమున సప్తపదియైన వెనుక అగ్నికి పడమరయందు ఎట్టని ఎద్దు చర్మమును రోమములు పైకుండునట్లుగా భూమిపై పరచి, దానిపై దర్భలు కప్పి యుండగా దర్భత్రాటిని విప్పవలెనని కలదు. ఆపైన వివాహకాలమున సీమంతము వచ్చును. అట్లే మానవమున కూడ.

**వివాహదక్షిణ:**

వివాహాంతమున పురోహితునకు దక్షిణనీయవలెను. సూత్రములను బట్టి ఆచార్యుడు బ్రాహ్మణుని నుండి ఒక గోవును, క్షత్రియుని నుండి ఒక గ్రామమును, వైశ్యుని నుండి ఒక గుఱ్ఱమును దక్షిణగా పొందవలెను అని పా. గృ.న కలదు. గోభి. బౌధ.లు ఒక గోవునే దక్షిణగా చెప్పినవి. నేడిట్లీయకపోయినను యథాశక్తి ద్రవ్యమిచ్చుచున్నారు.

**వధూవరయాత్ర:**

హిర. ఆప. గృ.లందు వివాహమైన వెనుక వధువును రథముపై గాని, వాహనముపైగాని ఎక్కింతురని కలదు. రథము సిద్ధము చేయున పుడు, ఎక్కునపుడు, నావ నెక్కునపుడు, నదీ తరణములందు పెక్కు మంత్రముల పఠనముండును.

ఆప.గృ. హిర.గృ.లందు వివాహాగ్నిని వధూవరుల వెనుకగా తీసికొని వెళ్ళవలెనని చెప్పగా, ఆశ్వ. గృ.న వధూవరులకు ముందుగా నని కలదు. మానవ కాఠకములందు పుణ్య దివస ప్రయాణమును చెప్పినవి.

**గృహప్రవేశము:**

సాయం సంధ్యా కాలములో వధూ గృహప్రవేశము జరుగవలెనని మానవము చెప్పినది. గోభిలమున ఇంటిలో వధువు ఎఱ్ఱని ఎద్దు చర్మముపై కూర్చుండబెట్టవలెనని విధించినది. అందు పఠింపబడు మంత్రములను బట్టి ఎద్దు చర్మము సమృద్ధికి ప్రతీకమేమో అని అనిపించుచున్నది. ఈనాడీ ఆచారము లేదు. అట్లే పార.న. కలదు.

కౌశిక సూత్రమునందు వధూగృహప్రవేశమున మరల రాతిపై నెక్కుట, అగ్ని చుట్టు మూడుసార్లు ప్రదక్షిణము, ఇష్టదేవతలను, కుల దేవతలను పూజించుట మొ॥ నవి కలవు.

గృహప్రవేశ హోమములుండును. ఇంతకు ముందు వివరించితిని.

పిల్లవానిని తొడపై కూర్చుండబెట్టుట:

కౌశిక, గోభిల, జైమిని మానవములందు హోమములకు ముందే పిల్లవానిని వధువు ఒడిలో కూర్చుండబెట్టుట యుండగా సాంఖ్య, కాఠక, ఆప. లందు హోమములైన వెనుక కలదు. కౌశికమునందు కల్యాణ నామము కలిగిన పిల్లవానిని కూర్చుండబెట్టవలెనని కలదు.

తరువాత వధూవరులు దధిప్రాశనము చేసి నక్షత్ర దర్శన పర్యంతము మౌనముగా కూర్చుందురు. మానవ. గృ.న దధి, మధువులను వివాహమైన వెనుక వధువు యొక్క ఇంటి దగ్గరే ప్రాశనము చేయవలెనని విధించినది. వివాహమైన వెనుక వధువు యొక్క ఇంటనే ధ్రువ నక్షత్ర దర్శనము విధించు సూత్రములు, హోమమైన వెనుక వధూవరులు మౌనముగా కూర్చుండనవసరములేదని చెప్పినవి.

ధ్రువ, అరుంధతీ దర్శనము:

దీనిని ఇంతకుముందే కొంత వివరించితిని. గోభిలము, వధూవర గృహప్రవేశ యాత్రకు ముందే చూపించవలెనని వ్రాసినది. ఇది ఒక బ్రహ్మణ గృహమున జరుగును. వధూవర యాత్రకు ముందేయని ఆశ్వ. కూడ మానవ గృ.న ధ్రువనక్షత్రము, అరుంధతి, జీవంతి, సప్తర్షి మండలములను చూపించవలెనన్నది. జీవంతిని విడిచి పైవానిని పేర్కొనినది భార.గృ., హిర.గృ.న వరుడు వధువుతో నక్షత్రములు కనబడగా బయటకు నడచి దిక్కులను, నక్షత్రములను, చంద్రుని, ధ్రువుని, సప్తర్షి మండలమును పూజించ వలెనని కలదు. పార.గృ.ధ్రువునే పేర్కొనెను. సాంఖ్య, హిర. ప్రకారము నక్షత్రములు కనబడువరకు వధూవరులు నిశ్శబ్దముగా నుండవలెనని చెప్పగా ఆశ్వ ప్రకారము పెండ్లి కూతురు మౌనమును పాటించవలెను.

స్థాలీపాకము:

వండిన అన్నమును అగ్నికి ఆహుతిగా నిచ్చుట. గోభిలమున స్థాలీపాకమునకు, అగ్ని, ప్రజాపతి, విశ్వేదేవులను వారు దేవతలని వీరి నుద్దేశించి

హోమము చేయవలెనని, హోమ శేషమును వరుడు కొంత భుజించి పత్నికీయవలెనని కలదు. ఆజ్యదధి మిశ్రితమైన హోమ శేషాన్నమును వరుడు భుజించిన వెనుక వధువు మౌనముగా తినవలెనని మానవ గృ.న కలదు. కాఠకమున వధూవరులు కలిసి భుజించవలెనని కలదు. ఆపస్తంబ, హిరణ్య కేశులందు వధువు దంపుట మొ॥ నవి సమానము.

త్రిరాత్రవ్రతము:

వివాహమైన వెనుక మూడు రోజులు దీక్ష. ఈ నియమములను కొన్నిటిని లోగడనే చెప్పితిని. మానవ కాఠకములు నవ వధువులు బ్రహ్మచర్యమును ఒక సంవత్సరముగాని, పండ్రెండు రాత్రులుగాని, ఆరు రాత్రులుగాని లేదా ఒక్క రాత్రిగాని పాటింపవలెనని చెప్పినవి. పార.లో చెప్పినట్లు సాంఖ్య. చెప్పుచు ప్రాతస్సాయం సమయములందు అగ్ని పరిచర్య చేయవలెనని చెప్పినది. ఇంకను ఒక మంత్రము కలదు. దాని యర్థమిది. "మిత్రావరుణులు పురుషులు, అశ్వినులిద్దరు మగవాండ్రు. ఇంద్రాగ్నులు, పురుషులు, నాయందు పురుష శిశువు పుట్టుగాక." అందే వివాహమైన వెనుక పదిరోజులు ఇంటినుండి ప్రయాణము చేయరాదని కలదు. ఆప.లో చెప్పినట్లే వధూవరుల మధ్యలో మేడిదండమును బౌధాయనము చెప్పినది. నీటిలో దీక్షయైన వెనుక విసర్జింపవలెనని చెప్పినది.

వధూవరుల శారీరక సంబంధమున సంయమనము కలిగించుటకు త్రిరాత్ర వ్రతముద్దిష్టమైనట్లు తోచును. యథార్థమైన ప్రేమ కాముకతా ష్ణామ్ము కాక ఆత్మ సంయమముపై ఆధారపడినదని ఇది సూచించు చున్నది. ఈ సంయమనము ఎంత దీర్ఘమగునో అంత ఉత్తమ సంతానము కలుగుటకు హేతువగును. (బౌధ.గృ. 1.7.11)

ప్రౌఢయైన యువతీ యువకులపట్ల ఈ వ్రతము యొక్క వాస్తవిక మైన అవశ్యకత చెల్లునుగాని బాల్య వివాహములందిది అర్థ హీనమగునని ఆధునికులు వాదించగా ఇది కేవలము వ్రతముగనే గ్రహింపవలెనని సనాతన వాదులందురు. ఈ వ్రతముపై నెవరు దృష్టినిడుట లేదు.

వధూగృహమున మూడురోజులు పెళ్లివారున్నచో సంగీత నృత్యాదులతో కాలక్షేపము జరుగుచున్నది. నేడు ఒక రోజు వివాహము జరుపుకొను వారి విషయమున చెప్పవని లేదు.

**సహభోజనము:**

స్థాలీపాక సందర్భముననే హోమ శేషాన్నమును కలిసి భుజించ వలె నని కొన్ని సూత్రములు చెప్పనవి. పార.గృ.న ఒక విశేషార్థమిచ్చు మంత్రము కలదు. "నేను నా ప్రాణములతో నీ ప్రాణమును, అస్థులతో అస్థులను, మాంసముతో మాంసమును, చర్మముతో చర్మమును ధరించుచున్నాను."

"ప్రాణాస్తే ప్రాణాన్ సందధామి, అస్థి భిరస్థీని..........." కలిసి భుజించుట కూడునా అని ఒక శంక. గధాధరుడు, వివాహమునందు, యాత్రలయందు. మార్గమునందు సహభోజనము చేయవచ్చునని, మిగిలిన స్థలములందు దోషము కలిగించునని హేమాద్రి వచనము నుదాహరించెను.

"అత్ర స్త్రియా సహ వరోఽపి సమాచారాత్ భోజనంకరోతి,
స్త్రియా సహభోజనేఽపి న దోష ఇత్యాహ హేమా ద్రౌ
ప్రాయశ్చిత్త కాండే గాలవః"
"ఏకయా న సమారోహః ఏకపాత్రే చ భోజనమ్
వివాహే పథి యాత్రాయాం కృత్వా విప్రో న దోషభాక్
అన్యథా దోషమాప్నోతి పశ్చాచ్చాంద్రాయణం చరేత్."

పతిపత్నుల ఐక్యమునీక్రియ సూచించును.

**చతుర్థీకర్మ:**

ఇంతకు ముందే ప్రస్తావింపబడినది.

## స్థానిక పద్ధతులు

నిబంధన గ్రంథములందు కొన్ని పద్ధతులు కలవు. వానిని నేటికిని అనుసరించుచున్నారు. ఇందు కూడ ఒక క్రమము లేదు. పార.గృ.నిబట్టి

గ్రామ వచనమును, (దేశాచారమును) స్థానీయ పద్ధతులను పాటింపవలెను. గదాధరుడు దేశాచారములను గూర్చి ఇట్లు వ్యాఖ్యానించెను. "గృహ్యసూత్రము లందు లేకపోయినను మంగళసూత్ర ధారణము, కంఠమందు మాలను ధరించుట, వధూవరుల వస్త్రములను ముడివేయుట, వట వృక్షమును స్పృశించుట, వరుని వక్షః స్థలమున పెరుగును పూయుట, ఇంకను కొన్ని పద్ధతులు పెద్దలు చెప్పినట్లు చేయవలెను."

"వివాహే శ్మాశానే చ వృద్ధానాం స్త్రీణాం చ వచనం
కుర్యుః, సూత్రే అనుపవిద్ధమపి వధూవరయోర్మంగళసూత్రం,
గలే మాలాధారణమాది."

### సీమాంతపూజనము:

వరుని, అతని బంధు వర్గమును, వధువు గ్రామమునకు వచ్చినపుడు పూజించుట కొన్నిచోట్ల వాఙ్నిశ్చయమునకు ముందే జరుగుచున్నది. మనవారు దీనిని ఎదుర్కోలు సన్నాహమందురు. ఇంతకు ముందు వివరించితిని.

### గౌరీహరపూజ:

శివగౌరుల విగ్రహములు బంగారముతోగాని, వెండితోగాని, లేదా పటములు గాని వస్త్రముపైగాని రాతిపైగాని చెక్కబడిన వానిని పుణ్యాహవాచనము తరువాత, కన్యాదానమునకు ముందుగా వధువు పూజించును. (చూ:- లఘు, ఆశ్వ, 15.35) ఇంతకు ముందు గౌరీపూజను మన పద్ధతిలో వివరించితిని.

### ఇంద్రాణీ పూజ:

ఇంద్రుని భార్య శచీదేవిని పూజించుట (చూ:- సంస్కార కౌస్తుభము). ఈ పూజ చేయుట ప్రాచీన ఆచారముగ వచ్చుచున్నది. రఘువంశమున కాళిదాసు శచీ సన్నిధానము వలన స్వయంవరమునకు అడ్డు చెప్పువారు లేరైరి అని వ్రాసెను. బహుశః స్వయం వరమునకు ముందు శచిని

పూజించెడి వారేమోయని శ్రీ పి.వి.కాణే అభిప్రాయపడిరి. కాని అగ్ని పురాణమున దీనికి ఆధారము కలదని శ్రీ బంకుమల్లి మల్లయ్యశాస్త్రి గారు వివాహతత్త్వమున వ్రాసిరి. ఆ వాక్యములివి.

"కన్యాదానమ్ శచీయోగో వివాహోఽథ చతుర్థికా
వివాహమేతత్కథితం యత్ర కర్మ చతుష్టయమ్."

కన్యదానము, శచీపూజ, వివాహము, చతుర్థి - ఈ నాలుగు కలిపి వివాహమనబడునని అగ్ని పురాణము. ఇది మన ప్రాంతములో లేదు కాని గుజరాతీలలో చెఱువు దగ్గరకు వెళ్లునాచారము కలదు. కన్యాదానమైన వెనుక వరుడు తన ఇంటికి కన్యను తీసికొని వచ్చునపుడు చెఱువు వద్దకు తీసికొని వెళ్లి కుమ్మరి మన్నుతో శచీదేవి బొమ్మను చేయించి అక్కడే వధువుచే శచీపూజ చేయించి మంగళ వాద్యములతో తన ఇంటికి తీసికొని రావలెను.

"వైవాహికేఽహ్ని కుర్వీత కుంభకారమృదా శచీమ్
జలాశయే తు తాం పూజ్యా వాద్యాద్యైః స్త్రీంగృహం నయేత్"

-- అగ్ని.పురా.

పై శ్లోకములో నున్న వివాహపదమునకు గృహప్రవేశ కర్మ అను అర్థము పై పురాణము వలన సిద్ధించునని శ్రీశాస్త్రిగారు వ్రాసిరి.

## తైల హరిద్రారోపణము:

వధువు రాసికొనగా మిగిలిన పసుపు వరుడు రాసికొనుట (చూ. ధర్మసింధువు) ఇది మన ప్రాంతమున తూర్పుప్రాంతంలో కలదు.

## ఆర్ద్రాక్షతారోపణము (తలంబ్రాలు):

మన పద్ధతిలో కొంత వివరించితిని. కొన్ని ప్రాంతములలోనున్న పద్ధతిని వివరింతును. ఒక వెండి గిన్నెలో కొద్దిగా పాలు పోసి నేతినభిఘరించి నీటితో తడిపి ఆరనిచ్చిన అక్షతలను అందుపోయుదురు. వరుడు పాలు, నేతిని వధువు యొక్క కలిపిన హస్తములపై రెండు సార్లు పూయును.

మూడుసార్లు అక్షతలను ఆమె అంజలి నిండునట్లు వేయును. మరల నేతిని రెండుసార్లు అభిఘరించును. అట్లే మరియొక వ్యక్తి వరునికట్లు చేయును. ఇద్దరు కలిపిన హస్తములపై వధువు తండ్రి కొద్ది బంగారమునుంచును. వరుడు తన కలిపిన హస్తములను వధువు చేతులపై నుంచును. ఒక మంత్రము చదువుచు వధువు తండ్రి, తన పిల్లను లేవదీయుగా ఆ అక్షతలను వరునిపై చల్లును. తరువాత వరుడు చల్లును. ఒక్కొక్కరు మూడేసి సార్లు చల్లుకొందురు. చివర వధువు చల్లును. మొత్తము ఏడుసార్లు. తరువాత పురోహితుడు, దూర్వలతో కూడిన మేడి రెమ్మతో నీటిని వారి శిరస్సులపై 'ఆపోహిష్ఠా' మంత్రములు చదివిన వెనుక చల్లును. వధూవరులు ఆ తరువాత తిలకము దిద్దుకొందురు. పరస్పరము దండలు వేసికొనుట, పసుపు త్రాటితో చేసిన కంకణ బంధనము లేక కౌతుక బంధనము ఉండును. కాళిదాసు ఆర్ద్రాక్షతారోపణమైన వెనుక కౌతుక బంధనమును చెప్పెను. ఇదియే చివరిదైనట్లు వ్రాసెను.

అక్షతలనగా నడుము విరుగని బియ్యము. వానివలె దంపతులు కూడ అక్షతలుగా నుండవలెనని ఆకాంక్ష.

మంగళ సూత్రము:

ఇది నేడు ముఖ్యాతి ముఖ్యముగ పరిగణించుచున్నారు. కాని సూత్రములీ విషయమున మౌనము వహించినవి. ప్రప్రథమమున శౌనక స్మృతి యందు కలదు. "తతో మంగళసూత్రం చ ధ్యాత్వాభీష్టాం చ దేవతామ్, బద్ధ్వాకంఠ ప్రదేశే స్యాద్భూషణాని చ శక్తితః" లఘు-ఆశ్వలాయనస్మృతి కూడ పేర్కొన్నది.

'బధ్నీయాత్ కన్యకాకంఠే సూత్రం మణి సమన్వితమ్
మాంగల్యం తంతునానేన మంత్రేణ స్యాత్ సదా సతీ.'

ఆ మంత్రమిది: మన పద్ధతిలో చెప్పిన దానికి కొంచెము భిన్నముగా నుండును. అర్థమొక్కటే.

"మాంగల్యం తంతునానేన భర్తృ జీవన హేతునా
కంఠే బధ్నామి సుభగే సా జీవ శరదః శతమ్"

పార.గృ.పై గదాధరుడు వ్రాయుచు మంగళసూత్రమును ధరింపవలెనని వధూవరులు పుష్పమాలలు ధరింపవలెనని వ్రాసెను. పార.సూ.లో లేదు. బౌధ.గృ. శేష సూత్రము అర్క వివాహమును వ్రాయుచు మాంగళ్య సూత్రమును దానికి కట్టవలెనని వ్రాసెను. ఇది నేడు కట్టుకొను సూత్రమగునో కాదో యని సందేహము.

మంగళ సూత్రవిధి ధర్మప్రవృత్తిలోను, సంస్కార రత్నమాల గ్రంథము లందు కలదు. దీనికి శతమానమని పేరు. నూరు సంవత్సరములకు తక్కువ కాకుండ ఆయుస్సుండవలెనను ఆశయముతో కట్టుచున్నారని పెద్దలందురు.

"కామేశ బద్ధ మాంగల్యసూత్ర శోభిత కంధరా"

అని లలితా సహస్రనామములలో కలదు కదా! అవి బ్రహ్మాండ పురాణాంతర్గతములు కదా! బ్రహ్మాండ పురాణము నిన్న మొన్నటిదనువారికి ఒక నమస్కారము. కామేశుడు కట్టిన మంగళసూత్రముతో నొప్పుతున్న కంఠము కలదానాయని ఆ నామమున కర్థము.

ముక్కుకాడ:

అట్లే ముక్కు కాడ విషయమై సూత్రములు కాని, స్మృతులు కాని, నిబంధన కర్తలుగాని వ్రాయలేదని శ్రీ పి.వి. కాణే వ్రాసిరి. క్రీ.శ.1000 వరకు మన భారతదేశమున ఈ ఆచారము లేదని డా॥ అల్తేకర్ గారు "Position of Hindu Women in Hindu Civilisation" అను గ్రంథమున వ్రాసెను. వేయి సంవత్సరములనుండి ఈ ఆచారమున్నటుల సాహిత్య గ్రంథముల వలన తెలియుచున్నదని శ్రీ పి.కె. గోడే వ్రాసియున్నారు. కాని "తారా కాంతి తిరస్కారి నాసాభరణ భాసురాయై నమః" అని ఆ లలితా సహస్ర నామములందే కలదు. పై సమాధానమే దీనికి వర్తించును.

ఉత్తరీయ ప్రాంత బంధన:

పసుపు కొమ్ములను, వక్కలను ఇద్దరియొక్క పై వస్త్రపు కొంగులలో వేసి ఇద్దరి కొంగులను ముడివేయుట. ఇది బ్రహ్మ గ్రంథి వంటిది. (చూ. సంస్కార కౌస్తుభము.)

ఐరిణీదానము:

ఇది మహారాష్ట్రులలో కలదు. మన ప్రాంతమున లేదు. వరునియొక్క తల్లికి ఒక మేదర బుట్టలో అనేకమైన కానుకలుంచి వెలిగించిన దీపములతో నిచ్చి తన పిల్లను ప్రేమతో చూడుడని వియ్యపురాలిని బంధువర్గమును అడుగుట. వివరములకై (చూ: సంస్కార కౌస్తుభము, ధర్మ సింధువు). వెదురునకు వంశమని పేరు కలదు. వెదురుతో నల్లిన బుట్టనిచ్చుటలో వెదురు మాదిరిగా వంశాభివృద్ధి జరుగవలెనను ఆకాంక్ష వ్యక్తమగుచున్నది. వివాహమైన వెనుక వధువు అత్తింటికి వెడలునపుడు ఇత్తురు.

"సవస్త్రఫలతాంబూలం దంపత్యోర్వంశ వర్ధనమ్
ఐరిణ్యాఖ్యం వంశపాత్రం పక్వాన్నైః పరిపూరితమ్
కరకై ర్యుత్రసంఖ్యైస్తు సువర్ణేన సమన్వితైః
ఏతావ దైరిణీ రూపం కర్తవ్యం కిలసూరిభిః"

అని సంస్కార రత్నమాలలో కలదు. ఇదే భావన వివాహాంతమున అప్పగింతలలో వ్యక్తమగును.

దేవకోత్థాపన - మండపోద్వాసనము:

దేవతలకు, మండపమునకు ఉద్వాసన చెప్పుట, వివాహమైన సరి రోజున లేవనెత్తుదురు. 5వ రోజు, ఏడడవరోజు మినహాయించగా మిగిలిన బేసిదినములలో కూడదు. ఆరుకూడ పనికిరాదు.

"సమే చ దివసే కుర్యాద్దేవ కోత్థాపనం బుధః
షష్ఠం చ విషమం నేష్టం ముక్త్వా పంచమ సప్తమౌ."

ఇంకను అనేకాచారములుండును.

కుంభ వివాహము:

జాతకరీత్యా వైధవ్యము సంప్రాప్తించ వలసియున్నపుడు తన్నివారణా ర్థమై కుంభ వివాహము జరుపుట కలదు. దీనిని సంస్కార ప్రకాశ, నిర్ణయ సింధువులు పేర్కొన్నవి. వివాహమునకు ఒక రోజు ముందుగా ఒక ఉదకుంభమున విష్ణువు యొక్క బంగారు ప్రతిమను పువ్వులతో అలంక

...బడిన దానినుంచుదురు. వరుణుని, విష్ణువును వరునకు దీర్ఘాయుర్దాయ నిమిత్తమై పూజింతురు. తరువాత ఆ ఉదకుంభమును తీసికొని వెళ్లి సరస్సులో దానిని బ్రద్దలు కొట్టి ఋక్ (7.49) మంత్రము చదువుచు ఆ నీటిని వధువునెత్తిపై చల్లుదురు. ఆ పైన బ్రాహ్మణ భోజనము.

అశ్వత్థ వివాహము:

సంస్కార ప్రకాశ దీనిని పేర్కొన్నది. ఇది కూడ కుంభ వివాహము వంటిదే. భవిష్యత్ వైధవ్యమును పోగొట్టుటయే ఉద్దేశ్యము. ఉదకుంభ స్థానమున అశ్వత్థవృక్షము. ఇచ్చట కూడ విష్ణువు యొక్క బంగారు ప్రతిమను పూజింతురు. పూజానంతరము ఆ ప్రతిమను బ్రాహ్మణునకిత్తురు.

అర్క వివాహము:

ఒక వ్యక్తికి దురదృష్టవశాత్తు భార్యవెనుక భార్య మరణించిన మూడవ స్త్రీని వివాహమాడుటకు ముందుగ జిల్లేడు చెట్టుతో వివాహము జరుగును. ఇది సంస్కార ప్రకాశ, నిర్ణయ సింధువులందు వర్ణింపబడినది. బౌధ.గృ. శేష సూత్రము కూడ దీనిని పేర్కొనెను.

కదళీ వివాహము:

భార్య మరణించిన వెనుక రెండవ స్త్రీని వివాహమాడుటకు ముందు ఈ వివాహమును చేయుట కొన్నింట కలదు.

ఇంకను పెక్కు ఆచారములుండును. కొందరు పుస్తె మొదటనేకట్టి దానము తరువాత చేయుదురు. ఉత్కళ బ్రాహ్మణులలోను, మరికొన్ని ప్రాంతములందును మంగళసూత్రము కట్టు పద్ధతి లేదు.

నాగవల్లి (నాకబలి) ద్రావిడులు చేయరు.

ఉత్కళ వంగ ప్రాంతములలో నూత్న వధూవరులను నాల్గవ రాత్రి ఒకమారు పాన్పుపై పరుండబెట్టి వెంటనే లేవనెత్తు ఆచారమున్నది.

ఇప్పటికి పశ్చిమ భారతమున పెండ్లికూతురుతో ఒక స్త్రీ కొన్ని రోజులు అరణముగా వెళ్లును. పాఠరాఖిణ్ (రక్షించునది) అని అందురట. రైభ్య స్నేహితురాలిగ, పని ఒత్తిడి లేకుండ నుండుటకై సూర్యతో వెళ్లినట్లు (అనుదేయీ) వేదమున కలదు.

## వివాహము ఎప్పుడు నిశ్చయమగును?

బలాత్కారముగా నీయబడినది, బలాత్కారముగ ననుభవింపబడినది చెల్లదని మనువు. వ.ధ.సూ. బౌధ.ధ.సూ. లందు కన్య బలాత్కారముగ కొనిపోబడి వైదిక మంత్ర సంస్కారము లేనిచో అట్టి కన్యను ఇతని కిచ్చి వివాహము చేయవచ్చునని కలదు. నేటి హిందూ లా ప్రకారము విధి పూర్వకముగా వివాహము జరిగినను బలాత్కారము లేక మోసమని నిర్ణయింపబడినచో అట్టి వివాహము చెల్లనేరదు.

"A marriage though performed with the necessary ceremonies, may be set aside by the court, if it was brought about by force or fraud" (చూ. Mulla's Hindh Law)

వ.ధ.సూ. లందు కన్య ఉదక పూర్వకముగ వాగ్దత్తమైన తరువాత, వరుడు చనిపోయినపుడు, మంత్రములు లేనపుడు, ఆ కన్య, తండ్రికే చెందుననియు, అతడు ఇంకొకరికి నీయవచ్చుననియు కలదు. కాత్యాయ మడు కూడ నిట్లే చెప్పెను. "వివాహము నిశ్చయమైన వెనుక వరుడు చనిపోయినచో వధువు మూడు ఋతుకాలములు గడచిన వెనుక మరల నింకొకని వివాహమాడవచ్చును."

"వరయిత్వా తు యః కశ్చిత్ప్రణశ్యేత్పురుషో యదా
రక్తాగమాంస్త్రీనతీత్యకన్యాన్యం వరయేద్వరమ్."

అని అపరార్కుడు కాత్యాయనుని ఉదాహరించెను. సంస్కార కౌస్తుభమున కాత్యాయనునిదే మరియొక వాక్యముదాహరింపబడినది. "కన్య నిమిత్తమై శుల్కమిచ్చి స్త్రీ ధనమిచ్చిన అతడెక్కడికో వెళ్లిపోయినపుడు

అట్టి కన్యకు ఒక సంవత్సరము వరకు వేచియుండి అతడు రాకపోయినచో మరియొకనికి నీయవచ్చునని కలదు."

"ప్రదాయ శుల్కం గచ్ఛేద్యః కన్యాయాః స్త్రీ ధనం తథా
ధార్యా సా వర్షమేకం తు దేయాన్యస్మై విధానతః"

సప్తపదియైన వెనుకనే వివాహము పూర్తియైనట్లు శిష్టులు భావింతురని మనువు. అట్లే నారదుడు, యముడు కూడ. సప్తపదికి ముందు వరుడు చనిపోయినను వధువు విధవగా పరిగణింపబడదు. "ఏవంచ సప్తమ పదాదర్వాక్ పరిణేతుర్మరణేపి న విధవాత్వ మిత్యుక్తం భవతి." అని స్మృతి చంద్రికాకారుడు. ఉదక పూర్వకముగా దానము చేసినను సప్తపదికానిచో పూర్తికానట్లు ద్రోణ పర్వమున కలదు. (ద్రో. 55.15-16).

అగ్ని సాక్షిగా వివాహము జరుపబడినచో అట్టివి త్రోసివేయదగినవి కావని ఆచార్య సమ్మతమును కామసూత్రము కూడ చెప్పుచున్నది. "అగ్ని సాక్షికా హి వివాహా న నివర్తంత ఇత్యాచార్య సమయః" (కా. 3.5.13) కాని శూద్ర స్త్రీ వరుని యొక్క వస్త్రపు అంచును పట్టుకొనినపుడే వివాహము పూర్తియైనట్లని చండేశ్వరుని 'గృహస్థ రత్నాకరమున' కలదు. కొందరి వివాహములందు వేద మంత్రములు లేకపోయినను కుటుంబాచారముల ప్రకారము నిర్ణీతమగుచున్నది.

ఒకేమారు దాయవిభాగము ఒకే మారు కన్యాదానమని మనువు. అయినను ఇంతకన్న మంచి వరుడు దొరికినచో ఆతనికీయవచ్చునని చెప్ప కపోలేదు. "తనపిల్లను ఒకనికిచ్చెదనని వాగ్దానము చేసి వరున కీయనిచో ఆ పిల్ల తండ్రి చోరుని వలె శిక్షార్హుడు. అయినను అంతకన్న మంచివరుడు దొరికినచో ఆతనికీయవచ్చును." అని యాజ్ఞ. కన్యయందు దోషములను కప్పిపుచ్చి వివాహము చేసినవాడు శిక్షార్హుడని యాజ్ఞ. లేని దోషములు కన్యయందు కలవని ఆమెను తిరస్కరించిన వానికి 100 పణములు శిక్షయని యాతడే చెప్పెను. అట్టి యామెనే వివాహము చేసికొనునట్లు చేయవలెననెను.

## శూద్రులకు వివాహ విధానము
## (శూద్రకమలాకరము నుండి)

### ఉదకపూర్వక కన్యాదానము, పాణిగ్రహణము:

గాంధర్వ, రాక్షస, పైశాచములందు తప్ప తక్కిన వివాహములందంతట ఉదక పూర్వక దానము కలదు. గాంధర్వ, ఆసుర, పైశాచ, రాక్షసములందు ముందే పాణిగ్రహణమని తరువాత హోమమని అపరార్కమందు వసిష్ఠ వచనము. పాణిగ్రహణ మంత్రములే భార్యయగుటకు ఆవశ్యకమైన లక్షణమని మనువు చెప్పుట చేతను, అట్లే పాణిగ్రహణము సర్వ వర్ణకములకు సమానమని యాజ్ఞవల్క్యుడు చెప్పుటచేతను (పాణి గ్రాహ్యస్సర్వవర్ణాసు) శూద్ర వివాహములందు కూడ పాణి గ్రహణము ముఖ్యమే. ఉదక పూర్వక కన్యాదానము చేయుట శూద్రులందు వైకల్పికము. అనగా చేసిన చేయవచ్చును, మానిన మానవచ్చును అని స్మృతి కౌముదియందు బ్రాహ్మవచనము కలదు. "జలపూర్వం తు విప్రాణామన్యేషామపి కామ్యయా."

### విఘ్నేశ, శచీ పూజల నాందీ శ్రాద్ధాదుల అవశ్యత:

పైవానిని చేసిన యెడల నిర్విఘ్నముగ వివాహ సిద్ధియగునని స్మృతి కౌముదియందు బ్రాహ్మవచనము.

వారాహ సంహితయందు కన్యకు వివాహము సమీపించినపుడు గృహమందు శచీదేవిని ముప్పొద్దుల గంధపుష్పాదులతో కన్యక పూజింపవలెనని కలదు.

### విధానము:

వాగ్దానమైన వెనుక పూర్వదినమందుగాని వివాహ దినమందు గాని ప్రాతః కాలమున కన్యతండ్రి తలంటు పోసికొని వినాయక పూజాదులు చేసి బియ్యముచే నింపిన రెండు కలశములందు, వెదురు పేళ్ల జంగెడయందు నందిని, నలిని, మైత్రి, ఉమ, పశువర్ధిని అను దేవతను, శస్త్రమందు భగవతిని

మాతృకల సన్నిధియందు స్థాపించి నాల్గవ దినమందు మండప దేవతలను పూజింపవలెను.

పచ్చని దారముచే కంకణము కట్టి కన్యయొక్క మూరచే నైదుగాని, ఏడుగాని మూరల పరిమితి గల 5, లేక 7 మెట్లు కలిగిన వేదికను చేయువలెను. ఆపైన వరునకు ఆసనము, మధుపర్కము, ప్రశస్త లగ్నమందు తెరతీసిన వధూవరులకు ముఖ దర్శనము చేయింతురు. కన్యకు నూత్న వస్త్రధారణము, తరువాత కన్యాదానము. కొందరు లగ్న సమయమందు పాణిగ్రహణమని చెప్పదురు. కన్య బంధువులు కన్యకకు యౌతుకమును కట్నమిత్తురు. వరుడు వాని తండ్రి మొ॥ వారును కట్నము నీయవలెనని కొందరు, హోమాంతమందు యౌతుకమని కొందరు. ఆపైని నాల్గు చుట్టులు గాని యైదుగాని వధూవరులకు దారము చుట్టి మీద చుట్టిన దారము క్రిందికని, క్రింద చుట్టిన దారము మీది నుండియు తీసి పసుపు రాసి ముప్పిరిగా చేసి క్రింది సూత్రము వరహస్తమందును, మీది సూత్రము వధూహస్తమందును కంకణము కట్టుదురు. అపుడు "యేన బద్ధో బలీ రాజా దానవేంద్రో మహాబలః తేన త్వామపి బధ్నామి రక్ష మా చల మా చల" అని పఠింతరు. అనగా పూర్వమందు భగవంతుడు రక్షాబంధనముగ బలిచక్రవర్తిని కట్టినాడు గనుక నిపుడును నిన్ను రక్షకొరకే బంధింపు చున్నాను చలింపకుము." ఆపైన పాలతో తడిసిన అక్షతలు వేయింతురు. ఆపైన మంగళ సూత్రము వేదిక యందు ప్రాఙ్ముఖులై యగ్నికి వెనుక భాగమున చాపపై వధూవరులు కూర్చుండగా దక్షిణమందుగాని, ఈశాన్య దిక్కుగా గాని మంగల కలశమును భుజముపై నుంచుకొని ఒకడు నిలబడి యుండును. పిదప సన్నెకల్లు పొత్తరము నలంకరించి యుంతురు.

వీరి వివాహమందు హోమములేదని మదనపాలుడు. కాని సరికాదు. ఆచార్యుడే హోమము చేయవలెనని నిర్ణయము. ఆపైన లాజహోమము, అగ్ని ప్రదక్షిణము హోమానంతరము ఏడు బియ్యపు పోగులు పోసి వధువును కుడిపాదముచే వరుడు విష్ణవే నమః అని పలుకుచు ఏడడుగులు త్రొక్కించును. ఏడవ యడుగు నందు పురోహితుడు కలశోదకముచే

వధూవరుల శిరస్సులపై అభిషేకించును. తరువాత వరుడు సూర్యుని చూచుట. వధూ హృదయస్పర్శ, వధువు పాపిట సిందురముంచుట. వధువును వరుడుగాని ఇతరులు గాని లేవనెత్తుట. తరువాత ఎద్దుతోలు పై వధువును కూర్చుండబెట్టుట. మరల హోమము - ప్రాశనము - ఆచార్యునకు గోదానము - బ్రహ్మకు కట్నమిచ్చుట - విప్రులకు ఆమాన్నము - రాత్రియందు ధ్రువదర్శనము - నాల్గవరోజున స్థాలీపాకము - వరునికి, వాని బంధులకు సత్కారము - వరుని తల్లికి మూసి వాయనము - (కన్యాపితకునని కొందరు) పదారు చిన్న చేటలతో గూడిన వంశపాత్రమనగ జంగెడ మొ॥ వానిలో ఉమామహేశ్వరులను ప్రార్థించుట జరుగును. వంశపాత్ర మైరిణీయనబడును. సాక్షాత్పరమేశ్వర రూపిణిగా భావించి శూర్పములతో కూడ వరుని తల్లికి కన్యాదాన సిద్ధికై దానము చేయుదురు. దీనిని కొందరు చేయరు. ఆపైన అప్పగింతలు. వరుడు వధువుతో వాహనమెక్కి ఇంటికి వచ్చి శ్రీదేవిని పూజించి మునుపు స్థాపించిన మాతృకలను, మండపదేవతలను పూజించి, వస్త్రగంథిని విప్పి కంకణములను విసర్జించి వేదవేత్తలను పూజించును.

ఇంకను కొన్ని ఆచారములు కలవు. వివాహపు రోజున ఉదయముననే శమీపుజ చేయింతురు. వరుని అలంకరించి ఒడలంతయు మంచి గంధము పూసి గోళ్లతో నిలువు చారలుగా గోకుదురు. పిమ్మట వానికి తలపాగా చుట్టి క్రొత్త గూడచెప్పులు తొడిగి పళ్లెములో అన్నము, పిండి వంటలు పెట్టించి, పెండ్లి కుమారుని భుజమున కెత్తి, మేళతాళములతో శాలువా గొడుగు క్రింద నడిపించుచు ఊరివెలుపల జమ్మిచెట్టు దగ్గరకు తీసికొని వెళ్లి ఆ చెట్టునకు నివేదన చేయింతురు. ఈ క్రియ భూత బలియో, శమీపూజయో వివరింపలేముగాని ద్విజులందు కల స్నాతక క్రియకు ప్రతిగా కనిపించును.

శూద్రాది వర్ణములలో మంగళ స్నాన నిమిత్తమై కొంత తంతు జరుగను. మేళతాళములతో కుమ్మరి ఇంటికి వెళ్లి ఐదేడు కుండలను తెచ్చి పెండ్లివారికి ఈయగా వారు నీటితో నింపి ఆ నీటితో వధూవరులకు మంగళ స్నానము చేయింతురు.

కొన్ని కులములవారు శివార్చకుల చేత వధూవరులకు భాషికములు కట్టింతురు.

పెండ్లి కుమార్తెను ఐరేదు కుండలయెదుట కూర్చుండబెట్టి గౌరీపూజ చేయింతురు.

వీరిలో పురోహితుడు కంకణములను విప్పిన నాటి రాత్రియందే గర్భాధానము చేయుదురు. వీరిలో మనుగడుపులు నెలల తరబడి యుండును.

కొన్ని వర్ణములందు మారు మనువులు, కట్టుబడి పెండ్లిండ్లనునవి కూడ కలవు. మారు మనువు భర్త చనిపోయినను, అసలు భర్త జీవించి యుండగాను జరుగును. వారికి వైధవ్యము లేదు.

పెండ్లికి ముందుగా మగపెండ్లివారు పెండ్లి కుమార్తెకు 'ప్రధానము' చేయించుట, పెండ్లి కుమారునకు కాళ్లగోళ్లు తీయించుట (స్నాతకమునకు ప్రతినిధి) మొ॥ పెక్కు ఆచారములుండును. అనేక వర్ణములు, అనేక ఆచారములతో కూడిన దేశమిది కాన కొన్నింటిని మాత్రమే పేర్కొంటిని.

* * *

# అంత్యేష్టి సంస్కారము

హిందూ జీవన విధానమున చివరి సంస్కారము అంత్యేష్టి సంస్కారము. బ్రతికియుండగా 15 సంస్కారములు జరుగగా చనిపోయిన వెనుక ఇతనికి ఉత్తమ గతులు కల్పించుటకు పుత్రాదులు చేయు సంస్కారమే ఇది.

పుట్టిన వానికి గిట్టుట తప్పదు. ఈ నియమమును ఎవ్వరు దాట లేరు. పుట్టుకచే సంతోషమును గాని, మరణించుటచే దుఃఖించుట గాని కూడదనియు, జీవి ఎప్పుడు పుట్టునో ఎప్పుడు గతించునో తెలియదనియు, జనన మరణములను సమానముగానే మహాత్ములు చూతురనియు, మరణము వెనుక ఆ జీవునకు ఉత్తమ గతులు కలుగుటకు, ప్రేతత్వమునుండి విముక్తి కల్గుటకు ఈ సంస్కారము అత్యవసరమని ఈ దిగువ శ్లోకముల వలన తేటతెల్లమగును.

"జాతస్య వై మనుష్యస్య ధ్రువం మరణమితి విజానీయాత్
తస్మా జ్జాతే న ప్రహృష్యేత్ మృతే చ న విషీదేత్."
"అకస్మాత్ ఆగతం భూతమక స్మాదేవ గచ్ఛతి
తస్మా జ్జాతం మృతం చైవ పం పశ్యంతి సుచేతసః"
"...............పంస్కారేణ పంస్కుర్వంతి." -- బౌధ.పితృ.సూ.

దేహమే మరణించును గాని, లోనున్న ప్రాణము కన్న అతీతమైన ఆత్మకు మరణము లేదని, అనేక వాసనలతో, సంస్కారములతో కూడిన జీవునకు అఖండమైన ఆత్మజ్ఞానము కలుగునంతవరకు తిరిగి తిరిగిపుట్టునని మన ప్రాచీన సర్వ గ్రంథముల సారాంశము. పునర్జన్మను అంగీకరించి, జన్మ లేకుండ ప్రయత్నించువారు భారతీయులు. ఈ చక్రము నుండి తప్పించు కొన్నవారు చాలకొద్దిమంది మాత్రమే. సామాన్యులు మరణించిన వారి గతియేమి? అనునది ఒక ప్రశ్న. అందులకు సమాధానమే ఈ రచన.

ఇదియొక ఋణముగా భావించి ఈ సంస్కారమును చేయవలెనని బౌధ.పితృ. సూత్రము. పుట్టిన వెనుక చేయు సంస్కారము వలన

ఇహలోకమును, మరణానంతర సంస్కారము వలన పరలోకమును జయించుచున్నాడని అందే కలదు.

"జాత సంస్కారేణ ఇమం లోకమభిజయతి
మృత సంస్కారేణ అముం లోకమ్." -- 3.1.4

కనుకనే దీనిని శ్రద్ధా పూర్వకముగా చేయవలెను.

పుణ్యపాపములు, స్వర్గ నరకములు, పునర్జన్మము, ఒక అతీతమైన శక్తి మనలను నడిపించుచున్నదను విశ్వాసము, మొ॥ అంశములపై ఈ సంస్కార మాధారపడినది. పై వానిని నమ్మని వాడు కూడ ఏదియో ఒక రకమైన సంస్కారమునే చేయుచున్నాడు.

మరణించిన వ్యక్తిని గూర్చి భయము, ప్రేమ మొదలగునవి సర్వ ప్రాణులకు సాధారణము. జీవించిన వారితో అతడు సంబంధము కలిగి యుండుననియు, అతనికి ఉత్తమ గతులు కలిగింపకపోయినచో బ్రతి కియున్నవారిని బాధించుననియు, ఆపైన గాఢమైన అనురాగము మొ॥ అంశములతో ఈ సంస్కారము ముడివడియున్నది. జీవించిన వాడు, మరియొక గ్రామమున కేగునపుడు దారిబత్తెమును గ్రహించునటుల మృతవ్యక్తి ప్రయాణము సుఖముగా సాగుటకు కొన్ని పదార్థముల నర్పిం చుట, శవమును శుద్ధిచేసి దహనము చేయుట, గోవు మొ॥ వానిని దానము చేయుట, శ్రాద్ధములు పెట్టుట మొ॥ పెక్కు అంశములతో నిది కూడియున్నది.

మరణించినవాడు ఏ రూపమును ధరించును? ఎక్కడ ఉండును? తద్దినములెందులకు పెట్టవలెను? మొ॥ ప్రశ్నలకు సమాధానము తరువాత నిత్తును.

ఈ సంస్కారమును గురించి వ్రాయవలెననిన 5, 6 వందల పుటలు పట్టును. అనేక సూత్రములు, దేశ కాల ఆచారములు, సంప్రదాయములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. పాఠకులకు విసుగు కలిగించక, మన ప్రాంత ఆచారమును, ఆపస్తంబ సూత్రమును పేర్కొనుచు సూక్ష్మముగా వివరింతును.

అరుంధతి నక్షత్రము కనబడకపోవుట, ఎదుటి వాని కంటిపాపలో తన ప్రతిబింబము కనబడకపోవుట మొ॥ పెక్కు సూచనల ద్వారా కొద్ది రోజులలో మరణము ప్రాప్తించునని తెలిసికొనవలెనని శాంతి పర్వమున కలదు. అట్లే లింగ, వాయు పురాణములందు కలదు.

సన్మార్గులకు అనాయాసమరణము సిద్ధించునని బ్రహ్మపురాణము చెప్పగా, అసన్మార్గులకు దుర్మరణము ప్రాప్తించునని భారతము చెప్పినది. (అను. అధ్యా. 104. 11-12)

మన ప్రాంతమున నున్న తంతు:

మరణింపబోవువాడు ఈ జన్మలో చేసిన పాపములు పోగొట్టుకొనుట కొరకు కొన్ని ప్రాయశ్చిత్తము లుండును. ప్రాయశ్చిత్తానంతరమన దంతధావనము, కేశవపనము, దశవిధ స్నానములు, పంచగవ్య ప్రాశనము, దశ విధ దానములు చేయవలెను. అట్లు కానిచో మరణించిన వెంటనే చేయుదురు. పురుషులకు, స్త్రీలకు, విధవలకు భిన్నభిన్నముగా ఈ ప్రాయశ్చిత్తములుండును.

మరణమునకు ముందుగా ఒక ఆవును దానమిత్తురు. దానిని ఉత్క్రాంతి సంజ్ఞిక ధేనుదానమందురు. అతని కుడిచెవిలో "బ్రహ్మ విదాప్నోతిపరమ్" "భృగుర్వైవారుణిః " మొ॥ ఉపనిషత్ మంత్రములను పఠింతురు. ఇది ఆ జీవుని మోక్ష ప్రాప్తికై పఠింతురు. ఇది బ్రాహ్మణుడు, అందున శ్రోత్రియుని పట్ల మాత్రమే. క్షత్రియ వైశ్యులకు "ఆయుష ప్రాణగ్ంసంతను..............." అను 12 వాక్యములు చదువుదురు. స్త్రీలకు ఎడమచెవిలో చదువుదురు.

మరణానంతరము స్థలప్రేత శరీర శుద్ధి కొరకు కర్మణః పుణ్యాహవాచనముండును. ప్రక్కమీదనుండియే మరణించుట, స్నానము లేక మరణించుట మొ॥ నవి జరిగినపుడు ఆ పాపము పోవుటకై షణ్ణిమిత్త ప్రాయశ్చిత్తముండును. ఆపైన కర్త పితృమేధ అధికారమునకు సంకల్పము చేయును. విచ్ఛిన్న ఔపాసనాగ్ని, ప్రాత రుపాసనాగ్ని అప్రదక్షిణముగా

చేయవలెను. ఆపైన పైతృమేధిక హోమముండును. 'సంత్వాసించామి' అను శాంతి మంత్రము చెప్పుదురు. "పరేయువాగ్ంసం" అను మంత్రముచే హోమము చేయవలెను. ఇందు మరణించిన వారి పుణ్యకర్మానుగుణముగా ఆయా లోకములకు తీసికొని వెళ్లు యముని గూర్చి ప్రార్థన ఉండును. అట్టి యముని తృప్తి కొరకై చేయు హోమమిది.

ఆ అగ్ని యందే బలి ప్రదానమునకు చరుపచనము (కుండలో బియ్యము వేసి ఉడుకబెట్టుట) చేయవలెను. మరల వపన షంస్కారము, స్నానము, విభూతి మొ॥ వానిచే శవమునకు అలంకరణ. ఆపైన చేతులకు, కాళ్లకు తెల్లని సూత్రము కట్టుట, వట్టి వేళ్ల గంధమును పూయుట, నూత్న వస్త్రముచే శవమును కప్పుట మొ॥ ఉండును. "అపైత దూహ..........." అను మంత్రముతో ప్రేత పూర్వము ధరించిన వస్త్రము నుండి ఒక పీలికను తీసి కర్త ధరింపవలెను.

"ఇది వరకు చేసిన శ్రౌతస్మార్త కర్మలు, దక్షిణలు, బంధు ప్రీతికై ఇచ్చిన ధనమును స్మరించుకొని పుణ్యలోకమును పొందుము." అని ఆ మంత్రమునకర్థము.

విధవకు, ఉత్తపనాగ్నిచేత బ్రహ్మచారికి కపాలాగ్నిచేత, సుమంగలికి, భార్య ఉండగా పోయిన వానికి ఔపాసనాగ్నిచేత అగ్ని సంస్కారముండును.

ఇక శవమును మోయు వాహకులను ప్రార్థించి తీసికొని రావలెను. ఆపైన శవయాత్ర, స్మశానమునకు పోవుదారిని నాల్గు భాగములుగా చేసిన అందు మొదటి మూడు భాగములందు శవమును నేలపై దింపుదురు. అపుడు శవము చుట్టు మార్గముననున్న భూతముల తృప్తి కొరకు బలిప్రదానము (అన్నము వేయుట) చేయుదురు. యజుర్వేదులకు మూడు కొమ్మల దగ్గర మూడు సార్లు వేయవలెను.

1వ భాగమంతమందు "పూషాత్వేవశ్చ్యావయతు"

2వ భాగమంతమందు "పూషేమా ఆశా"

3వ భాగమంతమందు "ఆయుర్విశ్వాయుః"

అను మంత్రములను దింపి ఎత్తునపుడు పఠింతురు. వరుసగా ఆ మంత్రముల అర్థము:-

1) పూషయనెడు దేవత మార్గమును తెలిసిన వాడు వాహకులను ఉపద్రవము లేకుండ తీసికొని వెళ్లువాడు, అతడు భువన పోషకుడు, నిన్ను పితృదేవతల దగ్గరకు చేర్చుగాక! అగ్ని పుణ్యకర్మానుగుణముగ నిన్ను తీసికొని పోవుగాక!.

2) పూషకు అనుకూల మార్గము తెలియును. భయరహితమైన మార్గముగుండా తీసికొనిపోవుగాక! మనకు దారిచూపుచు అతడు వెళ్లుగాక!

3) అగ్ని నిన్ను పరిపాలించుటకు సిద్ధముగా నున్నాడు. నీ కొరకై చూచుచున్నాడు. ముందితడు వెళ్లి ప్రతిబంధకులైన రాక్షసుల నుండి కాపాడుగాక!

దహన దేశమున పశ్చిమ దిశ యందు ప్రేతనుంపవలెను. ఇంతకు ముందు వండిన అన్నపు కుండను బ్రద్దలు కొట్టవలెను. "ఏషా వై దేవా" అను మంత్రముచే వాహకులు, మిగిలిన వారందరు ఉత్తరపు వైపుగా కొంత దూరము వెళ్లవలెను. "అపేతవీత" అను మంత్రముచే స్మశానమును శుద్ధిచేయవలెను.

తా:- "ఓ యమదూతలారా! పూర్వమునుండియున్న, క్రొత్తగా వచ్చిన మీరందరు ఇక్కడ నుండి తొలగిపొండు. వేరువేరుగా పొండు."

ఇంతకు ముందు చేసిన అగ్ని హోత్రమును మరల జ్వలింపచేసిన తరువాత మరల హోమములుండును. ఆపైన కట్లు విప్పుదురు. ఆ త్రాటిపై శవమును పరుండబెట్టవలెను. ఆపైన చితి పేర్చవలెను. కర్త "యే జీవా" అను మంత్రముతో తిరుగును. "ఇమమగ్నే" అను రెండు మంత్రములచే చితిమీద దక్షిణ శిరస్సుగా నుండునట్లు శవమును పరుండ పెట్టవలెను. తదుపరి ప్రేత నోటిలో బంగారము, బియ్యము, ఆజ్యమును (నేతిని) వేయవలెను. వచ్చినవారు బియ్యమును పోయవలెను.

"మైనమగ్నే" అను మంత్రముచే ఔపాసనాగ్నిని గ్రహించి ప్రేత యొక్క దక్షిణ భుజములందుంచవలెను.

తా:- "ఓ అగ్ని! ఇతనిని మాడ్చి వేయకుము. సంతాపమును కలిగింపకుము. శరీర అవయవములను విక్షేపము చేయక ఇతనిని పితృ లోకమునకు తీసికొని పొమ్ము."

ఆ అగ్నియందు 9 హోమములుండును. ఇందు "య ఏతస్య పథో............" అను మంత్రములను పఠింతురు.

తా:- ఇతడు స్వర్గమునకు వెళ్లునపుడు, ఇతనిని కీర్తించువారు, రక్షించువారు, ఇతని అపకీర్తిని చెప్పకుండ ఉండువారు మొ॥ వారి స్తుతి ఇందుండును. వారి సంతుష్టికి ఈ హోమములుండును.

తరువాత నితడు దుష్టతిథి, వార, నక్షత్రములలో పోయినచో ఆ దోషములు పోగొట్టుటకొరకు "ప్రకేతునా" అను 9 మంత్రములచే ఉచ్చైస్స్వరముతో మంత్ర పఠనముండును.

తా:- "ఓ అగ్ని! నీ యందున్న స్వాభావికమైన జ్యోతిని, ప్రేత శరీరమందు నీవుంచిన జ్యోతిని ఈ రెండిని ఏకముచేసి పరమాత్మ రూపజ్యోతిస్సుతో కలుపుము. యమ సంబంధి కుక్కల బాధనుండి వీనిని కాపాడుము. ఈ ప్రేతకు, సోమయాజుల యొక్కయు, బ్రహ్మయజ్ఞాదులను అనుష్ఠించువారి యొక్క పుణ్యలోకములు ప్రాప్తించుగాక."

దక్షిణ భుజమందు నీళ్లకుండ బెట్టుకొని కర్త, అప్రదక్షిణముగా 3 సార్లు "యద్వై దేవస్య" అను మంత్రముచే తిరుగవలెను. "యారాష్ట్రా త్పన్నాత్" అను మంత్రముచే కర్త పలాశ (మోదుగ) తోరణము క్రింద నుండి వెళ్లి జలాశయము దగ్గరకు శవమును చూడకుండ వెళ్లవలెను. "అజోభాగః" అను మంత్రముచే కొండ గొట్టెను తీసికొని వచ్చి చితి సమీపమందుంచి తదుపరి పర్వతము నెక్కెడివారు. ఇది నేడులేదు. తరువాతనే పలాశ తోరణము క్రింద నుండి వెళ్లుట. 'అజోభాగ'కు.

తా:- "ఓ అగ్ని! నీ తాపముచే దీనిని తపింపుము. శోకహేతువైన నీమంటలు దీనిని దహించుగాక." ఈ మంత్రముచే మేకను శవముతో బాటు దహించెడివారని తెలియుచున్నది. ఇందు కట్టు త్రెంపుకొని పారిపోవునట్లుగా కట్టుమని ఒక పాఠము, త్రెంపుకొని పోకుండ ఉండునట్లు కట్టుమని ఒక పాఠమును కనబడుచున్నది. దానికి బదులుగా నేడు దర్భలతో దాని ఆకారమును చేసి తంతు నడిపించుచున్నారు.

వాహకులచే దహనమైనదని తెలిసికొన్నవాడై కర్త స్నానము చేయును. అప్పుడే రోదనము కర్తకు వపన సంస్కారముండును. శిలా ప్రతిష్ఠ ఉండును. తరువాత నిత్యకర్మ ప్రారంభమగును. మృత్తికాస్నానము చేసి తిలోదకములను, వాసోదకమును శిలపై వదలవలెను. తాపము పోగొట్టుటకై మృత్తికాస్నానములు, తృష్ణను పోగొట్టుటకై తిలోదకములు, పిపాసను పోగొట్టుటకై వాసోదకములను, ఆకలిని పోగొట్టుటకై పిండ ప్రదానమును ఆ శిలకు చేసి ప్రేత రూపములో నున్న గ్రద్ద, కాకులకు ఈ పిండప్రదానము చేయవలెను. గ్రద్ద, కాకులు లేకపోయినచో పిండమును జలములో విడిచిపెట్టవలెను. ఆపైన కర్త, ఇంటికి వచ్చి దీపమును చూడ వలెను. చనిపోయిన ప్రదేశమందు జీవధార (ఎడతెగకుండ పడునట్లు)ను నవధాన్యములు క్రింద చల్లిన ప్రదేశమందు పడునట్లు పైన కట్టవలెను.

ఆ పైన సంచయనముండును. ఇది తొమ్మిది రోజులలోపుగా చేయవలెను. కొన్ని మంత్రములతో పంచ గవ్యములతో బూడిదపై చల్లుదురు. "యంతే అగ్ని మమంథామ" అను మంత్రముచే నీళ్లకుండలో పాలుపోసి ఆయుదకమును భస్మముపై చల్లవలెను. స్మశానాగ్నిని తీసికొని 1) అవస్రుజ, 2) సంగచ్ఛస్వ, 3) యత్తేకృష్ణస్య అను మంత్రములచే సంచయన హోమములుండును. ఆ మంత్రములకు వరుసగా ఇది యర్థము.

1) పితృప్రాప్తిని కలిగించుగాక. ఈ ప్రేతకు శరీరము వచ్చుగాక.

2) ఓ ప్రేతా! స్వధాకార బలముతో పితృదేవతలతో చేరుదువుగాక! ఇష్టాపూర్త కర్మఫలముతో కూడిన వాడవగుదువు గాక! ఈ భూ ప్రదేశమున నీవు కోరిన ప్రదేశమున జన్మను పొందుము.

3) ఓ ప్రేత! నీ దేహమునకు ఉపద్రవమును కలిగించిన చీమలు, సర్పములు మొ॥ వాని నుండి కలిగిన ఉపద్రవమును ఈ అగ్ని పోగొట్టుగాక! యాగ కాలమున నీలో ప్రవేశించిన సోముదు కూడ నిన్ను కాపాడుగాక. ఆ పైన అగ్నిని చల్లార్చవలెను. భస్మమునుండి ఎముకలను గ్రహించి ఒక పాత్రలోనికి ఏరవలెను. "ఉత్తిష్ఠాత స్తనువగ్ం..........." అను 5 మంత్రములచే 5 చోట్ల ఎముకలను గ్రహించి పాత్రయందుంచవలెను.

తా:- "ఓ ప్రేతా! లెమ్ము. నూత్న శరీరమును సంపాదించుకొనుము. నీ అవయవములను విడిచి పెట్టకుము. నీవు కోరిన ప్రదేశమును సవిత పొందించుగాక! ఈ ఎముకలతో సుందర శరీరమును ధరింతువుగాక! దేవతలకు ఇష్టమైన వాడవగుదువుగాక! స్వర్గ లోకమున ఉత్తమ స్థానమును పొందుము. యమయములతో ఐకమత్యమును పొంది స్వర్గసుఖమును పొందుదువుగాక."

ఆపైన అంత భస్మమును నీళ్లలో కలుపవలెను. నీటితో దహన ప్రదేశముమ తడిపి శవాకారముగా ఒక బొమ్మను గీసి బలి ప్రదానము చేయవలెను.

"ఆపోహిష్ఠ............ " హిరణ్యావర్ణ, పవమానసూక్త, హిరణ్యా సూక్తములతో ఎముకలపై నీటిని చల్లి గంగలో కలుపవలెను. ఈ మంత్రములలో సమస్త శుద్ధులు కలుగవలెనను అభిలాష వ్యక్తమగును. మొదటి రోజుననే నగ్న ప్రచ్ఛాదన, అను శ్రాద్ధమును, ఆహ్నిక శ్రాద్ధమును ఇంటి దగ్గరే చేయవలెను. ప్రేతకు అంధత్వాదులు లేకుండ ఉండుటకు నగ్నప్రచ్ఛాదన అను శ్రాద్ధమును పచ్చి ద్రవ్యములతో ఆచరింపవలెను. 1, 3, 5, 7, 9, 11 రోజులందు ఆరింటిని ఏకోద్దిష్ట విధానముగా (అనగా వానిని మాత్రముద్దేశించి) ఆమ శ్రాద్ధమును ఇంటి దగ్గరే పెట్టవలెను. వీనినే ఆహ్నికములందురు. ఇది అంతయు పచ్చి ద్రవ్యములతో చేయవలెను. ఈ పదిరోజులు ఉదయముననే నిత్యకర్మను ప్రేతనుద్దేశించి అన్నముతో జలాశయము దగ్గర చేయవలెను. ఇది ప్రేతకు ఆకలి దప్పికలు లేకుండ నుండుటకు చేయుదురు. సర్వ అవయవములు అతనికి ఏర్పాటు అగుటకు చేయుదురు.

10వ రోజున నిత్యకర్మ ఆచరించి కర్త స్నానము చేసి జ్ఞాతులందరి మైలను పోగొట్టుటకై వపన సంస్కారమును మరల కావించుకొనవలెను. తదుపరి జ్ఞాతుల మైల పోగొట్టుటకై అఘాపనుత్తి హోమములు 12 చేయవలెను. 'న హి తే అగ్నే' అను మంత్రములచే హోమములు. ఈ మంత్రమునకు ముందు పితృమేధ పన్నములో 'యథాఽహాని' ఒక మంత్రముండును. ఇందు ఋతువులు, తిథులు వరుసగా వచ్చినట్లు పెద్ద వారు ముందు, తరువాత పిన్నల మరణముండునట్లుగా అనగా అపసవ్య మరణము లేకుండునట్లుగా చేయుమని ప్రజాపతిని కర్త ప్రార్థించును. 'న హి తే అగ్నే'కు తాత్పర్యము:-

"ఓ అగ్ని! నావలు సముద్రమును దాటించునట్లు మా దుఃఖ సముద్రమునుండి దాటింపుము. మెరకనుండి పల్లమునకు నీరు పారునట్లు మా పాపము మా నుండి పోవుగాక!"

10వ రోజుననే శిల, భాండ, వాసములకుద్వాసన చెప్పి కూర్చప్రతిష్ఠ చేసి, కర్త బంధువులతో, జ్ఞాతులతో చనిపోయిన వానికి ధర్మోదకముల నిచ్చును.

ప్రేతకు ఉత్తమ లోకములు కల్గుటకై, సంతోషము కొరకై ఈ ధర్మోదకములుండును. కర్త తిలోదకమునిచ్చి నువ్వులు, ఉసిరిక పప్పుతో కూడిన దానితో స్నానముచేసి ఆనంద హోమాది కార్యములు జరుపును. "ఆనందాయ ప్రమోదాయ......................" మొ॥ మంత్రములచే 2 హోమ ములు జలాశయము దగ్గరే చేయవలెను. ఈ హోమములు చేయుటచే పశువులు మొ॥నవి మరణించుట సంభవింపదు. 10 రోజులు ప్రేత తృప్తి కొరకు చేసిన కర్మకాండ ముగిసినది. పై హోమములైన వెనుక ఆ అగ్నిలో అన్నము వండి కర్త 'యవో పి' అను మంత్రముచే కొద్దిగా తినవలెను.

తా:- "నా పాపమును పోగొట్టుము." అని అర్థము. ఆపైన విఘ్నేశ్వర పూజ, కర్మణః పుణ్యాహ వాచనము, నూత్న వస్త్రధారణము,

ఆశీర్వచనమును పొందవలెను. 10వ రోజుతో నిత్యకర్మదీక్ష పూర్తి యగును.

11వ నాటి కర్మ:

గృహశుద్ధి కొరకు విఘ్నేశ్వర పూజ, పుణ్యాహ వాచనము, ఆహ్నిక శ్రాద్ధమును చేయవలెను. తదుపరి వృషోత్సర్జనము. ఇది పిశాచ బాధను పోగొట్టి ప్రేత రుద్రలోకము చేరుటకై చేయబడు కర్మ. గిత్త, పెయ్య దూడలను ఆవాహన చేసి వానికి పాణిగ్రహణము జరిపించి, పూజచేసి చరుహోమములు జరిపించి, నమక పారాయణము 11 మంది బ్రాహ్మణులచే చేయించి, ఎద్దునకు అచ్చుబోసి, దానిని విడిచిపెట్టవలెను. ఇదియే వృషోత్సర్జనము.

తరువాత ఏకోద్దిష్ట విధానముగా మొదటి మాసికమును పెట్టుదురు. బ్రాహ్మణ ముఖమునగాని, అగ్నిముఖమున గాని చేయవలెను. తరువాత షోడశము. అనగా సంవత్సరమున, ప్రతి మాసమున పెట్టు మాసికములను ఒక మాటే పెట్టవలెను. కర్త మరణించునేమో అను శంకచే ఒక మాటే పెట్టుదురు.

సంవత్సరాంతమున జరుగు సపిండీకరణము 12వ రోజుననే చేయుటచే అన్ని మాసికములు 11వ రోజుననే పెట్టవలసియున్నది. ఏకోద్దిష్ట విధానమున విశ్వేదేవతలుండరు. ఒక్క పితృస్థానమే ఉండును.

12 మాసికములు, ఊనత్రయములు 3 (ఊన మాసిక, ఊనషాణ్మాసిక, ఊన ఆబ్దికములు); త్రైపక్షికము (మూడవ పక్షమున పెట్టునది) కలిపి మొత్తము 16. దీనినే షోడశమందురు. ఇందు 16 బ్రాహ్మణుల నర్చించవలెను. "ఆయా హి ప్రేత. . . శతశార దం చ." అను మంత్రముచే ఆవాహనాదులుండును.

సపిండీకరణము:

12వ రోజున చేయవలెను. ఇందేడుగురు బ్రాహ్మణులకు భోజనముండును. విశ్వేదేవులిద్దరు (కామ, కాల పేర్లులతో పిలువబడువారు), ప్రేత

స్థానమొక్కటి, పితృపితామహ ప్రపితా మహులు 3, విష్ణు స్థానమొక్కటి మొత్తము 7 గురు బ్రాహ్మణులకు పూజ. ఇందు ఆబ్దిక మంత్రమంతయు నుండును. ఉదక సంయోజనము, పిండ సంయోజనము మాత్రమధికము.

ఉదక సంయోజనమనగా పితృపితామహ ప్రపితామహులకు ఆహ్వానము చేసిన పాత్రలలో, ప్రేత పాత్రలోని నీటని పైవాని యందు కలుపుట.

పిండ పంయోజనమనగా ప్రేత పిండమును 3 భాగములుగా చేసి పితృపితామహ ప్రపితామహ పిండములతో కలుపుట. వరుసగా 'సమానీవ ఆకూతిః' "సంగచ్ఛధ్వం" అను మంత్రములను పఠింతురు.

తా:- మీ సంకల్పములు ఏకమగుగాక! హృదయములు ఏకమగుగాక! మనస్సు ఏకమగుగాక!

కలిసియుందుముగాక! కలిసి మాట్లాడుదుముగాక. విరోధము లేకుండ ఏకవిధముగా నుందుముగాక. పూర్వము దేవతలు ఐకమత్యముతో నుండి హవిస్సు నెట్లు పొందిరో అట్లే ధనమును స్వీకరింతురుగాక. మనస్సు, చిత్తము, అంతఃకరణము ఏకముగా నుందుగాక. అని చక్కని అర్థమిచ్చు మంత్ర పఠనముండును.

చతుర్థ పురుష నివృత్తి కొరకు అనగా కర్తయొక్క నాల్గవ పురుషుడైన వృద్ధ ప్రపితామహునకు స్వర్గపాథేయమును (దారిబత్తెమును) దానము చేయవలెను. లోకమున ఏయే వస్తువులననుభవించు చున్నాడో ఆయా వస్తువులు ఆ నాల్గవ పురుషుడు అనుభవింపగలందులకు ఈ బత్తెము నిత్తురు. వస్త్రము, బియ్యము, పచ్చి ద్రవ్యములతో ఈ దానముండును. ఆ వెనుక "ప్రేత పితృసాయుజ్యమును పొందుగాక, బ్రతికియున్న వారికి మంగళమగుగాక" అను నర్థమిచ్చు శ్లోకమును పఠింతురు.

"ఏషవోను గతప్రేతః పితృసాయుజ్యమాప్నుయాత్
శివం భవతు శేషాణాం జాయంతాం చిరజీవినః"

ఇకనుండి ప్రేత శబ్దోచ్చారణముండదు. ప్రేత పితృదేవతలతో కలిసిపోయినాడు కనుక 3 సార్లు ప్రేతను వెళ్లుమని చప్పట్లు కొట్టుదురు. పితృకార్యములందు చప్పుడు చేయరాదందురు. ఇప్పుడు మాత్రమే చప్పట్లు.

ఆపైన వసు, రుద్ర, ఆదిత్యులను అభిమంత్రించుదురు. పిండ ప్రదానము పూర్తి చేయవలెను. మరల వైతరణి అను గోదానము మొ॥ దశ దానములు చేయవలెను. ఆ సీమాంత క్రమము పూర్తిచేసి శ్రాద్ధాంగ తర్పణము చేసి తరువాత కర్త తలంటు పోసికొనుట, నూత్న యజ్ఞోపవీతమును ధరించుట, కర్మణః పుణ్యాహవాచనము చేయుట, ఊన మాసికము పెట్టుట మొ॥ తంతు జరుగును. తరువాత బంధువులకు భోజనము. క్రొత్త బట్టలను ధరించగా ఆశీర్వచనముతో కర్మ పరిసమాప్తి యగును. సపిండీకరణము వెనుక పెట్టు మాసికములలో విశ్వేదేవస్థానము, పితృస్థాన ముండును.

గ్రంథము పెరుగునన్న భావనతో తద్దిన మంత్రముల అర్థమును వ్రాయలేకపోవుచున్నాను. ఇందు పితృదేవతలను ఆహ్వానము చేయుట, మనము భోజనము పెట్టు బ్రాహ్మణులను విశ్వేదేవతలుగా, పితృదేవతలుగా భావించుట, సమస్త సుఖములు పితృదేవతలిత్తురుగాక అను ప్రార్థనలతో, స్తుతులతో నిండియుండును.

పై చెప్పిన పదముల వివరణ, పెక్కు గృహ్య సూత్రములలోని పద్ధతులు సూక్ష్మముగా వివరింతును.

## మృత్యువు సమీపించుననగా చేయుపనులు

కౌశిక సూత్రమునందు (80.3) మరణాసన్న వ్యక్తి యొక్క పుత్రుడు నేలపై దర్భలను పరచి 'స్యోనాస్మై భవ' (ఓ భూమీ! ఇతనిని చల్లగా చూడుము) ఆదిగా గల మంత్రమును చదువుచు ఇతనిని పరుండబెట్టి వలెనని కలదు. ముందుగా దశ విధ దానములు చేయవలెనని శుద్ధి ప్రకాశమునందు కలదు. ఈ దానములు, గయా శ్రాద్ధముకన్నను, అశ్వమేధ యాగ ఫలము కన్నను గొప్పవని కలదు. గోదానము ప్రశస్తము. అట్లే సర్వ

ప్రాయశ్చిత్తములు, వ్రతోద్యాపనలు జరుపబడవలెనని కలదు. మరణమునకు ముందు సన్న్యాసము పుచ్చుకొన్నచో ఆతుర సన్న్యాసమనబడునని, అతనికి జన్మలేదని గరుడ పురాణము. ఎట్టి భావనతో చనిపోవునో అట్టి గతి కల్గునని వేలాది పుస్తకములు ఘోషించుచున్నవి. కూర్మ స్కాందములందు గంగాది జలముల సమీపమందు, క్షేత్రములందు చనిపోయినవానికి ముక్తియని చెప్పినవి. సాలగ్రామము తులసి సమీపమున మరణించిన వానికి ముక్తియని పూజారత్నాకరమనుచున్నది. అట్లే ఉత్తరాయణాది పుణ్యకాలములందు మరణము మోక్ష ప్రదమని భారతము. అతని చెవిలో ఉపనిషత్ మంత్రము పఠింపవలెనని హిర.పితృ.సూ చెప్పగా నేడు భగవన్నామ గీతాపారాయణము చేయుచున్నారు. ఈ ఆచారము సర్వే సర్వత్ర ఉన్నది. యజ్ఞయాగాదులను చేయువారి మరణమును గూర్చి వ్రాయుటలేదు. లౌకికుల మరణము కన్న అది విశిష్టమైనది. వారీనాడు వ్రేళ్లపై లెక్కింపదగినవారుగా నున్నారు. దానికి చాల పెద్ద తంతు కలదు.

నేడు మృత్యువు సమీపించుచున్న దనగా తులసి జలమును నోటిలో పోయుచున్నారు. బెంగాల్ దేశమునందొక చిత్రమైన పద్ధతి కలదని రాజ్‌బలిపాండే గారు వ్రాసిరి. ఆ వ్యక్తిని నదికి దగ్గరకు తీసికొని వెళ్లి దేహము యొక్క క్రింది భాగమును నీటిలో ముంతురట. దీనిని వారు 'అంతర్జలి', 'ఘాట్‌మృత్యు' అని పిలుతురట. దీనికి ఆధారము స్కాందమని శ్రీ పి.వి. కాణే గారు వ్రాసిరి.

### అంత్యకర్మ చేయుటకు అధికారులు:

పుత్రులు ప్రధానము, అందున జ్యేష్ఠపుత్రుడు. సంతానము లేక పోయినచో సపిండులు, ఆపైన సమానోదకులు, లేదా తల్లికి సంబంధించిన సపిండులు, లేదా వారి సమానోదకులు, ఆపైన దౌహిత్రుడు, లేదా భార్యలు ఇట్లు వరుసగా పేర్కొనినది మార్కండేయపురాణము. దీనిపై పెక్కు నియమములు కలవు.

శవ విసర్జనము:

దహనమా? లేక ఖననమా? అనేక దేశములందు వారివారి ఆచారానుగుణముగ పాతిపెట్టుట, కాల్చుట, పశు పక్ష్యాదులకు వేయుట, మొ॥ పెక్కు ఆచారములు కలవు.

మృతవ్యక్తిని ఇతరులు తినుట, నిర్జన ప్రదేశమున విడిచిపెట్టుట, గుహలందు పాతిపెట్టుట, పశు పక్ష్యాదులకు ఆహారముగా నిడుట మొ॥ మనలో లేవు. నీటియందు విసర్జించుట సన్న్యాసుల పట్ల చెల్లును గాని ఇతరుల పట్లకాదు. ఇక పాతిపెట్టుట చిన్నపిల్లల పట్ల, సన్న్యాసులపట్ల మనలో కలదు.

"అద్వివర్షే ప్రేతే................ శరీర మదగ్ధ్వా నిఖనంతి" (పా.గృ.సూ.)- అయినను పాతిపెట్టు ఆచారము మనలో పూర్వముండెడిదని కొందరాధునికులనుచున్నారు. శవమునుద్దేశించి స్మశానమున పురోహితుడిట్లనును. "ఆనందదాయినియైన ఈ భూమినీకు తల్లి. నిర్ఋతి నుండి ఇది కాపాడును. హే భూమి! ఈ శవముపై నుండుము. ఇతనిని బాధింపకుము. విశ్రాంతి నిమ్ము. తల్లి తన వస్త్రముతో కప్పురీతిని ఇతనిని కప్పుము." అను నర్థమిచ్చు మంత్రములను బట్టి పూర్వము పూడ్చెడివారని అందురు. ఆశ్వ.గృ.సూ.ని బట్టి ఇది మృత జీవియొక్క ఎముకల నేరి ఒక పాత్రలో పెట్టు సందర్భమున ఈ మంత్రములను పఠింతురని విద్యారణ్యులు వ్యాఖ్యానము చేసిరి. ఆపైన గృహ్య సూత్రములలో ఖననము గూర్చి ప్రస్తావన లేదు. అనాది నుండి దహనము చేయుటయే మన ఆచారము.

"యో నిఖాతా యే పరోప్తా యో గ్ధాయే చోద్ధితాః
సర్వాంస్తానగ్న ఆవహ పితౄన్హ విషే అత్తవే" -- అథ.వేదము

తా:- "ఓ అగ్ని! పాతిపెట్టబడినవారు, పడినవారు, అగ్నియందు జలమందీయబడినవారు, విసరబడినవారు, పైవారినందరిని హవిస్సును భక్షించుటకై తీసికొనిరమ్ము."

"యే అగ్నిదగ్ధా యే అనగ్నిదగ్ధా మధ్యే దివఃస్వధయా మాదయంతే త్వం తాన్ వేత్థ యది తే జాతవేదః స్వధయా యజ్ఞం స్వధితిం జుషన్తామ్."

(అందే)

తా:- "అగ్నియందు దగ్ధమైన వారిని, అట్లుకాని వారిని ఓ అగ్ని! నీ వెరుగుదువు. నీ ద్వారా వారీ అన్నమును గ్రహింతురు గాక."

మొదలగు మంత్రముల వలన పాతిపెట్టు ఆచారము కలదని ఆధునికుల వాదన. కొన్ని కళేబరములు కన్పించుచున్నవని వారందరు. ఆ మంత్రములందున్న ఖననము, శత్రువులు చంపి సంస్కారము లేకుండ చేసినవిగాని, లేదా శిసుమరణముల పట్లగాని, లేదా ఆత్మహత్యాదులు చేసి కొన్నవారివిగాని, లేదా సంస్కారము చేయువారే లేక అనాథ శవములు గాని కావచ్చును. "తస్మాదప్యద్యేహాద దానమ్............" అను ఛాంద్యోగ్య శ్రుతిలో నున్నది అసురుల విషయమై ఖననమని కొందరి భావన.

దహనమే ప్రధానమనుటలో ఒక ప్రబలమైన యుక్తి కలదు. ఆర్యులు అగ్నిని దేవదూతగాను, అగ్నిలో హోమము చేసినది దేవతలకు చెందునని గట్టిగా విశ్వసించిరి. ఇది "వహ్నిం యశసంవిదస్య కేతుం సుప్రావ్యం దూతం సద్యోఅర్థమ్" మొ॥ మంత్రములచే స్పష్టము. దేహము బూడిద యైనపుడు, ఒక క్రొత్త దేహమును యమలోకమున ధరింపవలెనన్నను, పితరులలో కలియవలెనన్నను దహనమే చేయవలెనను మంత్రములు వేలాదిగా కలవు. హవ్య, కవ్యములకు అగ్నియే ఆధారము. అగ్నిని ఆరాధించు పార్శీలు పక్షులు మొదలగునవి తినుటకై శవములను విడిచిపెట్టుదురు. వీనిని (శవములను) అగ్నిలో వేసిన అగ్ని అపవిత్రమగునని బావించిరేమో!

పుణ్యము, పాపము చేయుటకవకాశమే లేని శిశువులకు, పుణ్యపాపాతీతులైన సన్న్యాసులకు మాత్రమే ఖననము. పుణ్యాపాప మిశ్రిత దేహులైన సామాన్యులకు దహనమే ముఖ్యము. ఆపైన ఈ సంస్కారమును ఔర్ధ్వ దైహిక క్రియగా భావించిరి.

రెండు సంవత్సరముల శిశువులకు దహనము లేదని, ఉపనయన దీక్ష లేనివారికి కూడ ఖననమేయని పెక్కు గ్రంథముల వలన తెలియును. వివాహము కాని స్త్రీలకు దహనము లేదు. రెండు సంవత్సరములు దాటిన వారిని దహించిన దహింపవచ్చునని, మానిన మానవచ్చునని వికల్పమును సూచించినవారు మను, బౌధాయనులు. కాని వైఖ. స్మార్త సూత్ర మున 5 సంవత్సరముల వయస్సులోపు గలవానికి గాని 7 సంవత్సరముల వయస్సులోపుగల ఆడపిల్లకు గాని దహనము కూడదని కలదు.

"నామకరణమునకు ముందు పోయినచో ఖననము, ఉదక క్రియలేదు. నామకరణము వెనుక 3వ సంవత్సరము లోపుగ పోయిన పిల్లవానికి దహనము, ఉదక క్రియ చేసిన చేయవచ్చును, లేదా ఖననము చేయవ చ్చును. 3వ ఏడునుండి ఉపనయనము వరకు దహనము, మంత్రములు లేక ఉదక క్రియ, ఉపనయనమైన వెనుక పోయిన వానికి మంత్ర పూర్వక దహనమని" యాజ్ఞ. స్మృతిపై మితాక్షరి వ్యాఖ్య.

ఇక పెద్దవారి పట్ల ఖననము కొన్ని వర్ణములలో నేడు కూడ కలదు. పెక్కు మంత్రముల వలన దహనమే మన ఆచారమని తేలుచున్నది.

### సన్న్యాసుల పట్ల నియమము:

సన్న్యాసులలో ఒక భేదమగు కుటీచకుని దహింపవలెనని, బహోదకుని ఖననము చేయవలెనని, హంసను నీటిలో విడిచిపెట్టవలెనని, పరమహంసను పాతిపెట్టవలెనని స్మృత్యర్థ సారమున కలదు. నేడీ భేదమును పాటింపక ఖననమే చేయుచున్నారు.

### శవ వాహనము:

శవమును మేడికట్టతో చేసిన వాహనముపై పరుండ బెట్టవలెనని, కృష్ణాజినమును పరుపవలెనని ఆ.గృ.సూత్రము. ఇది నేడు లేదు. వెదురునే వాడుచున్నారు. దశరథుని శవమును ఒక శిబిక (పల్లకి)పై తీసికొని వెళ్లినట్లు రామాయణము.

**శవమును తొలగించు పద్ధతి:**

దీనిని తీసికొని పోవువారు బేసి సంఖ్య కలిగిన పెద్దలై యుండవలెనని, కొందరి మత ప్రకారము ఎడ్లబండిపై తీసికొని వెడలవలెనని యందురని ఆ.గృ.సూ. 4.1. లందు కలదు. నేడు బండిలేదు. రక్తసంబంధమైన వారు తీసికొని వెళ్లవలెనని సర్వ గ్రంథకర్తల అభిప్రాయము.

**శవయాత్ర:**

మృతుని పెద్ద కుమారుడు చేతిలో నిప్పుగల కుండను ధరించి నడుచును. చనిన వ్యక్తికన్న రెండు సంవత్సరములపైబడి వయస్సు కలిగిన వారు శవమును వెంబడించవలెనని పా.గృ. సూత్రము. వయస్సు నను సరించి పెద్దలు ముందు నడువగా పిన్నలు వారి ననుసరింతురు. ప్రాచీన కాలమున మృతుని భార్యలు జుట్టుముడి విప్పుకొని, భుజములపై దుమ్ము చల్లుకొనుచు వెళ్లేవారని బౌధ.పి.సూ. వలన తెలియును. నేడిదిలేదు. శవమును తీసికొని వెళ్లునపుడు 4 వాద్యములు వాయించవలెనని బ్రహ్మ పురాణపు మాట శుద్ధి ప్రకాశమున కలదు. ఈ పద్ధతి నేడు కొన్ని వర్ణములలో కలదు. దశరథుని తీసికొని వెళ్లునపుడు అతని భార్యలు వెంట వెళ్లినట్లు రామాయణము. శవ యాత్రయందు యమ సూక్తములను పఠింపవలెనని ఒక సూత్రము చెప్పగా నేడు రామాది నామములను పఠించుచున్నారు.

**అనుస్తరణి:**

అనుస్తరణి, లేదా రాజగవి అని పిలువబడు గోవును వీరివెంట తీసికొని వెళ్లెడివారు. "ఆనయుం త్యేతాం. . ." అను బౌధ. పితృ.సూ. వలన పై విషయము తెలియుచున్నది. ఈ పశువు ఆవుకావచ్చును, లేదా ఆడమేక కావచ్చును. లోకములను రక్షించుదానివి, బలినిమిత్తమై తీసికొని పోవుచు న్నామని అర్థమిచ్చు మంత్రములు కలవు. దీనిని హోమము చేయుటగాని, విడిచిపెట్టుటగాని చేయవచ్చునని సూత్రము లందు కలదు. "మృతునకు సహచరివై యున్నావు, నీ వలన మృతుని పాపములు పోవును. అందువలన

మాకెట్టి పాపముండదు" అను నర్థమిచ్చు మంత్రములను పఠించెడివారు. వదిలిపెట్టినచో ఇది రుద్రులకు తల్లి, వసువులకు కూతురు, ఆదిత్యులకు చెల్లెలు, మా సంతోషమునకు కేంద్రము. దీనిని చంపకుడని మనవి చేయుచున్నాను. అను నర్థమిచ్చు "మాతా రుద్రాణాం" మొ॥ మంత్రమును పఠించెడివారు. దీనిని చంపుటవలన మృతునకు దారి బత్తెముగా నుండునని కొందరు భావింపగా, పరలోక యాత్ర సుఖముగా సాగుటకని కొందరు భావించిరి. అనుస్తరణీ, వైతరణీ అను పదముల అర్థమును గ్రహించిన ఇది ఇతనికి సహాయముగా నుండుననియే.

## సతీసహగమనము కలదా?

భర్త శవముతో బాటు బ్రతికియున్న భార్యను చితినెక్కించు ఆచారము సూత్రములందు కలదు. (ఆ.గృ.సూ.) ప్రేత పత్నిని ప్రేతకు ఉత్తర భాగమునందు పరుండబెట్టవలెనని పై సూత్రము చెప్పగా ఎడమ వైపున పరుండబెట్టవలెనని బౌధాయనము. మరిది ఆమెను లేపును. "ఇయం నారీ..............విశ్వం పురాణా మను పాలయంతీ" అను పితృమేధ పన్నమును బట్టి "పుత్రాదులను ఆమె రక్షించవలసినదిగా ఆమెకు అనుజ్ఞనిమ్ము. నీతో వచ్చుట ఆమెకు ధర్మమని తెలిసినను ఆమెకు బ్రతికియుండుటకు అనుజ్ఞనిమ్ము" అని స్పష్టముగా గలదు. "ఉదీర్ష్వ నార్యభి" అను మంత్రమున "చితినుండి నీవు లెమ్ము" అని కంఠోక్తిగా కలదు. దాసీజనము కూడ దహింపబడెడివారని స్రరదర్‌గారు Aryan Religion అను గ్రంథముల వ్రాసిన వ్రాతలకు ఆధారము చిక్కుట లేదు. బాబిలోనియా మొ॥ దేశములలో ప్రభువు మరణించినచో అతని సేవకుని కూడ పాతి పెట్టెడివారు. ఇట్టి సంఘటన మన దేశములో లేదుగాని సతి కానంతవరకు స్త్రీకి మరల మరల పుట్టుక కలదను గరుడ పురాణ వాక్యమును బట్టి పూర్వమిదియుండెడిదని తేలుచున్నది. గర్భిణులకు, చిన్నపిల్లలు కలిగిన స్త్రీలకు సహగమనము లేదని అందే కలదు. సతీ సహగమనము కొన్ని ప్రాంతములందుండినను విష్ణు ధర్మ సూత్రమును బట్టి ఇది చేసిన చేయవచ్చును. మానిన మానవచ్చునని వికల్పము కలదు.

బ్రతికియున్న స్త్రీ త్రికరణశుద్ధిగా బ్రహ్మచర్యమును పాటించవలెనన్నది. ముఖ్యముగా రాజపుత్రులందుండెడిది. దీనిని శాసన రూపమున బెంటిక్ రూపుమాపినాడు.

దహనమొక యజ్ఞము:

దహనమునకు ముందు బ్రాహ్మణ శవమైనచో ఆచేతియందు స్వర్ణ పిండమును, క్షత్రియుడైనచో ధనుస్సును, వైశ్యుడైనచో మణియుంచవలె వని ఆప.గృ.సూ.లందు కలదు. నేడివి పాటించుట లేదు. ప్రేత శ్రోత్రియుడైనచో యజ్ఞపాత్రలను ఆయా అవయవములపై నుంచెవలెను. ఇక గోవును చంపినచో ఆయా అవయవములను శవముపై నుంచుట, లేదా విడిచిపెట్టినపుడు పిండితో ఆవును చేసి వపకు బదులు ఆపూపములను బెట్టుట, అగ్ని, సోమ, లోక, అనుమతి దేవతలనుద్దేశించి వాల్గాహుతులిచ్చుట, ఐదవ ఆహుతిని ప్రేత హృదయముపై నుంచుట మొ॥ జరిగెడివి. ఇవి సామాన్యులనుద్దేశించినవి కావు.

శ్రోత్రియునకు 3 అగ్నులతో, ఔపాసనాగ్నిని మాత్రము కలవారికి దానితోనే (స్మార్తాగ్ని), లౌకికులకు మామూలు అగ్నితోనే సంస్కారమని పా.గృ.సూ. లందు కలదు.

అగ్నిని ముట్టించునపుడే అర్థమిచ్చు మంత్రములుండును. "సూర్యం తే చక్షుః" ఇత్యాది మంత్రములు పితృమేధ పన్నమున కలవు.

తా:- "ఓ ప్రేతా! నీ చక్షురింద్రియము సూర్యుని, నీ ప్రాణము వాయువును పొందుగాక. నీ పుణ్య కర్మానుగుణముగ స్వర్గమును గాని, భూమిని గాని పొందుము."

అట్లే "అయం వై" మంత్రము.

తా:- ఓ అగ్ని! కొడుకు తండ్రిని పున్నామ నరకము నుండి కాపాడుట ప్రసిద్ధము. ఇతడు బ్రతికియుండగా చేసిన యాగముల వలన నిన్ను కాపాడినందున ఇతడు నీకు తండ్రియైనాడు. అట్టి నీ తండ్రిని

కాపాడి పుత్రత్వమును సార్థక పరుచుకొనుము. మరియొక మంత్రమున "ఓ ప్రేతా! అన్నాదులకు లోటు లేకుండ నుందువు గాక" అను హృదయ విదారకమైన, ప్రేమ పూర్వకమైన వీడ్కోలుండును.

దహన సమయమున బ్రతికియున్నవారు దుఃఖించకూడదని, ఒకరి నొకరు ఓదార్చుకొనుచు ఉత్తమ కథలు చెప్పుకొనవలెనని పా.గృ.సూ.లందు కలదు. ధర్మ రాజాదులు దుఃఖించుచుండగా వ్యాసుదు గట్టిగా మందలించె నని భారతమున ఉన్నది. దుఃఖించినచో మృతునకు లాభము చేకూర్చదని తెలియుచున్నది.

ఉదకాంజలి:

ఉదకాంజలిని ప్రేతయొక్క గోత్రమును పేరును ఉచ్చరించుచు నీయవలెననియు, నీటినుండి బయటకు వచ్చి ఉతికిన వస్త్రములను కట్టుకొన్నవారై తడిగుడ్డలొకేసారి పిండి యెండునట్లు చేయవలెనని ఆ.గృ.సూ.లందు కలదు. స్నానానంతరము వండిన అన్నమును కాకులకు వేయుట కలదు. ప్రేతకాకులను కూడ ఆవహించి యుండునని విశ్వాసము పక్షులు, మరుత్తులతో (పితరులలో ఒక శాఖ) పోల్చబడినవి. (ఋ.వే. 1.8507).

ఇంటికి తిరిగి వచ్చుట:

నక్షత్రములు కనబడువరకు అచ్చటనే యుండి ఆ వెనుక ఇంటికి ముందు పిన్నలు నడువగా తరువాత పెద్దలు నడచి రావలెనని, ఇంట ప్రవేశించునపుడు పాషాణము, అగ్ని, ఆవుపేడ, అక్షతలు, నూనె, నీరు మొ॥ వానిని స్పృశింపవలెనని ఆ.గృ.సూ. కొందరి మతప్రకారము, పిచుమంద లేక వేప ఆకులు తినవలెనని పా.గృ.సూ.

దూర్వలను, ఎద్దును కూడ ముట్టుకొనవలెనని, ప్రేతనుద్దేశించి ఒక పిండమును ఇంటి ద్వారమున నుంచి లోనికి ప్రవేశింపవలెనని శంఖ వచనమునుదాహరించినది -- మితాక్షరి వ్యాఖ్య. ఆనాడు ఇంట వంట చేయ

రాదని, మూడు రోజులు ఉప్పు, కారము లేని భోజనమును భుజింపవలెనని ఆ.గృ.సూత్రము.

## ఆశౌచ విధులు: (మైలలో పాటించునవి)

చనిపోయిన వాని బంధువులు ఎందులకు మైలపట్టవలెనో కారణము తెలియదు. మన ఊహకందనిది శవము దగ్గరనున్న వానికి ఆరోగ్య రీత్యా మైల పాటించవలెనని చెప్పినను, దూరముగా నున్న బంధువులకు కూడ మైల పాటించుట తప్పుటలేదు గదా! భౌతిక కారణములను బట్టి చెప్పలేము. విజ్ఞాన శాస్త్రమున కందనిది. (Super Science)

వైదిక క్రియలొనర్చుటకు వీలులేక పోవుట, ఆ పది రోజులలో అస్పృశ్యుడుగా పరిగణింపబడుట ఆశౌచలక్షణమని మితాక్షరి వ్యాఖ్య. శుద్ధియందు సర్వ ధర్మములు పాటించుటకు వీలుండును.

"బాహ్య శౌచముకన్న లోపలి శౌచము గొప్పది. చేపలు మొ॥ నీటిలో ఉన్నను శుచిగా నున్నవని చెప్పలేము గదా! ఆత్మజ్ఞానమనే నీటిలో మునుగ వలెనని, విశ్వాసమనే గంధము పూసికొనవలెనని, నిష్కామమనే మట్టిని పూసికొని స్నానము చేయవలెనను ఒక చక్కని శ్లోకము లింగపురాణమున కలదు. భావశుద్ధియే ప్రధానమని పద్మపురాణము." "శుచి కామా హి దేవా వై" అనగా శుచిని కోరువారు దేవతలని బ్రహ్మాండ పురాణము. అయినను లోపల శౌచముతో బాటు పై శుచిని కూడ పాటింపవలెను. పొట్టులేని గింజను పాతిన మొలకెత్తుటలేదు. పొట్టు పొట్టే. కాని దాని అవసరము కూడ కలదు. అట్లే బాహ్యనియమముల ఆవశ్యకత కూడ కలదు. చనిపోయిన వ్యక్తి యొక్క బంధువులు స్నానాదులు చేసినను కొంతకాలము వారు అశుచులేయని అతీంద్రియవేత్తలు గుర్తించిరి. ఈ మైల చనిన వ్యక్తి యొక్క వర్ణము, వయస్సు, లింగమును బట్టి యుండును. సూత్రములందు బ్రాహ్మణులకు 10 రోజులు, వైశ్యులకు 15 రోజులు, క్షత్రియులకు 12 రోజులు, శూద్రులకు 1 నెల వరకు నుండునని కలదు. ఈ భేదము అయా వర్ణములు పాటించు ఆచారములపై ఆధారపడినదేమో! ఈ విషయమై పెక్కు నియమములు కలవు. సూక్ష్మముగా వివరింతును.

నిత్యాగ్నిహోత్రి, వేదాధ్యయన పరుడైన బ్రాహ్మణునకు ఒక రోజు తోనే శుద్ధియనియు, కేవల వేదమును వల్లించువానికి 3 రోజులనియు, ఏదియులేనివానికి 10 రోజుల తరువాత శుద్ధియని పరాశర స్మృతి. ఇట్లు తగ్గింపరాదని, పై మాటలు పూర్వయుగములకు సంబంధించినవని సర్వ బ్రాహ్మణులకు 10 రోజులు మైలయని చాల గ్రంథములందు కలదు.

శతాతపుని మత ప్రకారము అన్నివర్ణములకు పుట్టుక, మరణములందు 10 రోజులు మైలయని చెప్పినట్లు మితాక్షరివ్యాఖ్య.

ఋత్విజునకు, యజ్ఞదీక్షితునకు, బ్రహ్మచారికి, బ్రహ్మవేత్తకు, శిల్పులకు, దాసదాసీ జనమునకు, వైద్యునకు, మంగలికి, రాజునకు, శ్రోత్రియునకు వెనువెంటనే స్నానముతోనే శుద్ధియని కొన్ని స్మృతులందు కలదు.

రెండు సంవత్సరములలోపు పిల్లవాడు పోయినచో తల్లిదండ్రులే 10 రోజులు మైలపాటించవలెనని మితాక్షరి వ్యాఖ్య. ఇది బంధువులకు లేదట. దూరముగా నున్న బంధువులు వినునపుడే పాటించవలెను. 10వ రోజు దాటిన వెనుక విన్నచో ఒక రాత్రిగాని, లేదా 3 రాత్రులుగాని పాటింపవలెనని పార.గృ.సూ. శిశువునకు దంతములు రాకమునుపు పోయినచో సపిండులకు స్నానము, పిల్లవాడైనచో 3 రోజుల మైలను తల్లిదండ్రులు పాటింపవలెనని, ఆడపిల్లయైనచో ఒక రోజు చాలునని శంఖ, అత్రుల మాటలు. దంతములు వచ్చి, చూడాకరణము కాకపోయినచో సపిండులకు 1 రోజు, 1 రాత్రియనియు, 3 రోజులు తల్లిదండ్రులకని యాజ్ఞ. స్మృతి. బాలికయైనచో సపిండులకు స్నానముతో శుద్ధి. పుట్టు వెంట్రుకలు తీసిన వెనుక వారికి ఉపనయనము కాని బాలురపట్ల, వివాహము కాని బాలికల పట్ల తండ్రి, సపిండులు 3 రోజులు మైల పట్టవలెనని, సమానోదకులకు స్నానముతో శుద్ధి. ఉపనయనమైన వెనుక సపిండులకు 10 రోజులు మైల, సమానోదకులకు 3 రోజులే మైల. ఇట్లెన్నియో నియమములు కలవు. ఇక కొన్ని విధులను పేర్కొందును.

మైలలో చాల సుఖములను త్యజించుట, దుఃఖమును వ్యక్తీకరించుట, కేశములను ఖండింపకుండుట, వేద మంత్రములను చదువకుండుట,

నేలపై నిద్రించుట, పగలు మాత్రమే భుజించుట మొ॥ పెక్కు విధులు కలవు. సమస్త వైదిక క్రియలు మానవలెనని కొందరు స్మృతికర్తలు చెప్పగా శ్రౌతాగ్నులనర్చించుట మానకూడదని కొందరనిరి. సంధ్యా వందనము పనికి రాదని గోభిల స్మృతి చెప్పగా అర్ఘ్య ప్రదానము వరకు చేయవలెనని మితాక్షరి వ్యాఖ్య. మానసికముగా సంధ్యా మంత్రములు జపింపవలెనని స్మృతిముక్తా ఫలము. వేదాధ్యయనము, పంచమహాయజ్ఞములు పనికి రావని సంవర్తుని వాక్యము. విష్ణుసహస్ర నామములు పఠింపవచ్చునని నిత్యాచార పద్ధతిలో కలదు.

### అస్థి సంచయనము:

అనగా ఎముకల నేరుట. ఇది పూర్వము పాతిపెట్టెడి వారను ఆచారమునకు గుర్తు అని కొందరి ఆధునికుల వాదన.

సత్యాషాఢ శ్రౌత సూత్రమున దహనానంతరము నాడు కాని లేక 3,5,7 రోజులలో చెప్పగా 1,3,5,7,9 రోజులలోనని గరుడ పురాణ వాక్యము. 1,4,7 రోజులలోనని వామన పురాణము. నాలుగు వర్ణముల వారు 4,5,7,9 రోజులలో వరుసగా చేయవలెనని యముని అభిప్రాయము.

ఆశ్వలాయనుని అనుసరించి కృష్ణపక్ష దశమి తరువాత బేసి తిథులైన ఏకాదశి, త్రయోదశి, అమావాస్యలందు చేయవలెనని, ఆషాఢ ద్వయము, ఫల్గునీద్వయము, ప్రోష్ఠపదద్వయము కూడదు. చనిన వెనుక 3,5,7 రోజులలో చేయవచ్చునని బౌధాయనుడు. భస్మముపై పాలను నీళ్లను చల్లి మేడికట్టెతో కొన్ని మంత్రములతో ఎముకలను విడివడునట్లు చేయ వల యును. భస్మమును దక్షిణ దిక్కుగా పారపోయవలెను. తైత్తిరీయుల ఆచారమును బట్టి ఈ ఎముకల నేరుట స్త్రీల పనియనియు, అందున మృతుని జ్యేష్ఠ భార్య చేయవలెనని కలదు. నలుపు, నీలము లేదా ఎరుపు దారముతో బృహతియను ఓషధిని ఎడమచేత ధరించి, రాతినెక్కి ఉత్తరే ణుతో చేతులను తుడుచుకొని కండ్లు మూసికొని ఎడమచేతితో ఎముకల నేరవలెనని బౌధాయనుడు. "లెమ్ము మాత్ను రూపమును ధరింపుము"

అను ఆదేశముండును. అంగుష్ఠ అనామికలతో పాదముల నుండి శిరస్సు వరకు ఒక్కొక్క ఎముక నేరవలెనని ఆశ్వలాయనుడు. ఎముకలను ఒక పాత్రలో పెట్టుటగాని, కృష్ణాజినముతో గాని ముడివేయవలెనని మరియొక సూత్రము. కొందరి మత ప్రకారము దూర్వలు, పసుపు గుడ్డ గుంటలో వేసి ఎముకలనందులో వేయవలెనట. గంగాది జలములలో కలుపవలెనని చాలమంది అభిప్రాయము. ఇవి గంగలో కలిసినచో మృతుడు, బ్రహ్మ లోకమునుండి తిరిగిరాడని ఒక శ్లోకము.

"గంగాతోయే చ యస్యాస్థి ప్లవతే శుభకర్మభిః
న తస్య పునరావృత్తి ర్బ్రహ్మలోకాత్కదాచన."

శాంతికర్మ:

పోయిన పదవరోజున ఈ కర్మ చేయవలెనని ఆశ్వలాయనుడు. బ్రతికి యున్న బంధువులకు, కర్తకు స్వస్తి పూర్వక ఆశీర్వచనము, శాంతిమంత్ర పఠనముండును. ఇది పూర్తి కాకపోయినచో మైల పూర్తికాదని ఒక వాక్యము. ఇది స్మశానము దగ్గరే చేయవలెనని కొందరనగా గ్రామమునకు వెలుపల ఎక్కడనైన చేయవచ్చునని కొందరనిరి. అక్కడ ఒక ఎద్దు చర్మమును పరుచుట - దాని నెక్కుడని దీర్ఘాయుర్దాయమునిచ్చునని చెప్పుట స్త్రీలిందు పాల్గొనుట మొ॥ తంతునేడు లేదు. స్త్రీలు, లేత దర్భలచే వెన్నను గ్రహించి కన్నులకు కాటుకగా పెట్టుకొనుట మొ॥ పద్ధతులు నేడు లేవు.

సమాధి కట్టుట:

వెనుక సమాధి కట్టు ఆచారము నేటి మహమ్మదీయులందు, క్రైస్తవు లందు కలదు. ఇది మనలో నుండెడిదా? యని ఒక శంక. శ్రోత్రియులకు, శ్రోత్రియులు కానివారికి కూడ సమాధులు కట్టుట ఉండెడిదని సత్యాషాఢ శ్రౌత సూత్రములందు, బౌధ. పితృ. సూత్రములందు కలదని శ్రీ పి.వి. కాణే గారు వ్రాసిరి. శతపథ బ్రాహ్మణమున దీనికి ఆధారము కలదని వ్రాసిరి. చనిన వెనుక చాల కాలమునకు పౌర్ణమినాడు దీనిని కట్టవలెనని,

చితాభస్మమున్న పాత్ర నుంచి దానిపై సమాధి కట్టవలెనందురు. అంతియే కాని కేవల శవమును పూడ్చి సమాధి కట్టుట కాదు.

## పిండ ప్రదానము:

స్థూలమైన దేహము లేక పోయినను, ఇంకను అతడు జీవించి యుండెనను విశ్వాసముతో పిండములనిత్తురు.

శిలపై నువ్వులతో కూడిన నీళ్లను వదలుట, దర్భలపై పెద్ద పిండము నిడుట (పూరక పిండము), దానిపై నువ్వులతో కూడిన నీళ్లను విడుచుట, భృంగరాజ, తులసి పత్రములనుంచుట, ఓ పుండరీకాక్షా! ప్రేతకు ముక్తినిమ్ము అను శ్లోకమును పఠించుట, చివరకు నీళ్లలో విడిచిపెట్టుట మొ॥ విధులను ప్రేతత్వ విముక్తికై చేయవలెనని అంత్యేష్టి పద్ధతిలో కలదు. ఈ పదిరోజులు విడిచిపెట్టిన పిండములచే ప్రేతయొక్క సూక్ష్మ శరీరము నిర్మాణమగునని గరుడ పురాణము.

చనిన వెనుక జీవుడు ఒక రకమైన మూర్ఛావస్థ వంటి దశను పొందును. మూర్ఛరోగికి మందులిచ్చి వాని రోగమెట్లు పోగొట్టు చున్నామో అట్లే మనశ్శక్తి, మంత్రశక్తి, ద్రవ్యశక్తి అను శక్తుల వలన వాని ప్రేతత్వమును పోగొట్టవచ్చును. వాని కొక నూత్నదేహము ప్రసాదింప బడవలెను. అథర్వవేద సంబంధమైన పిండోపనిషత్తునందు

"ప్రథమేన తు పిండేన కలానాం తస్య పంభవః
ద్వితీయేన తు పిండేన మాంపత్వక్ శోణితోద్భవ

పిండే పిండే శరీరస్య పిండదానేన పంభవః"

అని కలదు. అనగా ప్రథమ పిండప్రదానమ వలన వానికి కలా వికాసము, రెండవ పిండముచే మాంసము, చర్మము, శోణితము, మూడవ దానిచే మతి, నాల్గవ దానిచే అస్థిమజ్జలు, ఐదవ దానిచే హస్తాంగుళులు, శిరస్సు ముఖము, ఆరవ దానిచే హృదయము, కంఠ తాలువులు, ఏడవ దానిచే ఆయుస్సు, ఎనిమిదవ దానిచే వాక్కు, తొమ్మిదవ దానిచే సమస్త

ఇంద్రియములు, పదవ పిండముచే నానా భావముల వికాసము కల్గునని అర్థము.

చనిన వెనుక ప్రేత ఒక అతివాహిక శరీరము ధరించునని అది అగ్ని, వాయు, ఆకాశాంశలతో కూడియుండునని, అది మానవులకే యునియు, 10 రోజులు చేసిన పిండ దానాదులచే ప్రేతత్వముక్తి కలిగి, భోగ దేహము ధరించునని, సంవత్సరాంతమున చేయు సపిండీకరణము వలన మరల మూడవ దేహము ధరించునని పెక్కు పురాణములందు కలదు. ప్రాయశ్చిత్త వివేక వ్యాఖ్యానమున, మూడు దేహములు కాదనియు, అతివాహిక లేక ప్రేత దేహమొకటి యనియు, భోగ దేహము మరియొకటని గోవిందానందుడు వ్రాసినాడు.

షోడశ శ్రాద్ధములు చేయనిచో పిశాచముగా నుండునని షోడశ శ్రాద్ధములు మినహా మిగిలినవి తరువాత చేసినను పిశాచత్వము నుండి విడివడదని యముని వాక్యమును తత్త్వార్థ కౌముది పేర్కొన్నది. అతి వాహికమునే బ్రహ్మ పురాణము యాతనీయ శరీరమన్నది.

మహా పాపములు చేసి మరణించిన వారు స్థూల శరీరము వంటి ఆకారమునే పొంది నానా యాతనలు పడుదురని పద్మ పురాణము (II. 67.98.)

వృషోత్సర్జనము:

అచ్చుపోసి అంబోతును విడిచిపెట్టుట.

మృతుని ముక్తికై దీనిని విడిచి పెట్టుదురు. దాని నలంకరించి దాని చెవిలో ఇట్లు చదువుదురు. "నాల్గు పాదములు కలిగిన ధర్మదేవత వృషభ రూపముగా నున్నది. దానిని పూజించుచున్నాను. నన్ను రక్షించుగాక."

"వృషో హి భగవాన్ ధర్మశ్చతుష్పాదః ప్రకీర్తితః
వృణే హి తమహం భక్త్యా స మాం రక్షతు సర్వతః"

ఇది ప్రేతత్వ విముక్తికై, సద్గతి కలుగుటకై చేయుదురు. "అముక ప్రేతస్య ప్రేతత్వ ముక్తయే..........సంతారయితుమ్." అని సంకల్పమున ఈ అర్థము స్పష్టము.

"ఓ గోవులారా! ఇది మీకు పతి. యథేచ్ఛగా దీనితో తిరుగుడు. మాకు సంతానము సమృద్ధిగా నుండుగాక." అను నర్థమిచ్చు శ్లోకములను పఠింతురు. దానిని నాగలికి కట్టరు. స్వేచ్ఛగా తిరిగును. దేవ పితృ కార్యములకు ఆవు సంబంధమైన ద్రవ్యములను వాడుచున్నాము. అట్టి గో సంతతి వృద్ధి పొందుటకు ఆబోతు ఉండవలెనను కదా! గోసంతతి వృద్ధియగునట్లుగా ఇంటియందు సంతానవృద్ధి యుండుగాక అను భావనతో దీనిని చేయుచున్నారేమో!

సపిండీకరణము:

దీనిని గూర్చి విపులముగా మన ప్రాంత పద్ధతి యందు వివరించితిని. ప్రేతను పితరులతో కలుపుట. దీనిని 12వ రోజున గాని, సంవత్సరాంత మున గాని చేయవలెనని అంత్యేష్టి పద్ధతి యందు కలదు. దీనికి ముందుగా షోడశ శ్రాద్ధములుండును.

శ్రాద్ధమనగా నేమి? పితరులనగా నెవరు?

"దేశే కాలే చ పాత్రే చ విధినా హవిషా చ యత్
తిలైర్దర్భైశ్చ మంత్రైశ్చ శ్రాద్ధం స్యాత్ శ్రద్ధయా యుతమ్."

తా:- దేశ కాల పాత్రాదులననుసరించి హవిస్సు మొ॥ వానిచే శ్రద్ధాపూర్వకముగా తిలలు, దర్భలు, మంత్రముల సహాయముతో చేయు క్రియకు శ్రాద్ధమని పరాశరుడు.

ప్రేతలను, పితరులనుద్దేశించి భోజనాదులను శ్రద్ధాపూర్వకముగా పెట్టుట శ్రాద్ధమని మరీచి మహర్షి.

"ప్రేతాన్ పితౄంశ్చ నిర్దిశ్య భోజ్యం యత్ ప్రియమాత్మనః
శ్రద్ధయా దీయతే యత్ర తచ్ఛ్రాద్ధం పరికీర్తితమ్."

హోమము, పిండదానము, బ్రాహ్మణ తర్పణము, ఇందు ప్రధానమని ఆప.ధ. సూత్రములపై హరదత్త వ్యాఖ్య.

విశేషమైన శ్రద్ధతో విధి పూర్వకముగా పితరునుద్దేశించి ఏది ఈయ బడునో అది పరలోకమున అక్షయ తృప్తినిచ్చునని మనువు.

శ్రాద్ధమొనర్చుటలో శ్రద్ధ, కృతజ్ఞతా భావము గోచరించును. తల్లి దండ్రుల వలననే ఈ శరీరమును పొందితిమి. ఈ శరీరముచే సమస్త ఇహ, పరలోక సుఖములను పొందవచ్చును. తుదకు మోక్షఫలమును గూడ ఈ శరీరముతో పొందవచ్చును. అట్టి శరీరమునిచ్చిన తల్లిదండ్రులను స్మరించుటలో దోషమేమి కలదు? పితృ దేవతలకు కృతజ్ఞతను చూపింపక పోయినచో జీవితము వ్యర్థము. కృతఘ్నుని కన్న మించిన పాపిలేడని మన గ్రంథములు చెప్పుచున్నవి. పితృదేవతలపట్ల మనమే కాదు. ఇతర మతస్థులు కూడ విశ్వాసమును ప్రకటింతురు.

ఈ లోకమున జీవులకు, ఇతర లోకముననున్న జీవులకు అనితర సంబంధము కలదని మన విశ్వాసము. ఆపైన ఒకరిపై నొకరు ఆధారపడినట్లు గీతావాక్యము.

"పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ."

పైవారితో సంబంధము హవ్యకవ్యములనర్పించుట వలన పంచ మహా యజ్ఞముల వలన నిత్యకర్మల వలన జరుగను.

## అసలీ పితృదేవతలెవరు?

తండ్రి, తాత, ముత్తాతలకు పితరులు అను శబ్దము వాడబడుట ఒకటి, వారి అధిష్ఠాన దేవతలైన వసు, రుద్ర, ఆదిత్యులకు చెందుట మరియొకటి. ఈ రెండర్థములందీపదము వాడబడినది. వీరిలో పెక్కు రకములు, అంగిరసులు, వైరూపులు, అథర్వణులు, భృగువులు, నవగ్వులు, దశగ్వులుగా ఋగ్వేదమున పేర్కొనబడిరి. బ్రాహ్మణుల యొక్క పిత రులు అగ్నిష్వాత్తులని, క్షత్రియులకు బర్హిషదులని, వైశ్యులకు కావ్యులని,

శూద్రులకు సుకాలినులని పిలువబడుదురని నంది పురాణమును హేమాద్రి పేర్కొనినాడు. శాతాతపస్మృతి 12 పితృ వర్గములను పేర్కొన్నది. విష్ణు ధర్మోత్తరమును బట్టి కొంతమంది పితృ దేవతలు మూర్తి లేక ఉందురట. కొంతమంది మూర్తి కలిగియుందురట. ఋషుల నుండి పితృదేవతలు, వారినుండి దేవతలు, వారినుండి మానవులు పుట్టినట్లు మనువు.

దేవతలు తూర్పునకు, పితృదేవతలు దక్షిణపు దిక్కునకు, మానవులు పశ్చిమ దిక్కునకు, రుద్రులు ఉత్తరపు దిక్కునకు చెందిన వారని తైత్తిరీయ సంహిత.

దేవతలకు స్వహావషట్కారములతో, పితృదేవతలకు, స్వధా నమస్కారములతో పూజ జరుగను. వీరెక్కడ నుందురు?

భూలోకముపైన అంతరిక్షము, ఆపైన పితృలోకముందునని తైత్తి. బ్రాహ్మణమున కలదు. "విధూర్ధ్వలోకే పితరో వసంతి." అను వాక్యముచే చంద్ర మండలము పైన పితృగణములుందురు. చంద్రలోకము జలమయమైనది, జలమయమైన లోకముకంటె పైన అగ్ని ష్వాత్తాది పితృగణములుందురని భాగవతము. ఇక అథర్వ వేదమున నిట్లు కలదు.

"ఉదన్వతీ ద్యౌరవమా పీలుమతీతి మధ్యమా
తృతీయహ ప్రద్యౌరితి యస్యాం పితర ఆసతే."

అనగా ఆకాశము యొక్క మొదటి కక్ష్యను అవమఅనిఅందురు. అది జలమయమైనది. మధ్యమ కక్ష్యను పీలమతి అని పిలుతురు. అనగా పరమాణు రూపమైనది. తృతీయ కక్ష్య ప్రద్యౌ అని పిలువబడును. అది ప్రకాశమయము. అందు పితరులుందురు.

ఇక శ్రాద్ధములను పెట్టి పితృదేవతలను పూజించుటలో ప్రయోజనమేమి?

యాజ్ఞ. స్మృతిపై విశ్వరూప వ్యాఖ్యను తిలకింపుడు. పితృదేవతలను తృప్తి పరపుము అని శాస్త్రము చెప్పినది కనుక చేయుట ఒకటి.

పితృదేవతలు తృప్తిని పొంది కర్త సుఖమును పొందినచో శంకకే తావు లేదు గదా! వసు-రుద్ర-ఆదిత్యులు ఇష్టమువచ్చిన రూపమును ధరింపగల సమర్థులు. అట్టివారు కర్తను, కర్తయొక్క తండ్రి తాత ముత్తాతలను సంతోష పెట్టవచ్చును గదా? అని నాస్తికులను ప్రశ్నించెను.

నారాయణ పండితుని శ్రాద్ధకల్పలతలో ఇట్లు కలదు. శ్రాద్ధమెట్లు నిష్ప్రయోజనమగును? అని ప్రశ్నించి 1) శ్రాద్ధములు పెట్టుమని చెప్పు పుస్తకములు లేదందువా? 2) శ్రాద్ధము వలన పితరులు సంతోష పడరందువా? 3) లేక పెట్టుటలో ఫలము లేదందవా? అను ప్రశ్నలకు పెట్టుమని చెప్పు శ్రుతి స్మృతులు పెక్కు గలవు కదా! తండ్రి మొ॥ వారికి అధిష్ఠాన దేవతలకు చెందుచున్నవి గదా! దీర్ఘ జీవనము మొ॥ ఫలములు లభించుచున్నవి గదా! అని సమాధానములను చెప్పెను.

వెంకయ్య, పుల్లయ్య అని పేర్లు శరీరములకా? చైతన్యముతో కూడిన వ్యక్తులకా? చైతన్యముతో కూడిన శరీరములనే అట్లు పిలుచుచున్నాము. అట్లే పితృ, పితామహ, ప్రపితామహులతో కూడిన వసు రుద్రాదిత్యులని భావింపవలెను. కర్మ కాండచే ఆ దేవతలు తృప్తి పొంది తద్వారా పితరులు కూడా సంతోషపడుదురు. ఒక గర్భిణికి అన్నపానాదులిచ్చి ఆమెను తృప్తి పరచినచో ఆమె తృప్తి పడుటయేగాక లోనున్న పిండమునకు తృప్తిని కలిగించునట్లైనది. అట్లే పైదానిని గూడ అన్వయింపవచ్చును. అని ఆతడు వ్రాసినాడు.

బ్రతికియున్నవానికి అన్నము పెట్టిన లాభము కలదుగాని చనిన వానికి పెట్టుటలో అర్థమున్నదా? ఇక చనిన వాడు అన్నమును తినునా? ఎట్లు తినును? ఎట్లతనికి చెందును? పునర్జన్మ నంగీకరించుచున్నాము గదా? చచ్చినవాడు ఏ రూపమెత్తినట్లు తినునని బోలెడు శంకలు.

దీనికంతకు సంకల్పశక్తి, మంత్రశక్తి మొ॥ ప్రభావమును గుర్తించిన శంకలకు తావులేదు.

"యథా గోషు ప్రనష్టాసు వత్సో విందతి మాతరమ్
తథా శ్రాద్ధేషు దృష్టాంతో (దత్తాన్నః?) మంత్రః"

"ప్రాపయ తేతుతమ్" అని మత్స్యపురాణము అనగా ఒక దూడ, వేల ఆవులు కలిగిన మందలో తన తల్లి నెట్లు గుర్తించుచున్నదో అట్లే మంత్రశక్తి పితరులకు ముట్టునట్లు చేయును. ఇచ్చిన ద్రవ్యము ఆయా రూపములలో వారికి చెందునని మత్స్యపురాణ వాక్కు. ఇక హేమాద్రి వాక్యములను తిలకింపుడు:-

"దేవో యది పితా జాతః శుభ కర్మాను యోగతః
తస్యాన్న మమృతంభూత్వా దేవత్వేఽప్యనుగచ్ఛతి
గంధర్వే భోగరూపేణ పశుత్వే చ తృణం భవేత్
శ్రాద్ధాన్నం వాయురూపేణ నాగత్వే ఽప్యను గచ్ఛతి
పానం భవతి యక్షత్వే రాక్షసత్వే తథాఽమిషమ్
దానవత్వే తథా మాంసం ప్రేతత్వే రుధిరోదకమ్
మానుషత్వే ఽన్నపానాది నానాభోగరసో భవేత్."

అనగా మరణించినవాడు తన శుభకర్మను బట్టి దేవతయైనచో మన మొసంగిన అన్నము అమృత రూపముగా, గంధర్వుడైనచో భోగరూపముగా, పశువైనచో గడ్డిరూపముగా, పామైనచో వాయురూపముగా, యక్షుడైనచో మద్యరూపముగా, రాక్షసుడైనచో ఆమిషరూపముగా, దానవుడైనచో మాంస రూపముగా, ప్రేతయైనచో రక్తరూపముగా, మనుష్యుడైనచో అన్నముగా మారునని అర్థము. ఇది అంతయు మన సంకల్ప బలముపై ఆధారపడినది. మరణించిన వ్యక్తి తద్దినముల పట్ల నమ్మకము లేనివాడైనచో ముట్టునా అని చిత్రమైన ప్రశ్న యోగవాశిష్ఠమున కలదు. వానికి నమ్మకము లేక పోయినను పెట్టువాని సంకల్ప బలము వలన అతనికి ముట్టునని సమాధానమొసంగబడినది.

మనశ్శక్తి వలన సర్పాది క్రూర జంతువుల నెట్లు లోబరుచుకొను చున్నారో మనలో చాలమందికి తెలియును. అట్టి మనశ్శక్తి ద్వారా "ఆయాంతు నః పితరః" మొ॥ మాటలచే పితరునాహ్వానింతురు. ఒక వీణ వాయించుచుండగా ఎదురుగా శ్రుతిసరిచేసి సిద్ధము చేసిన వీణలో కూడ ప్రకంపనములను చూచుటలేదా? వాయుతరంగముల ప్రభావము మనకు

తెలియనిది కాదు. ఇక చేతన విషయమున చెప్పనేల? దూరదృష్టి, దూర శ్రవణములపై పాశ్చాత్యులు కూడ అమోఘమైన కృషి చేయుచున్నారు, ప్రత్యక్షముగా చూపించుచున్నారు. పితృదేవతలను గూర్చి నీవెట్లు నమ్ము చున్నావని Sir Oliver Lodge (సర్ ఆలివర్ లాడ్జిని) అడుగగా మానసిక శక్తిచే అచేతనములను కదల్పవచ్చును, భౌతిక శరీరము లేక పోయినను పైవారితో మాట్లాడవచ్చునని తెల్పినట్లు స్వామి దయానందులు 'ధర్మవిజ్ఞాన్' అను పుస్తకమున వ్రాసిరి.

తండ్రియే కొడుకుగా పుట్టుచున్నాడని 'ఆత్మా వై పుత్రనామాసి' అని వేదమంత్రము. తండ్రి కొడుకుల కభేదము. తానున్నచో తన తండ్రియున్నట్లే. తాను పిలిచినచో తండ్రి పలుకును. ఆపైన పిలుచువాడు, పలుకువాడు ఒక్కరే!

మనము పెట్టు, మనకు కనబడు అన్నమును వారెట్లు తిందురని ఒక శంక. మనకు పాలు కావలెనన్నచో గడ్డినితిను ఆవును పితుకుచున్నాము. గడ్డి పాలుగా మారినవి. అంతియే కాని పాలకు కారణమైన, స్థూలమైన గడ్డిని తినుట లేదుగదా! అని సమాధానము. మన కంటికి కనబడని సూక్ష్మమైన ఆహారమును, సూక్ష్మ రూపముతో వారు గ్రహింతురు. విద్యుదయస్కాంత తరంగముల వలన ఎక్కడో ఉన్నవారికి తీగలు లేని (Wireless) సాధనముతో వార్తలను పంపుచున్నాము. మంత్రశక్తి అట్టిదే. మనము మనియార్డరు చేయుచున్నామనిన చేసిన చోట ఇచ్చిన నోట్లనే ఎక్కడనో ఉన్నవానికి అవే నోట్ల నిచ్చుట లేదు కదా! దీనికి బదులు దీనితో సమానమైన వాని నాతడు పొందుచున్నాడు. అట్లే ఈ అన్నము ఈ రూపముతోనే భుజించినచో నమ్మెదును గాని, దీనికి భిన్నమైనచో నేను నమ్మనని వాదించు మహానుభావులకు నమస్కారము.

శ్రాద్ధమును పెట్టునపుడు బ్రాహ్మణులను పిలిచి పెట్టుదురు. వారు తిని తృప్తి పొందిన పెట్టువాని పితృ దేవతలు తృప్తి పడుదురని విశ్వాసము. భోక్తలుగా నిమంత్రించిన బ్రహ్మణులపై పితృదేవతలు నివసింతురని మనువు. బ్రాహ్మణుల ద్వారా పితరుల కెట్లు ముట్టునో చూడుడు:-

"ఇమ మోదనం విదధే బ్రాహ్మణేషు విష్టారిణం
లోక జితం స్వర్గమ్ సమే మాక్షేష్ట స్వధయా
పిన్వమానో విశ్వరూపా ధేనుః కామదు ఘా మే అస్తు"

అని వేదమున కలదు. అనగా "బ్రాహ్మణుల సమీపమున నుందును. ఇది స్వర్గప్రాప్తికి సాధనము. కామధేను తుల్య ఫలమునిచ్చునని" అర్థము.

పద్మ పురాణములో సృష్టిఖండము నందు రాముడు దశరథుని నుద్దేశించి బ్రాహ్మణులకు పెట్టు సందర్భమున "బ్రాహ్మణులలో నేను దశరథుని చూచితినని" సీత అనును.

"పితా తవ మయా దృష్టో బ్రాహ్మణాంగేషు రాఘవ."

బ్రాహ్మణులకే పెట్టనేల? ఇతరులకు పెట్టకూడదా? ముట్టదా యేమి? ఇవన్నియు బ్రాహ్మణులు కల్పించిన వ్రాతలని కొందరు వాదింతురు.

మంత్ర స్వరూపుడైన ఉత్తమ బ్రాహ్మణుడు మనము కోరిన కోరి కలను తీర్చును, తీర్చునట్లు చేయును. విద్యుత్తును రాగి తీగనుండి పంపుచున్నాము, కట్టెనుండి కాదు. అట్లే బ్రాహ్మణ శరీరము ఒక చక్కని విద్యుత్ వాహకము. శ్రాద్ధమునందు శ్రోత్రియుడైన, వేదవేత్తయైన, ఆచార వంతుడైన బ్రాహ్మణునే నియమింపవలెనని, వేదము నెరుంగని వారెందరు భుజించినను నిష్ఫలమని, ఒక్క వేదవేత్తయైనను చాలునని మనువు.

"శ్రోత్రియాయైవ దేయాని హవ్యకవ్యాని దాతృభిః
అర్హత్తమాయ విప్రాయ తస్మై దత్తం మహాఫలమ్
ఏకైకమపి విద్వాంసం దైవే పిత్ర్యే చ భోజయేత్
పుష్కలం ఫలమాప్నోతి నామంత్రజ్ఞాన్ బహూనపి
సహస్రం హి సహస్రాణామనృచాం యత్ర భుంజతే
ఏకస్తాన్ మంత్రవిత్ ప్రీతఃసర్వానర్హతి ధర్మతః"

మంచి కులములో పుట్టినను, శీలవంతుడు కాకపోయినచో ఫలమేమి? సుగంధ పుష్పములలో క్రిమి కీటకాదులుండుట లేదా? అని అగ్ని పురాణ వాక్యము.

"కిం కులేన విశాలేన వృత్తహీనస్య దేహినః
కృమయః కిం న జాయంతే సుగంధిషు."

వారెంత చదివిన వారైనను, శీలము లేని బ్రాహ్మణులను పూజింప రాదని, వాక్కుతో కూడ పూజింప రాదని జాతుకర్ణ్యుడు.

"అపి విద్యాకులైర్యుక్తాన్ వృత్తహీనాన్ ద్విజాధమాన్
అనర్హాన్ హవ్యకవ్యేషు వాఙ్మాత్రేణాపి నార్చయేత్."

ఇంత గట్టిగా చెప్పుటకు కారణము, పితృదేవతలు వాయురూపముతో నుండి భోక్తలను ఆవహించి యుందురు కనుక. (చూ. బ్రహ్మాండ పురాణము).

దేవ కార్యములందు బ్రాహ్మణుల విద్యాదులను ప్రశ్నింపనవసరము లేదు కాని పితృకార్యములందు తప్పక పరీక్షింపవలెనని మనువు.

బ్రాహ్మణులకు పితృకార్యము దైవకార్యము కన్న మిన్నయని, తప్పని సరియని మనువు.

కర్తకు శరీర శుద్ధి, ద్రవ్యశుద్ధి, కర్త భార్య శుద్ధిగా నుండుట, స్థల శుద్ధి, మానసిక శుద్ధి, మంత్ర బ్రాహ్మణాదుల శుద్ధులను ఏడింటిని స్కాందపురాణము పేర్కొన్నది.

తీర్థమహిమ:

గంగాది నదుల, గయాది తీర్థముల మహిమ మన సాహిత్యమున అపారముగా నున్నది. కాశీ ఖండమున

"అకాలేఽప్యథవా కాలే తీర్థే శ్రాద్ధం చ తర్పణమ్
అవిలంబేన కర్తవ్యం నైవ విఘ్నం సమాచరేత్."

అనగా కాలాదులతో నిమిత్తము లేకుండ తీర్థము నందు శ్రాద్ధ తర్పణము లీయవచ్చునని కలదు. "గయాం ప్రసంగతో గత్వా శ్రాద్ధం సమాచరేత్" అనగా గయవెళ్లి మాతృశ్రాద్ధము తప్పక చేయవలెనని ఒక ప్రమాణ వాక్యము.

"ఏషు తీర్థేషు యచ్ఛ్రాద్ధం తత్ కోటి గుణమిష్యతే
యస్మాత్తస్మాత్ ప్రయత్నేన తీర్థే శ్రాద్ధం సమాచరేత్."

తీర్థములందు చేసిన శ్రాద్ధాది క్రియలు కోటి గుణ ఫలితముల నిచ్చునని కలదు.

పాత్రశుద్ధి:

శ్రాద్ధ క్రియలందు వెండి శ్రేష్ఠమని విష్ణుధర్మ సూత్రము. పితృ దేవతలు వెండి పాత్రయందు స్వధను పిండిరని కనుక వారికవి తృప్తి నిచ్చునని మార్కండేయ పురాణము. దైవ కార్యములందు వెండి పనికి రాదు. వెండి బంగారములు లేనిచో రాగి, కంచు శ్రేష్ఠము, శివుని నేత్రము నుండి వెండి పుట్టినట్లు పద్మపురాణము. మట్టి పాత్రలో వంట శ్రేష్ఠమని ప్రజాపతి వచనము. ఇనుము అసలు వాడరాదని అత్రివాక్యు. వెండిపాత్రలు, తామ్రాది పాత్రలు వాడుటవలన పితరులకు అక్షయ తృప్తి కల్గునని మనువు.

ఆధునికులు కూడ లోహాదుల ప్రభావమును బాగుగా గుర్తించిరి. Black burn అను విద్వాంసుడు, వెండికి చంద్రునకు సంబంధము కలదని, రత్నములకు ధనశక్తి కలదనియు (Positive), లోహములకు ఋణశక్తి కలదనియు (Negative) చెప్పినాడు. నీటితో కూడిన వెండి పాత్రలు, ఇచ్ఛాశక్తి మంత్రశక్తి మొ॥ వానితో పైలోకములోనున్నవారితో సంబంధము సుగమమని మహర్షులు గుర్తించిరి.

ఇందు వాడబడు ద్రవ్యములను గూర్చి కొద్దిగా వివరింతును.

**దర్భలు:** దర్భల మూలమందు బ్రహ్మ, మధ్య విష్ణువు, చివర శంకరుడు ఉండునని గరుడ పురాణము. సమూలముగా పెకలించిన దర్భలు పితృకార్యములందు వాడవలెను. అట్లుకానివి, దైవకార్యమందు వాడవలెను.

**తిలలు:** శ్రాద్ధ దేశమున, 'అపహత' అను మంత్రము చదువుచు తిలలను చల్లుదురు. ఇక్కడ నుండి అసురులు, భూతములు తొలగిపోవుదురుగాక!

అని అర్థము. నా స్వేద జలము నుండి తిలలు పుట్టినవని కృష్ణుడన్నట్లుగా గరుడ పురాణ వచనము.

మేక: శ్రాద్ధ ప్రదేశమున మేకను కట్టవలెనని అసురులచే కలుషితమైన ప్రదేశము మేక, తిలల వలన శుద్ధియగునని కూర్మ పురాణము. నేడు మేకను కట్టుటలేదు.

శ్రాద్ధాన్నము: దేశ కాల పాత్రలననుసరించి భిన్నభిన్న ఆహారములు భోక్తలకు పెట్టుట కలదు. అధర్వ వేదమున

"యంతే మంథం యమోదనం యన్మాంసం నిపుణామి తే
తే తే సంతు స్వధావన్తో మధు మన్తో ఘృతచ్యుతః"

అనగా దీనివలన అన్నము గాని, మాంసమును గాని పెట్టవలెనని తెలియుచున్నది. "యదన్నః పురుషో లోకే తదన్నా స్తస్యదేవతాః" అను వాక్యమును బట్టి మనము తిను ఆహారమునే దేవతలు తిందురని తేలును. పూర్వయుగములందు మాంసము విధింపబడినను ఈ యుగమున లేదు. బెంగాలు మొ॥ ప్రాంతములందు చేపలను వండుదురు. మిగిలిన మాంసమును పెటుటలేదు.

"వర్ష ఋతువునందును, మఘా నక్షత్రముతో కూడిన భాద్రపద త్రయోదశినాడును, తేనెతో కూడిన పదార్థముతో శ్రాద్ధము చేసిన అది పితృదేవతలకు అక్షయమైన తృప్తి నిచ్చుననియు, పై చెప్పిన నాడే కాక వేరొక తిథి యందైన అపరాహ్ణకాలమున తేనెతో నేతితో చేసిన అప్పములను (అపూపములను) ఎవడైన శ్రాద్ధము చేసి తృప్తి పొందించు వాడు మన కులములో పుట్టునాయని పితరులు చూచుచుందురని" మనువు.

కాలము -- తిథులు:

మనకొక మాసము వారికొక రోజు. మన అమావాస్య వారికి మధ్యాహ్న కాలము. కనుకనే అమావాస్య తిథి యందు అపరాహ్ణ కాలమున (సుమారు ఒంటిగంట దాటిన తరువాత) వారిని అర్చించవలెను.

"కృష్ణ పక్షమున చతుర్దశి తప్ప దశమి నుండి అమావాస్య వరకు గల తిథులు, ఎంత శ్రేష్ఠములును, ఫలము నిచ్చునవియైయున్నవో తక్కినవి అట్టివికావు. సరితిథులందు, సరినక్షత్రములగు భరణి రోహిణ్యాదులందు శ్రాద్ధము చేసిన వాడు అన్నియు పొందును. బేసి తిథులైన పాడ్యమి మొ॥ తిథులలో, అశ్విని, కృత్తిక, మొ॥ బేసి నక్షత్రములలో చేసిన వాడు, ధనము, విద్యకలిగిన సంతతిని పొందును. కృష్ణ పక్షము శుక్లపక్షముకన్న మిన్న. అట్లే పూర్వాహ్ణము కంటె అపరాహ్ణము శ్రేష్ఠము." అని మనువు.

శతపథమునందు "పూర్వాహ్ణో వై దేవానాం, మధ్యందినో మనుష్యాణామ్, అపరాహ్ణః పితౄణాం, తస్మాదపరాహ్ణేదదతి." అని కలదు. అనగా దేవకార్యములకు పూర్వాహ్ణము, మనుష్య కార్యములకు మధ్యాహ్నము, పితృదేవకార్యములకు అపరాహ్ణము శ్రేష్ఠము.

"అమావాస్యనాడు పితృదేవతలు వాయురూపము ధరించి గృహ ద్వార సమీపమునకు వత్తురు. సూర్యడస్తమించువరకు, ఆకలి దప్పికలచే బాధపడుచుందురు. శ్రాద్ధములు లేకపోయినచో అస్తమించిన వెనుక బాధపడుచు వంశమునందు పుట్టినవారిని శపించుచు వెడలిపోవుదురు. కనుక అమావాస్య ప్రశస్తమైన తిథి" -- గరుడ పురాణము.

"అమావాస్య దినే ప్రాప్తే గృహద్వారే సమాశ్రితాః
వాయుభూతాః ప్రవాంఛంతి శ్రాద్ధం పితృగణా నృణామ్"

కనీసము, కాని ఖర్చులేని నీళ్లతో నైనను తర్పణము లిచ్చినచో తృప్తి పొందుదురు. ఏ పదార్థములు పెట్టిలేనివాడు, కేవల దరిద్రుడైనచో "నే నశక్తుడను. ఓ పితృదేవతలారా నన్ను క్షమింపుడని" చేతులెత్తి మ్రొక్కినను ఆ దేవతలు సంతోషింతురని ధర్మ సింధువున కలదు.

## పిండముల విచ్చుటలో ఫలము:

దేవలోకములో పితృదేవతలున్న అగ్ని యందు హుతము చేసిన దానితోను, పితృలోకములోనే ఉన్నచో బ్రాహ్మణ భోజనము వలనను, నరక మున ఉన్నచో భూమియందుంచిన పిండములతోను తృప్తి పొందుదురని బృహస్పతి, వృద్ధ పరాశరుల వచనము.

శ్రాద్ధ క్రియలు వరాహావతారమున స్థాపింపబడినవి కనుక, మూడు పిండములందు విష్ణువున్నట్లు భావింపవలెనని శాంతి పర్వము

శ్రాద్ధ భేదములు:

పార్వణ శ్రాద్ధము, ఏకోద్దిష్ట శ్రాద్ధము, ఇష్టి శ్రాద్ధము, అష్టకాశ్రాద్ధము మొ॥ 96 శ్రాద్ధములు కలవు. అన్నింటిని వివరించినచో గ్రంథము పెద్దది గును. ఒక్క పితరునుద్దేశించి చేయు శ్రాద్ధమునకు ఏకోద్దిష్టమని పేరు. పితృపితామహ ప్రపితామహులనుద్దేశించి చేయుదానికి పార్వణ శ్రాద్ధమని పేరు యజ్ఞారంభమునందు చేయదగినది ఇష్టి శ్రాద్ధము.

పుష్య, మాఘ, ఫాల్గున, బహుళ, అష్టమి తిథులందు చేయదగినది అష్టకాశ్రాద్ధము నేడు నూటికి తొంబది తొమ్మిది మంది సంవత్సరమున కొకసారి తద్దినములను పెట్టుచున్నారు.

అన్ని వర్ణములకు శ్రాద్ధ క్రియలు కలవు. కొన్ని సంస్కారములు మానినను, లేకపోయినను, ఇది సమస్త హిందువుల లోను కలదు. ఈ శ్రాద్ధమే సమస్త హిందువులను బంధించునది.

"స్వధా పితృభ్యః పృథివీ షదభ్యః స్వధా పితృభ్యః
అంతరిక్ష పద్భ్యః స్వధా పితృభ్యో దివిషద్భ్యః"

భూమి, అంతరిక్షము, స్వర్గమునందున్న పితరులకు ఈ కవ్యము నిచ్చుచున్నాను. అని అథర్వ వేదమంత్రముతో

"ఆయాంతు నః పితరస్సోమ్యా సో ఽగ్నిష్వాత్తాః
పథిభిర్దేవయానైః అస్మిన్ యజ్ఞే స్వధయా
మదంతో ఽధి బ్రువన్తు తేఽవన్త్వస్మాన్"

తా:- మా పితరులు దేవతల గమన యోగ్యమైన మార్గమునుండి వత్తురుగాక. ఈ యజ్ఞాన్నముచే ప్రసన్నుడవై చెప్పుము. మమ్ములను రక్షించుము అను వాక్యములతో ఈ అధ్యాయము ముగింతును.

### గర్భిణీ మరణమున:

శిశువును తీసివేసి అష్టకాధేను, తిలధేను, భూమిధేను దాన పూర్వకముగా ఆమెను దహించవలెనని బౌధాయనుడు (3.6.4.) మిగిలిన క్రియలు మామూలుగానే. నేడు శిశువును తీసివేయుట లేదు.

### నవప్రసూత, రజస్వలా మరణము:

వీరు మరణించినచో పంచగవ్యములతో కలిసిన నీళ్లతో కడుగవలెను. ప్రాజాపత్య ఆహుతులిచ్చిన వెనుక క్రొత్త బట్టలు కట్టబెట్టి ఆమెను దహించవలెనని సంపూర్ణ దాహము పనికిరాదని "నిశ్శేషస్తు న దగ్ధవ్య ఇతి వచనమ్" అని గదాధరుని క్రియాపద్ధతిలో కలదు.

### సన్న్యాసి ఖననము:

వారి లక్ష్యము పితృలోకము, స్వర్గ లోకము కాదు. వారు కోరునది బ్రహ్మలోకమే. వారు సామాన్య మానవుల కంటె భిన్నులు, విశిష్టులు. వీరిని గూర్చి దహనము, ఖననము అను మాటలను గాక బ్రహ్మ మేధమని తైత్తిరీయమన్నది. వారిని ఒక గోయి తీసి వారి కడుపుపై భిక్షాపాత్రను పెట్టి నీటితో నిండిన కమండలము కుడి చేతియందు మట్టి కప్పవలెనని, సమాధిని నిర్మించవలెనని బౌధ.గృ.సూ. న కలదు. ఇది పరమ పవిత్ర కార్యముగా భావింపవలెనిని, అశ్వమేధ ఫలము వచ్చునని అందే కలదు. "ఇత్య శేష సంస్కారో ఽశ్వ మేధఫలం తత్రోదాహరంతి."

వీరికి మామూలు వ్యక్తుల వలె ఉత్తర క్రియలు లేవు. ఏకోద్దిష్ట శ్రాద్ధము కాని, సపిండీకరణముగాని అవసరము లేదనియు, 11వ రోజున పార్వణము చాలునని స్మృత్యర్థసారమున కలదు. నారాయణ బలి యుండును.

నేడు సన్యాసి కపాలమును బ్రద్దలు కొట్టుటలో కారణమేమనగా బ్రహ్మజ్ఞానానికి నవరంధ్రములగుండ ప్రాణము పోవక బ్రహ్మ రంధ్రము గుండనే ప్రాణముపోవలెనను భావనతో అట్లు చేయుదురు. "శతం చైకా హృదయస్య నాడ్యాః" అను ఛాందోగ్య శ్రుతి దానికి మూలము.

అగ్ని పరిత్యజించి, జ్ఞానాగ్ని యే కల వారగుటచే దహనము లేదని యతి సంస్కార గ్రంథము.

ప్రవాసి మరణము:

ఎక్కడికో పోయి మరణించిన వానిని గూర్చి కొన్ని నియమములు కలవు. పోయిన తిథి తెలియకపోయినచో కృష్ణపక్ష అష్టమికాని, ద్వాదశి కాని, అమావాస్యనాడు గాని పోయినట్లు భావించి ఆయా తిథులనుండి పర్వ్రక్రియలు జరుపవలెనని అప్పటినుండి మైలను బంధువులు పాటింప వలెనని పారాశరుని వచనము. ఆ శవమును తీసికొని వచ్చుటగాని, లేదా ఎముకలను తీసికొని వచ్చి తంతు జరుపవలెనని, 33 అవయవముల నుండి 33 ఎముకలను తీసికొని రావలెనని, అవి కూడ దొరుకనిచో ఎక్కడ నుండి పోయెనో ఆ దిక్కునకు ఎదురుగా తిరిగి ప్రేతను ఆహ్వానించి అతని బొమ్మను చేసి దహనము చేయవలెనని బౌధాయనుడు. ఇది మరణింపక పోయినను మరణించినట్లు తెలిసినపుడు చేయవలసిన పద్ధతి అది. ఒకవేళ నిజముగా బ్రతికియుండి తిరిగి వచ్చినచో జాతకర్మ మొదలు వివాహ పర్యంతము అన్ని సంస్కారములాతనికి జరుపబడవలెనని, అతనిని ఎవరు, ఏ విషయమున పట్టించుకొన రాదని బౌధ.పితృ. సూత్రమున కలదు.

జీవత్ శ్రాద్ధము:

అనగా బ్రతికియుండగా తనకు తానే పెట్టుకొను శ్రాద్ధము. ఇదియొక చిత్రమైన పద్ధతి. ఒకనికి సంతానము లేకపోయినను, లేదా అతనికి కొడుకులున్నను వారు సరిగా కర్మకాండ చేయరను ఉద్దేశమున్నను అతని బొమ్మను అన్ని మంత్రములతో దహనము చేయు పద్ధతియది. ఇది చేసికొన్నవాడు వెంటనే మరణించునని ఒక నమ్మకము మనలో కలదు. కనుక నిది సాధారణముగా చేయరు.

ఘటశ్రాద్ధము:

ఒకడు పతితుడై భ్రష్టుడైనచో, ప్రాయశ్చిత్తములు చేసికొనకుండ నున్నచో వానిముద్దేశించి ఘట స్ఫోటము (కుండను బ్రద్దలు కొట్టుట)

చేయ వలెనని, చనినట్లు భావింపవలెనని, బంధువులతనికి శ్రాద్ధము, ఉదక క్రియలు జరుపవలెనని, మైల కూడ పట్టవలెనని గౌతమ ధర్మ సూత్రములందు కలదు. నేడిది లేదు. పాటించుట లేదు.

శ్రాద్ధక్రియకు అనర్హులు:

శస్త్రహతులైనవారు, విషము పుచ్చుకొని పోయినవారు, నీళ్లలో మునిగి పోయినవారు, వృక్షపర్వతాదుల నుండి మరణించిన వారి మాట ఏమిటనగా వారికి దహన సంస్కారమే లేదని బౌధాయనుడు. కాని నేడు కొన్ని ప్రాయశ్చిత్తములు చేసి కర్మకాండ జరిపించుచున్నారు. వీరికి పితృ లోకమే లేదని విజ్ఞానేశ్వరుడు. వారికి సంబంధించిన వారు ఉదకకర్మాదులు చేయవచ్చునని గౌతమ ధర్మ సూత్రములందు కలదు.

ధర్మద్రోహికి, ఆత్మహత్యాపాతకునికి, పాషండునికి (నాస్తికుడు), వ్యభిచారిణికి, గర్భపాతము చేసికొన్న దానికి, భర్తను సంపూర్ణముగా ద్వేషించు స్త్రీకి మొ॥ వారికి దహన క్రియలు పనికి రావని మనువు. దొంగలకు కూడ అక్కర లేదని యాజ్ఞవల్క్యుడు. వీరు సంఘమునకు ద్రోహులు కనుక పనికి రాదనిరి. కాని ఈనాడు ఎవరిపై ఎట్టి ఆంక్షలు, ఒకరిని ఒకరు వెలివేసికొనుట, లేవు కనుక, ఆపైన ఎవరు ఎట్టి పాపములు చేసిరో సంపూర్ణముగా తెలియదు కనుక వారికి గూడ దహనాదులు జరుగుచున్నవి.

కొన్ని ప్రత్యేక నియమములు:

అంగిరుని మతప్రకారము ఆహితాగ్నిని దహించిన నాటినుండి మైల పట్టవలెను. సామాన్యుల మరణమున మరణము నాటి నుండి మైల మొదలు.

దంతములు రాని వారిని పాతిపెట్టునపుడు వట్టి ప్రణవము (ఓం) తోనే జరుపవలెనని గృ.సూ. (3.10.45). గర్భస్రావమువల్ల పుట్టిన ఆ ఉచ్చారణ కూడ లేదట. రెండు సంవత్సరాల శిశువును పూలతో,

బట్టలతో ఖననము చేయవలెనని మనువు. బ్రహ్మచారి ఏ శవమును మోయరాదని, తల్లిదండ్రులు, ఆచార్యుని శవములను మోయవచ్చునని యాజ్ఞవల్క్యునివాక్కు స్మృతులందు కలవు.

అనాథ ప్రేత సంస్కారమునకు విశేషము కలదని పురాణములందు కలదు.

నగ్నదేహమును దహింపరాదని ప్రచేతసుని వాక్కు. అలంకరించి దహింపవలెననెను.

ఇంటినుండి వెడలిపోయిన తండ్రి 15 సంవత్సరముల వరకు ఇంటికి రాకపోయినచో అతని ఆకారము వంటిదానిని మోదుగ ఆకులతో చేసి దహింపవలెనని భవిష్య పురాణము. 12 సంవత్సరముల వ్యవధి చాలునని బృహస్పతి.

ఆత్మహత్యలచే మరణించిన వారికి యమ, విష్ణువుల పూజచేసి విష్ణు, బ్రహ్మ, శివ, యమ ప్రతిమలకు పిండప్రదానము చేయు నారాయణ బలిని మితాక్షరి పేర్కొన్నది. ఇట్లెంతయో కర్మకాండ కలదు. యథాశక్తి నాచరించి ఉత్తమ ఫలములను పొందుదుముగాక.

శ్రీనివాసాయ మంగళమ్

* * *

# ఉపసంహారము

"దృఢ బద్ధ ధర్మమూలః వేదస్కంధః పురాణ శాఖాఢ్యః,
క్రతుకుసుమః మోక్షఫలః మధుసూదన పాదపో జయతి".

తా:- ధర్మము వేరు, వేదము చెట్టుబోదె; పురాణములు కొమ్మలు; యాగములు పువ్వులు; మోక్షము ఫలము. శ్రీ మహావిష్ణువు చెట్టునకు ఆధారము. జయమగుగాక!

ఈ యజ్ఞభూమి లేక కర్మభూమియందు అనాదిగా కర్మకాండ సాగుచున్నది. ఏ ప్రయోజనము లేనిచో ఇట్టిది సాగునా? కొన్ని కర్మలు దృష్ట ప్రయోజనములు. కొన్ని అదృష్ట ప్రయోజనములు. అనగా ఫలము కంటికి కనుపించునవి కొన్ని. అగుపించనివి కొన్ని. కర్మలు చేయుటచే ఒక అపూర్వము పుట్టునని అది ఒక ఫలమొసంగునని శాస్త్రము ఘోషించుచున్నది. యజ్ఞయాగాదులు చేసినచో యజమానునకు మరణాంతమున ఫలము. ఇది అదృష్టఫలము. కాని ఏ మందులకు లొంగని ఆధివ్యాధులు పోవలెనన్నచో మంత్రతంత్ర క్రియాకలాపమేగతి. కొన్ని మొండివ్యాధుల నివారణకై సూర్యనమస్కారములు చేయుచున్నారు కదా! వర్షము పడనిచో సహస్రఘటాభిషేకములు చేసి ఫలమును పొందుచున్నారు కదా! శత్రు సంహారమునకు శ్యేనయాగమున్నది కదా! కారీరి అను ఇష్టిని చేసినచో వర్షము పడునని వేదము చాటుచున్నది కదా! శాస్త్రీయముగా పుత్ర కామేష్టిని చేయువారు పుత్రుని బడయుచున్నారు కదా! అట్లే కొన్ని సంస్కారములు ప్రత్యక్షఫలమును ప్రసాదించును. మగశిశువు పుట్టుటకై పుంసవన సంస్కారమేర్పడినది. గర్భపాత నివారణకై సీమంత సంస్కారము నుద్దేశింపబడినది.

మొత్తము సంస్కారముల వలన బ్రహ్మమయమైన శరీర మేర్పడునని లోగడ వివరించితిని. అపుడు ఈ శరీరము మామూలు శరీరము కంటె భిన్నముగా అగుపించునా? లేదు. కాని ఉండును. ఎట్లు? ఒక గుడ్డకు మూడు ప్రత్యేకమైన రంగులు అద్దినచో అది జాతీయపతాక యగుచున్నది. ఒక కాగితమున అశోకచక్రము, కొన్ని ప్రత్యేకమైన గుర్తులున్నచో ఒక

రూపాయి యగుచున్నది. అది వట్టి గుడ్డయని, ఇది వట్టి కాగితమని అనుచున్నామా? ఆ గుడ్డకు, ఈ కాగితమునకు ఒక సంస్కారమును కలిగించి విలువ నాపాదించుచున్నాము కదా! లేనిచో అవి మామూలు వస్తువులే! మన మెన్నుకొను వ్యక్తి మంత్రియగుచున్నాడు. మంత్రిత్వము మొగముపై వ్రాసియుండునా? అనగా ఒక సంస్కారముచే (ఓట్లు, ఎన్నిక వలన) విలక్షణ వ్యక్తిగానున్నాడు. అట్లే సంస్కారములను చేసికొన్నవాడు సంఘమున ఒక విశిష్ట వ్యక్తిగా ఒక విలక్షణ వ్యక్తిగా ఉండును. కంటికి కనబడని, ప్రత్యక్షముగా నిర్ధారణ చేయలేని ఒక అలౌకిక ప్రభావముతో నుండును.

పచ్చి బియ్యమును బొక్కుటలేదు. పచ్చిమాంసమును తినుటలేదు. వండుకొని తినుచున్నారు. అనగా సంస్కరించి వాడుచున్నారు. అట్లే జీవుని ఆవరించిన దోషములను పోగొట్టుటకు, గుణమును కలిగించుటకే ఈ సంస్కారములున్నవి. చేట పడినది మొదలు కాటికేగువరకు ఉన్నవి. కాటికేగిన తరువాత కూడ కలవు. రోజు చీలుము పట్టిన పాత్రను తోము చున్నాము. అట్లే పుట్టిన నాటినుండి గిట్టువరకు జీవునకు పట్టిన మాలిన్యము పోవలెనన్నచో ఈ సంస్కారముల ఆవశ్యకత ఎంతైన కలదు. క్రొత్తగా కార్యాలయములలో చేరినవారికి శిక్షణ ఇచ్చుచున్నారుకదా! ఈ శిక్షణ భావి ఉద్యోగ జీవితమున ఉపకరించుచున్నది. ఇహపరలోక సౌఖ్యముల నిమిత్తమే ఈ సంస్కారములున్నవి.

ముందుగా వ్యక్తి బాగుపడవలెను. ఆ వెనుక సంఘము బాగుపడును. ముందుగా సంఘమును సంస్కరించవలెననుట వెఱ్ఱిమాట. మాటలో, చేతలో, తుదకు భావనలో సంస్కారముట్టిపడవలెను. అట్టి వ్యక్తులు పెక్కుమంది ఉన్నచో తనంతట తానే సంఘము ఉద్ధరింపబడును. వ్యక్తిని, తుదకు జాతిని తీర్చిదిద్దునవే ఈ సంస్కారములు. వాని ప్రణాళికను గమనించినచో తన పొట్టకు శ్రీరామ రక్ష అనురీతిలో నుండక వ్యక్తి శ్రేయస్సు, సమాజ కళ్యాణము, పరస్పరము ముడివడి యున్నదని విడివిడిగా లేదని తెలివిడిచేయును. ఉదాహరణకు ప్రతిగృహస్థు విధిగా చేయవల సిన పంచమహాయజ్ఞములను చూడుడు. దేవయజ్ఞమునందు దేవతలను,

ఋషియజ్ఞమునందు ఋషులను, వారందించిన విజ్ఞానమును, పితృయజ్ఞమునందు పితృదేవతలను కొలుచుచున్నాడు కదా! నృయజ్ఞమునందు సాటివ్యక్తికి అన్నము పెట్టవలెను కదా! భూతయజ్ఞమునందు కుక్కలకు, కాకులకు బలివేయుచున్నాడు కదా! పొరుగువానిని ప్రేమింపుమని ఇతర మతములన్నచో, పొరుగుప్రాణిని కూడ ప్రేమింపు మని ఈ సనాతన ధర్మము చాటుచున్నది. తనకు తాను వండుకొని తినువాడు కేవలము పాపమునే తినుచున్నాడని వేదము భాషించుటలేదా? ఇట్టి సూత్రములు సంస్కారములతో ముడివడి యున్నవి.

చత్వారింశత్ (40) సంస్కారములలో పదునారింటిని వివరించితిని. యజ్ఞయాగాదులు నేడు ఇంచుమించు లుప్తమగుటచే వివరించలేదు. అనాదినుండి వచ్చుచున్న సంస్కారములన్నింటిని నేడు చేయుటలేదు. వేద వ్రతములేనాడో కాలగర్భమున కలిసినవి. ఇక సీమంత పుంసవనములు కొన్ని వందల సంవత్సరములనుండి ఆచరణలో లేవు. కొన్ని సంస్కారము లను ఉపనయన కాలములోనే ఏకరవుపెట్టుచున్నారు. ఇక అర్థమును తెలిసికొని ఆచరణలో పెట్టుట ఏనాడో పోయినది. ఒక యంత్రములో గిరగిర తిరుగు చక్రము మాదిరిగా ఈ సంస్కారములున్నవి. విజ్ఞానము కంటె వినోదమునకే ప్రాధాన్యమిచ్చుచున్నారు. అర్థము తెలియక పోయినను మంత్రశక్తి వలన సంస్కార ప్రయోజనము నెరవేరును. కాని అర్థముతో కూడినచో వీర్యవత్తరమగునని ఛాందోగ్యశ్రుతి వివరించుచున్నది. అర్థము తెలిసికొని ఆచరణలో పెట్టనిచో గంధ వాసనలేని గంధపుచెక్కలను మోసికొని పోవు గార్దభముతో సమానమని పెద్దల తీర్పు. ఈ సంస్కారముల మహత్త్వ మిట్టిదని నిరూపించుటయే, జాగృతిని కలిగించుటయే ఈ రచన యొక్క ఉద్దేశ్యము. ఆ ప్రయోజనము సిద్ధించినదో లేదో నిర్ణయించవలసినవారు పాఠకులు.

పాఠకులకు విసుగుకల్గునని సుమారు 800 పుటలున్న గ్రంథమును సగమునకు సగము కుదించితిని. అనేక వర్ణముల ఆచారములను సేకరించి నను పూర్తిగా అందించలేకపోతిని. నాకున్న ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత, హిందీ భాషాజ్ఞానముతో కొన్ని వందల గ్రంథముల సారాంశమును మీ కందించగల్గితిని.

మన ప్రాంతమున ఆపస్తంబ సూత్రము ననుసరించి సంస్కారములు చేయుచుండుటచే దానికే అధిక ప్రాధాన్యమిచ్చి మిగిలిన సూత్రములలోని విశేషములను ఎడనెడ ప్రస్తావించితిని. భారతదేశపు నలుమూలల పదునెని మిది సూత్రములను పాటించుచున్నారు. ఇక దేశాచారములు లెక్కకు మిక్కిలి. ఉత్తరదేశపు టలవాట్లను తెలియవలెనన్నచో పారస్కరగృహ్యా సూత్రమును, ఋగ్వేదుల ఆచారములను గ్రహింపవలెనన్నచో ఆశ్వలాయన గృహ్యాసూత్రమును పరికింపవలెను. పాండేగారి హిందూ సంస్కార్ నుండి, భారత రత్న శ్రీ పి.వి. కాణేగారి ధర్మశాస్త్ర చరిత్ర నుండి పై రెంటి పద్ధతులను స్వీకరించితిని.

"రాగద్వేష విదగ్ధానాం అజ్ఞాన విషపాయినామ్
చికిత్సా ధర్మశాస్త్రాణి వ్యాధీనామివ భేషజమ్" -- శంఖలిఖితులు.

తా:- రాగద్వేషములచే బాధపడువారికి, అజ్ఞానమనెడి విషము త్రాగు వారికి, వ్యాధులచే బాధపడువారికి ఔషధమువలె ధర్మశాస్త్రముపకరించును.

ధర్మః సంసేవితః శుద్ధస్త్రాయతే మహతో భయాత్
శ్రుత్వాపి సంతస్తుష్యంతి దూరాద్ధర్మపరం నరమ్,
ధర్మః కృతః శ్రుతో దృష్టః కథితశ్చింతితోఽపి వా
తథాఽనుమోదితశ్చాపి పుష్ణాతి పరమం శుభమ్." -- ఆశ్వలాయన.

తా:- ధర్మము సరిగా ఆచరింప బడినచో భీకరమగు భయమునుండి రక్షించును. ధార్మిక కృత్యములు చేయువాడు దూరముగా నున్నను వాని చరితమును విని పెద్దలు సంతోషించుచున్నారు. ధర్మమును ఆచరించుట, వినుట, చెప్పుట, చింతించుట వలనను కూడ అధికలాభము కల్గుచున్నది. కనుకనే బుద్ధిమంతులు యథాశక్తి ధర్మము నాచరింపవలెను.

నేను చేసిన ఈ కొద్దిపాటి ధర్మకార్యమును వెలుగులోనికి తీసికొని వచ్చిన తిరుమల తిరుపతి దేవస్థాన కార్యవర్గమునకు హృదయపూర్వక అభినందనలు.

దే. శేషగిరిరావు

